ఆంధ్రప్రచారిణీగ్రంథమాల. ౬.



# వసుమతీవసంతము.

(మౌర్యరాజ్యస్థాపనము.)



ఇది

[illegible]

వేంకటపార్వతీశ్వరకవులచే

రచియింపఁబడి

[illegible]



అయ్యగారి నారాయణమూర్తి బి. యె, బియల్ గారిచే

సంపాదింపఁబడినది.

రెండవకూర్పు 2000



దారులకు
స్టేజితో
—0—0

1913

ఇతరులకు
పోస్టేజిగాక
రు 1—8—0

# అవతారిక.

దేశచరిత్ర మనుజుని వివేకవంతునిగఁ జేయును. పూర్వు లెట్టికష్టముల నెట్టియుపాయాంతరములచేఁ దొలఁగించుకొనఁగలిగిరో తెలుపును. ఎట్టిసాధనాంతరముల నెట్టిమహోన్నతదశల నందఁగలిగిరో విశదీకరించును. ఎట్టిజ్ఞానహీనతచే నెట్టియధోగతుల పాల్పడిరో స్పష్టపఱచును. ఎట్టిసదాచారముల నవలంబించి యెట్టిబలపరాక్రమంబులచే ఖ్యాతిఁ జెందఁగలిగిరో బోధపఱచును. ఎట్టిదురాచారగ్రహణమున నెట్టిదురవస్థలకు లోనైరో తెలియఁజెప్పును. ఎట్టిస్వార్థత్యాగమున నొక్కొక్క మహాపురుషుఁడు స్వదేశమునకుఁ గలుగనున్న మహోపద్రవమును భేదించి శాశ్వతకీర్తిని జేపట్టఁగలిగెనో ప్రబోధించును. వేయేల! ఏజాతివారుగాని, యేసంఘమువారుగాని, యేదేశమువారుగాని, యేనాగరికులుగాని, యేజానపదులుగాని, తమతమశాశ్వతదేశక్షేమమునకై యెట్టిధర్మాచరణంబున నెల్లు పాటుపడవలయునో తెలుపుచు, వారివారిజీవయాత్రలకు దారిఁ జూపును. చరిత్రజ్ఞానము లేనిదేశప్రజాజీవనము సూదంటురాయి లేనియోడయాత్రవంటిది. చూడఁగన్నులును, చేతఁగఱ్ఱయు, నైనలేని దీనుని ప్రయాణమువంటిది.

సమస్తశాస్త్రజ్ఞానమునందును బ్రఖ్యాతివహించిన మనయార్యులేలొకో యిట్టి మహోపకారకరంబులగుచరిత్రములను వ్రాయమానినైచిరి? ఈకారణమున మనదేశమువా రంధకారమున మునిఁగియున్నారనుట నిర్వివాదాంశము. ఈలోపముం దీర్పఁ బాటుపడుట ప్రతిహైందవునకును గర్తవ్యము. కేవలము చరిత్రమును వ్రాసినచో నందలి విషయములు సామాన్యజనరంజకములు గాకుండి, రోగికి పథ్యపువస్తువుల

...ుహా వచ్చును. ఈకారణముచేతనే మేధావంతులైనమన పూర్వులు సామాన్యజనులకు వివిధనీతులను ప్రబోధించుటకు పురాణేతిహాసంబులే యుక్తగ్రంథము లని తలంచిరి. భారతము చరిత్రమే యయినను, మనోహరకల్పనలచే నితిహాసరూపంబుగ రచియింపఁ బడుటచే సర్వజనపరిచయంబై సులభగ్రాహ్యంబై ఆహ్లాదజనకంబై పంచమవేదంబుగఁ బరిగణింపఁబడుచున్నది. కావునఁజరిత్రములన్నియును నితిహాసరూపములుగ సర్వజనరంజకములుగ వెలయించుట యాధునిక కవివరులకు ప్రస్తుతకర్తవ్యము. ఇట్టియుద్యమము నెఱవేర్చుటకొఱకు మాయాంధ్రప్రచారిణీగ్రంథనిలయము స్థాపింపఁబడినది. ఇట్టియుత్కృష్ట ప్రయత్నమునందు, ప్రప్రథమమున స్వకపోలకల్పిత మగునవలను దేని నైన వెలువరించుట కార్యసాధనము కాదని తలంచి నవలను రచించుట యందు దారితీరినబంకించంద్రునియొక్క "దుర్గేశనందని"ని ఆంధ్రంబు నకుం గొనితెచ్చి మాగ్రంథమాలికనుఁ బ్రథమపుష్పముగ నొసంగి తిమి. ద్వితీయపుష్పమైన నాంధ్రకవులచే నూతనకల్పితము గావలయు నని మాచదువరులు వేగిరపడుచుందురు. వారిమనోరథమున కనుకూలముగ "వసుమతీవసంత" మనునీనవల నర్పించుచున్నారము. ఇందలి కథ యేచరిత్రమును జిత్రింపఁ జేయుచున్నదియో మునుమున్న తెలిసికొనఁ బాఠకులు తత్తరపడుచుందురు. హైందవులకు హిందూమహావీరులచారిత్రము చిత్తరంజకముగదా! అందును హిందూరాజులు మహోన్నత్యముం గాంచినకాలమునుగూర్చి వినుటకుఁ గౌతుకము మెండు. చిన్నచిన్నరాజ్యములుగఁ జీలికొనిపోయి యన్యోన్యద్వేషానలంబున బలహీనమై 'గ్రీకువీరా'గేసరులవాతఁబడనున్న హిందూస్థానము నంతను నేకచ్ఛత్రాధిపత్యంబునకుఁ దెచ్చి హిందూరాజ్యరమ కత్యంతానందము కల్గించి హిందువులను స్వాతంత్ర్యసౌఖ్యరసాంబుధి నోల

లాడింపఁగలిగిన చంద్రగుప్తసార్వభౌమునిచరిత్రము మనకత్యంతానంద దాయకము కాదా?

వివిధసస్యానుకూలసారభరితంబై, నానాలోహపూరిత పర్వత శోభితంబై, బహువిధసౌఖ్యనిదానంబైన హిందూరాజ్యలక్ష్మిలావణ్యాం బున కాసించి గ్రీకుకులచంద్రుఁడగు మహాలగ్జాండరు హిందూదేశముపై దాడివెడలి పాంచాలరాజులలో నొకరివెనుక నొకరి నోడించి క్రమక్రమ ముగ దేశము నాక్రమించుకొనుచువచ్చుచుండ, హిందూస్థానరాజ్యము లలో సత్యధికోన్నత్యమును వహించి అసమానశౌర్యధుర్యులగువీర భటసంతతులచే శోభిల్లుచున్న మగధరాజ్యసింహాసనమునధిష్ఠించియున్న నందుఁడు గ్రీకులవలన స్వదేశమునకుఁ గలుగుచున్న యవమానజనకమగు నోటమి తప్పించి హిందూశౌర్యసంపత్తులు కొంతతవడకుండఁగాపాడుటకు మానుగ, తనపట్టణంబునఁ గలసత్కులప్రసూనవీరులతో ద్వేషము కల్పించుకొని, వారినడఁగింపఁ బ్రయత్నించుచుండెను. గ్రీకులవలనఁ గలుగు చున్న యిట్టిదేశోపద్రవమును, నందునివీరధర్మరాహిత్యమును, స్వ దేశాభిమానశూన్యత్వమును, పాంచాలరాజుల పరాభవంబును గాంచి, వీరప్రతాపోన్నతుండగు చంద్రగుప్తుఁడు, అసమానరాజనీతి నిపుణుం డును, నందకులనాశనదీక్షాపరతంత్రుండు నగు చాణక్యధీమాతుని సాహాయ్యము చేకొని పాటలీపుత్రమువీడి నందశత్రుజనంబుల నొక సేనగాఁగూర్చికొని పాంచాలంబుఁ బ్రవేశించి మునువున్న హిందూదేశ విద్వేషులగు స్వదేశరాజుల నాశముచేసి పిమ్మట యుద్ధరంగమున బాహు పరాక్రమంబున విజృంభించి గ్రీకులఁ గీటడంచి రణరంగమునయవన పారశీకాది దేశంబుల జయించిన గ్రీకులపరాక్రమము హిందువులపరాక్రమ మునకుఁ జాలకపోయెనను యశోవిశేషము హిందూరాజ్యరమ కలం కారముగ నొసంగి గ్రీకులెన్నటికి హిందూరాజ్యమును జొరకుండఁ గట్టడి చేసి దేశక్షేమము నరయఁజాలనినందునిశిర ముపాయనముగ నొసంగి

హిందూరాజ్యలక్ష్మిం గయికొనిన చరిత్రాంశ మీ "వసుమతీవసంతము"న హృదయరంజకముగ నుత్పాదింపఁబడినది.

ఈగ్రంథమునురచించినవారు వేంకటపార్వతీశ్వరకవులు. కవులిరువురైనను నవలయందలియొక్కొక్క ప్రకరణము నొక్కొక్కరు రచించినను, శైలియం దిసుమంతయు భేదములేక కవితాధార యొక్క టేప్రవాహముగా నొప్పారుచున్నది. వివిధకవులు రచించినభారతభాగవతగ్రంథములలో నాయాభాగములశైలి తారతమ్యములు విస్పష్టపడుచు వివిధకవివిరచితములని విశదీకరించుచుండును. ఈనవలయం దట్లుగాక వర్ణనాచమత్కృతుల నేమి, ఊహాపోహముల నేమి, ధారాళశైలి నేమి, ఈయుభయకవులలో నిసుమంతయు భేదము గానరాదు. వీరిశైలి శర్కరామిళితగోక్షీరాస్వాదనముం దలపించుచుండును. వీరికవితాధోరణిం గూర్చియు, వర్ణనాసామర్థ్యమును గూర్చియు పాత్రౌచిత్యవిన్యాసమును గూర్చియు నవలచదివినచదువరులే గ్రహింపనున్నారు వీరు నియోగివంశీయులనియు, ఇందలి వేంకటరాయకవి, ధనాభిరామము, సతీసంయుక్త, మాచశూరేంద్రవిజయము, అనునాటకములను, సురసయనునవలయు, పార్వతీశ్వరకవి, సువర్ణమాల, తారాశశాంకవిజయము, అనునాటకములను, ఉభయులునుగలిపి చిత్రకథాసుధాలహరియను ప్రబంధమును, రచించి తమకవితాసామర్థ్యమును నాంధ్రదేశమునఁ బ్రకటింపఁజేసినవారనియు మాత్రము తెలుపుచున్నాఁడను. ఇక్కవు లుభయులాంగ్లేయవిద్యావాసన నెఱుంగనివారయ్యును, ఆంధ్రీకృతచరిత్రగ్రంథ సాహాయ్యమాత్రముననే యీగ్రంథము రచియించిరి. మఱియు మాగ్రంథమాలకు ద్వితీయపుష్పముగా నొసంగవలసినదను నాప్రార్థనముచే ఏప్రిల్ నెలలో ప్రారంభించి నేచేయువేగిరపాటుచే నెలదినములలో దీనిని ముగించినారు. లోపలేశములెవ్వియయిన పండితోత్తముల కీగ్రంథము

నందుఁ గానఁబడినచో వానికీ యవ్యవధయే కారణమని విన్నవించు చున్నాఁడను.

ఈయాంధ్రప్రచారిణీ గ్రంథమాలికాభ్యుదయమునకు సర్వవిధములఁదోడ్పడుచున్న మాప్రధానపోషకులకును, అచిరకాలముననే మా యుద్యమమున కత్యంతప్రోత్సాహకులగు, ఆంధ్రదేశమునందు మొదల మాగ్రంథముల నందికొనుచున్న భాషాభిమానులగు మాచందాదారులకును, మేమెంతయుఁ గృతజ్ఞులమై యున్నారము.

ఆంధ్రభాషాసేవకులగు వారెవ్వరైనఁ జరిత్రవిషయమగు నవల నేదియయిన మనోహరముగ వ్రాసి మాకొసంగినచో వందనపూర్వకముగ నందికొని యిందుఁ బ్రకటించుచున్నారము.

అయ్యగారి నారాయణమూర్తి,
సంపాదకుఁడు.



# ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయము.

## ప్రకటనలకు నిబంధనలు.

---

వార్తాపత్రిక లొకసారిచూచుటకు మాత్రమే యుపయోగించు నవి యగుటచేతను, గ్రంథములు శాశ్వతములు నిరంతరపఠితములు నగుటచేతను, వార్తాపత్రికలయందలి ప్రకటనలకంటె గ్రంథములయందలి ప్రకటనలు శాశ్వతములయియుండునని వేఱుగఁ జెప్పనక్కఱలేదు.

2. మా గ్రంథములు సర్వజనసామాన్యముగ సులభశైలిని వ్రాయఁ బడినమనోహరములగు నవలలగుటచే వీనికి విశేషవ్యాప్తియును, బహుజనాదరణమును కలిగియుండును. కావున నీగ్రంథములయందుఁ బ్రకటనలు వేయించుకొనువారికి విశేషలాభము కలుగును

3. మా గ్రంథములలో ఒకమారు ప్రకటన వేయుటకు పేజీ 1 కి రు8-0-0లు అరపేజికి రు5-0-0లు పాతికపేజికి రు3-0-0లు తీసికొనఁబడును. విరివిగ ప్రకటనలు వేయించుకొనువారికి రేటుతగ్గింపఁబడును. ఇంకను విశేషము తెలియఁగోరువారు మాకు ప్రత్యేకముగ జాబువ్రాయవలయును.

4. పత్రికాధిపతులెవ్వరైన మా ప్రకటనలను తమతమ పత్రికల యందు వేయ నంగీకరించెదరేని వారి ప్రకటనలను మా గ్రంథములందును ముద్రించెదము.

సెక్రటరీ,



# రెండవకూర్పు పీఠిక.



భాషాభిమానుల యాదరముచేతను, భాషాపోషకుల యభిమానముచేతను, ప్రభువుల యనుగ్రహముచేతను, మా గ్రంథమాలికనుండి ప్రథమసంవత్సరమున వెలువడిన నవలలన్నియును పునర్ముద్రణమునకు వచ్చినవని తెలియఁజేయుట కెంతయు సంతసించుచున్నారము.

ఆంధ్రభాషాసేవ సేయుచున్న మా యాంధ్రప్రచారిణీగ్రంథనిలయమునకుఁ గంటికి ఱెప్పవలె నెల్లవిధముల సహాయులై యుండి మా యుద్యమములకుఁ బ్రోత్సాహముం గూర్చుచున్న మా ప్రధానపోషకులును, ఆంధ్రభాషాపోషకులును, నుదార హృదయులును, నగు శ్రీ శ్రీ కొవ్వూరి చంద్రారెడ్డిగారికి మేమెంతయుఁ గృతజ్ఞతాభినందనముల నాచరించుచు సత్కార్యనిర్వహణదీక్షాదక్షులగువారికి సర్వేశ్వరుఁడు దీర్ఘాయురారోగ్యములనిచ్చి రక్షించుఁగాకయని ప్రార్థించుచున్నారము.

మిక్కిలి శ్రమపడి పదిదినములలోనే ఈ గ్రంథ ముద్రణాదికార్యములఁ బూర్తిచేయించియిచ్చిన హెచ్. వి. కృష్ణ అండు కంపెనివారి యెడ మేమెంతయుఁ గృతజ్ఞులము. ముద్రింపించిన జ్యోతిష్మతీముద్రాక్షరశాలాధికారులును మిక్కిలి ప్రశంసనీయులు.

సంపాదకుఁడు.

శ్రీరామచంద్ర.

# అదృష్టము.



అదృష్టమునకు ఱెక్కలున్నవి. కాలచక్రమువలె నిది యెప్పుడు నాఁగక దొరలిపోవునది కాదు. ఇచ్చవచ్చినప్పు డెగురుటకును, కోరిన చోట వ్రాలుటకును, దానికి స్వాతంత్ర్య మున్నది. ఇష్టము లేనిచోటఁ దనగాలియైనఁ బ్రసరింపకుండఁ జల్లఁగ దాఁటిపోవుచుండును. అదృష్టవంతునకు దాని ఱెక్కలచప్పు డొక్కసారియే వినఁబడును. అదృష్టహీనున కాచప్పుడెప్పుడును వినఁబడదు. అది యెప్పుడును గనఁబడదు. అదృష్టమునకుఁ గనఁబడుస్వభావమే లేదని కొందఱనుకొందురు. అదృష్టహీనుఁ డదృష్టమే లేదనుకొనును. ఱెక్కలున్న, యదృష్టమునకు రూపమేల లేదని నీకు సందేహము కలుగుచున్నదా? దాని ఱెక్కలకుమాత్రము రూపమున్నదా? ఆకస్మికముగ నెగిరిపోవుస్వభావము కలదగుటచే దానికి ఱెక్కలున్నవనుకొనుచున్నాము. కావుననే దానిని పక్షియని భావించుచున్నాము. అది వ్రాలినచోటు కన్నులపండువుగా నుండును. అది ప్రార్థించినరాదు. పిలిచినఁ బలుకదు. అది యెప్పుడు వచ్చునో యెక్కడ వ్రాలునో ఎంతకాలముండునో యెవ్వరు చెప్పఁగలరు? కొందఱు దీనిని వెదకిపట్టుకొనవలయునని ప్రయత్నించుచున్నారు. ఈత్రోవనే వచ్చునని కొందఱెదురు చూచుచున్నారు. కొంద ఱేమియుంజేయక నిస్పృహం జెందుచున్నారు. అదియొకప్పుడు ప్రయత్నించినవారికిఁ జిక్కుటయును గలదు. ఎదురు చూచువారికిఁ గనఁబడుటయును గలదు. నిస్పృహం జెందువారియెదుట వ్రాలుటయును గలదు. ఒకప్పు డీమువ్వురిని దాఁటి పోవుటయును గలదు. మొత్తముమీఁదఁ దఱచుగనూరకచూచుచుండు

వారికంటెం బ్రయత్నము చేయుచుండువారే యదృష్టమును బొందఁ గలుగుదురని బుద్ధిమంతుల యభిప్రాయము.

అదృష్టమునకు మంచి చెడుగులు లేవని కొందఱందురు. అది యసత్యము. అదృష్ట మవివేకులకడనైన నుండఁగలదుగాని యసూయాగ్రస్తుల కడ నుండఁజాలదు. ఎచ్చట మదమాత్సర్యాది దుర్గుణములు వర్ధిల్లుచుండునో యచ్చటినుండి తొలఁగిపోవుట కదృష్టము తనఱెక్కల విప్పుకొనుచుండును. కొందఱు దీనిని దైవమందురు. కొందఱు భాగ్యమందురు. ఎవ్వరెట్లన్నను మేము దీని సదృష్టమే యందుము. అదృష్టమువంటిది మఱియొకటి లేదు. సర్వమున కదృష్టమే నిదానమైనది. నేఁడు మాకల మదృష్టప్రభావము నూహించుచున్నది.



శ్రీరామచంద్ర.

# వసుమతీవసంతము.

## ప్రథమ భాగము.

### మొదటి ప్రకరణము.

నేడు మూఁడుజాములు తిరిగినవి. సూర్యుఁ డాకాశగోళమున మూఁడుభాగములకుఁ బయినుండి వెలుఁగుచుండెను. ఎండయంత తీవ్రముగ లేదు. ఇవి ఫాల్గునమాసపు గడపటిదినములు. ఇప్పుడిప్పుడే కొంచెము కొంచెముగ నెండలు ముదురుచున్నవి. శిశిరవసంతసమాగమ సమయంబులఁ బగటిపూటఁగూడ ప్రొద్దువాలిన పిదపఁ బ్రయాణము సేయుట యాత్రికుల కంతకష్టముగ నుండదు. కావున మన మిప్పుడు పాటలీపుత్త్రమునకుఁ బదిమైళ్లదూరమున నున్న మహావనమునఁ బ్రయాణము చేయవచ్చును. వసంతునిదూతలగు కోకిల లప్పుడే యావనమునఁ బ్రవేశించినవి. కోమలకలస్వనంబుల నెల్లరకును వసంతుని రాకఁ దెలుపుచున్నవి. దక్షిణవాతపోతములు మామిడిపూవుల కమ్మనిపరిమళములతో వచ్చి వానికి స్వాగత మొసంగుచున్నవి. వనరమ యాదూతలకుఁ జిగురుతో, రజములతో, నలంకరింపఁబడిన మనోహర శాఖాసుందిరముల విడుదులు చేసి యుంచినవి. ఒత్తుగఁ బెరిగియున్న చిట్టీత, బలుసు, బొమ్మజెముడు, మొదలగు ముండ్ల పొదలచేతను, దట్టముగ నల్లికొన్న వివిధలతా సంతానములవలనను, విశాలశాఖా ప్రకాండములచే నాకాశము నొరయుచున్న భూమీరుహంబులతోడను, దుర్గమంబగు యున్న యమ్మహావనము క్రూరసత్త్వనివాస యోగ్యమైనదైనను, భవిష్యద్వసంతా

గమసూచకంబు లగుకలకంఠ నిస్వనంబులతోడను, మందమలయా నిలంబులతోడను, పల్లవిత కుసుమిత లతాతరు కాండములతోడను, కన్నుల పండువు సేయుచుండెను.

ఆవనమధ్యమున వాయువ్యమునుండి యాగ్నేయముగాఁ బోవుచున్న యొకదారి యున్నది. అది యంత విశాలమైనది కాదు. వరుసగా రెండుమూఁడుగుఱ్ఱములు పోవుటకుమాత్రము సరిపడియున్నది. దాని కిరువంకల నిలివెడెత్తున నెత్తుగఁబెరిగియున్న పొదలును, మొక్కలును, తీవలును, దూరముగ నున్నగుట్టలవఱకును వ్యాపించియున్నవి పాటలీపుత్త్రమునకు వచ్చుచుఁ బోవుచుఁ నుండు ప్రయాణికుల రాకపోకలచే నామార్గము చాలవఱకు నలఁగియే యుండెను. అక్కడక్కడఁ బ్రాక్పశ్చిమంబుల కొకరిద్దఱు మనుష్యులుమాత్రము పోవుటకు సరిపడినయిఱుకు త్రోవ లామార్గమునం గలియుచున్నవి. అవి తఱచుగా వేఁటకు వచ్చుచుండు రాజులు తమవేటకాండ్రతో నంతర్వనంబునకుం బోవుట కేర్పడినవై యుండవచ్చును. అపరిచితం బగు నియ్యరణ్యమున నాసందు త్రోవలంబడి మనము పోఁగూడదు. తిన్నఁగా దారినే పోవుదము

అరేబియాదేశపుగుఱ్ఱముపై నెక్కి యొక యాశ్వికుఁ డాదారిని వచ్చుచుండెను. ఆతని వయ స్సిరువదిరెండు సంవత్సరము లుండును. కన్నులు విశాలము లయినవియే గాని మొగ మంతయందమైనది కాదు. గండు మొగము. గళ మొక్కింతపొడవై శిరోవేష్టభారమున వంగియుండెను. శిరోవేష్టమునందలి రవలతురాయి యాతఁడొక రాజకుటుంబములోనివాఁడని చెప్పక చెప్పుచుండెను. గుఱ్ఱము మెల్లఁగ నడచుచుండెను. గమనాయాసము చేతఁ గాదు. ఆతఁడు కళ్లెమును వదలి వేగముగఁ బోనిచ్చుటలేదు. పురుషుఁడు వెనుకకుఁ దిరిగితిరిగి చూచుచుండెను. ఇంతలో దూరమునుండి యొకయీల వినఁబడెను. ఆతఁడు వనము నలుదెసలను బరికించి చూచెను గాని యేమియును గోచరింప లేదు. నిశ్శబ్దముగ

నుండెను. వెనుకనుండి రెండుగుఱ్ఱములు వేగముగఁ బరుగెత్తుకొని వచ్చుచుండెను. యోధుఁడు తనగుఱ్ఱపుకళ్లెమును సడలించుటచే గుఱ్ఱము పరుగెత్తసాగెను. ఇంతలో దూరమున పొదలనుండి గలగలధ్వని యొకటి వినఁబడెను. మరల నీల వినఁబడెను. ఇప్పుడు గుఱ్ఱపుగతి కొంచెము మందగించినది. కనుచూపుమేరలో ధూళివిశేషముగ లేచి యాకసము వఱకును వ్యాపించుచుండెను. అది క్రమక్రమముగ సమీపించెను. ఆపైపున టకటకయనుధ్వనులు వినఁబడుచుండుటచే యోధుఁడు పరికించి చూచెను. పొదలనుండి విడివడినదుప్పులగుంపొకటి యాతని కన్నులఁ బడియెను. కొన్ని ముందునకు వచ్చుచుండెను. కొన్నిదుప్పులు పొదల నుండి విడివడి యిటునటు గంతులు వేయుచుండెను. కొన్ని గుట్టల నుండి గబగబ యాప్రదేశమున కురుకుచుండెను. గుంపులుగుంపు లుగను, మందలుమందలుగను వచ్చునాదుప్పులచే మార్గమున కవరోధము కలిగెను. దుప్పికొమ్ములకుఁ జుట్టుకొని తెగిపడిన లతాగుల్మము లచేఁ ద్రోవయంతయుఁ జిందరవందర యగుచుండెను. అవి తండోప తండములుగ వచ్చిపడుచుండుటవలన గుఱ్ఱము ముందున కడుగిడ లేక పోయినది. యోధుఁడు కళ్లెమును బిగించి యొఱలోనికటారిని దూసెను. కాని, యాతనికి ధైర్యము చాలినదికాదు.

అల్లంతదూరమున మనుష్యునియలుకు డయినంతమాత్రముననే మేయుచున్న కసవునుగూడ వదలి సహజభీరుత్వమును సూచించు తను చంచలకటాక్షముల నలుదెసలఁ బ్రసరింపఁజేయుచు చంగుచంగున నే పొదలమాటునకో, ఏ లోయలలోనికో, పాఱిపోయి దాఁగికొనుదుప్పులే కావాయివి? పరస్పరసాహాయ్యమున వీని కెంతబలము, ఎంతధైర్యము, ఎంతసాహసము కలిగినది? ఔరా! ఏమి యాసేనావిన్యాసము! ఒకదాని వెనుక నొకటి! పలువలకొమ్ములొండొంటినొరసికొనున ట్లొకదాని ప్రక్క

నొకటి! ఆకొమ్ములను శారుటీఁటెలవలె ముందునకువంచి తదేకదృష్టితో నాయోధునివంక నెట్లుచూచుచున్నవో?

దుప్పులగుంపు చాల నపాయకరమైనది. పులివేఁటయయిన నింత భయంకర మయినదికాదు. దానినుండియయినఁ దప్పించుకొనుటకు మార్గము లున్నవి. దుప్పులు గుంపులయి వచ్చిపడునప్పు డెట్టియోధుఁ డయినను తప్పించుకొనఁజాలఁడు. పర్వతమయిన నడ్డుపడలేదు. వీనిమూలమునఁ జాలమంది వేఁటకాం డ్రపాయములపాలయిరి. ప్రాణములఁ గోల్పడిరి.

మనయోధునకు సందిగ్ధ సమయము తటస్థమయినది. ముందునకుఁ బోవలేఁడు. దుప్పు లెదుట కలగఁద్రొక్కుచుండెను. గుఱ్ఱము ముందున కడుగిడుట లేదు. ఆఁగిపోయెను. దుప్పులు మార్గమున గుంపుగట్టి మోరలు పైకెత్తిచూచుచుండెను. వానికొమ్ములకుఁ గల వాఁడి బల్లెముల కైన నుండదు. అవి త్రిశూలములు. ఆప్రళయకాల రుద్రాయుధముల పైఁ బడినవారికి బ్రదుకెక్కడిది?

యోధుఁడు తనవాఁడికత్తిచే నొకకొమ్మును, రెండుకొమ్ములను, పదికొమ్ములను, ఛేదింపఁగలఁడు కాని, యవి లెక్క లేకుండనున్న వే?ఆతని కేమియును దోఁచుటలేదు హృదయ మావేగపడుచుండుటచే నున్న ధైర్యమును జాఱిపోయినది మరల నొక్కసారి ముందునకు వీక్షించెను.కన్నులు గిఱ్ఱునఁ దిరిగెను. ధైర్యము చెదరియున్న యాతనిహృదయమున భయమునకుఁ జోటుదొరకెను. అది ప్రవేశించినతోడనే యాతురత యధికమగుటచే నాతఁడు సంభ్రమపడఁజొచ్చెను. వెనుకకుఁ దిరిగి తన్ను వెంబడించి గుఱ్ఱములపైవచ్చుచున్న వారినిగూర్చి "రావలదు" అని యొక్కకేకవైచెను. తోడనే వెనుక వచ్చుచున్న గుఱ్ఱములు కొలఁది దూరముననే యాఁగిపోయినవి. పాప మారెండుగుఱ్ఱములపైనున్న వారును స్త్రీలే.

యోధుఁడు కళ్లెమును పార్శ్వమునకు బిగలాగి గుఱ్ఱమును వెనుకకు మరలింపఁజూచెను గాని జంతుస్వభావము నెఱింగినయాగుఱ్ఱము స్థాణువువలెనుండి తిరుగదయ్యెను. అతికష్టమున నాతఁడు గుఱ్ఱమును మరలించెను. ఆసమయమునఁ దూర్పుదిక్కున కొండగోయనుండి "తిరుగకుము! వెనుదిరుగకుము! అపాయము రాఁగలదు" అనియొక గంభీరధ్వని వినవచ్చెను. భయభ్రాంతిచేఁ గలఁతనొందినయాతనిమనస్సున కావాక్యములు బోధపడినవి కావు. మఱింత భయముతోఁ గళ్లెమును వదలి రికాబులనుండి మడిమలు తాటించి గుఱ్ఱమునుడాయించెను. గుఱ్ఱము శరవేగమునఁ బెద్దదాఁటులతో వెనుకకుఁ బరుగెత్త నారంభించెను.

బిలబిలలాడుచు దుప్పు లన్నియు నొక్కసారిగా మోరలు వంచి కొమ్ముల శ్రాలుచేసి యతివేగమున నాగుఱ్ఱముపైఁ బడ ముందున కుఱుకుచుఁ దఱుముకొనివచ్చుచుండెను. వానిగమనమున వాయువేగమున్నది. తెప్పపాటుకాలములో ముందున్న దుప్పులన్నియు నాగుఱ్ఱముపైఁ బడి వాఁడికొమ్ములం గ్రుమ్మి చిందఱవందఱఁ జేసివైచెను. పాపము! మనయోధుఁడు క్రిందఁగూలఁబడియెను ఆతనిపైగుఱ్ఱమును బడిపోయెను. ఆభీభత్సముంజూచి ముందుగుఱ్ఱముపై నున్నబాలిక యొక్కకేక వైచి మూర్ఛిల్లెను. అంతకంటెను ముందు రాఁబోవు నాపదనుండి సాధ్యమయినంతవఱకుఁ దప్పింప నెంచి వెనుకగుఱ్ఱముపై నున్నసుందరి యాబాలికగుఱ్ఱమునకు తనగుఱ్ఱము నడ్డముగఁ జేర్చి యొఱనుండి కత్తిని దూసికొని సంసిద్ధముగ నుండెను ఉపమాలంకారప్రియుం డగుకాళిదాసమహాకవి యాసుందరినప్పుడు చూచియుండునేని తప్పక మహిషాసురమర్దని యగుచండికతోఁ బోల్చకమానఁడు.

ఆసమయమున సిందాఁకటికంటెఁ గొంచెము సమీపమున మరలనొకయీల వినఁబడెను. తోడనే వేఁటకుక్కలు పొదలనుండి శరవేగమున విడివడివచ్చి యాదుప్పులను దాఁకి చెల్లాచెదరుగఁ జేయుచుండెను.

ఆదిక్కునుండి వేలకొలఁది యలుఁగు లొకదానివెనుక నొకటిగ బారులు గట్టి వచ్చుచుండెను. ఆదారుణశరాఘాతములచే గుఱ్ఱమును గ్రుమ్ముచున్న దుప్పులు తుత్తునియలయి పోయెను. ముందు జంతువులు కూలిన కొలఁది వెనుకనున్న దుప్పులు ముందునకుఱికి యాశరానలంబునకు శలభములయి పోవుచుండెను. ఆబాణఘాతములకుఁ దప్పి ముందుగుఱ్ఱముల పై కుఱుకఁబోవుచున్న జంతువుల నాసాహసికసుందరి తనకరవాలమున కెరఁ జేయుచుండెను. చెదరి పాఱిపోవుచున్న దుప్పులను వేఁటకుక్కలు తమకరాళదంష్ట్రాంకురంబులఁ జీల్చి చెండాడుచుండెను. నాలుగయిదు నిమిషముల కాప్రదేశమున దుప్పులవికలాంగకములు తప్ప దుప్పులు లేవు. ఇఁకఁ దమకుఁ బని లేదని కాఁబోలు నొక్క వేఁటకుక్క యయిన నక్కడ నిలువ లేదు శరవర్షము చల్లారినది.

ఇంతవఱకుఁ గోఁగిఁచేఁబూని కాచికొనియున్న యాసుందరి యప్పు డొకసారి వెనుకకుఁ దిరిగి చూచెను. ఇంకను నాబాలిక గుఱ్ఱముపై మూర్ఛమునింగియే యున్నది. రికాబులలోనున్న యాబాలిక సుకుమార ప్రవాళారుణచరణంబు లట్లేయున్నవి. కోమలమృణాలసమాదృశంబు లగునాబాహువల్లరు లాయశ్వకంఠమున నిరువంకల వ్రేలాడుచున్నవి. సహజరాగరామణీయకంబు లగునాయంగుళు లిప్పుడు రక్తకాంతులం జెలుకుచున్నవి. ఆబాలికా మనోహరచంద్రమండలము గుఱ్ఱపుజూలుచేఁ గప్పఁబడి యున్నది. అట్లుపడియున్న బాలికంజూచి యా రెండవ సుందరి, యొక్క నిట్టూర్పు విడిచెను. కన్నులనుండి యశ్రుబిందువుల వెలార్చెను. స్త్రీస్వభావము. సహజముగ సాహసిక లగుకాంత లాపదల యందు ధైర్యమునే వహింతురు. కాని యనంతరమున దుఃఖ మాఁచి కొనఁజాలరు.

సుందరి గుఱ్ఱమునుండి దిగెను. గుఱ్ఱముపైఁ బడియున్న యా బాలికనెత్తి తనయొడిలోఁ జేర్చికొని మొగముపైఁ బైఁట చెఱఁగుతోఁ

గొంచెముగవిసరెను. "అమ్మా! భయములేదు" అని పిలిచెను. ఇంకను నాబాలికకుఁ దెలివిరాలేదు. సుందరి, బాలిక, యనువిశేషణములు మీకు విసుగుఁ బుట్టించుచున్నవా? అపరిచితవనీతలంబున నాకస్మికముగఁ బరిచితలైనవారి నామములు మనకెట్లు తెలియఁగలవు? తెలియునంతవఱకు మనమావిశేషణములనే విశేష్యములుగా వాడుకొందము. ధర్మిధర్మవాచకవిషయంబున మహాకవులమనుకొనువారే పొరఁబడిపోవుచున్నారు. ఈగందరగోళమునఁ బడియున్న మన మెంతటివారము? అయినను సుందరీపదము మనోహరమైనదియే. బాలిక ముద్దుపేరు. ఉచ్చరించినకొలఁది మనోహరంబులగుచుండు నీముద్దుమాటల వినుట కెవ్వరు ముచ్చటపడకుందురు?

సుందరి యట్లు విసరుచుండెను. ఆచల్లనిగాలి కాబాలిక మొగంబున ముసరికొనుచున్న వినీలకుటిలకుంతలంబులు వీచోపులిచ్చుచుండెను. సుందరి మాటిమాటికి నామెకన్నులు విచ్చునేమో యనునాశతోఁ జూచుచుండెను. కొంతసేపటి కాబాలిక యొకనిట్టూర్పు విడిచెను. కనుదమ్ములించుక చలించెను. ఆబాలికామణి యొకసారి కన్నులు విచ్చి చూచెను. ఎదుట నొకపురుషుని దివ్యసుందరవిగ్రహముండెను. మరలఁ గన్నులు మూఁతపడియెను.

---

## రెండవ ప్రకరణము.



ధనుర్బాణములను ధరించియున్న యాపురుషుని చూచినతోడనే సుందరి సంభ్రమము నొందెను. ఏమియును మాటలాడక యాపత్సూచకమగుదృష్టితోఁ బడియున్న గుఱ్ఱమువంకఁ జూచుచుండెను. పురుషుఁ డతివేగముగ నాగుఱ్ఱమును దొలఁగించి క్రిందఁబడియున్న

యోధునిశరీరమును దడవిచూచెను. గాయములు విశేషముగఁ దగిలి యున్నవి. నెత్తురువెల్లువలచే దుస్తు లన్నియును దడిసిపోయెను. ప్రక్క లెగురుటలేదు. చేయిపట్టిచూచెను. నాడి కనఁబడలేదు. గుండెలపైఁ జెవినొగ్గి వినెను. ఏమియును వినఁబడుచున్నట్టులేదు. శరీరముమాత్రము వెచ్చగనే యున్నది. నాసారంధ్రములనుండి కొంచెము శ్వాసము వచ్చుచున్న ట్లనుమానించెను. మరల గుండెలపైఁ జేయివైచెను. ఆఁగియాఁగి కొట్టుకొనుచున్నట్టు కనిపట్టెను. ఆతనియాతురమును జూచి, సుందరి "అయ్యో! ఆతఁడెట్లున్నాఁడు?" అని తొందరతోఁ బ్రశ్నించెను.

"భయములేదు. ఆబాలికకు స్మృతివచ్చునంతకు నీవేమియును గదలవద్దు. ఈతనిరక్షణమునకుఁ దగిన ప్రయత్నములం చేసెదను." అని పురుషుఁడామెను హెచ్చరించెను. ఇంతలోఁ గొంతమందిసేవకు లచటికి వచ్చిరి. పురుషుఁడు వారితో నేమియో మెల్లఁగఁ జెప్పెను. సేవకు లాయోధుని పదిలముగనెత్తి తీసికొనిపోయిరి పురుషుఁడు సమీపించి "ఇంకను స్మృతికలుగలేదా?" యని సుందరినడిగెను.

"అయ్యో! ఈసుకుమారి భయభ్రాంతయై మూర్ఛిల్లినది. హృదయము చెదరిపోయినది. ఎంతకునుస్మృతికలుగుటలేదు. కొంచెము జలముండిన___"

పురుషుఁడటునిటుచూచి "భద్రముగ నుండుము" అనిచెప్పి వెడలెను

"ఈ యాపద్బాంధవుఁ డెవ్వరైయుండును?" అనిసుందరి తలపోయసాగెను. ఏమియును గోచరముకాలేదు. పురుషుఁడు వారినెఱింగియే యుండునా?

పురుషుఁడు జలమునుగొని తెచ్చి యా సుందరి కొసంగెను. ఆ జలము సుందరి యా బాలిక మొగమునఁ జిలికి చీరచెఱఁగున నతిమృదులా

ముగ నొత్తెను ఆచీరచెఱఁగుచే మరల విసరుచుండెను. కొంతసేపటి కాబాలిక యొకనిట్టూర్పు విడిచి కన్నులు తెఱచెను. ఆసుందరపురుష మూర్తి కన్నులయెదుటనే యుండెను. బాలికకు స్మృతి వచ్చినది. ఆమె యట్టె తనదృష్టి సుందరిమోమునఁ బ్రసరింపఁజేసెను. సుందరి హృదయము సంతోషనిమగ్నమయ్యెను బాలికచూపుల యర్థమును గ్రహింపలేకపోయెను. సుందరియొడినుండి యామె తటాలునలేచి మేలిముసుఁగు సవరించుకొని యామెవెనుక కరిగెను సుందరియును లేచి నిలువఁబడియెను.

పురుషుఁడు "మీ రెక్కడికేగెదరు?" అని యడిగెను.

సుందరి "పాటలీపుత్రమునకు"

"ఎచ్చటినుండి వచ్చుచుంటిరి?"

"రత్నగిరినుండి, మాపరివార మంతయు ముందేగినది. సమీపమునకు వచ్చితిమిగదా యని మేమాయనతో గుఱ్ఱముల నెక్కివచ్చుచు నీవిపత్తునంబడి పరోపకార పారీణులగు మీయవ్యాజవాత్సల్యమున రక్షింపఁబడితిమి.'

"ఆయోధుఁడు నారథముపై సురక్షితముగఁ బాటలీపుత్రము చేరఁగలఁడు. గాయములపూన్పు ప్రయత్నములును జరుగును."

ఈసంభాషణమువలన బాలిక కెల్లవృత్తాంతమును దెలిసెను. తమ్ముఁ గాపాడినయాపుణ్యపురుషుని సుందరి వెనుకనుండి మరల నొకసారి చూచెను. ఆచూపును మరలించుకొనలేక పోయెను. ఆలోకమోహనం బగు సుందరాకారసందర్శనంబునఁ దనివి తీరకుండెను అతని యెడమ భుజంబున నెక్కడించియున్న విల్లు పాదములవఱకు వ్రేలాడుచుండెను. మెడలోజందెపుఁబెట్టుగ ధరింపఁబడినయమ్ములపొది కుడిపైపున నొప్పులు గులుకుచుండెను. కుడిచేతిలో నొకయలుఁగుండెను. జఘనోపరిభాగమున బిగించి కట్టినకాసెకోక యాతనిసింహమధ్యమును విస్పష్టముగఁ దెలుపు

చుండెను ఒడలంతయుఁ గంచుకాద్యలంకరణములచేఁ గప్పఁబడియుండెను. విశాలవక్షస్స్థలంబును, నాజానులంబితంబు లగుబాహువులును, నాతఁడు బలపరాక్రమసంపన్నుఁడని చెప్పుచుండెను. పూర్ణిమాచంద్ర మండలమును నిరసించునాతని నెమ్మోమున నొకవింత కాంతి కన్నుల మిఱుమిట్లుగొలుపుచుండెను. పుండరీకంబులంబోని యావాలుగన్నులు సోగలై, యాకర్ణాంతములై, చూపులుగంభీరములై, సుందరములై, యుండెను. ఫాలభాగము విశాలమైయుండెను. విండ్లవలె వంగియున్న కనుబొమలు దీర్ఘములై, దట్టములై, యున్నవి. ఇంద్రనీలకాంతులం జిమ్ముచుఁ, బట్టుకుచ్చులవలె మెత్తనై యొత్తుకొనుచున్న మీసములు ముఖమండలమునకు సంపూర్ణశోభావంతములై యుండెను. అట్లాబాలిక యింకను జూచుచునే యుండెను. ఆసుందరాంగునికడ క్షణక్షణమున కొకవింత యందము తోఁచుచునేయుండెను.

పురుషుఁడాబాలికచూపులయర్థమును గ్రహించెనో లేదో కాని యాతనిచూపులుమాత్ర మాసమీపమునకుఁ బోయి కుశలప్రశ్నమును జేయుచుండెను. చూపులకుఁ గుశలప్రశ్న మనఁగా నేమందురా? అవి యొండొంటితో మైత్రిం గల్పించుకొనఁగలవు. అగాధములగు హృదయములను గూడఁ దెలిసికొనుశక్తి వానియందున్నది. ఆరహస్యము మన కెట్లు తెలియును? సుందరి యీపరమార్థమును గ్రహించెనో లేదోగాని వెనుకకుఁ దిరిగి బాలికవంకఁ జూచెను.

"ఈసాధుశీలుఁ డెవ్వరై యుండును?" అనువాక్యము లాబాలిక కెంబెదవులనుండి యప్రయత్నముగ నవ్యక్త మధురధ్వనితో మెల్లఁగ వినవచ్చెను.

సుందరి పురుషునివంకఁ జూచి "అయ్యా! నేఁడు మాప్రాణములను గాపాడి మాకు మహోపకారముం గూర్చిన మీపావననామాక్షర

ములం దెల్పి మమ్ము ధన్యాత్మలంగాఁ జేయఁ బ్రార్థించెదను" అని యెను.

"ఎట్టివిపత్తులనైనను దప్పించి సన్మార్గుల సర్వదా కాపాడుటకు జీవదయాపరుం డగు భగవంతుఁడే తోడుపడుచుండును. మనుష్యమాత్రుఁడ నగు నేనెంత? నాపేరుతోఁ బ్రయోజన మేమి?"

"ఇప్పట్టున మమ్ము రక్షించుటకై యవతరించిన భగవంతుఁడు మీకంటె మఱి మాకెవ్వఁడు?"

"అదృష్టవశమున నీశ్వరప్రేరణచే నిమిత్తమాత్రముగ వచ్చిన నాసంగతిఁ దెలిసికొనుటవలన మీకుఁ బ్రయోజన మేమున్నది?"

"ఉత్తములు తమనామమును ద్యాముగఁ దెలియఁజేయునాచారము లేదని నేనెఱుంగుదును. అయినను కృతజ్ఞతాపూరిత మగునాహృదయము నన్నిట్లు ప్రేరేచుటచే నడుగ సాహసించితిని. నన్ను క్షమించెదరుగాక!"

"ఇందు క్షమింపవలసిన దేమున్నది? సురక్షితముగ మీగమ్యస్థానమును జేర్చుటయే నాకోరికయై యున్నది"

"మీకు సర్వదా భగవంతుఁడు తోడగునుగాక!" ఇట్లు వారు ముచ్చటించుకొనుచుండఁగాఁ గొందఱుబోయ లొకపల్లకిం గొని తెచ్చిరి. పురుషుఁడు "మీరీపల్లకినెక్కి పాటలీపుత్రమున కరుగవచ్చును. ఈ బోయలు మిమ్ము సురక్షితముగ గమ్యస్థానమునకుఁ గొనిపోవఁగలరు" అనియెను.

బాలిక మేలిముసుఁగును సవరించుకొనియెను. సుందరి యామెహృదయమును గ్రహించి ముందునకు దారితీసెను. బాలిక మందమందగమనముతో నామెవెన్నంటి పల్లకియొద్దకుం జని యచ్చట నిలువఁబడియెను. సుందరి యాపురుషునకు నమస్కరించి "మాకు సెలవొసంగెదరా" యని విన్నవించెను—

“శుభమగుఁగాక” యని పురుషుఁ డాశీర్వదించెను. తోడనే యాబాలిక పల్లకిలోఁ బ్రవేశించుచు మేలిముసుఁగుచాటునుండి యొకసారి పురుషునిపైఁ దనకటాక్షమును బఱగించెను

కొందఱుముద్దరాండ్రచూపు లతినిశితములైనవి. ఆచూపు లాపురుషుని హృదయమున నాఁటుకొనియెను. ఆతసహృదయ మొక్కసారి కలఁగెను. ఇంతలో సుందరియుఁబల్లకి నెక్కెను. బోయ లాపల్లకి నెత్తి యోంకారధ్వనులు దెసలఁ బ్రతిధ్వనులీనఁ బాటలీపుత్రముదిక్కుగా నడచుచుండిరి. పల్లకి దృష్టిపథంబునుండి దాఁటిపోవుటచేఁ బురుషుఁడు తనచూపులను వెనుకకు మరల్చెను. ఇరువురు సేవకు లాయశ్వములను వారివెంటఁ గొనిపోయిరి. మనపురుషుఁడు తాను వచ్చిన త్రోవనే వనమధ్యమునకుఁ బోయెను.

---

## మూఁడవ ప్రకరణము.



పాటలీపురదుర్గమునందలి రాజభవనమున వసారాలో నొకపురుషుఁడు ప్రచారము చేయుచుండెను. ఆతఁడు విలువగలసన్ననితెల్లదుస్తులను ధరించియుండెను. ఆతఁడు ధరించినయంగీ మోకాలివఱకు దిగఁబడి వాయుప్రసారమునఁ గొట్టుకొనుచుండెను. సగముసగము నరసినబుగ్గమీసములును, దట్టమై పొడుగుగనున్న బవిరిగడ్డమును ఆతనిగభీరవదనమండలమునకు మఱింతగాంభీర్యమును గలిగించుచుండెను. అమూల్యరత్నఖచిత మగుముద్రయుంగర మాతనికుడిచేతి చిటికెనవ్రేలిపైఁ బ్రకాశించుచుండెను. సింగపుతలలపోలిక చెక్కడపుఁబనిగలమెఱుఁగుబంగరుకడియము లాతనిముంజేతుల వ్రేలాడుచుండెను. ఆతనిపదంబుల బంగారుజరిగపనిచేసినముచ్చెలజోడు ధరింపఁబడి యుండెను. ఆచంద్రకాంత

శిలాతలంబున నటునిటు నడచునప్పుడు డాబోడు మడిమలతాఁకునఁ జిటుకు చిటుకుమని ధ్వనిచేయుచుండెను. ఆతనివయః స్సఱువదియేండ్లు గడచి నను శరీరపాటవముంబట్టి నలువదియేండ్లకు మించియుండదని తోఁచును. రాత్రినిద్దుర చాలకయో, మఱియేకారణముననో గాని యాతనినేత్రము లెఱ్ఱవడి నెత్తురుముద్దలవలె నుండెను.

ఆతఁడిట్లాలోచించుకొనుచుండెను. "వైద్యులు బాగుగనే పని చేసిరి. ప్రాణభయము లేదనుమాట నేఁటికి వినఁబడినది. ఈగుణము నిలువఁబడవలయును చాలవఱకు రక్తము క్షీణించినది. నేఁడు వైద్యులు కట్లు విప్పి కడిగించి మరల కట్లు కట్టినారు. నాతము చేయకుండ నేదో మందిచ్చి యుందురు. ఆమందువలన నాతనికి బాగుగ నిద్రపట్టి నది. నిద్రపట్టుటవలనఁగూడ నారోగ్యము కలుగును బాధయును చాల వఱకు తగ్గినది. ఈశ్వరానుగ్రహమునఁ గ్రమక్రమముగ నారోగ్యము కలుగవచ్చును" అని యాలోచించుకొనుచుండఁగా నుత్తరపువైపున నున్నగదితలుపు తెఱచికొని యొకదాసి ప్రవేశించి "మహాప్రభూ! మెల కువ వచ్చినది. దయచేయుఁడు" అని చెప్పెను. తోడనే యతఁడు లోని కరిగి తలుపు జేరగిలవైచికొనియెను.

ఆగది చాల విశాలమైనది. తూర్పువైపుగవాక్షము కాక తక్కిన వన్నియును మూసివేయఁబడి యుండెను. విశేషముగ నితరవస్తువు లం దేమియును లేవు. ఒకబల్లపై మణిమయపాత్రములందుఁ గొన్నిద్రావ కములును, లేపనములును, జేర్పఁబడి యుండెను. దానికెదురుగ నొక పవడపుఁగోళ్లమంచముపై హంసతూలికాతల్పమున నొకపురుషుఁడు శయ నించి యుండెను. ఆతనియొడలినిండఁ దెల్లనివస్త్రము కప్పఁబడియున్నది. ముఖముమాత్ర మగపడుచుండెను. ఆమంచమునకు సమీపమున సువర్ణ మణిఖచిత మగుపీఠముపై నాపురుషుఁడు కూర్చుండి, పరుండియున్న

పురుషుని చెక్కులపైఁ జేయివేసి చూచి "కుమారా! సుఖముగా నున్నదా" అని ప్రశ్నించెను.

హీనస్వరముతో "కొంచెము నెమ్మదిగ నున్నది" అని యాతఁడు బదులు చెప్పెను. అతనిముఖము రక్తక్షయమువలనఁ గొంచెము తెల్లవడి యుండెను ఆతఁ డేదో జబ్బుపడి యుండవచ్చును.

పీఠముపైఁ గూర్చుండియున్న మొదటిపురుషుఁడు "బాధ యెట్లున్నది?" అని ప్రశ్నించెను.

"చాలవఱకు తగ్గుచున్నట్లున్నది. ఆయాస మింకను తగ్గలేదు. లేచిన కన్నులు తిరుగుచున్నట్లుండును" అని రోగి చెప్పెను.

"బాగుగ నిద్రపట్టినదా?"

"ఒడలుమఱచిననిద్దుర యింకను పట్టుటలేదు. కొంచెముగ నిద్ర పట్టుచున్నది. హృదయమున నేదో గందరగోళముగా నుండును. నేనిచ్చటి కెట్లువచ్చితిని?"

"మనభటులు సురక్షితముగ రథముపైనుంచి తీసికొని వచ్చినారు"

రోగి కన్నులు మూసికొనియెను. కొంతసే పాలోచించి "పాపము వారేమైపోయిరో గదా!" అని ప్రశ్నించెను.

"వారును మనకోటలోననే యున్నారు. వారి కేమియు నాపద కలుగలేదు"

"ఎచ్చటనున్నారు?"

"శచీభవనమున నుంచితిని. వారిసంరక్షణమునకు వసంతుని నియోగించితిని"

అనునప్పటికి రోగి యులికిపడి లేవఁబోయెను.

"కుమారా! లేవకుము! గాయపుఁగట్లు చెదరి రేఁగఁగలవు" అని పురుషుఁడు వారించెను.

"వసంతుఁడు వారికిఁ దగినపరిచర్యలు చేయుచున్నాఁడా?"

"ఆ. వారి కేమియును కొదవ లేదు. వారియుపచారముల కనేక పరిచారికలు నియమింపఁబడిరి."

"వసంతుఁడా? పరిచారికలా? సుందరులా? సంరక్షణమా? నేనా? జీవించుటయా?" అని యొకపెద్దనిట్టూర్పు విడిచి రోగి కన్నులు మూసికొనియెను.

పురుషునిగుండెలు బ్రద్దలై పోయెను. ఆతని కదియంతయును సన్నిపాతగుణముగఁ దోఁచెను. తత్తరముతో "వైద్యులు! వైద్యులు!!" అని కేక వేయుచు గదినుండి యవ్వలకుఁ బరువెత్తెను.

అట్లు సంభ్రమముతోఁ బోయినపురుషుఁడు పద్మనందుఁడు. ఆతఁడే మగధరాజ్యచక్రవర్తి. ఆపడియున్నరోగి యాతనిజ్యేష్ఠపుత్త్రుఁడు, విష్ణుగుప్తుఁడు. ఆతనికిప్పుడు సన్నిపాతదోషము కలుగలేదు. గాయముల బాధకుఁదోడు హృదయమున నేదోవేదనము కలిగినది. దానిపై నాతనికిఁ గోపముకూడ వచ్చియుండును. తండ్రియెదుట నావిషయమునుగూర్చి నొక్కి చెప్పుటకు ధైర్యముచాలనియశక్తిచే నేమేమో ప్రలాపించెను. పద్మనందుఁడీతని కొకరాజపుత్త్రికను బెండ్లిచేయుటకును, ఆకారణమున నొకరాజ్యమును సంపాదించుటకును, పెద్దప్రయత్నమును చేసియుండెను. ఆతఁడిట్టికార్యములయందు చాలనేర్పరి. కుమారునకు నెమ్మదిగా నున్నదనునాశతో నాతనిఁ జూడవచ్చెను. ఇప్పటియాతనియున్మత్తప్రలాపములు పద్మనందునకు దోషగుణజన్యములుగాఁ దోఁచెను. ఆతనిగుండె నీరైపోయినది. హృదయము చెదరిపోయి యేమిచేయుటకును దోఁచక యున్మత్తునివలె వైద్యులనిమిత్తము కేకలువేయుచుఁ బోయెను. పుత్త్రప్రేమ యెంత ఘనమైనది?

---

## నాల్గవ ప్రకరణము.



మగధమాళవదేశములకు నడుమ నొకపర్వతపంక్తియున్నది. ఆపర్వతములయందలిచిన్నిచిన్ని రాళ్లు మిక్కిలి తేజోవంతములై రత్నకాంతుల నీనుచుండును. అదికారణముగ నాపర్వతపంక్తిని "రత్నగిరి" యని ప్రజలు పిలుచుచుందురు. పూర్వము, మాళవరాజసంతతిలోనివాఁడగు చండపాలుఁ డనునాతఁ డేకారణముననో యప్పటిమాళవపతియాగ్రహమునకుఁ బాత్రుఁడై అవంతిని వీడి కుటుంబసహితముగ నీపర్వతప్రాంతములకు వచ్చి చేరెను. ఆతఁడు చాలధనముకలవాఁ డగుటచే నాపర్వతపంక్తినడుమంగల యొకవిశాలప్రదేశమున నొకపట్టణము నిర్మించెను. దానికాతఁడు రత్నగిరి యనియే పేరు పెట్టెను. క్రమక్రమముగ నారాజుసౌశీల్యముచే నితరదేశములనుండి చాలమంది యచ్చోటికిఁ గుటుంబసహితముగఁ గాపురమునకు వచ్చిరి. కొంతకాలమున కాపర్వతపార్శ్వప్రదేశమంతయు జనాకీర్ణమై యచ్చటచ్చటఁ బల్లెలును, పట్టణములును, బయలు వెడల నదియొకచిన్న రాజ్య మయ్యెను. ఆప్రజలందఱాచండపాలునియధికారమునకు లోఁబడి నడచుకొనుచుండిరి. చండపాలుఁడు రత్నగిరిదేశమునకు రాజై సుఖముగఁ జాలకాలము ప్రజాపాలనముఁ గావించెను.

ఆరత్నగిరి క్రమముగా నాతనివంశములోనివాఁడైన మానపాలుఁడనురాజుచేఁ బాలింపఁబడుచుండెను. మానపాలుఁడు చాలధర్మాత్ముఁడు. ప్రజ లాతని దేవునిగ భావించుచుండిరి. ఆతనికిఁ బుత్త్రసంతానము లేదు. చిరకాలమున కొకపుత్త్రికమాత్రము కలిగెను. ఆమెపేరు వసుమతి. ఆశిశువు జనించినకొలఁదికాలములోనే విధివశమున మానపాలుని

భార్య చనిపోయెను. ఆ దుఃఖవశమున నాతఁడు చాల కృశించి పోయెను. అదిగాక యేండ్లుగడచినవాఁడు. ఈసమయమున నాతని కెల్లవిధములఁ గుడిబుజమై సేనాధిపతియై యున్న యాప్తబంధుఁ డొకఁ డాతని విడిచి విదేశములకుఁబోయి పోయెను. ఈమనస్తాపములచే వ్యాధి గ్రస్తుఁడై యాతఁ డీలోకమును విడిచి పోయెను

తండ్రి గతించినతోడనే వసుమతి రత్నగిరికి రాణియని మంత్రులు ప్రకటించిరి. ఆమె కప్పటికి వ్యవహారోచితజ్ఞానము లేకయుండుటచే మంత్రులే యారాజ్యము నాశ్రాలికపక్షమునఁ బాలించుచుండిరి. దురాశాపరుఁ డగుపద్మనందుఁ డీసమయమును గనిపట్టి యాకోట నాక్రమించుకొనవలయు నని తలంచెను. యుద్ధము లొనరించి ద్రవ్యమును వెచ్చపెట్టి కీర్తిని సంపాదించుట యాతని కిష్టములేదు. భేదోపాయమునఁ దనకార్యము సాధించుకొనుట లెస్సయని యాతఁ డాలోచించెను. ఇట్లు తలంచి కార్యతంత్రజ్ఞులగు నాప్తుల నచటికిఁ బంపి మంత్రులలో నంతఃకలహములు పుట్టించెను. ఆకలహ కారణములచే రత్నగిరి కల్లోలములలో మునిఁగిపోయెను. సందడి నడంచువాఁడునులోలె పద్మనందుఁడు కొలఁదిపరివారముతో, యువరాజగు విష్ణుగుప్తునితో, రత్నగిరి ప్రవేశించి చల్లఁగ నాకోటనాక్రమించుకొనియెను. ఆరాజ్యమిాపటుకు నందరాజ్యమునకు లోఁబడినదే యగుటను, ప్రజలను బాలించు దక్షు లెవ్వరును లేకపోవుటచేతను, మంత్రులలో నంతఃకలహములు బలమగుటచేతను, కోటలోనియితరోద్యోగు లందఱు నేమియుఁ గలుగఁ జేసికొనక యూరకుండుటచేతను, నందున కారాజ్య మత్రశమముగఁ జేఁజిక్కెను. రాజనీతినిపుణుఁ డగునందుఁడు ననాయాసముగ నొక దేశమును తనసామ్రాజ్యమునఁ గలుపుకొనఁగలిగినందుల కెంతయు సంతసించెను. అందు రాజప్రతినిధిగఁ,గోట స్వాధీనమగుటలోఁ దనపక్షమునఁ బనిచేసిన

"శకటాలుఁ" డనుమంత్రిశిఖామణి నేర్పఱచి కొన్నిదినములు తన కుమారు నందుండనియోగించి యాతఁడుపాటలీపుత్త్రమునకు మరలెను.

విష్ణుగుప్తుఁడు కొన్నాళ్లు రత్నగిరిలోనుండి వసుమతితోఁ బరిచయము చేసికొనియెను. ఆతఁడుజ్ఞానహీనుఁడును మోటుదనముగలవాఁడు నగుటచే నాతనిచేష్ట లామెకు సహ్యములుగ లేకపోయెను వసుమతి చాల విద్యావతి. ఆమెను జిన్ననాఁటనుండియును బెంచి పెద్దదానిని జేసినసుందరియే యామెకువిద్య నేర్పెను. పరిపూర్ణముగ సంగీత విద్య నభ్యసింప జేసెను. క్రమముగా వసుమతి సంగీతసాహిత్యములయం దద్వితీయ ప్రజ్ఞావతి యయ్యెను.

విష్ణుగుప్తుఁ డామె నెట్లైన లోఁబఱచుకొని పరిణయము చేసికొనవలయుననుగట్టియాశతో నుండెను. ఇంక నచ్చటనుండినఁ దన నామె వివాహమాడునాశ యుండదనియుఁ, బాటలీపుత్త్రమునకుఁ బోయినచోఁ దగినవారిచే నామెకుఁ జెప్పించి యామె మనసు తనవంకకుఁ ద్రిప్పికొని పరిణయమాడవచ్చుననియు నాతఁడు తలంచుకొనియెను.

ఇట్లు కృతనిశ్చయుండై వసుమతిని బాటలీపుత్త్రమునకుఁ బ్రయాణము చేసెను. వసుమతి బాలిక. ఏమిచేయఁగలదు? రాష్ట్రమునందలి యుద్యోగస్థు లందఱును నందునియాజ్ఞకు లోఁబడిపోయిరి. ఇప్పు డామెను రక్షించువా రెవ్వరు? ఇట్టివిషమస్థితిలో వసుమతి మఱియొక మాట చెప్పక తనసంరక్షకురాలగు సుందరితో విష్ణుగుప్తునివెంబడి పాటలీకిఁ బ్రయాణముచేయుట కిష్టపడియెను.

పాప మామెకుఁ దల్లి చిన్ననాఁడే గతించినది. తండ్రియును డివి కేగెను. శైశవమునుండియుఁ దన్ను కన్నబిడ్డకంటె నెక్కువ ప్రేమతోఁ బెంచుచున్నసుందరి యామెతోడనేవచ్చుట కాయత్తపడి యున్నది. ఇఁక నామెకు రత్నగిరిలో నేమున్నది? ఎవ్వరున్నారు? రత్నగిరి

యామెకు దుఃఖముల కాలవాలమైనట్లు కనఁబడియెను. ఆవలి కేగిన నావిచారముల నెల్ల మఱచిపోవచ్చునని యామె తలంచెను. ముందేమి కానున్నదో యామె యాలోచించుకొనలేదు. పాప మామె వయ స్సెంత? విష్ణుగుప్తునిమాయోపాయము లామె యెట్లుగ్రహింపఁగలదు? సుందరియే తన కన్నిట దిక్కని యామె నిశ్చయించుకొనియెను. సుందరితో నామె పరివారసహితముగఁ బాటలీపుత్త్రమునకుఁ బ్రయాణ మయ్యెను.

నాఁడు పరివారమును వీడి వచ్చుచు మహావనమున మనకుఁ బరి చితలైన బాలికాసుందరులలో, బాలికయే వసుమతి. సుందరి సుందరి యే. దుష్టులగుంపుచే నపాయమునుగాంచినయాతఁడు విష్ణుగుప్తుఁడు. దుశ్చింతలగలవారి కెప్పుడును శుభములు చేకూఱవు.

---

# ఐదవ ప్రకరణము.

క్రమముగా విష్ణుగుప్తున కారోగ్యము కల్గెను. మరల నాతఁ డెప్పటిగోడవంకఁ బ్రవేశించెను. ఆతఁడు మిగుల మూఢుఁడగుటయేకాక నవనవయౌవనమదంబునఁ గేవల విషయాసక్తుండై యుండెను. తండ్రి వలె నాతనికి రాజ్యకాంక్ష లేదు ధనాశ లేదు. ఆతని కేమికొదవ? చక్రవర్తికి పెద్దబిడ్డ; యువరాజు; జనకునియనంతరమునఁ గోరకయే రాజ్యలక్ష్మి యాతని వరింపనున్నది; కుందేటికొమ్ములనైన సాధించి తెచ్చి యిచ్చుటకు వేనవేలు సేవకులున్నారు; అనుభవించుట కనేక భోగము లున్నవి; ఐశ్వర్య మున్నది. సార్వభౌముఁడగుతండ్రి యాత నిని బ్రాణముకంటె నెక్కుడుగఁ జూచుకొనుచున్నాఁడు. కోరికలను

బుట్టినట్లైనజన్మ మాతనికడ సార్థకతఁ గాంచుచున్నది. భావిమగధ చక్రవర్తిగాఁ బరిగణింపఁబడుచున్న యాతనికిఁ దీరనికోరికలే లేవు.

కాని, యాతఁ డొక్క విషయముంగూర్చి నిరంతరమును బరితపించుచుండెను. ఆపరితాపమున కెన్నటికైన నుపశాంతి కలుగునా? వసుమతీకరగ్రహణమునఁగాని యాతనితాపము చల్లారదు. అప్పుడు గాని యాతనిజీవితమునకు సుఖము కలుగదు. అతఁడు తనవైభవమును గూర్చియు, గుణములను గూర్చియు, నతిశయముగా నెందఱవలననో "వసుమతికడఁ బొగడించుకొనుచుండెను" ఆమెహృదయమింక నాతనికిఁ బూర్ణముగఁ దెలియలేదు. కాని యామెకుఁ దనపై ననురాగము కలుగ లేదని మాత్రము గ్రహించెను.

వసంతునిపై నాతని కనుమానము తగిలెను. వసంతుఁడు వసుమతీ సుందరుల సంరక్షణమునకై రాజుచే నియమింపఁబడుట విష్ణుగుప్తునకుఁ బ్రాణసంకటముగ నుండెను. విష్ణుగుప్తునకుఁ దండ్రికడ నెంత యోచనయున్నది. తండ్రికాతనియెడ నెంత యోప్రేమయున్నది. అయినను విష్ణుగుప్తుఁడు చండశాసనుఁ డగుతండ్రికడ వారెత్తి మాటాడ ధైర్యము లేనివాఁడై యుండెను. ఎట్లైన వసంతుని నాయుద్యోగమునుండి తప్పింప వలయు నని యాలోచించుచుండెను. రాజ్యతంత్రజ్ఞుఁ డగుపద్మనందుఁడు ప్రజారంజకుం డగువసంతునకు మహామాన్యతపదవి నొసంగ నిష్టము లేనివాఁడైనను, నాతనియందు గౌరవము సే చూపుచుండును. అందు లకుఁ గారణ మాతనిసుగుణములే కావచ్చును. గోముఖవ్యాఘ్రమగు పద్మనందుని గంభీరహృదయమును గ్రహించుట చాలఁ గష్టము.

విష్ణుగుప్తుఁడు రాచనగరునం దొకరహస్యాగారమునఁ హంస తూలికాతల్పమున నీయాలోచనాసముద్రమునంబడికొట్టుకొనుచుండెను. ఇంతలో వెలుపలఁ జిటుకుచిటుకుమనుగిలుకుమట్టెలచప్పుడు వినవచ్చెను.

ఆతఁడు తలయెత్తి చూచునరి కెదుట నొకతరుణీమణి సాక్షాత్కరించి యుండెను.

ఆమె యందకత్తెయే యని చెప్పినంతమాత్రమునఁ దృప్తి లేదు. అవయవవర్ణనమున యథారూపమును బోధించుటదుస్సాధ్యమే. కామినులకుఁ బ్రాయమే సుందరమైనది. విలాసములకు జవ్వనము, మెఱుఁగులకు దొలుకాఱువంటిది. నెఱజవ్వనమున విలసిల్లు నాయువతీమణి నెమ్మోనినిగ్గులు పవనచంచలితంబు లగుజలతరంగములం దొలుకాడు చంద్రకిరణములవలె మిలమిల మెఱయుచుండెను. ఆమెవిలాసచేష్టితముల కవధి లేదు. ఒక్కక్షణమైన నామె యూరకుండదు. పయ్యెద సవరించు కొనుచుండును. కరకంకణములనుగదలించుచుండును. అటునిటుసవిలాసముగఁ జూచుచుండును ఆమెముఖచంద్రమండలము చిఱునవ్వువెన్నెలల నొకప్పుడును విడిచి యుండుట లేదు. ఆమెనవ్వుచుండునప్పుడు, నును జెక్కులఁ జిన్నిగుంట లెంతోరమణీయముగ నుండును. సాముద్రిక శాస్త్రమున నట్టిచిహ్నములు జారిణీలక్షణములుగఁ బరిగణింపఁబడినవి. ఆమె జారిణియో, భోగినియో!

విష్ణుగుప్తుఁడు గాయములబాధలోఁ బడియున్నప్పు డీమె యాతని కుపచారములఁ జేసినది. విష్ణుగుప్తున కామెయన్నఁ జాలదయ. ఆతని కడ నామెకుఁ జాలఁజనవున్నది. వారి కన్యోన్యసంబంధ మీవిధముగాఁ గుదిరినది ఆమెనుచూచినతోడనే విష్ణుగుప్తునకు ముఖము వికసించినది.

"చతురికా! ఏమైనది?" అనియెను.

"ఇంక మింతయైనది"

"ఆమె యంతయు నాలకించినదా?"

"ఆలకించినది"

"ఏమన్నది"

"ఏమనుట కేమున్నది. ఊరకున్నది"

"సిగ్గుపడినది కాఁబోలును!"

"సిగ్గుపడినదో, భయపడినదో"

"ఎట్లైన నేమి? కోపపడకుండుట యేచాలును"

"నీ కేమైనను జాలును"

"ఈమాటల కేమిఁగాని, కార్య మేమయినది?"

"భంగ మయినది"

"పరిహాసములు మాని నిజము చెప్పుము"

"నిజము నిడివిమీఁదగాని తేలదు"

"వసుమతీహృదయము నీకింకను దెలియలేదా?"

"తెలిసిపోయినది"

"ఏమని తెలిసిపోయినది?"

"నీమీఁద లేదని—"

విష్ణుగుప్తుఁ డదరిపడియెను. "నీమాటల కేమియును బ్రత్యుత్తరము రాలేదా?" అనియెను.

"వచ్చినది ఆమెకుఁ బెండ్లియాడవలెనని లేదు"

"ఏమి? మగధరాజ్యచక్రవర్తిని యగుటకైనను నామె కిష్టముండదా?"

"పాపగ్రహములు చూచుచున్నవి ఆమె కంతయదృష్ట మెట్లు పట్టును? నిన్నుఁ బెండ్లియాడవలె నని లేదు"

"మఱి యెవ్వరిని బెండ్లియాడును?"

"వసంతుని—"

ఈమాటకు విష్ణుగుప్తునకుఁ గోపమువచ్చెను. మఱి నీవేమి బోధించితివి?" అనియెను.

"మాటలలోఁ బడిపోవుట కందఱును వెఱ్ఱిచతురికలే యనుకొంటివా?"

"నిర్భాగ్యురా లగువసుమతి నీమాటలు విన లేదా?"

"వసంతునిబోధనము లామెతల కెక్కినవి. మనమేమిచెప్పినను లాభము లేదు"

విష్ణుగుప్తుఁడు మండిపడియెను. "ఏమి! ఆదురాత్ముఁ డొంతదుర్ణయుఁడై చరించుచున్నాఁడు! ఆతనిపాఁగ రడఁచువఱకు మనకార్యము సిద్ధింపదు. ఇందులకుఁ దగినప్రయత్నము చేయవలయును"

"మాటలవలన లాభము లేదు. చేసి చూపవలయును"

"అది మనచేతిలో నున్నది"

"యువరాజునకుఁ జేయరానిపని యేమున్నది?"

"కొలఁదిదినములలో నాతనిగతి చూచెదవుగాక! ఇటకు నీవు రహస్యముగనే వచ్చితివా?"

"నీకన్నులకంటె నెవ్వరును నన్ను చూడ లేదు. నీగుండెలు కొట్టుకొనుచున్న వా యేమి?"

"మఱేమియును భయము లేదు. నాయనగారియాజ్ఞ యట్లున్నది. దానిని మనము వ్యతిరేకించుచున్న ట్లగపడరాదు"

"నాయనగారియాజ్ఞ కాదు. వసంతునియాజ్ఞ యనుము"

"ఛీ! ఆనీచుఁ డేమిచేయఁగలఁడు"

"ఇంకేమి చేయవలయును! మొదటికే మోసము చేయుచున్నాఁడు"

"ఇంకెన్ని నాళ్ళు! అయినదా యయ్యాపని"

"కావలయును. ఆవెనుకఁ జూడవలయును."

"రమ్ము! మనయుద్యానమునకుఁ బోదము. నీతో నింకను మాటలాడ వలసియున్నది."

ఇట్లుసంభాషించుకొని వారిరువురును వెడలిపోయిరి.

చతుర్థకపణ్యాంగన. వారిరువురకును జనవధికమగుటచే రాజుగారు

చతురికను యువరాజమందిరమునకు రాఁగూడదని యాజ్ఞచేయించిరి. అది వసంతునిమూలమున జరగియుండునని చతురికకుఁ గోపముకలిగెను. అందుమూలమున నీకుట్రపన్నినది. అంతేకాని వసుమతీవసంతులకింత వఱకేమియును సంభాషణము జరగియుండలేదు. వసంతుఁడెవ్వరో వసుమతి యెఱుఁగనే యెఱుఁగదు. వేశ్యాంగనలమాయావాగురలలో వనే కులు బంధింపఁబడిరి. వారివిషవాక్యములు చాలమంది ప్రాణముల హరించినవి. విష్ణుగుప్తునకుఁ జతురికవాక్యము లమృతప్రాయములు. చతురికవలనఁ దనకార్యములు చక్కఁబడునని యాతఁడు నమ్మి చున్నాఁడు జత్తులమారిచతురిక యాతని లోఁబఱచుకొని యేమేమో చేయఁజూచుచున్నది. ఎట్టివింతలు పుట్టనున్నవో?

## ఆఱవ ప్రకరణము.



పాటలీపుత్త్రమునందలి రాజభవనమునకు దక్షిణముఁ దూర్పు పడమరలకు వ్యాపించు నొకసౌధపంక్తి యున్నది. అందు శచీసౌధము మనోహరమైనది. దానికిఁ బ్రాక్పార్శ్వమున చైత్రభవనమును, ఎట్టయెదుటనే విష్ణుగుప్తుని కేళీసౌధమగు నింద్రమందిరమును గలవు. శచీసౌధము చంద్రకాంతశిలలచే నిర్మింపఁబడినది అడుగునను పైభాగమునను తాపటముచేయఁబడినయాసుస్నిగ్ధశిలాప్రదేశముల మనోహరలతలును, పుష్పములును, ఫలములును, చిత్రింపఁబడియుండెను. అందొక విశాలభవనమున కుడ్యములయందు చిత్రవిచిత్రములగు చిత్రపటములమర్పఁబడి యున్నవి. అందు వరుసగా శ్రీమహావిష్ణునిదశావతార

ములు, నందనోద్యానమునందలి మందారతరుషండమునఁ గందుకక్రీడ సలుపు జగన్మోహిని, తుమ్మెదగాథ నపనయించు నెపంబునఁ జనుదెంచిన దుష్యంతుని మనోహరరూప సందర్శనంబున వెఱఁగుపడి నిలిచియున్న శకుంతల, లజ్జామార్ధ్యమున నగ్నిమిత్రునికౌఁగిట బెదరిబెదరి చూచుచున్న మాళవిక, హంససందేశము నత్యాదరమున నాలకించుచున్న దమయంతి, రాణులచేఁ బూజింపఁబడుచున్న వత్సరాజును, కుసుమశరభ్రాంతిచేఁ దదేకధ్యానమునఁ జూచుచు నిలువఁబడియున్న రత్నావళి, ఆకాశయానమునఁ బోవుచు సేకావళినెపంబున వెనుదిరిగి సానురాగముగఁ బురూరవుం జూచుచు నాఁగినయూర్వశి, మొదలగుచిత్రరూపములు యథాపూర్వముగ లిఖింపఁబడియుండెను.

ఆగదియందు రత్నకంబళముపై పఱపఁబడినమెత్తనిపట్టుపఱుపుపై గోడకువేయఁబడిన మొకమల్‌దిండు నానికొని వసుమతి కూర్చుండియుండెను. పార్శ్వముననున్న పట్టుదిండుపై నెడమమోచేతి నాని హస్తపద్మమునఁ జెక్కిలిఁ జేర్చికొనియెను. ఆమెదక్షిణబాహువల్లిక పార్శ్వముననున్న సుందరిమెడకుఁ జుట్టుకొని యామెదక్షిణభుజంబునుండి కంఠపార్శ్వమున వ్రేలాడుచుండెను. ఆహస్తపల్లవము సుందరిసమున్నతవక్షస్థలంబున వ్రేలాడుచున్న మణిహారముల నల్లనఁగదలించునప్పుడు కోమలాంగుళంబుల మెఱయుచున్న యుంగరములమణిద్యుతులు సుందరికన్నుల మిఱుమిట్లుగొలుపుచుండెను. సుందరి యెడమచేయి వసుమతిగంటలయొడ్డాణముప్రక్కనుండి యామెసన్నని నడుమును జుట్టుకొనియుండెను. ఆమె వసుమతివంకఁ దదేకదృష్టితోఁ జూచుచుండెను. ఇరువురును మాటలాడుటలేదు వారిహృదయముల నేదో విచారముకలిగియున్నట్లు వారిముఖలక్షణములవలనఁ దెలియవచ్చుచుండెను. ఒక్కింతసేపు వారటేయుండిరి. వసుమతి యొకనిట్టూర్పు విడిచి సుందరితో నిట్లనియెను.

"ఈతనియుద్దేశ మేమైయుండును?"

"ఎట్లు తెలియఁగలదు? పాముకాళ్లు పామునకే యెఱుక. ఇతఁడెంతకఠినహృదయుఁడో, అంతదుర్మార్గుఁడు. ఎంతదురాశాపరుఁడో, అంతలోభి"

"పాపాత్ముఁడగు నీతనిపాలఁబడి మనము మానప్రాణములఁ గోలుపడవలసినదేనా?" అని వసుమతి కన్నుల నీరు పెట్టుకొనియెను.

"అమ్మా! విచారింపకుము. మెఱుఁగులేఁజెక్కుల వేఁడికన్నీటిచేఁ గందింపకుము. నిట్టూర్పులవలన నధరపల్లవము వాఁడిపోవుచుండ నా హృదయము దహించుకొనిపోవుచున్నది ఊఱడిల్లుము"

"ఏమని యూఱడిల్లి యుండఁగలము? ఆతనిదుర్వ్యాపారము లతిఘోరములుగ నున్నవి."

"ఆతని కున్న దంతయును రాజ్యకాంక్షయే"

"రాజ్య మాతనిస్వాధీనముననే యున్నదే. సంరక్షణ మను నెపమునఁ దెచ్చి మనకేల యిట్టినిర్బంధముం గూర్పవలయు?"

"పద్మనందునకు రాజ్యకాంక్షకంటెను పుత్త్రప్రేమ ఘనమైనది. మననిర్బంధమునకు విష్ణుగుప్తుఁడు కారణమై యుండవచ్చును"

ఇట్లనినతోడనే వసుమతిమోడలు కంపించెను. అధరపల్లవము చలించెను. కన్నులెఱ్ఱవడియెను. మొగము చేవురించెను. గద్గదస్వరముతో నిట్లనియెను.

"దేవుఁడు నిర్దయుఁడు. ఆమూఢునిగాయములనుమాన్పి యగతికనగు నాహృదయమును గాయపఱచినాఁడు. దినదినమునావిష్ణు—ఆ నిర్భాగ్యుఁడు తనయున్మత్తప్రలాపములచే నాగాయముపై గరళముం జిలుకుచున్నాఁడు"

సుందరి తరళనయనము లశ్రుపూరితము లయ్యెను. ఆర్ద్రమువారి హృదయము లతికరుణములు. వారిసుకుమారహృదయములు కష్టముల

పేరైన విననోపవు. "అమ్మా! నేను దురదృష్టవంతురాలను. తల్లి దండ్రులు లేనిబిడ్డ వగునిన్ను నాప్రాణముగఁ బెంచితిని. నీవు రత్నగిరి రాణివై యున్నప్పుడు కన్నులుచల్లఁగాఁ జూడవలయునని గంపెడాసతో నుంటిని. నాకష్టము లన్నియు మఱచిపోయితిని. నాజీవితము నిరర్థక మైనదే యైనను నీతోడిదేలోకముగ జీవించి యుంటిని. తల్లీ! చిన్న బోయిననీమొగము చూడఁజాలను. నీహృదయమును పరితపింపఁ జేసి కొనకుము. ఇంతవఱకు మనకుఁగలిగినయుపద్రవ మేమియును లేదు. ధైర్యమును వహించి యుందము" అనియెను.

"ఉత్తరక్షణమున నెట్టియాపద రానున్నదో తెలియుట లేదు. పాముకాటునవిషమునలె నాదురాత్మునియెడ లంతటనుమోహవికారము విరియఁబారినది. యుక్తాయుక్తపరిజ్ఞానము లేక లజ్జావిహీనుఁడై చరియించుచున్నాఁడు. దుర్మదాంధుఁడై నిరంకుశముగ నాతఁడేమిచేసినను చేయఁగలఁడు. మనకు దిక్కెవ్వరు?" అనునప్పుడు వసుమతియొడలంతయును గడగడ వడంకెను.

"దిక్కులేనివారికి దేవుఁడే దిక్కు. నాఁటికెవ్వరినో యాతఁడే పంపుసేయుచుండును. అట్లు కానియెడల మొన్న నామహావనమునందు దుష్టుల యుపద్రవమునుండి యామహాత్మునిచే మనమెట్లు రక్షింపఁబడుదుము?"

అతితరమగువిచారమున కంతరాయమే కలుగనియెడల నది హృదయగోళమునుబగల్చివైచును. సుందరిపై వాక్యములవలన వసుమతి హృదయము మఱియొకచోటికిఁ బోయెను. అటఁ గష్టములేవియు నగపడుటలేదు. కాని, హృదయమున నేదో యాశ కలిగెను. ఏమేమో యాలోచించుకొనియెను. ఆయాలోచనల కంతము లేకపోయినది. సుందరితో మఱి యెట్లు మాటలాడవలయునో యామెకుఁ దెలిసినది కాదు. నాలుకతుదివఱకు వచ్చినమాట యాఁగిపోవుచుండెను.

అతికష్టముపై మనసు కుదురుపఱచుకొని "ఆయుదారశీలుఁ డెవ్వఁడో? ఎచ్చటివాఁడో? ఏమైనఁ దెలిసినదా?" అనియెను.

సుందరికి నూపిరి తిరిగినది ఆమెకు వసుమతివిచారమునపనయించు మార్గము దొరకినది "బిడ్డా! ఆతఁడు రాజకుటుంబములోనివాఁడనియే నానమ్మకము. విశేషించి యీనగరవాస్తవ్యుఁడే కావచ్చును" అనియెను

"నీవెట్లు చెప్పఁగలవు?"

"రాజపుత్త్రులకుఁగాని వేఁటగోడవ యుండదు. ఆతనిరూపగుణవిశేషములుకూడ నావిషయమును స్థిరపఱచుచున్నవి. ఈనగరము వాఁడే కానియెడల సర్వము నెఱింగినవానివలె నింతలో మనకు మంచి సదుపాయములను గల్పించి మనల సిపురంబునకుఁ జేర్పలేఁడు."

"ఆనుగుణరాశికటాక్షమున మన మింకను రక్షింపఁబడఁగలమా?"

"ఆ! నిశ్చయముగ రక్షింపఁబడఁగలము. బాల్యచాపలమునం గలిగినసిగ్గుచే నీవాతని నప్పుడు తిన్నఁగఁ జూడలేకపోయితివి"

వసుమతియొడలు జల్లుమనియెను "చూచినంతమాత్రమున నాతని స్వభావము మన కెట్లు తెలియఁగలదు?"

"చూపులవలన హృదయము వ్యక్తమగుచుండును. అప్పుడాతఁడునావెనుక మేలిముసుఁగునైచికొనినిలిచియున్న నీపైఁ బఱగించిన సమాదరశీతలంబులగు కటాక్షములలో నెంతయో యర్థమున్నది. ఆతఁడు మనల నెన్నటికిని మఱవఁజాలఁడు"

వసుమతికి సిగ్గు పుక్కిలింత లయ్యెను. మఱియేమియును మాటలాడలేదు. సుందరి కారణమును గ్రహించినది. ఆమెయు నాప్రశంస యంతటితో నాఁపివేసెను.



# ఏడవ ప్రకరణము.

సౌందర్యవర్ణనము కొందఱ కింపుగ నుండును. గుణకీర్తనము మఱికొందఱకు రుచించును వర్తనాదులనుగుఱించి తెలిసికొనుటకై వేఱొకకొంద ఱభిలాషపడుచుందురు. అందఱ నన్నివిధముల సంతసింపఁ జేయుట యొకరితరము గాదు. కాని, కథానుకూలముగు పాత్రౌచిత్యమును యథారీతిగఁ బోషించుటకై ప్రయత్నించుటయే కవులధర్మము. ఈసందర్భమున మనకథానాయిక యగు వసుమతిసౌందర్యముగూర్చి వ్రాయవలయు నని మాకెంతయో కోరికయున్నది. ఆమెమోహన రూపమును వ్రాయుటకు మేము చిత్రకారులమయ్యెదము. పాఠకుఁడా! నీహృదయఫలకమును పరిశుభ్రపఱచి యుంచెదవేని మాలేఖినిచేఁ జేత నైనంతవఱ కామెమనోహరాకృతిని లిఖియించుటకై ప్రయత్నించి చూచెదము. మేమెంతవఱకుఁ గృతార్థుల మయ్యెదమో చెప్పుభారము నీయందున్నది. మేమావసుమతి నడుగఁబోము. నీవు సరిచూచి కొనఁ గోరెదవేని మహావనమునం దామెను దర్శించినరసికపురుషుని హృదయమున దృఢముగఁ బ్రకృతిచే లిఖింపఁ బడినయావసుమతీ మోహనవిగ్రహముతోఁ బోల్చిచూచుకొనుము. దానికిని దీనికిని భేద ముండదనియే మాయభిప్రాయము. మేమిప్పు డాపురుషునితో నైక్య మొందితిమి.

వసుమతి యిప్పు డేకాంతస్థానమునం దున్నది. తనసౌధమున నొకమృదుశయ్యపైఁ బరుండి యున్నది. నిద్రించుట లేదు. ఏమియో యాలోచించుదానివలెఁ బరధ్యానముగఁ జూచుచున్నది. మేమామె మోహనాకృతి నిప్పుడు ప్రదర్శింపఁబోవుచున్నాము. పునరుక్తియని కోపింపక నీహృదయమును నిర్మలముగ నుంచుకొనుము. వసుమతివలెనే

నీవుగూడఁ బరధ్యానముగ నుండకుము. మాకిప్పు డుపమాద్యలంకార ములతోఁ బనిలేదు. స్వభావమునే నైకొని సత్యము నింతుఁ బ్రదర్శించె దము. కాని, మబ్బుచాటునుండి వెలువడుసంపూర్ణచంద్రబింబము నొక్కసారి స్మరించుకొందుము. ఆ వెన్నెల కాంతిని విలోకింతుము. ఆచల్ల దనమునకై సంతసింతుము. అప్పుడె వికసించినపద్మముల గ్రహింం తుము వానిపత్రములమెప్పిదమునకై యానందింతుము. వానిపై నాడుచున్నభ్రమరముల నాలోకింతుము. చంపకముల సన్నిధి చేసి కొందుము. మృణాళములఁ దలంతుము. పల్లవములఁ బ్రశంసింతుము. తారల లెక్కింతుము.ఆకాశమునకై చూతుము. మెట్టదామరల నవలో కింతుము. పదియాఱువన్నె బంగారముఁ గోరుదుము. కలకంఠముల స్మరింతుము.అయ్యో! మేము పూర్వపరిచయముగల వీనినన్నిటిని మఱవ లేకుండఁ బోయితిమే? అయినను వసుమతినిఁ జిత్రింపవలయునను సంక ల్పము మాహృదయమున దృఢముగ నాఁటికొనియే యున్నది. ఈ మనోహరవస్తుసంస్మరణచే మామన మవశమైనది. అలీకసాన్నిధ్యమున లీనమైనది. ఇట్టిసమయమున వసుమతి సత్యమైనమోహనాకృతి మా హృదయమునఁజిత్రముగ నెట్లో నెలకొన్నది.నీవుమావలె మనసును బరు గెత్తనీయకుము. మాహృదయమునందు నాఁటికొనియున్నయీవసుమతీ మోహనవిగ్రహమును నీహృదయములో నద్దికొనుము. ఇప్పుడు చూచి కొనుము!

ఆలావణ్యరాశి తేజోవరణమున నిగనిగమెఱయుచు నీలకాంతులచే సోగలై దట్టముగనున్న యాకుంతలములను జూచుచున్నావా? ప్రకాశ మానమై, సుస్నిగ్ధమై, వర్తులమైనయాముద్దుమొగ మగపడుచున్నదా? ఆసుందరీమణిమనోహరతనులతయందలి లావణ్యతేజము నీకన్నుల మిఱుమిట్లుగొల్పుచున్నదా? ఆసాత్త్వికాకారము నీకు గోచరించుచున్నదా? ఆకర్ణాంతములై, విశాలములై, వాలికలై యున్నయామెనేత్రము లెట్లు

వికసించి యున్నవో చూడుము! మృదుపక్ష్మములు కదలుట లేదేమి? కనీనికలు సునీలములై యెంతమనోహరముగనున్నవి? సుదీర్ఘమై, సుందరమై, యమూల్యముక్తామణి ప్రభాచుంబితాగ్రమై, తిన్ననై, యొప్పులొలుకు నాసికఁజూచితివా? సమదీర్ఘములయి, కోమలములయి, గుండ్రములయి యున్న బాహువులు కంచుకాద్యలంకరణములచేఁ బ్రకాశించుచున్నవి. చూచితివా? సమగ్రకోమలారుణాంగుళివిభాసితంబు లగుమనోహర హస్తములం బరికించుచున్నావా? నఖంబులు కాంతిమతంబులయి యున్నవి. సన్ననై, చిఱుగంటల మొలనూలిచే నలంకరింపఁబడిన నెన్నడుము నీకగపడుట లేదా? స్వభావారుణంబులయి సమంబులై యున్న యామె మృదుపదంబుల విలోకించితివా? సన్ననిదువ్వలువమాటునుండి వెలువడు నెమ్మోని మెఱుపులయందలియందమును నీవు గ్రహియించితివా! ఆమె మనతో మాటాడదేమి?

ఆమెహృదయమున నేదో వింతవికార మొదయించినది. స్త్రీల హృదయములు నిగూఢములైనవి. పరేంగితజ్ఞానధురీణు లగుమహా పురుషులకుఁ గూడ దురవగాహమైనవి. ఇప్పు డామెమన స్సామెలో లేదు. ఆమెనిద్రించుటకై పరుండియుండలేదు. ఏదియో యాలోచించుకొనుచుండెను. ఏమియునుఁ దోఁచుటలేదు. మహావనమునఁ దన్నురక్షించినపురుషుని మోహనాకార మామెమనస్సును హరించి యుండునా? యువతులు కేవలపురుషసౌందర్యమునకే వలచుట స్వాభావికము. గుణవిశేషములు కూడ విదితమైనప్పు డిఁకఁ జెప్పవలసినదే మున్నది? ఆమె పది యాఱేండ్లకన్య. ఆతఁడు జగన్మోహనాకారుఁ డగు యౌవనపురుషుఁడు. ప్రాణదాన మొనరించినసుందరుని ప్రాణేశ్వరునిగాఁ దలంచుటలో వింత యేమున్నది? పొరలిపొరలివచ్చుచుండు భావముల వలన నెంతనిగూఢ చిత్తములనైనఁ గనిపట్టవచ్చును. నిజముగా నామె హృదయమును నాపురుషుఁ డాకర్షించినాఁడు. ఆమెకు నిదురపట్టుట లేదు. ఇట్లు యోచించుకొనుచుండెను.

"ఆదయార్ద్రహృదయుఁ డకారణవాత్సల్యమున నాపత్సముద్ర మునుండి నన్నుద్ధరించుటకుఁ గారణమేదైన నుండునా? స్వర్గమునుండి దిగివచ్చినభాగ్యదేవతవలె మమ్ముద్ధరించి తా నెంటఁగఁ బోయెనేమో? అతనికిఁ బ్రాణులందు దయకుదుంచినసుస్వభావ మేదైన నుండియుండు నా? లేకున్న నాతనిన్నేకంటిచూపు లంతటి మనోహరములుగ యుండ నేల? అయ్యో! అదిమాత్రము చాలసేపు నిలిచిననా? నాచూపులలో నైక్యమైనట్లుండి యంతలో మఱలిపోవుచుండెడివే? ఆఁడు వారిచుఱుకు చూపులయం దట్టిగుణము కలదేమో? అంతమాత్రమున నాతనిమనస్సు నకుఁ గష్టము కలుగదుగద? ఆకారణమున నాపై నసూయ కలుగు నే మో?—ఎంతమాట! అట్లయిన నాయం దెంతో ప్రేమగలవానివలె మాచెలితో నావిషయమున నేల ముచ్చటించును? కృతజ్ఞతాపూర్వక ముగ నేనేమి చేసితిని? ఆతనిముద్దుమొగమునఁ జిఱునవ్వుదయించిన దే? అదియాతనిస్వభావమా? ముఖలక్షణమా? లేక దీని కేమైననర్థమున్న దా? నన్నాతఁడు పరిణయము కాఁ దలఁచియుండునా ?— అట్లయిన నాతనియన్వయనామగోత్రము లేల దాఁచికొనవలయును? సుప్రసిద్ధుఁ డగుటచేఁ దన్నుఁ దాఁ దెలిపికొనకున్నను దనయూరిపేరైన నేల తెలుప లేదు? ఆతఁ డీపాటలీపుత్రమున నే యుండియుండునా? అదియునుగాక యాతఁడు రాజపుత్రుఁడునుగూడ నైయుండునని హృదయమునం దేది యో చెప్పుచున్నది. ఆశ యిట్టితలంపులనే కలిగించును. రాజపుత్రుఁడే కానియెడల నాతని కావనసమీపమున, పల్లకీయు బోయలు నెట్లు వత్తురు? అంతపరివార మెట్లుండును? ఇదియంతయు నిజమేయైనచో మరల మాకేల దర్శనమీయఁడు. నాహృదయ మాతనికి స్పష్టముగఁ దెలియలేదేమో? మహాత్ములు పరహృదయము నెఱుంగువఱకుఁ దమ హృదయములను వెల్లడింపరుగదా! ఇప్పట్టున నాగతి యేమి కావల యును?"

అని యాలోచించుకొనుసరి కామెకనుగొలుకులనుండి బాష్ప బిందువులు చెక్కులవెంట దిగజారుచుండెను. నిట్టూర్పులు వచ్చెను. ఒడలూరక వడఁకుచుండెను. పరవశతదోఁచెను. ఒక్కింతసేపు కన్నులు మూఁతపడియెను. ఇంతలో నాపురుషుని దివ్యమంగళవిగ్రహ మెదుట సాక్షాత్కరించిన ట్లయ్యెను. దిగ్గున లేచి నిలువఁబడి నలువలం కులకుఁ దనచూపులు సారించెను. ఎవ్వరు నగపడలేదు. శయ్యపైఁజేరి కన్నులుమూసికొనియెను. మరల నాసుందరాకారము గోచరమయ్యెను. మరలఁ గన్నులు విచ్చి చూచెను. సుందరి యెదుట నిలువఁబడి యుండెను. సుందరి నామె చూడలేదు. "ఏమియీమాయావిలాసము" అనియెను.

"ఆపురుషోత్తమునిదా?" అని సుందరి ప్రశ్నించెను.

వసుమతి యించుక యప్రగల్భయై యామెనుజూచెను. ఆచూపు లట నిలిచినవికావు ఇటునటు పరుగెత్తినవి. ఎదుటకుడ్యముపై నొక మోహినీపట ముండెను. దానిని నిరూపించుచు, "అతఁను మోహినీ రూపమును దాల్చి యీతఁ డెట్టిమాయావిలాసముఁ జూపినాఁడు" అనియెను.

"మోహనరూపమనుము" అని సుందరి మారుపలికెను.

వసుమతి దానికిఁ బ్రత్యుత్తర మీయవలయు నని యాలోచించు కొనుచుండెను ఇంతలోఁ బరిచారిక వచ్చి "అమ్మా! అధికారి తమ కొఱకు వేచియున్నాఁడు" అని వచించెను. వారాతని సందర్శింపఁ బోయిరి.

---

## ఎనిమిదవ ప్రకరణము.

వసుమతీసుందరులు సౌధమును దిగివచ్చునప్పటి కధికారపురుషుఁడు లోపలిభవనమున నిలువఁబడియుండెను. అతని జూచినతోడనే యాసతీమణులిరువురును మిగుల నాశ్చర్యమును జెందిరి. ఒక్కింతసేపాయద్భుతరసంబున మునింగి నిశ్చేష్టలై నిలువఁబడిరి. అతఁడు రాజపుత్త్రోచితంబు లగుదుస్తులనుధరించి యుండెను. ఏమి యాలోచించుకొనుచుండెనో గాని కుశల మరయవచ్చినయాతఁడును మాటలాడలేదు. వసుమతి యింకను జిత్రప్రతిమవలెనే యున్నది. ఆయిరువురిలోఁ బెద్దదియును గృహకృత్యములయందలిభారమును వహించినదియు నగుసుందరి కిఁక నివ్వెఱపడి చూచుచుండుట కవకాశము లేదు. గృహమున కతిథియైవచ్చినపురుషుని సన్మానింపనియవమాన మామెకుఁ గలుగవలసినదే గాని వసుమతి కెంతమాత్రమును గలుగదు. సుందరి వినయపూర్వకముగ "అయ్యా! స్వాగతము. ఈపీఠముపై దయసేయుఁడు" అనియెను. పురుషుఁ డట్లు కూర్చుండెను.

"దయాళురగు మీహృదయమునకు మేమింకను జ్ఞాపకముగ నున్నామా?" అని సుందరి ప్రశ్నించెను.

"లేకేమి? ఎప్పటికప్పుడు మీక్షేమసమాచారములఁ దెలిసికొనుచునే యున్నాను. ఇప్పుడు మీ కుశలమును బ్రత్యక్షముగఁ జూచిపోవలయు నని వచ్చితిని"

"ఎంతకాలమునకు మరల దర్శనము దొరకినది? ఇంతవఱకు మీ రెచ్చట నున్నారు?"

"ఇచ్చటనే చక్రవర్తిచే మీసంరక్షణమునందే నియోగింపఁబడియున్నాఁడను"

"ఇంతకుముం దెచ్చట నుండెడివారు ?"

"ఎప్పుడు నిచ్చటనే యున్నాఁడను. నేనీచక్రవర్తికి జ్ఞాతివర్గము లోనివాఁడ నగుటచే నీనగరునందే వసించి యుందును"

వసుమతి కీమాటలు వినఁబడినవా ? ఈతఁడలనాటి ప్రాణదాత యని యామె గ్రహించినదా ? ఏమో ? ఆమె యేమియును మాటలాడ లేదు. మహానందమున నొడలు మఱచిపోయినదికాఁబోలు !"

"మహాత్మా ! ఇప్పుడుగదా మావసుమతి దిక్కుగల దైనది" అని సుందరి దీనముగఁ బలికెను.

"చక్రవర్తి రక్షణముననున్న మీ కేమిభయము ?"

"మమ్మాచక్రవర్తి యెందులకు రక్షించునో తెలియకుండుట కంటె మఱి భయమేమున్నది ?

"మిమ్మెల్ల విధములఁ గాపాడవలయు ననియే మహారాజు నుద్దేశము."

"మా జీవితములఁ గాపాడ నక్కఱలేదు. మరియాదఁ గాపాడినఁ జాలును."

"అదేమి యట్లనుచున్నారు ?"

"రాజోద్యోగులకడ నంతకన్న మనవి సేయవలసినదేమున్నది?"

"నావిషయమున మీ రేమియును శంకింపవలదు. అబలలగుమీ మానరక్షణము సేయుటకంటె నాకు రాజసేవ యధికముగాదు. నన్ను మీ ప్రాణబంధునిగఁ దలంచి మీకుఁ గష్టముగఁ దోఁచుచున్న మీ హృదయరహస్యముల వెల్లడింపవచ్చును. నేను జీవించియున్నంతవఱకు మీ కేమియును భయములేదు."

"అల్లనాఁడు క్రూరజంతుబాధనుండి మాజీవితములఁ గాపాడితిరి. సతీమణులకు జీవిత మంతప్రియమైనది కాదు. శీలమును గాపాడు

కొనుటకు వారు ప్రాణములనైన విడువఁగలరు. ఇప్పుడు మాకు మాన రక్షణమున సంశయము కలుగుచున్నది."

పురుషుఁడు బాగుగ నాలోచించుకొనియెను. ఆతని కాలోచన యేమియునుదోఁచుట లేదు. ఒక్కింత వదనబింబమును పైకెత్తిచూచు సరికి వసుమతీ మోహనవిగ్రహ మాతని యెట్టయెదుట సాక్షాత్కరించి యుండెను. ఆమెతరళనయనంబులనుండి వెడలుకటాక్షములాతనిహృదయ మును గలఁచివేయుచుండెను. వసంతుఁడామెవంకఁ జూచువఱకును, వసుమతి యాతనిమనోహరలావణ్యామృతమునుదనివాఱఁ గనుదమ్ములఁ గ్రోలుచునే యుండెను. ఆతనిచూపు లెదురొక్కనితోడనే వసుమతి తనకటాక్షముల గిరుక్కున మరల్చివైచెను

ఓపికిఁకివసుమతీ! నీకింత భయమేల? ఆతఁడు శాంతమూర్తి. దయామయుఁడు. ఆతనిమనోహరకటాక్షమాలికలకు నీవలపు చూపు లుపాయన మొసంగఁదలంచియు నేల శంకించెదవు? ఓముద్దరాలా! నీకు సిగ్గు లేదని యెవ్వ రాక్షేపింతురు? సుందరి నీప్రాణమే గదా! నీముద్దు చెల్లించుటకంటె నామె కిఁక నేమి కావలయును? పాప మాతని హృదయ మెట్లున్నదో మాత్రము నీకుఁ దెలియనిమాట నిశ్చయము. అందుచేతనే నీవాతనిచూపుల నెదిరింపలేకున్నావు. తెలిసినను నీసిగ్గు నీకు స్వతంత్రత నీయదే. ఇరువురను జూచుచున్న మాకు మీరిద్దఱు నొక్క మెట్టుపై నున్నారనియే తోఁచుచున్నది. నీవుఁగూడఁ దెలియఁదలంతు వేని యొక్కింతసేపు నీలజ్జాసఖిని దూరమునకుఁ బంపి యాతనిచూపుల యర్థమును గ్రహింపుము.

పురుషుఁ డింకను నాలావణ్యరాశిం జూచుచునే యుండెను. ఆతని కాలోచన యేమియును దోఁచనే లేదు. మరల నడిగినదే యడుగు చుండెను.

"మీ కేమియును భయము లేదు. సంశయమువలదు" అని యెను.

"కాముకులచిత్తవృత్తములు యుక్తాయుక్తవివేకశూన్యములై యుండును. మానవతులసౌశీల్యములు పరమపవిత్రము లయినవి. అపరిచితంబగు నీస్థలంబున, దుష్కాముకజనమధ్యంబున, నున్నమాకు శాంతి యెట్లుండును? ఈపురంబున ననాధజనరక్షకుండగువసంతుఁ డొకఁ డున్నాఁడనివినుచున్నాము. ఆతనియనుగ్రహము మాకెట్లు లభించును? ఎన్నివిధములఁ జూచినను మీకంటె మాకెవ్వరును రక్షకులు లేరు"

"మఱేమియు నుపద్రవము లేదు. పాటలీపుత్రమంతయుఁ బాపాకరంబనియెతలంపకుఁడు. దీనదయాపరుండును,మహాతేజస్సంపన్నుఁడు నగు చంద్రగుప్తుఁ డీయూర నున్నంతవఱకును దారుణకర్మముల నాచరించుటకుఁ జక్రవర్తియైన సాహసింపఁజాలఁడు. ఆతఁడు పరదైవము వలె నెల్లవిషయములఁ గనిపెట్టుచునే యుండును. ఆతఁడు నాకుఁ బ్రాణమిత్రుఁడు. నేనును నిరంతరమును మీక్షేమమునుగూర్చి ప్రయత్నించుచుండెదను."

"అంతర్భవనములనున్నయబలల నిరంతరముఁ గను గలిగి చూచుచుండుటకు మీకుమాత్రము తీరిక యెట్లుండును?"

"అట్లు శంకింప నక్కఱలేదు. మీ కెప్పుడైననాపద రానున్న యప్పుడీయుంగరమును నాకడ కంపుఁడు. నాప్రాణములఁ గోల్పడియైన మిమ్ముఁ గాపాడుటకుఁ బ్రయత్నించెదను."

అని యొకముద్రిక నొసంగెను

ఆనంద మనిర్వాచ్యమైనది. రూపరహితమగు నాపవిత్ర శక్తి యిట్టిదని వ్రాయుటకుఁగాని వర్ణించి చెప్పుటకుఁగాని వలనుపడునది కాదు. అది యనుభవైకవేద్యము ఆముద్రిక వసంతనామాంకితమై యుండెను. అప్పుడు సుందరికిఁ గలిగినయానందమునకు మేర లేదు. ఏమహా

పురుషునియుత్తమగుణములు లోకాతీతము లని యెల్లప్పుడును వినుచుండెనో, ఎవ్వనియనుగ్రహము తమకు లభించుట దుస్సాధ్య మని తలంచుచుండెనో, ఆమహాపురుషుఁడు నేఁడు తమజీవనదాతయై, ప్రాణబంధుఁడై, తమమానప్రాణరక్షణములకుఁ బూటకాఁపై, యెట్టయెదుట సాక్షాత్కరించి యున్నయీ తేజోమూర్తి యని తెలిసికొనఁగలిగినప్పు డామె హృదయమున నెట్టియానందము పూర్ణీభవించియుండునో యెవ్వరు చెప్పఁగలరు? అప్పు డచ్చట వసుమతీసుందరు లిరువురుమాత్రమే యుండుట తటస్థించెనేని స్త్రీప్రకృతికి సహజములగు విలాసచేష్టలచే వారిహృదయభావము లుప్పొంగి పొరలిపోవుచుండునని చెప్పుటకాశ్చర్య మేమున్నది? వసుమతి లజ్జాపారాధ్యమున మాటలాడక చిత్రమువలె నున్నదియేగాని యామెవిమోహ హృదయమున నెన్ని మోహభావములు పుట్టుచునే యున్నవి. వలపుచూపు లన్నిటిని గనిపట్టుచునేయున్నవి. ఇప్పు డామె మనంబున, నానందము, మోహము, లజ్జానిర్బంధము, సంభ్రమము, ఇంక నేమేమియో నిండి నిబిడీకృతంబులై యుండెను పాపము! వసుమతి యెంతగూఢముగ నున్నను నవి యన్నియును మొగమునఁ గనఁబడుచునే యున్నవి. సుందరి కొక్కటేయానందము వసుమతిహృదయభావముల నామె కనిపట్టి యుండునా? ఏమో? ఆమె తనవలపుచేష్టల నన్నిటిని జాలకాలముక్రిందటనే మఱచిపోయినది. ఇప్పుడు వసుమతివికారముల నామె గ్రహింపలేదనుకొందుము. వసంతునకు నమస్కరించి.

"అయ్యా! మీమహానుభావత్వమును దెలిసికొనఁజాలనిమా యవివేకమును మన్నింపఁ గోరెదము. ఇప్పుడు మాకు సంపూర్ణముగ ధైర్యము కలిగినది." అనియెను.

"ఇందు మన్నింపవలసిన దేమున్నది? నన్నును, నాపేరునుగూడ మీరు మనఃపూర్వకముగ గౌరవించుచున్నందులకు సంతోషించితిని. నేఁడోయివచ్చెదను. మీకింకను గోరఁదగిన దేమైనఁ గలదా?"

"అయ్యా! తలఁచు మీదర్శనముకంటె మాకీఁకఁ గోరఁదగిన దేమున్నది?"

"అవశ్య మట్లే."

అని వసంతుఁడు వెడలిపోవుచు నొకసారి వసుమతివంకఁ జూచెను. ఎట్లు సాహసించినదో గాని వసుమతియును జూచెను. ఆయన్యోన్య వీక్షణము లొక్కక్షణకాలముమాత్రము నిశ్చలములయి యున్నవి. ఆమోహావీక్షణములే యొండొరులమనోహరాకారములను హృదయ ఫలకముల లిఖియించు తేజోలేఖనయంత్రము లయినవి.

వసంతుఁడు తనయుంగరమును సుందరికిని, హృదయము వసుమతికిని సంపూర్ణస్వాతంత్ర్యములతో నొసంగి యెట్లో వెడలిపోయెను.

తరువాత వసుమతీసుందరుల కేమోమో చాలవఱకు సంభాషణము జరిగినదఁట! సుందరి నెఱజాణ! ఆమె యెప్పుడును వసుమతిని బరిహాసించుట కేయుచ్చుట పడుచుండును. ఆమె ప్రోత్సాహవచనములచే వసుమతి మనసు చివుక్కుమన్న దేమో?

---

## తొమ్మిదవ ప్రకరణము.

మోహము చాలఁజెడ్డది. లోకమంతయు మోహములోనే మునిఁగియున్నది. ఏకపక్షమోహము మిగుల నపాయకరమైనది. పాము కాటునకును దీనికిని భేదము లేదు. ఈవిషము తల కెక్కినేని యది దిగుటకుఁ దగినమందు దీలోకమున లేదు. ప్రాణములు పోయిన వెనుక

నది యేమగునో మనము చెప్పలేము. అప్పటికిని నివృత్తికాని యావిష-జ్వాల లాప్రాణములను భయపెట్టుచు వెనుదవులునని యే చెప్పవచ్చును.

విష్ణుగుప్తుఁడు వసుమతిని బరిణయమగుటకై యనేక ప్రయత్నములు చేయుచుండెను. అవి యన్నియును నిష్ప్రయోజనములయి పోవుచుండెను. ప్రతిప్రయత్నావసానమందును నాతని కాశాభంగమే ఫలితమగుచుండుటచే నారాటము హెచ్చయ్యెను. మోహము ముంచుకొనుచుండెను ఒడలు తెలియుట లేదు. తానేమిచేయుచుండెనో, ఏమి మాటలాడుచుండెనో ఆతఁడెఱుఁగఁడు. సర్వదా వసుమతీవిగ్రహ మాతని కన్నులయెదుటఁ బ్రచలిత మగుచుండెను. ఆతనికి వసుమతి తక్కనిఁకఁ బ్రపంచమేమియు గోచరించుటలేదు.

నిద్రాహారము లాతఁ డెఱుఁగఁడు. ఒకనాఁటిరాత్రి రెండుయామములు దాఁటినవి. ఆతఁ డింద్రమందిరమున శయ్యపైఁ గూరుచుండియుండెను. ఒకరత్నజ్యోతిచే నామహాలంతయు దేదీప్యమాన మగుచుండెను. దక్షిణగవాక్షము తెఱచియున్నది. మలయానిలకుమారుఁ డప్పు డాదిక్కునుండి మెల్లమెల్లఁగ మహాలులో నాడుకొనుటకై దిగుచుండెను. కిటికీకవ్వల సర్వము నంధకారమే. విష్ణుగుప్తుని హృదయమా మోహాంధకారపూరితమై యున్నది. ఆతఁడు తల రెండుచేతులలోనుంచుకొని యొకవిధముగఁ జింతించుచుండెను. ఆతఁ డేమియాలోచించుకొనుచుండెనో గాని యొకసారి గుభాలున లేచును. మరలఁ గూర్చుండును. ఒకమారు తనకత్తిని సవరించుకొనును. ఇంచుక తలయూఁచి దానిని మెల్లఁగఁ జారవిడుచును. నిస్పృహఁ జెందుచున్న యాతని హృదయమునఁ గోప ముద్రేకముతోఁ బ్రవేశించి వికారహేతువు లగువస్తువుల నాశనము చేయువలయు ననుసంకల్పముఁ బుట్టించుచుండె నేమో మన మెఱుఁగము. ఆశకు నీని నన్నిటిని బాలించుశక్తియున్నది. దానిచే

మహాసముద్రమునైనను దుదిముట్ట నీఁదవచ్చును. ఆశయే, మోహముచే నిస్పృహఁ జెందియున్న వారి ప్రాణములు లేచిపోకుండఁ జిక్కించుకొను వలయయియున్నది. ఈయాశాజాలము లీతనియుద్దేశప్రయత్నముల కంతరాయములుగ నుండి చాలఁ బనిచేసియుండును. లేనియెడల నాతఁ డట్లుద్దేకించుచుండియు విరతి నొందుచుండుటకుఁ దగిన కారణ మగపడదు.

మూఁడుజాములు దాఁటినవి. ఆతఁడు శయ్యపైనుండి కదలలేదు. చాచియున్న యొకపాద మప్పుడప్పుడు పాముపడగవలె నాడుచుండెను. కన్నులు మూఁతవడి యుండెను. తల కదలుటలేదు. ఒక్కశిరోజమైనఁ జలించుటలేదు క్రమక్రమముగఁ జేతుల పట్టుసడలెను. మేను మెల్లఁగ శయ్యపై కొఱఁగెను. మనఃపరిశ్రమచేతను, శరీరాయాసము వలనను, నొక్కనిమిషములో నిద్రాదేవత యనురాగముతో వచ్చి యాతనికౌఁగిలించుకొనియెను. గాఢముగఁ గౌఁగిలించుకొనలేదు. కలతనిద్దురలు తఱచుఁ గలలచే నిండియుండును. జాగ్రదవస్థయందు మనస్సున నాఁటిన విషయములే స్వప్నమునఁ దోఁచుచుండుట స్వాభావికము. ఆతఁడొక స్వప్నమును గనియెను.

ఆకలలో నాతఁడు వసుమతికై వెదకికొనుచు శచీసౌధమున కరిగెను. ఆమె యగపడలేదు. అంతటను వెదకెను. నిలువుటద్దమునఁ దన యందమును జూచికొనియెను. తనహృదయమున వసుమతియాకారమును స్మరించుకొనియెను. పారవశ్యమునఁ గన్నులు మూఁతవడియెను. మరల నొకసారి నిలువుటద్దమునఁ దన్ను చూచుకొనఁగోరెను. ఇప్పుడచ్చట నద్దములేదు. శచీభవన ముద్యానవనముగా మారెను. ఒక పొదరింటిలో నేలకి లతలమాటుననుండి యొక మనోహరాకార విలాసద్వ్యక్తి మగుచుండెను. అటనున్నవా రెవ్వరైయుందురు? ఆతనికి స్వప్నముననైన వసుమతి సుందరాకారముకంటె వేఱేమియు గోచరిం

చుట లేదు. కాని, తనయాశాలతకు నిరంతరమాధారకుఁడయియున్న వసంతుఁడు కూడ నాతనిస్మృతికి వచ్చుచుండుట కలదు. మఱపురాని వారిలోఁ బ్రాణప్రియులతోఁగూడ గర్భశత్రువులును గలిసియుందురు. అతఁడించుక సమీపించి చూచెను. ఆపొదరింటిలో వసుమతీ వసంతులిరువురును గూర్చుండి యుండిరి.

వికచారవిందముపై ముసరికొనుచున్న సమదచంచరీకములవలె వసుమతివదనబింబమునఁ జలించుచున్న చికురజాలంబులఁ జక్కఁజేయు వసంతునిఁ జూచునప్పటి కాతనిహృదయము కళుక్కుమనియెను. శరీరమునఁ గంపము తోఁచెను. అప్పు డాతనికి భయముకలుగుటకుఁ గారణము లేదు. క్రోధ మతిశయించినప్పుడుఁగూడ నొడలువడఁకుట సామాన్య ధర్మము. ఏది యెట్లున్నను రాజపుత్త్రుఁడు భయభ్రాంతుఁడయ్యెనని చెప్పుటకుమాత్రము మాకిష్టము లేదు. వసుమతి వసంతుని ప్రక్కనే కూర్చుండియుండెను. వసంతుఁడు తనయెడమచేతి నామె కంఠమునకుం జుట్టి కోమలకరాంగుళులతోఁ జుబుకమును బుడుకుచుండెను. ఆతని కంఠపార్శ్వంబున వామభుజంబుపైఁ దనచెక్కిలి నానుకొనియున్న వసుమతి క్రేగంటిచూపు లూర్ధ్వముఖంబులయి ప్రేమైకస్థానము లగు వసంతుని వాలికచూపులతో నైక్య మొందుచుండెను. వారేమిమాటలాడుకొనుచుండిరో యాతనికిఁ దెలియలేదు నిజముగ వారేమియును మాటాడుటయును లేదు. తన్ప్రయత్నమున మైమఱచి యుండిరి. విష్ణుగుప్తుని యాశాలత తెగిపోయినట్లయ్యెను. హృదయావేగము నాఁపలేక పోయెను. ఇరువురుకాముకు లేకాంతస్థలంబున వినోదించుచున్నప్పుడు రసభంగము సేయుఁగూడదనుసంశయమైన నాతనికిఁ గలుగలేదు. కాని, వసంతునియాత్మగౌరవమును, పరాక్రమమును, తలంపునకు వచ్చుటచే భయము కలిగెను. అసూయయును, రాజపుత్త్రత్వమువలనఁ గలిగిన

దురభిమానమును నాతనిఁ బ్రేరేపించుటచే వెనుకముం దరయక వారిని సమీపించెను. వసుమతీవసంతు లతని జూచిరో లేదో కాని యానంద పారవశ్యమున యథాపూర్వముగనే యుండిరి. వారినిఁ జూచుకొలఁది విష్ణుగుప్తుని హృదయమునఁ గ్రోధానలము ప్రజ్వలించుచుండెను. అట్టి సమయమున వసంతుని దననిశితఖడ్గమునకు బలిసేయఁ దలంచెను. కత్తి నెత్తి సోదరింటిపై నొక్కవిసరు విసరెను. తోడనే వసంతుఁడు దిగ్గున లేచి కన్ను లెఱ్ఱఁజేసి చూచెను. కాలానలకీలాసన్నిభంబులగు నాతని కోపవీక్షణంబులు మహాయోధులకుఁగూడ భయంకరము లయినవి. విష్ణుగుప్తుఁడు భయభ్రాంతుఁడయి యొక్కపరుగునం బాఱిపోవుచు మాధవీలతాపాశములు కాళ్లకుఁ దగులుకొనుటచే ముందునకుఁ బడి యెను.

ఆపాటున మెలఁకువ కలిగినది. కన్నులు విచ్చి చూచుసరి కేమియును లేదు. మనస్సనేకవిధములఁ దొట్రుపడుచుండెను. ఆయుద్యానమును, నా సోదరిల్లును, నా వసుమతీవసంతులును, వారిపారవశ్యాకారములును, నాతనిమనస్సునకుఁ బొడకట్టెను. మనశ్చాంచల్యము కలిగినది. అందువలన సత్యాసత్యము లాతనికిఁ దెలియలేదు. హృదయదౌర్బల్యమున యాథార్థ్యము నాతఁడు గ్రహింపలేకపోయెను. కొంతసేపటివఱకది స్వప్నమే యని యతనికి గోచరించినదికాదు. వసంతుని క్రోధాకారము మరల హృదయమునఁ దట్టినతోడనే యాతఁడు శయ్యానుండి లేచెను. ఎందులకు? ఉద్యానమునుండివలెనే పరుగెత్తుటకు. అది సాధ మని యాతఁడు గ్రహించెను. తానిదివఱకు ననుభవించినది స్వప్నవృత్తాంత మని యాతఁడు కనుఁగొనియెను. నిజముగ వసుమతి యింకను వసంతునిసొమ్ము కాలే దని సరిపుచ్చుకొనియెను. ధైర్యమును వహించెను. ఎల్లవిధములఁ దనప్రయత్నముల కభ్యంతరము కలుగఁ జేయుచున్న వసంతునిరూపగుణవిశేషంబులఁ బలుతెఱంగుల నిందించెను.

తపమనోరథఫలంబులకు, మూగుతుండయి యున్న యాతనినిర్జించు టెట్లని యాలోచించుకొనుచుండఁగా వేరుపసమయమున నాతనికన్నులుమూఁత పడియెను. ఆతఁడు మరల నేమిస్వప్నముచు గాంచెనో మనకుఁ దెలిసినది కాదు.

---

## పదియవ ప్రకరణము.

రాజనగరిలోని యొకభవనమునఁ జక్రవర్తియగు పద్మనందుఁడును, విష్ణుగుప్తుఁడును, సముచితాసనములఁ గూర్చుండి యుండిరి. యువరాజు వినమితవదనుఁడయి యుండెను రాజు చాల మాటనేర్పరి. ఆతఁ డెప్పుడును పుత్త్రునిమనసు నొవ్వకుండఁగనే బుద్ధులఁ గఱపుచుండును. ఎటులయినఁ గుమారునిఁ దనయంతవానిగాఁ జేసిపోవలయు నని యాతని కోరిక. తండ్రిబిడ్డల కిట్టిందివిధముగ సంభాషణము జరగెను.

"కుమారా! నీవు భావిచక్రవర్తివి. మరియాద విడిచి చరియింపఁగూడదు".

"నేనేమి చేసితిని?"

"ఎప్పుడును నాటగాండ్రతోడను, పాటగాండ్రతోడనే చరియించుచుందువు."

"ఏమియును దోఁచదు. వినోదముగఁ గాలక్షేపము సేయుటకు నాకింకెవ్వరున్నారు?"

"నీకుఁ గాలక్షేపమే కాదా? ప్రతిదినమును కొలువునకు రాఁగూడదా?

"ఏమో? నాకుఁ జాలఁ జిరాకుగ నుండును."

"చతురిక యింకను నీయింటికి వచ్చుచున్నదా?"

విష్ణుగుప్తుని మొగము వెలవెలపోయెను. "లేదు పాప మొక్క-సారి—"

"నీకుఁ జూడవలయునని యున్నదా?"

"దానికిఁ జూడవలయునని కోరిక యున్నదఁట!"

"వలదు. ఇట్టివాఁడవనియే నిన్ను వసుమతి నిరాకరించుచున్నది."

"అందువలనఁ గాదు. వసంతునిబోధనమువలన"

"నీవెప్పుడును వసంతునిపై నేరములనే చెప్పుచుందువు. ఒక్కటి యును సత్యమైనదికాదు. ఆతఁడు బుద్ధిమంతుఁడు. ఇంతవఱకు మన యెడ ద్రోహచింత యాతనికిఁ గలుగలేదు."

"ఒక్క-నమ్మకమువలన నేమతే యుండరాదు. ఆతఁడు చేయు కుట్రలిన్నియు నన్నియుఁ గావు. ఆతని కిప్పుడు రత్నగిరిరాజ్యమును, వసుమతిని, గూడ నపహరింపవలయు నని యున్నది"

"ఆతఁ డన్యాయమునకు నేపనియందును బ్రవేశింపఁడు."

"వసుమతి నంగీకరింపఁ జేయుటకే యాతఁడు ప్రయత్నించుచున్నాఁడు."

"నీకు బుద్ధియే యున్నయెడలఁ జక్రవర్తిపుత్త్రుఁడ వగునీకంటె వసంతుఁ డామె కెక్కు-వవాఁడా?"

"ఆతఁ డట నధికారిగానున్నంతవఱకు నాబుద్ధి యేమియు నుప యోగింపదు. ఆతనిఁ దప్పింపవలయు. తప్పించుటయే కాదు. అవ మానింపవలయును. శిక్షింపవలయును. ఆతఁ డట్టిహీనస్థితికి వచ్చినప్పుడు గాని నాపై వసుమతికి మోహము కలుగదు."

ఇట్లు మాట్లాడు కొనుచుండఁగా నాగదివెలుపల నుద్యానవన మునుండి "ఓసి దురాగ్రహురాలా! ఎంతస్వామిద్రోహమున కొడిగట్టు కొనుచున్నావే" అని యొకయువతీమణిపరుషవాక్యములు వినవచ్చెను.

ద్మనందునకు స్వామిద్రోహ మనినఁ జాల భయము. తత్క్షణమే కిటికీలోనుండి యుద్యానమువంకఁ జూచెను. దూరమున నొకతరుణి పాఱిపోవుచుండెను. వగర్చుచున్న యొకయువతిభవనమువిక్కుగా వచ్చు చుండెను. తత్తఱముతో రాజును, విష్ణుగుప్తుఁడును, తలుపులు దెఱచి కొని, యుద్యానమునఁ బ్రవేశించిరి.

విష్ణుగుప్తున కది యేమియు నాశ్చర్యముగఁ దోఁచుట లేదు. ఆవచ్చుచున్న చెలువ చతురిక యని రాజు తలంచికొనియెను. ఆమె వారి సమీపమునకు వచ్చి నమస్కరించి రాజున కొకయుత్తరము నొసంగెను. ఆమె నిజముగా చతురిక గాదు. చతురికనుబోలి యుండుటచే దూరము నుండి చూచినరాజుగారి కనుమానము కలిగెను అది యామె కక్క యో చెల్లెలో యయియుండును.

"ఈయుత్తర మెక్కడిది" అని రాజుగా రడిగిరి.

"ఇది యొకదాసియొద్దనుండి గ్రహించితిని"

"ఆదాసి యెవ్వరు?"

"రత్నగిరినుండి వచ్చినవసుమతిపరిచారిక"

"సుందరియా? ఆమెపరిచారిక కాదే"

"సుందరి కాదు. కనకలత"

"ఆమె యేమైనది?"

"పాఱిపోయినది"

"అంతభయమునకుఁ గారణమేమి?"

"దేవర యీయుత్తరమును చిత్తగింపవలయును. ఇది యొక రాజద్రోహిచే వ్రాయఁబడినది"

పద్మనందుఁడు తత్తఱపడియెను. ఉత్తరమును విచ్చి యిట్లు చదివెను.

'ప్రియా! కష్టములు వచ్చెనని విచారింపవలదు. నేటిరాత్రితో నీనిర్బంధము వదలిపోఁగలదు మూఁడుగుజ్జములతో రాత్రి రెండు యామములకు వచ్చి పిలిచెదను. అప్పటికి మీఱిరువురును సిద్ధముగ నుండవలయును. వలయుసాధనము లన్నియును సిద్ధపఱచితిని. ఏమియును సంశయమ్మువలదు.

వసంతుఁడు"

ఈయుత్తరము చదువుచున్నప్పుడు రాజు మొగము క్రోధావేశమున జేవురించుచుండెను. దీర్ఘక్రోధమున రాజుదాసితో "నీయుత్తరము నీ కెట్లు వచ్చినది? ఇది యాదాసియొద్ద నుండునని నీ వెట్లు కనిపట్టితివి? నిన్ను విడిపించుకొని పాఱిపోఁగలిగినంతటి బలముగలదానియొద్ద నీయుత్తరము నెట్లు పెఱికికొనఁగలిగితివి?" అను ప్రశ్న లేవియును వేయ లేదు. అంతయవసరమును లేదు. అందు వసంతునియుంగరపుముద్ర యున్నది. అదివసంతుఁడే వ్రాసియుండు ననుటకిఁక సంశయ మేమి యుండును? ఎట్లువచ్చిన నేమి? నేరము బయటఁబడినది.

విష్ణుగుప్తుఁడు తండ్రిముఖచిహ్నములఁ గనిపట్టెను "నాయన గారు! చూచితిరా వసంతునిదుర్బుద్ధి! ఇప్పుడయిన నామాటలు తార్కాణ మగుచున్నవా ? ఇంకను నన్నే నిందించుచుందురా ? ఇఁక వసుమతి దక్కదు." అని దీనముగఁ బలికెను

"ఇప్పుడేమియు నుపద్రవము కలుగలేదు. మఱేమియు తొందర పడనక్కఱలేదు. దీనికిఁ దగినప్రతీకారము త్వరలోనే చేయవచ్చును" అని చెప్పి పద్మనందుఁడు రహస్యాలోచనామందిరమునకుఁ బోయెను.

---

# పదునొకండవ ప్రకరణము.



ఆదేశమున నాబాలగోపాలము వసంతోత్సవముచేయు నాచారము కలదు. కావునఁ బాటలీపుర మిప్పుడు నిత్యకల్యాణమును బచ్చతోరణము నై యుండెను. ఆవసంతమున నందఱహృదయములును పల్లవించినవి. వనములును బల్లవించినవి. వనములఁ గోయిలలు కంఠమెత్తి పంచమస్వరమున రాగ మాలాపన సేయుచుండెను. పురమునందలి ప్రతిసౌధమునందును యువతిజనము కలస్వనమున మోహనరాగ మాలాపించుచుండెను. వసంతమున రాగ మెల్లెడ మూర్తీభవించి యున్నది. రాగము మూర్తీభవించుట యెట్లని సందేహ మక్కఱలేదు. లేఁజిగురులయందలి నవపల్లవములు రాగయుక్తములు. పల్లవసదృశము లగు యువతీమణుల మృదులాధరములును రాగయుక్తములే. యౌవనదంపతుల హృదయములుకూడ రాగయుక్తములయి యున్నవి. సమదకోకిలముల తొగరుగన్నుల యందును, చిలుకబోదల ముకుపుటములయందును, రాగము మూర్తీభవించియున్నది. ఈయద్భుతమహిమ లావసంతసమాగమముననే కలిగియుండును. వసంతోదయము యౌవనోదయమే. దానికిని దీనికిని భేదము లేదు.

శచీభవనమునకు దక్షిణభాగమున విశాల మగు కుసుమాకరోద్యాన మున్నది. ఆవనలక్ష్మికిని వసంతసమాగమ మైనది. వసంతుఁడా వసరమును బ్రకృతిచేఁ గూర్పఁబడినయమూల్యాలంకారములచే నలరించుచుండెను.

ఆవనమునకుఁ జుట్టును చంద్రకాంతమణినిర్మిత మగు ప్రాకారమున్నది. ఆయోరనే దట్టముగ నెత్తైన తాళవృక్షము లుండెను. వాని

మొదళులనీడలాప్రాకారమునసీలమణిశిలాకలవలెఁ బ్రతిఫలించుచుండెను. వానియాకులపచ్చనికాంతులాప్రాకారోపరిభాగమునకు గారుత్మతమణి ప్రభలఁ గూర్చుచు, ఖేచరులకు హృదయాహ్లాదమును గూర్చుచుండెను. తరువాత నొకదానివెనుక నొకవరుసగా చుట్టును తియమామిడిగున్నలు, సురపొన్నలు, పొగడలు, మందారములు, నిమ్మలు, నారింజలు, మొదలగుఫలవృక్షములు రమణీయముగ నాటఁబడియుండెను. నడుమ నడుమ లతామందిరములును, మణిమయవేదికలును; విలసిల్లు చుండెను క్రిందఁ బచ్చపట్టుకంబళము పఱచిన ట్లొత్తుగఁ బెఱిగియున్న లేఁబచ్చిక యాలోకనసుందరముగ నుండెను.

ఆవనమధ్యమునఁ బద్మరాగమణిమయంబులగు సోపానములచే నొప్పులుగులుకుచు, నిర్మలవారిపూరముల నిండి తొలఁకుచున్న సరోవర మొకటియుండెను. అదిచతురమై చిత్రలిఖితమగు మణిమయదర్పణముం బోలి ప్రకాశించుచుండెను. అందుఁ బద్మలతలును, కలువతీఁగలు నలమికొనియుండెను. చిఱుగాలితాఁకునఁ గొంచెమెత్తుకొనియున్న తామరాకులచెంతనున్న కొదమరాయంచలు తెరచాఁపయెత్తబడి విడుచుటకు సిద్ధముగనున్న రమణీయవిహారనౌకలఁ దలపించుచుండెను. అందలి జలవిహంగముల కలకలారావములును, జలతరంగముల గలగలధ్వనులును, సమదబంభరములఝుంకారస్వనంబులును, శ్రవణపర్వములై విన వచ్చుచుండెను.

ఆసరోవరమునకునడుమ మణివినిర్మితమగు మండపమొకటి విరాజిల్లుచుండెను. అందు నీలమణిస్తంభములకు గజమెత్తువఱకు నెప్పుడు జలము నిండియేయుండును. అందు వల్లవకామినులతో వివిధాకృతుల విహరించుచున్నట్లు జలకేళీలోలుఁడగు గోపాలబాలునిమనోహరవిగ్రహములు యథాపూర్వకముగఁ జిత్రింపఁబడియుండెను.

ఆకొలనిచుట్టును తీవపందిళ్లు, పూలమొక్కలును, దర్శనీయములై యుండెను. అందందు వివిధాకారములగు జలయంత్రములు గలవు. ఒకచో పద్మాలయయుఁ బద్మహస్తయు నగునట్లు మణులచేఁ జిత్రింపఁబడిన లక్ష్మీవిగ్రహమును తొండములచే నాకర్షింపఁబడిన సలిలధారలచే నభిషేకించుచున్నట్లు చంద్రశిలానిర్మితములగు వెల్ల యేనుఁగులు రెండుచిత్రింపఁబడియుండెను. ఇంకొకచోఁ దనకోమలకరకమలములనున్న కలశమును వంచి మాధవీలతను దడుపుచున్న శకుంతల, మఱియొకచో వదనాసవసేచనమున దోహదము సేయునదియుఁబోలె పుక్కిటి జలంబుల వకుళభూరుహస్కంధముం దడుపుచున్న సుందరీరూపము, వేఱొకయెడ జటాజూటమునుండి పొంగిపొరలివచ్చుచున్న గంగాప్రవాహముగలచంద్రశేఖరవిగ్రహము, ఇట్లే చిత్రవిచిత్రములగుజలయంత్రము లమర్పఁబడియుండెను. ఆజలధారలన్నియును వేఱువేఱుగా స్ఫటికశిలానిర్మితములగు కాలువలనుండి యయ్యుపవనాలంకారములగు లతాతరులబోదులలోనికిఁ బ్రవహించుచుండెను. ఒక్కచో నీలమణినిర్మితమగు నేనుఁగుతుండమునుండి చిమ్మనగ్రోవినుండివలెఁ బైకెగయుచున్న జలశీకరము లాకొలనియొద్దనున్న మాధవీలతామందిరమును దడుపుచుండెను.

ఆలతాగృహమునందలి చలువరాతిన్నెపై వసుమతికూర్చుండియుండెను. ఆమె వసంతపూజ చేయుచుండలేదు. ఆమెచేతిలో నొకతామరపూవున్నది. అది సహస్రపత్రకమలము. మనోహరముగ వికసించియున్నది. దానిపరిమళ మామెకు వెగటుగఁ దోఁచుచున్నదేమోకాని యామెమొగమున నట్టివికారము కన్పట్టుచుండెను. ఆమె తలవంచికొని యాపుష్పమువంకనే చూచుచుండెను. ఒక్కొక్కటిగ రేకుల నూడఁదీయుచుండెను. అవి యెంతకును దఱుగుటలేదు. ఇంక నట్లేచేయుచుండెను. అందేమికనఁబడియెనోకాని యొక్కనారిచిఱునవ్వునవ్వెను. పొద

రింటిగలువవంకలకును దృష్టి సారించెను. అప్పు డామెచెక్కులు పులకించి యున్నవి. ముందున్న కొలనివంకఁ జూచెను అందొయ్యారముగ జోడుబాయక యీఁదులాఁడుచున్న రాయంచమిథున మామెకన్నులఁ బడియెను. తామరాకులపై ముక్తామణులపోలిక నిలిచియున్న జల బిందువులలోఁ బ్రతిఫలించుసాయంతనసూర్యకిరణప్రసారమున నామె కన్నులు మిఱుమిట్లు గొనియెను. ఆకారణమున నాచూపులు చెదరిపోయి నవి. రవికిరణప్రతాపమున ముకుళించియున్న కలువపూవుపై నాదృష్టి ప్రసరించెను. తోడనే వసుమతికన్నుల నశ్రుబిందువు లుదయించెను. పయ్యెదచెఱఁగునఁగన్నులు తుడిచికొని మరలఁ దానున్న పొదరింటివంకఁ జూచికొనియెను. ఆమెకు శరీరమునఁ గంపము దోఁచెను. అటనుండలేక లేచి యుద్యానమునఁ బ్రవేశించెను.

వసుమతి వనరమయొక్క యనంతసౌభాగ్యమును దిలకించెను. అంతటను వసంతునిమనోహరాకారము విస్పష్టమగుచుండెను. అప్పుడే యుదయించుచున్న లేఁజిగురులయందు గాఢరక్తిమయు, వికసించినవాని యందించుక మెఱుపును, విరిసి వ్రాలినపల్లవములఁ గపిలవర్ణమును నిట్లు వివిధభేదములచే వివిధవర్ణములగు చిగురుటాకుల నెన్నింటినో చూచెను. అన్నిటియందును వసంతాకృతి యొక్కమాదిరిగనే పూర్ణీ భవించియుండెను. మలయానిలస్పర్శనంబుననల్లనఁ గదలియాడు లేఁజిగురు గొమ్మలతాఁకున నించించుక విరియుచున్నలతాకుసుమమంజరులువసంత కుమారునిసుకుమారచేష్టితములఁ బ్రకటించుచుండెను. కోమలరసాల పల్లవంబులఁ గసివాటుగ భుజించి పంచమస్వరంబున నెలుగెత్తి గానము సేయుకోకిల కలకంఠనాదములయం దెల్లెడ వసంతుని గుణకీర్తనము లే వినవచ్చుచుండెను. తీయమామిడిగున్నలయందలి యొగరుపూఁప పిందెలమెక్కియానందించుచిలుకబోదల యస్పష్టములగు ముద్దుపలుకుల

యందును, అరవిరిమొగ్గలచుట్టును జుంజుమ్మని రొదసేయుచుఁ బరిభ్రమించు నెలదేఁటిగముల మనోహరాకృతులయందును, వికసితకుసుమ మంజరులయందుఁ బరిమళములు సేకరించుకొని తీయ మామిడుల కాయఁగొమ్మలపై నుయ్యేలలూఁగుచు, లతాతనుసంతతులు నానంద పారవశ్యమునఁ దలలూప నిసుదపయనంబుల నల్లనల్లన నేతెంచుమంద మలయానిలకుమారుని శైత్యసౌరభమృదు స్పర్శనంబులందును, రామణీయకనిధి యగువసంతునిసుకుమారాకారము పరిపూర్ణముగ వ్యక్తమగుచుండెను. వేయేల? వసుమతి మనోహరవీక్షణంబు లేవంకఁ బఱపిన నావంకనే వసంతుఁడు ప్రత్యక్ష మగుచుండెను. అది వసంతకాలము. విశ్వమంతయును వసంతవిలసితమై యుండుననుటలో వింత యేమున్నది? వసంతునిమోహనాకార మెవ్వరైనఁ గన్నారఁ గాంచినవా రున్నారా? నిజముగఁ జూచినవా రెవ్వరైన నుందురేని వారాతని వర్ణింపఁ జాలరు. చూడకయే చూచినట్లు వర్ణించి లోకమును నమ్మించినవారనేకు లున్నారు. ఆకాశమునకు నిచ్చెనలు వేయునట్టివారివాక్యములను మేమంతగా విశ్వసింపము. వసుమతియొక్క తెయే విశ్వమంతటను వసంతుని యాకారమును విస్పష్టముగఁ జూచుచున్నది.

అతఁడు కాలక్రమమున మార్పునొందువసంతుఁడుకాఁడు. మోఁకు ద్రుమాకులఁ జిగురు వెట్టింపఁ బాటుపడువసంతుఁడు కాఁడు. అతఁ డెన్నఁడును కోకిలలకుఁ బాటలు నేర్పలేదు. యువయువతీజనంబున కంతకు నతఁడు సామాన్యుఁడు కాఁడు. పైపైమెఱుంగుల నలరించుచు నున్నట్లె యుండి తుదకు ప్రాణేశ్వరియగువనలక్ష్మిని గ్రీష్మాతపతప్తం జేసి కృతఘ్నుఁడై యగపడకుండఁ బోవువాఁడు కాఁడు. చిరకాలమునుండి సమయముదొరకినపుడెల్ల కవులచే వేనోళ్ల వర్ణింపఁబడుచుండు వసంతుఁడు గాఁడు.

ఏపురుషోత్తముని మనోహరాకార మేతరుణీమణి చంచలకటాక్షములకు నిశ్చలత్వమును గటాక్షించునో, యెవ్వనిసంస్మరణ మేసుందరి యధరపల్లవమును నిట్టూర్పుబొగలచేఁ గమలించునో, యెవ్వనియలీక సాన్నిధ్య మేకన్నియ సుకుమారావయవములఁ గంపింపఁ జేయునో, యాసతీమణి కాతఁడొక్కఁడే వసంతుఁడు. భావనాబలంబున సతీమణు లెల్లరును దమతమ ప్రాణేశ్వరులను వసంతమూర్తులుగఁ జూచికొన్న వారే. కాని, వసుమతిమాత్రము విశ్వమంతటను వసంతుని జూచుచున్నది. ఆమె నిజముగ వసంతునిపై వలపుఁ గలిగియున్నది. మహావనమునఁ దనజీవితమును గాపాడినవసంతుని, ఆత్మరక్షణకై నిజముద్రిక నానవాలుగ నిచ్చినవసంతుని, తనజీవితేశ్వరునిగ నమ్మియున్నది.

సమీపించియున్నప్పుడుఁగూడ వ్రీడాభరంబునను, నానందపారవశ్యంబునను, నెవ్వరిమనోహరాకారమును గన్నార వీక్షింపలేకపోయినదో, యెవ్వనిమృదుమధురసంభాషణంబుల వీనులవిందుగ వినలేకపోయినదో, యెవ్వనిగుణగణంబులు తలంపునకుఁ దాఁకినప్పు డొక్కవేఁడినిట్టూర్పు విడువకయుండలేకపోయినదో, యాతనిమోహనాకారమును, నవపల్లవములందును, నూత్నకళికాసంచయమునందును, నరవిరిమొగ్గలందును, వికసితలతాంతమంజరులయందును, పూఁపపిందెలయందును, కాయగొమ్మలయందును, లోపలను, వెలుపలను, ప్రతివస్తువునందును, గన్నులఁ గాంచుచున్నది. మనసారఁ బ్రేమించుచున్నది.

మోహమున కద్భుతశక్తి యున్నది. ఒంటిపాటుగ నున్నవారిపైఁ బడినప్పుడు దానితెగువ చూచి తీరవలయును. వసుమతిహృదయము నిప్పు డది సంపూర్ణముగఁ గెలఁచి వైచినది. ఉన్మాదముం గూడఁ గలిగించినది. పాపము! పదియాఱేండ్లకుసుమకోమలి యగువసుమతి యిప్పు డేమిచేయఁ గలదు?

ప్రతివృక్షమునకు నమస్కరించును. ప్రతిశాఖను గౌఁగిలించుకొనును. వసంతునకుఁ బుష్పాంజలి నొసంగ లతలకై పరువెత్తును పొగడకొమ్మపైఁ జక్కఁగ నల్లికొనిన పుష్పవతియగు మాధవీలతం గాంచి సిగ్గున వెనుదిరుగును. కోకిలాలాపములనాక్కింత నిలిచి వినును. అంతలో నేమితోఁచునో? ఊరక నిట్టూర్పులు విడుచుచుండును. ఒక్కచో నిలుచుట లేదు. ఒడలంతయుఁ జెమ్మటచే నార్ద్రీకృతమయ్యెను. సాత్వికోదయమునఁ బొరలిపొరలి వచ్చుచున్న యామెస్వేదోద్గమము నపనయించుటకు మలయానిలునిశక్తి చాలలేదు. తిన్నఁగా నొకమల్లెపందిరి కడకేఁగెను అటఁగూడ వసంతుఁడు సాక్షాత్కరించియే యుండెను. ఆతని మల్లెపూవులతోఁ బూజింపఁ దలంచి, కోనులకరపల్లవమును పైకిఁ జాచి యొకకుసుమమును గోసెను. అందును వసంతుఁడు మూర్తి భవించి యుండెను. పూజించుటకు మఱి తావులేదు. ఆకుసుమములను గన్నులకద్దికొని తనశిరంబున నుంచుకొనియెను. మరల నింకొకపూవును గోసి, మునుపటివలెనే యొనరించెను. తనివి తీరలేదు. ఇంకను నట్లే చేయుచుండెను.

ఆసమయమున సుందరి యచ్చటికి వచ్చి యంతయును జూచెను. వసుమతి యేమియు నెఱుఁగదు. సుందరి నెఱజాణ ఆమెజాణతనము ప్రతివాక్యమునందును వ్యక్తమగుచుండును.

“వసుమతీ ! వలపు తలకెక్కుచున్నదా ? ” అని పలుకరించెను.

---

## పంద్రెండవ ప్రకరణము.

---

వసుమతి నిశ్చేష్ట యయ్యెను. వదనచంద్రమండలమునఁ బొరలి పొరలివచ్చు స్వేదబిందువులఁ బయ్యెదచెఱఁగున నొత్తికొనుట లేదు. గుట్టుబట్టబయలయ్యెనను నారాటమునఁ గొట్టుకొనుచున్న గుండెలదుడుకు నడఁగింపఁ బ్రయత్నించుట లేదు. హృదయావేగముచే నెడనెడ వచ్చుచున్న నిట్టూర్పులనాఁచికొనవలయు ననుతలంపైనఁ గలుగుట లేదు. నీలచికురజాలంబులం దగిలికొని ప్రేలాడుచున్న మల్లికాకుసుమముల సుగంధములకై పరిభ్రమించుసమదభృంగముల షడ్జస్వరమాధుర్యమునైన నాలకించుట లేదు. ఎదుట నిలుచుండిన సుందరిని బలుకరించుటకునోట మాట రాకుండెను. మలయవాయుస్పర్శనంబునం గదలు కోమలారుణ ప్రవాళమువలె మృదులాధరము కంపించుచుండెను. సుందరి చాఁ దెలివిగలది. వసుమతిగంభీరహృదయభావముల నన్నిటిని సంపూర్ణముగ గ్రహించెను.

"వసుమతీ! ఏమి సేయుచుంటివి?" అని పలుకరించెను.

వసుమతికింకను మాటలాడుటకు ధైర్యము కలుగలేదు. ఉత్తర మీయకుండినచో సుందరి యనుమానించుకొనునేమో యని సందేహించి "ఋతురాజు నారాధించుచుంటిని." అనియెను.

"వసంతునిఁ బూజించుచుంటివా?" అని సుందరి ప్రశ్నించెను. వసుమతిగుండె ఝల్లుమనియెను. గద్గదస్వరముతో

"ఔను" అని ప్రత్యుత్తర మిచ్చెను.

"నిన్నే నీవు పూజించుకొనుచుంటివే! తన్మయత్వముచే నీవు వసంతాకృతినిఁ దాల్చితివా యేమి?"

"లేదు. ఆతని నాహృదయాంతరాళమునఁ బూజించి నిర్మాల్యమును నాశిరస్సున ధరించుకొంటిని."

"సుందరీశిరోమణి వగునీకుఁగూడ వసంతుఁడు నెత్తిమీఁదిదేవతయేనా?"

"ఆతఁడు లోకమునకంతకును బైవాఁడేకదా?"

"నీహృదయము!—ఆతనిపైనున్నది కాఁబోలును!"

"అది యెచ్చట నున్నదో నేనెట్లు చెప్పఁగలను? నీకెట్లు తెలియంగలదు?"

"అటులైన నీలో లేదా?"

"లేదని నీవెట్లు నిర్ధారణ చేయఁగలవు?"

"వసంతుఁ డాకర్షించికొని పోయె నని తలంచితిని."

వసుమతి మొగము వెలవెలఁబోయెను "ఏమి! ఈయసందర్భప్రలాపములు" అని గద్దించెను.

వయసుచే సుందరి వసుమతికంటెఁ బెద్దది. చాలవఱకుఁ బ్రపంచానుభవముగల ప్రౌఢ. అసందర్భముగ మాటలాడునది కాదు. వసుమతిపలుకులకు భయపడలేదు.

"నీమనసు నీలో లేనట్లు నీమొగమే చెప్పుచున్నది" అనియెను.

వసుమతి లేనిధైర్యమును దెచ్చుకొని "మొగముచూచి హృదయమును దెలిసికొను నద్భుతశక్తి నీకెట్లు కలిగినది?" అని యుగ్గడించెను.

"అట్టిశక్తి వసంతుఁడు సాక్షాత్కరించి దయతో నాకొసంగినాఁడు."

"ఆతఁ డిదివఱ కెవ్వరికిని బ్రత్యక్షమైనట్లు వినియుండలేదే?"

"లేకేమి? ఈకన్నులతో మనమే చూచియుంటిమి"

వసుమతిహృదయమున సంతోషమో, మోహమో, ఆనందమో, మఱియేమోకాని యుప్పొంగి పోవుచుండెను. తడఁబాటుతో "నీమాటలయర్థమేమో నాకుఁ దెలియుటలేదు." అనియెను.

"తెలియకున్న నీశుభలేఖఁ జూచికొనుము. తెలిసినదానికిఁ దెలియనిదియుఁ జూచినదానికిఁ జూడనిదియుఁ దెలుపుట నావశము కాదు"

"అయ్యో ! తల్లిదండ్రులను బోఁగొట్టుకొని, రాజ్యమును బరుల పాలుగావించి, కఠినహృదయుఁడును, దురాశాపరుఁడును, క్రూరకర్ముఁడును నగుదురాత్మునిక్రూరతిమూదరణమున నీచెఱసాలలోఁ బడియున్న మనకు శుభలేఖ లెవ్వరియొద్దనుండి వచ్చును?"

"గతము నేలత్రవ్వెదవు? శుభమున కేలశంకించెదవు? ప్రాణ బాంధవుఁడు దయతో స్వహస్తమున లిఖయించియొసంగినకమ్మ శుభ లేఖగాక మఱేమగును?"

"దిక్కుమాలి పరులపంచలపాలయియున్న మనకుఁ బ్రాణబంధువు లెవ్వరు?"

"విచారముల నన్నిటినిమఱపించి తన్నయత్వమున మహానందముం గూర్చు నివసంతుని నీవేమందువు?"

"అనుట కేమున్నది? అది యాతనిస్వభావము."

"ప్రాణరక్షణ మొనరించి బలవంతముగ హృదయమును హరించినవసంతున కదియును స్వభావగుణమేనా?"

"వసంతుఁ డెవ్వరు?"

"నీప్రాణేశ్వరుఁడే?"

వసుమతికిఁ గోపమువచ్చినది. కన్ను లెత్తిపడ లేదు. కనుబొమలు మాత్రము ముడివడినవి. కాని, మొగమునసంతోషచిహ్నములే తోఁచుచున్నవి. విశాలనయనములు బాష్పపూరితములయియున్నవి. కోపము

స్వచ్ఛందమయినది. దానికి మాయ, మర్మము లేదు. సిగ్గుచేఁగలిగిన కోపముమాత్రము కృత్రిమమయినది. కోపమునకును ప్రేమకును జాతి వైర మున్నది. లజ్జాకోపముమాత్ర మట్టిది కాదు. అది కేవల మను రాగముయొక్క మాయవేషము. కాని, తఱచుగా నీరెండుకోపములకును బర్యవసాన మొక్కటియే యగుచుండును. ఇప్పుడు వసుమతికిఁ గలిగినది లజ్జాకోపము. హృదయమును దాఁచికొనుటకై తెచ్చికొనిన దొంగ కోపము. ఇట్టికోపముతోనే వసుమతి,

"ఏమీ! సుక్షత్రియకులాలంకారుఁడగు మానపాలునితనయ నెఱుంగక మాటలాడుచున్నావు?" అనియెను.

"వసంతునకుఁగూడ నిట్టియాభిజాత్య ముండుటచేతనే నీకీ లేఖ వ్రాయవలసివచ్చినది."

"ఆతఁడు నాకేల వ్రాయవలయును?"

"నీవాతని ప్రేమించుటచేత—నిన్నాతఁడు ప్రేమించుటచేత"—

"ఓధూర్తురాలా! ఏమి యీయవ్యక్తాలాపములు! ఛీ సిగ్గు!"

"ఇట్టిసిగ్గుచే నెంతకాల మీహృదయమును బరితపింపఁజేసికొం దువు?"

"చిరపరిచితిగలనీవు నాహృదయము నిట్లుగాఁ దెలిసికొంటివా? చాలుఁజాలు! ఇంక నిట్టిప్రసంగములఁ గట్టిపెట్టుము. నాకుఁ గోపమా వచ్చుచున్నది. నీగౌరవమునకు భంగకరముగ నెట్లు వర్తింపవలసివచ్చునో? నాయెదుట నిలువకుము. అవ్వలికిఁబొమ్ము"

"అట్లేపోయెదను. నీహృదయేశ్వరునిచే లిఖయింపఁబడిన యీ యుత్తరమును నీవొక్కతెవే చదివికొనుము. నీహృదయౌత్సుక్యమునకు భంగకరముగ నిందుండి నేనేల యడ్డు రావలయును! ఈలేఖ మూల మున మోహానలపరితప్తము లగుమీయిరువురిహృదయములును వసు

రాగరసాంబుధి నోలలాడి సుఖింపవలయుననియే నాకోరిక. అదియే పది వేలు. నీలేఖ నీవే తీసికొనుము. నాకెందులకు?"

వసుమతికి హృదయమును దాఁపఁ దలంపు గలుగుచున్న కొలఁది కోప మధిక మగుచుండెను. ఇప్పుడు పట్టరానికోపము వచ్చెను. పాపము! వసుమతి ముద్దరాలు వెనుకముం గాలోచించుకొనలేదు. సుందరి చేతినుండి యుత్తరమును తటాలున లాగికొని చించి పాఱవైచెను.

---

## పదుమూఁడవ ప్రకరణము.

వసుమతి యేమిపని చేసినది? ఎవనికొఱకు తానింతవఱకును దదేకధ్యానముతో నున్నదో, ఎవ్వని మోహనాకారమును తనలోపలను, వెలుపలను, నంతటనుజూచి యానందించుచున్నదో, ఎవ్వని యుదారగుణమునఁ జెలితోఁ దాను మహావనమున రక్షింపఁబడినదో, అట్టి ప్రియుని, నట్టిసుందరవిగ్రహుని, నట్టి సుగుణాలంకారుని, సందేశపత్రికను క్షణికములోఁ జించి పాఱవైచినదిగదా! ఇది యామె చేయఁదగినపనియా? వసుమతి మంచిపని చేసినదికాదు. చాలఁ దొందరపడినది. తనగుట్టు బట్టబయలయ్యె ననుమిథ్యాకోపము కల్పించుకొని తానిట్టి కార్యమున కొడిగట్టవచ్చునా? ఇది ముగ్ధాలక్షణము కాఁబోలును! కొందఱు ముద్దరాండ్రు తమహృదయమునందున్న మోహవ్యాపారమును ప్రాణసఖులకైనఁ దెలుప సంకోచించుచుందురు. అది తెలియకుండ నుండుటకై యెన్ని యోవికారములను తెచ్చిపెట్టుకొనుచుందురు. వసుమతియునట్లే ప్రవర్తించినది. వసుమతి యొనరించినయికార్యమునకయి కోపించి సుందరి యవ్వలికేగెను.

వసుమతి తానిప్పు డేమిచేసినదో తెలిసికొనియెను. మిక్కిలి చిన్నబుచ్చుకొనియె. ఆవేగపడఁజొచ్చెను. శరీర మాపాదమస్తకమును గడగడవడఁకుచున్నది. తనపురోభివృద్ధికి, తనయాశాలతికు, తనమునుగడకు, తనయిహసౌఖ్యమునకు, నిది భంగకరమైనసూచన యని డిల్లపోయెను. గుండెలు తటతటఁ గొట్టుకొన నారంభించినవి. హస్తములు తానొన రించిన యకృత్యమును దెలిసికొని కాఁబోలు పల్లవములవలెఁ జలింప నాగెను. ముత్యములవలె శాష్పబిందువు లామెకన్నులనుండి జారి జొట జొట పయ్యెదపైఁ బడుచుండెను. ఈవేగములన్నియు నొక్కమారుగఁ బనిచేయుటచే నామె హృదయమునఁ జాలఁదల్లడిల్లినది. క్రమ క్రమముగ నవి యన్నియును సద్దణఁగినవి. కొంతసేపు హృదయ మేమియుఁ బనిచే యక స్థాణువువలె నుండెను. ఇట్లు కుంఠిక మైనపిదప గుండెలతి తీవ్ర ముగ మరలఁ గొట్టుకొనసాగెను. యోచన లన్నియు నొకదాని వెంట నొకటిగ మరలవచ్చి ప్రవేశించినవి. అవి యన్నియు మరల నామె హృదయమునఁ జాలఁ గ్రుమ్ములాడినవి. వానికిఁ బ్రయోజన మేమియుఁ గాన్పింపలేదు. ఈగాలివాన కొంత యడఁగినపిదపఁ బశ్చాత్తాప మామె లోపలఁ బ్రవేశించెను. ఆమె తనయకృత్యమునకయి పలుమాఱుఁ దన్ను దూషించుకొనియెను. ఈభయవికారములలో మునిఁగి పోయి ముందేమి చేయవలయునో యామెయూహింపఁజాల దయ్యెను. ఒకసారి యాకసము వంకఁ జూచెను. నలుదెసలు పరికించెను. ఆమెదృష్టులు క్రమక్రమ ముగఁ గ్రిందికి పఱాగె త్తినవి. అందేమున్నది? తాను చించి పాఱవైచిన యుత్తరపుముక్క లున్నవి. అవి కనఁబడినతోడనే యామెకన్నులవెంట మరల శాష్పబిందువు లురలజొచ్చెను. ఆముక్క లొక్కొక్కటిగ నేరి కనుఁగొనవలయు ననుసంకల్ప మామెకుఁ గలిగెను. ముందునకు వం గెను. కాని, కన్నీళ్లా కార్యమున కవరోధము లయినవి. ఆమె కన్నీళ్లను దుడిచికొని యాలేఖాఖండము లొక్కొక్కటిగఁ దీసి కన్నుల నద్దుకొన

సాగెను. ఈముక్కలయందలి లేఖనాంశము ను కన్నులు గ్రహింపఁ గలుగు ననునాశ చేతనో, ప్రియునిహస్తములచే లిఖింపఁబడిన శుభాక్షర ముల నీక్షింపఁగలిగితి ననుభక్తిభావముచేతనో, యామె యుల్లొనరించి యుండును. దానివాస్తవమును వసుమతి నడిగియే తెలిసికొనవలసి యున్నది.

ఆలేఖాఖండములు మూఁడునాలుగు క్రిందనుండి తీసి యెడమ చేత నుంచికొనియెను కుడిచేతితో మరల నొకటిరెండుముక్కల నేరెను. ఇంతలో మలయానిలకుమారుఁడు చెట్లపైనుండి యామె యెడమచేతిపై నిట్టూర్పువాలి యందున్న ఖండముల నెగురఁగొట్టెను. వసుమతి మిగులఁ జీకాకును బొందెను. ఆమెకుఁ జాలఁగోపము వచ్చినది. ఈసమయమున కుడిచేతిపట్టు సడలి యందున్న ముక్కలుగూడ జాఱిపోయినవి. ఆమె కేడుపువచ్చెను. ఏమిచేయుటకును దోఁచలేదు. వికలచిత్తులకు చేత నా చేతనజ్ఞానముండనేరదు. పాప మీయామె ముగ్ధ. భావసంకల్పము లన్నియుఁ జెదరియున్నవి. మనస్స్తిమితత కుదురుటలేదు. మలయవాయువుల వంక దలయెత్తి దీనముగఁజూడసాగెను. ఇట్లని ప్రార్థింపఁజొచ్చెను.

"ఓమలయానిలకుమారా! నే నబలను. నానాథునకు మహాప రాధము చేసి వికలచిత్తనై యున్నదానను. నన్ను క్షమింపుము. తాప శాంతిఁ జేసి నన్నాదరించుటకు మారుగ, నాహృదయానలమును మఱింత రవులుకొల్పుచున్నాఁడ వేమి! నీవు నాజోలికి రాకుము. నీకిదే మ్రొక్కుచున్నదానను"

ఈసందర్భమున నామెకు నిర్మలాకాశము కన్నులఁ బడియెను. హృదయమించుక వికసించెను. అప్పటి తనకృత్యమును దలంచికొనియెను. ఆమెకు నవ్వువచ్చెను. ఆమె మోకరించి సద్భావముతో మరల నా లేఖాఖండములఁ దీయ నుద్యమించెను. ఒకటిరెండుముక్కలను దీసెను.

అందేమున్నదో చదువవలయునని యామె కాతురతజనించెను. మడఁచి యున్న యొకతునుకను విచ్చి చూచెను. అందు "అ గ్రహ" అను నక్షరములుండెను. సంభ్రమవశమున వానిని "అనుగ్రహ" అని యామె చదువుకొనినది. మరలఁ గొన్ని ఖండముల విప్పిచూచెను. ఒకదాని యందు "కిం" ఉండెను. వేఱొకదానిలో "ము" అనునక్షరమున్నది. ఇంకొకటిఁజూచెను. అందు "...వసంత" అనునక్షరము లున్నవి. ఆమె సంభ్రమానందములతో నాపవిత్రాక్షరము లున్న తునుకను దనకన్నుల కద్దుకొని హృదయముపైఁ జేర్చికొనియెను. మరల మరల "వసంత వసంత" యని యనేక పర్యాయములు చదువుకొనియెను. హృదయమునం దదేరీతిని స్మరించుకొనియెను. అప్పటి యామె హృదయౌత్సుక్యమునకు మేర లేదు మరల భూమినుండి మఱిరెండుతునుకలను దీసెను. వానియందు వరుసగ, "దును" "దుసు" అనునక్షరములు గోచరించుచుండెను. వానియర్థ మూమెకుఁ దెలియలేదు. ఇఁకఁ గొన్ని తునుకల నేరెను. వానియందక్షరముల పోలికలుగూడ లేకుండఁబోయినవి. మఱియొకముక్కను దీసి చూచెను. దానిలో "విష్ణుగుప్త" యను నక్షరములున్నవి. చూచినతోడనే యామెకు శరీరము వడక నారంభించెను. కన్నులు మిఱుమిట్లు గొనియెను. హస్తపల్లవములు దడదడ కంపించుచుండెను. గుండె లుద్వేగముతోఁ గొట్టుకొనసాగెను. ఆమె కొంచెముమనసును గుదుటఁబెట్టుకొని యింకొకముక్కను విప్పెను. అందు "ఆపద" అను భయంకరాక్షరములు కనఁబడినవి. అది చదివి వసుమతి మిక్కిలి భయపడసాగెను. ఆమెకు శరీర'మంతయు ముచ్చెమటలతోడను దడిసిపోయినది. మొగము వెలవెల పోయెను. గుండెలలో నేమియో యలజడిపుట్టెను. ఆమె యేమి చేయఁగలదు? ఒకమాట కొకమాట సమన్వయించుట లేదు. ఎట్లో ధైర్యమును

తెచ్చుకొని యింకొకముక్కను విప్పి చూచెను. దానిలో "చూడను," అని యుండెను. ఆమె నిశ్చేష్ట యయ్యెను. ఒక్కింతసేపటికి మరలఁ దెలివి తెచ్చికొని మొదటితునుకను విప్పి చూచెను. అందలియక్షరములను "ఆగ్రహ" అని స్పష్టముగఁ జదువుకొనియెను. "ఏమి! అనుగ్రహము కదా? ఆగ్రహమా?" అని యులికిపడియెను. మిక్కిలి తత్తఱపాటును బొందెను. అప్పుడొక లేఖాఖండము గాలితాఁకున నెగిరి యామెపయ్యెద పైఁ బడియెను. దానిందీసి చూచెను. అందు "ప్రియా" అను సంబోధనవాక్య ముండెను. ఆమెహృదయము భగ్గున మండిపోయెను. "హా! జీవితేశ్వరా! మహాపరాధిని యగునిమందభాగ్యురాలు నీకు ప్రియురాలెట్లగును? ఇంతటిప్రేమాస్పదం బగుసంబోధనమున కిది తగదు, తగదు—ఓయవివేకిని! వసుమతీ! ఆయుదారశీలునకు, నాదయాళునకు, నాపరోపకారపారీణునకు, నీవెట్లుప్రియురాల వగుదువు? "ప్రియా" యని యనిపించుకొనుటకు నీవు తగవు—తగవు—" అని తనయందలి నిరసనభావమునం గలిగినకోపముతో నాముక్కను నలిపి పాఱవైచెను. ఇంక మిగిలినవానిని జదువఁగూడదని యామె నిశ్చయించుకొనియెను. తన చేతిలోనున్న యాముక్కలన్నిఁటినిఁ గ్రమముగఁ బెట్టి చూచెను. వానియందు వరుసగ—

"ఆగ్రహ"
"కిం"
"ము"
"వసంత"
"ుడను"
"దూఁడు"
"విష్ణుగుప్త"
"ఆపద"
"చూడను"

అసు చదువుకొనియెను వానివలన నేమిబోధపడినది? ఏమియును బోధపడ లేదు. హృదయాందోళనము మఱింత హెచ్చయ్యెను, "అయ్యో! ఈయుత్తరమును వివేకహీననై నేనేల చించిపాడువైచితి" నని యామె మరలఁ దన్ను మిక్కిలి నిందించుకొన నారంభించెను. ఇంక నేమేమియో యాలోచన లామెమనసునఁ బుట్టినవి. ఏమైన నేమి? చేయి దాఁటిపోయినది ఇఁక నాయుత్తరముయొక్క సంపూర్ణార్థము నామె గ్రహింపఁజాలదు. "ఆగ్రహము" "ఆపద" విష్ణుగుప్త, ఈ మూఁడును మరలఁ జదివి చూచికొనియెను. ఒక్క నిమిషము తదేక దృష్టితోఁ దలవంచుకొనియెను. ఆమె మొగముపై కెత్తుసరికి కన్నులెఱ్ఱబడిపోయి యుండెను బాష్పబిందువులు వచ్చుట లేదు. మొగము జేవుఱించెను. అధరమును గఱచికొనుచు "నాప్రియున కాపద సేయునా రెవ్వరు? ఆతనియాగ్రహమునకు నాప్రియుఁడు లోఁబడువాఁడేనా?" అనుకొనుచుఁ దల పంకింప నారంభించెను మరల నుత్తరక్షణముననే యాకోపవికారము లన్నియు నామెమొగమునుండి వెడలిపోయినవి. దీనభావ మంకురించెను. ఏమిచేయుటకును దోఁచక తలవంచుకొనియెను. క్రింద మఱిరెండు లేఖాఖండములు గాన్పించెను. అందొక దానియందు "చంద్రగుప్త" అనునక్షరము లగపడుచుండెను. దానిని కంపితహస్తముతోఁ నెత్తికొనుచుండఁగా రెండవతునుక గాలితాఁకున నెగిరి సమీపముననే తిరుగఁబడియెను. అందున్న "రక్షణ" యనునక్షరంబులు చదివెను. తొందరతో దానినిగూడఁ దీసికొనెను. ఈరెండును జేర్చి చూచుకొనియెను. అందేదియో యర్థము స్ఫురించుచుండెను. ఈయభిప్రాయమువలనఁ బయితునుకలలోనిసారాంశ మామెకు గోచరించినట్లుగ నుండెను. ఉత్తర మాపత్సూచకమయిన దని యామె యనుకొనెను. కళవళము మఱింత హెచ్చయ్యెను. ప్రాణేశ్వరునిప్రియలేఖను జించి

పాఱవయిచిన పాపఫలము సంపూర్ణముగ ననుభవించుచున్నానని యామె యనేకవిధములఁ బశ్చాత్తాపపడఁజొచ్చెను. ఆమె యిట్లు వితర్కించెను.

“అయ్యో! ప్రాణేశ్వరున కేమియాపద రానున్నదో? దిక్కుమాలినలజ్జాకోపములు నన్ను ప్రేరేచుటచే మూర్ఖచిత్తనై యీ యుత్తరము నేనేలచించితి? ఇందలివిషయము లెంతయవసరమైనవో గదా! ఇఁకేమి జరుగనున్నదో? ఎట్టియాపదలలో మునిఁగిపోవ నుంటిమో? ఇందలి యాథార్థ్యము నాకెట్లు తెలియును? ఊరక కీడుశంకించుచున్నానేమో? ఈయాపద విష్ణుగుప్తునకుఁ గాఁగూడదా? అట్లేల యనుకొనవలయును? అదియునుసరికాదు. హృదయేశ్వరుఁడు “చూడను” అని స్పష్టముగ వ్రాసియున్నాఁడే. దానికింకొక యర్థమేమియున్నది? ఏవిధముచేతఁ జూచినను మాయాపదనే శంకింపవలసివచ్చుచున్నది. కడపటి “చంద్రగుప్త” “రక్షణ” అనుపదములయర్థమే మాయాపదను దృఢపఱచుచున్నది. కానియెడలఁ జంద్రగుప్తునిరక్షణ మేల కావలసియున్నది?” అని వితర్కించుకొనియెను.

మోహ మనేకవికారముల నుదయింపఁజేయును. ఎట్టిభయకారణమునైనఁ గనఁబడకుండఁ గప్పివేయుచుండును. “ప్రియా” యను వాక్యమామెతలఁపునఁ బొడమెను. “హా ప్రియా! వసంతా!” అని పెద్దపెట్టున నెలుఁగెత్తి యేడ్చుచు నిలువునఁ గూలఁబడియెను. కలఁతవారియున్న హృదయమున శోకానలము ప్రజ్వలించుటచే నామె శోషిల్లి మూర్ఛమునింగెను.



# పదునాల్గవ ప్రకరణము.

---

వసుమతి కన్నులు తెఱచుసరికి యొకపురుషుఁ డామెకుఁ గనఁబడియెను. అతనితలపై విచిత్రాలంకారవిలసితం బగుశిరోవేష్టము మెఱయుచుండెను. దానిపై రసాలఫలసదృశాకారము గలపచ్చనితురాయి శోభిల్లుచుండెను. ఆతనియధరము తాంబూలరాగముచేఁ గెంపువలెఁ బ్రకాశించుచున్నది. ఆతనిచూపులు సౌమ్యములుగ లేవు కన్నులెఱ్ఱనై వియోగతాపవ్యథనో, మధుపానమత్తతచేఁ గలిగినయౌత్సుక్యమునో, వెల్లడిచేయుచుండెను. మొగము సంపూర్ణచంద్రమండలము వలె శీతలప్రకాశితము గాక, నల్లమబ్బుచాయల లోఁగొనుచు నప్పుడె యస్తమింపనైయున్న సూర్యబింబమువలె దుమదుమలాడుచుండెను. కోపవేగముననో, యెడతెగని నిట్టూర్పులసందడినో, ముకుపుటములు తెఱచుచుఁ బైకెగురుచుండెను. మణులచేఁ జెక్కఁబడినవల్లని (మొకమల్) యంగరకాయాతనిమోకాళ్లవఱకు వ్రేలాడుచుండెను. దక్షిణకరమున బంగారుతీఁగలచే మనోహరమై సింగపుతలగలదంతపు బెత్త మొప్పులు గులుకుచుండెను అది యాతనిచేతిలోఁ దిన్నఁగ నుండుట లేదు. ఇటు నటు జరగుచుఁ దలక్రిందు లగుచు వాహ్యాళి సేయుచుండెను. దక్షిణ కరముయొక్క యనామికయందు, నమూల్యపద్మరాగాలంకృతం బగు సువర్ణాంగుళీయకము తనయుజ్జ్వలకాంతుల నిటునటు ప్రసరింపఁ జేయుచుండెను. ఆతనియెడమచేయి మాటిమాటికిని, నూనూఁగుమీసముల పైకిఁ బోవుచు వాని నొకవింతహొయలున సవరించుచుండెను.

ఆపురుషుఁడు మెల్లఁగ, వొయ్యారముగ, సగర్వముగ వసుమతిని సమీపించెను. వెనుదిరిగిపోవుటకామెకుఁ బాదము లాడలేదు

ఆమె యేమియును జేయలేక స్థాణువువలె నిలువఁబడిపోయెను. అది యును పురుషునకు విలాసముగనే శోభించినది. ఆమెముఖమండలమును గాంచినతోడనే పురుషునితీక్ష్ణాకార మంతయు మారిపోయినది. బెబ్బులి గొఱ్ఱెపిల్ల యైనది. సుందరాంగులమనోహర కటాక్షములయం దీమహిమ యున్నదికాఁబోలును! అతఁడు మందహాసముఁ జేసెను. అది యాతని హృదయగాంభీర్యమును వెల్లడిచేయుచుండెను. దీనభావమునుగూడ సూచించుచున్నది ఆశోకమోహనమూర్తిని సమీపించి యాతఁ డిట్లు చెప్పఁదొడఁగెను.

"మనోహారిణీ! నన్నుఁ జూచి యిట్లేల బెచ్చువడియెదవు? నేను నీకు దాసుఁడను. నీవొక్కసారి నీకోమలశీతలకటాక్షమును బఱగించెద వేని నేనుధన్యుఁడ నగుదును ధన్యతముఁడ నగుదును. నాహృదయ ములో నీవు నాకుఁదెలియకుండ నొకవింతయగ్నిని బ్రవేశపెట్టితివి. అది నన్ను దహించివేయుచున్నది. ఇట్లెన్నాళ్లు భరించి యోర్చుకొని యుండఁగలను? అది ప్రతిరక్తనాళమునందును బ్రవేశించి నాశరీరము నందలిరక్తము నంతయు మహాజ్వాలగా మార్చివేసినది. రోమరోమకూప ములనుండి వెలువడునిజ్వాలలు, ఈధూమరహితకీలలు, నాకుభరింపశక్యము గాకుండనున్నవి. ఒక్కొక్కప్పు డీమంటల యుద్రేకముచే మండిపోవుదు నన్నభయమున నాశరీరమునందలిదుస్తుల నన్నిటిని దీసి పాఱవైచు చున్నాఁడను. వీవన లీయగ్నిని మఱింతయభివృద్ధిపఱచునేగాని యెట్లుప శాంతి చేయఁగలవు? ఎట్టియుపచారములచేతను నిది శాంతిఁ జెందునది కాదు. నీశీతలాంగపరిరంభణంబునంగాని యిది యుపశమిల్లదు. నీప్రేమను పటివలెనే యుపేక్ష వహింతువేని ఈయగ్నికీశరీరము సంపూర్ణముగ నాహుతియైపోవును. ఒక్కమారుగ నట్లైపోయినను బాగుగనేయుండును. నిలువునను నిలువఁబెట్టి తీవ్రాగ్నిశిఖల దరికొల్పి కొంచెముకొంచెముగ మంటఁజేసియుఁ జచ్చిపోకుండ నాశాపాశములను బంధించి యీయమ

బాధలో నిలిపి వేసితివే? నీపై నున్న యాశ, నీయందున్న మోహము, నీమీఁదనున్న యనురాగము, నీతో నున్న హృదయసంబంధము, నాప్రాణములకు సంకెలలై బంధించివేయుటచే వానికి గాఢముగఁ జిక్కుఁబడి పోయి నేనీలోకమును విడువఁజాలకున్నాఁడను. అట్లు విడిచిపోవుటయు నాశక్యము కాదు. అదియును నీకటాక్షములోనే యిమిడియున్నది. అదియునుగాక నీరూపగుణములచేఁ గట్టువడిపోయియున్న నాకింక స్వాతంత్ర్య మెక్కడిది? ఈకారణముచేత రత్నగిరిలో నిన్ను వీక్షించినదిమొదలు నేను పొందుచున్న బాధ, నేననుభవించుచున్న నిర్బంధము, లిట్టివని యిప్పు డెట్లు వాక్కులచేఁ జెప్పఁగలను? ఓమోహనమూర్తీ! ఈబాధ, యీనిర్బంధము, నీయగ్నిజ్వాలాసంచయము, నీహాలాహలము, నివి యన్నియు నేనెన్నాళ్లుభరించి యుందును? నన్ను గృపఁజూడుము. నీదాసుఁడనై పోయితిని. నన్ను పేక్షించుటచే నీకు మహాపాతకము రాఁగలదు. తప్పక రాఁగలదు. ఏమందువు? కోమలపల్లవసదృశమయి, సుధారసపరిపూర్ణముగు నీయధరమును విప్పి, యొక్క వాక్యము.— అమృతతుల్య మగునొక్క పలుకు, వీనులవిందుగ వినిపించి నాయీ మహాగ్నిజ్వాలలఁ జల్లార్పుము.

వసుమతి యీదీనాలాపములను వినియెనో లేదో కాని యామె పెడమొగముఁ బెట్టుకొనియుండెను. పురుషునకుఁ బ్రత్యుత్తర మేమియు నీయలేదు.

ఈపురుషుఁడు విష్ణుగుప్తుఁడే యని వానివాక్యములను బట్టి చదువరులు గ్రహించియే యుందురు.

వసుమతి మాటాడలేదు. ఆమెకుఁ బదచలనము లేదు. ఆమె హృదయమునకును జలనము లేదు. స్త్రీలహృదయములు చంచలములని స్వభావ మెఱుంగనివారొందఱు వాదించుచుందురు. అట్టివార లీసమయమున వసుమతిని జూచియుందురేని, నామెహృదయస్థైర్యమును

గనిపట్టఁగలుగుదురేని, తప్పకతమవాదమును విడిచి పెట్టఁగలరు. విష్ణుగుప్తుఁ డామెలక్షణములను బరికింపలేదు. ఆమె సిగ్గుచే మాటాడకుండె నని యాతఁడు యోచించుకొని యిట్లనియెను.

"వసుమతీ! ప్రత్యుత్తర మిచ్చుట కింతసిగ్గేల? నీవాక్యామృతమును జిలికి నాహృదయతాపమును జల్లార్పుము"

"నావాక్యము నీ కమృతము గాదు" అని పెడ మొగముగనే వసుమతి ప్రత్యుత్తరమిచ్చెను.

విష్ణుగుప్తుఁ డీమాటలకు వెలవెలఁబోయి "కా కేమగును?" అనియెను.

"విషమగును"

"హృదయతాపభరంబునఁ బ్రాణములపై నాశవదలుకొనియున్న నాకిట్టిసమయమున దానివలనఁగూడఁ బ్రయోజనమున్నది"

"పరితాపోపశమనమున నీకు మరణమే శరణ్యమై యున్న యెడల మఱియేయుపాయమునకైనఁ గడంగుము. ఊరక నన్నేల నిర్బంధించెదవు?"

"ఇది నిర్బంధమా? నీభార మంతయు నేనే వహించితినే! వివాహవిషయమున నీచే నరికట్టఁబడి నీదాసుఁడనై మెలంగెదనే. రత్నగిరిరాజపుత్త్రికను మగధదేశరాజ్ఞీమణిని జేయఁదలంచుట నిర్బంధముగఁ దోఁచుచున్నదా?"

"అట్లెన్నటికైన జరగునని స్వప్నమునఁ గూడఁ దలంపకుము. చంద్రుఁ డెంతరాజై యున్నను, నానిశాచరుని మొగము పద్మినీకాంత యెన్నఁడును జూడఁబోదు"

"అట్లే నీవును నా మొగమును జూడఁబోవా?"

"చూడను ముమ్మాటికినిఁజూడను."

విష్ణుగుప్తుని హృదయము రగులుకొనిపోవుచుండెను ఆతనికి సహింపశక్యముకాని కోపము వచ్చెను.

"దుర్భాగ్యురాలా! యువరాజును నీవెట్లు తప్పించుకొని పోఁగలవు? నిన్ను నీవెట్లు కాపాడుకొనగలవో చూచెదఁగాక!" అనియెను.

"చూచుట కేమున్నది? మనుష్యమాత్రులొకరినొక రేమియో సాధింతుమనుకొనుట వట్టిభ్రమ. ఈదినమున నున్నవారు జేపగపడుట లేదు. దీనికంతకును భగవంతుఁడే కర్త. నీవును నేనును గాదు"

"ఏమీ యీప్రగల్భవాక్యములు! ఎట్టిదైవ మడ్డుపడునో నీవే చూచెదవు. కన్నులున్నవికదా!"

"నాఁడు మహావనమున నిన్నును మమ్మును బ్రాణాపాయమునుండి కాపాడినదైవమే నేఁడును గాపాడును. అప్పుడున్న దైవ మిప్పుడు లేకపోలేదు. వృథాప్రగల్భములతోఁ బ్రయోజన మేమి? అప్పు డేమి చేయఁగలిగితివో చూచికొనుము"

"నీహృదయము నాకుఁ దెలిసినది. ఎవ్వఁడు నాయాశాకుసుమమునకు ఝంఝామారుత మగుచున్నాఁడో, ఎవ్వనిమూలమున నా మనోరథసిద్ధుల కంతరాయము లగుచున్నవో, ఎవ్వని నీహృదయమున నిరంతరమును ధ్యానించుచు నన్నుఁ దృణీకరించుచున్నావో యాతని నీ వింకఁ జూడఁజాలవు ఆతనినామమునైన వినఁబోవు. సుక్షత్రియకుమారుఁడనైతినేని నావాక్యము లర్థవంతము లగునుగాక? దానిఫలము శీఘ్రముగ ననుభవములోనికి వచ్చునుగాక! ఓసిదురాత్మురాలా? నీవేమి చేయఁగలవు? నీరాజ్యము నారాజ్యమునఁ గలిసినది. నీవు నావశమై యుంటివి. నీప్రాణములును నాచేతిలో నున్నవి బాగుగ నాలోచించుకొనుము. అమృతమును బరిత్యజించి హాలాహలమును గ్రోలకుము. కల్పవృక్షమునువీడి కాలినమోడు నాశ్రయింపకుము. చింతామణిని బోఁగొట్టుకొని చింతగింజ నేరికొనకుము."

ఇట్లింక నేమియో యుపన్యసింపసాగెను. బెబ్బులి చెంతనున్న హరిణివలె వసుమతి గడగడవడఁకిపోవుచుండెను. ఈవ్యాఘ్రముఖము నుండి యావలఁబడుట యెట్లని యామె యాలోచించుకొనసాగెను. ఇంతలో నచటి కెవ్వరో వచ్చుచున్న యలుకుడు వినవచ్చెను. విష్ణుగుప్తుఁడా యలుకుడు విని కోపఘూర్ణితచిత్తముతో నావలికి దాఁటిపోయెను.

---

## పదునేనవప్రకరణము.

---

వసుమతిదుడుకుఁదనమునకుఁ గోపగించుకొని వెడలిపోయిన సుందరి యేమైనది? ఆమెకు నిజముగా వసుమతిపైఁ గోపము వచ్చినదా? సుందరికి వసుమతి ప్రాణముకంటెను బ్రియమైనదిగదా! పాపము! వసుమతి కామెకంటె దిక్కెవ్వరున్నారు? అట్టిచో నామెపై సుందరి యెట్లు కోపింపఁగలదు? ముగ్ధలగుయువతీమణులు సిగ్గుచే నేమిచేయ సాహసింపరు? అవి యన్నియును బ్రాణప్రియులకుఁ గోపకారణములగునా? వసుమతి తప్పుపనియే చేసినది. కటకటా! తరువాత నెంతగాఁ బరితపించినది? ఆపరితాపముం జూచిన మనకే జాలి కలుగుచున్నదే? సుందరి కది యెంతవిచారకరముగ నుండును? సుందరి యిది యంతయును జూడఁబోవునా యని సందేహింతురా? ప్రాణప్రియ యగు నామెను విడిచి సుందరి యొకనిముసమైన నిలువఁ జాలదని మీరెఱుఁగరు.

సుందరి నేఁడు శచీభవనమున నంతర్భాగముననున్న తినపడక గదిలో నలంకరించుకొనుచున్నది. ఆమెతననిడుదపెన్నెరులముడిసడలించి

సంపెఁగనూనెచే మెఱుఁగు పెట్టుచున్నది. కురుల నిరుపాయలుగ వక్షఃపార్శ్వంబులకు మలపి మృదులారుణాంగుళులచేఁ జిక్కుడలించు కొనుచున్నది. నీలమై దట్టముగనున్న కచకలాపమునుండి వెలువడుకోమల నఖంబులు నల్లమబ్బుపైఁ బ్రసరించుమెఱపుతీఁగలవలెమెఱయుచుండెను. ఆమెబాహువల్లరులు సుదీర్ఘములైనను శిరోజములు చాలఁ బొడవైన వగుటచేఁ జిక్కుడలించినంతవఱ కెడమచేతితోఁ జేర్చిపట్టుకొని మరలఁదుదవఱకుఁజిక్కుఁదీసికొనవలసివచ్చెను. తరువాత దంతపుదువ్వెన తో నదేరీతిగ దువ్వుకొనియెను. నిలువుటద్దమునఁ జూచికొని సమానముగఁ దిన్నని పాపట దిద్దుకొనియెను. నీలమై, నున్ననై, యున్న చికుర మండలమున కుమ నిగనిగలాడుచున్న పాపట గీఁటురాతిపై మెఱయుచున్న సువర్ణరేఖవలె నొప్పు లొలుకుచుండెను. రెండుపాయలుగ నున్న కుంతల ముల వెనుక వైచికొని దువ్వెనతో నున్నగ దువ్వికొనియెను. కొంత వఱకు జడనల్లి చుట్టగాఁ జుట్టెను తరువాతఁ దుదవఱకు నల్లి చుట్టగాఁ జుట్టుకొనియెను. తుదిచుట్టుమాత్రము వెన్నున వ్రేలాడ విడిచెను. ఆమె తనశిరంబున సువర్ణాలంకారము లేవియు ధరింపలేదు. జడచుట్టుపై నొకపుష్పమాలిక నలంకరించెను. పన్నీటిచే వదనమండలమును దుడిచి భ్రూమధ్యనుండి పాపటవఱకు సిందూరరేఖ సవరించికొనియెను. విశాలతరళనయనంబులఁ బచ్చకప్పురపుఁగాటుకరేఖఁ దీర్చికొనియెను. కర కమలముల బరిశుభ్రముగఁ గడిగికొని వేఱొకగదిలోనికరిగి యొక్కింత సేపటిలోఁ దిరిగి యచ్చటికి వచ్చెను. ఆమె యిప్పుడు మునుపటివలె లేదు సాక్షాత్కరించిన మోహినివలె నున్నది. ఆమె ధరించుకొన్న సరిగ పనిచేసినపచ్చపట్టు చీరకుచ్చె లుష్మోత్తప్రావులవలెఁ బాదములవఱకు వ్రేలాడుచుండెను. అమూల్యరత్న ఖచిత మగుగంటలమొలనూలి కాంతులు కన్నుల మిఱుమిట్లు గొలుపుచుండెను. శ్రవణయుగ్మమునం దలంకరించికొన్న నును గెంపుఁదమ్మంటుల యరుణకాంతి లేఁజెక్కులకో,

కపోలములందలి కెంజాయలుకర్ణాభరణములకో, మెఱుఁగు పెట్టుచుండెను. ఆమె తనయందమును నిలువుటద్దములోఁ జూచికొనియెను తల యూఁచెను. అప్పు డచ్చట నద్దములోని ప్రతిబింబమును నామెయును దక్క మఱియెవ్వరును లేరు. ఉన్నచో వారును దలనూఁపవలసినదే. విస్మృతి వహింపవలసినదే. ఆమెసౌందర్యము స్త్రీలకుఁగూడ మోహమును గలిగించును. ఆచెలువమునం దొకవిధమైనయాకర్షణశక్తి మిశ్రితమై యున్నది. ఆచూపులలో మత్తుమం దున్నది. ఆమె తనసౌందర్యమునకుఁ దానే ఱిచ్చవడియెను. తలవంచుకొని యొక్కనిట్టూర్పు విడిచెను. తన్నుఁ జూచి తానేమోహించుకొన్న దేమో? కాదు. కాదు. ఆమెకుఁ బూర్వ వృత్తాంత మేదియో స్ఫురణకు వచ్చియుండును. ఒకటిరెండశ్రుబిందువులు కాటుకకనుఁగొలుకులనుండి జారి పైటపైఁ బడి యంతలో మాయమయ్యెను. ఆమెకు జ్ఞప్తికివచ్చిన విచారసూచకమగు విషయమును దెలిపికొనుట కట నెవ్వరును లేరు. ఆకారణముచే మన కందలియథార్థము బోధపడినది కాదు. ఆవిలాసవతి కాసమయమున నేదో ప్రియతమమైన వస్తువు తలఁపునఁ బాఱియుండును. పాప మిరువదియైదేండ్లపడుచు. ముగ్ధబాలికయగు నసుమతికొఱకుఁ దనజీవితమును ధారవోయుచున్నది. ఆమెసత్యచరిత్ర మేమో మనకింకను దెలియలేదు.

సుందరి బ్రహ్మచారిణి కాదు. సంపూర్ణయౌవనావస్థలో నభిమానధనమును గాపాడుకొనుచున్న ధైర్యవతి. ఆమెధైర్యమున కెట్టి శూరపురుషులును జాలరు. ఆమె యిప్పు డిట్లలయలంకరించుకొనుచున్నది చెపుమా! ఆమె యేదో ఘనకార్యమును దలపెట్టినది. సుందరి తలంచినకార్యముల కెన్నఁడును విఘ్నములు కలుగలేదు. ఆమె సౌందర్యవిలాసములే యామెకు విజయమును జేకూర్చుచుండును.

అప్రగల్భ లగు సతీమణులసౌందర్యము దుష్టలోకమువలన వారికిఁ గీడు దెచ్చుచుండును. కాని, ప్రగల్భురాం డ్రగుసుందరులమనోహర

విలాసములు దుష్టలోకమునే మోసము చేయఁగలవు. వారి సౌందర్య
మున కెట్టినిశాచరులైనను నిష్ఠాగరిష్ఠు లగుమానులు కావలసినదే వారి
కాసౌందర్యము రాజ్యమువంటిది. దానికి లోఁబడి లోక మంతయును
చెప్పినట్లు చరియింపఁగలదు పూర్వమాదినారాయణుఁడు జగన్మోహి
న్యవతారమును దాల్చినప్పు డట్టిసౌందర్యమే మూఢులగు రాక్షసుల
యాథాత్మ్యమును జల్లార్చినది.

సుందరిసౌందర్య మట్టిది. ఆమెకు నేఁడు చీఁకటివేళ నొంటిపాటున
నొకయపరిచితస్థలంబునకుఁ బోవలసివచ్చినది. చాలనావశ్యకం బగునొక
సందేశమును నడపవలసి వచ్చినది. ప్రాణమానరక్షణసమయంబున
నామెకు సౌందర్యమే కవచమువంటిది. ఆమె తనవిలాసములవలన లోక
మును వశపఱచుకొనఁగలదు. కేవలసౌందర్యము లోకమోహనకరమైన
దగుటచే పాపమబలలు దురాత్ములమూలమునఁ జిక్కులలోఁ బడిపోవు
చుందురు. చతురమతి యగుసుందరి కట్టిభయము లేదు. ఆమె యొక్క
సారి తేరిచూచెనా యెట్టిదుష్కాముకుఁడైన నామెకు దాసానుదా
సుఁడై పోవలసినదే. సుందరి యిదియంతయు బాగుగ నాలోచించు
కొనియే యిప్పు డీజగన్మోహిన్యవతారమును దాల్చి యుండును.

ఆమె మరల నొకసారి యద్దమువంకఁ జూచెను. విశాలోన్నతవక్ష
స్థలంబునఁ గంచెలపైఁ బయ్యెద నందముగ సవరించుకొనియెను.
తాంబూలరాగాధరమును విరియించి యొక్కచిఱునవ్వు నవ్వెను. ఇవి
యన్నియును మోహనమంత్రమున కంగన్యాసములు కాఁబోలును.
ఆనిర్జనస్థలంబున నప్పటివిలాసములను దేవతలైనఁ జూచియుండరు. చూచి
నచోఁ బుష్పవర్షమును గురియించియే యుందురు.

అప్పుడు సూర్యాస్తమయ మైనది. కనుచీఁకటి పడుచుండెను.
సుందరి గదితలుపులుమూసి యుద్యానవనమార్గము పట్టెను. ఆమె
యెటకుఁబోవఁదలఁచినదో మనకుఁ దెలియదు. ఆవిషయము వసుమతికిఁ

దెలిసియేయుండును. ఆమె యిప్పుడు విచారసముద్రమున మునిఁగి యున్నది. మనతోఁ మాటాడలేదు. సుందరివలననే నిజముఁ దెలిసికొన వలయును. మనమామె వెంటనే పోవుదము.

---

## పదునాఱవ ప్రకరణము.

ఆకసమునందలి సంజకెంజాయ లుద్యానమునఁ జిగురుగొమ్మలకు వింతకాంతి నొసంగుచుండెను. పక్షులు కిచకిచ కూయుచుఁ జీఁకటులతోఁ గూడ గుబురుగొమ్మలమాటున నున్న తమ గూండ్లలోనికిఁ జేరుకొను చుండెను. అప్పుడొంటిగ నడచుచున్న సుందరి నడుగడుగునకును వసంత కోకిల 'కో' యని పలుకరించుచుండెను. సుందరి వెనుదిరిగి చూచుట లేదు. చీఁకటి బాగుగఁ బడకుండఁగనే తిరిగి రావలయునని యామె తలంచెను. ఎట్లు పోవలయునో యామెకుఁ దోఁచుట లేదు. ఉద్యానవనదక్షిణ ద్వారముఁ దెఱచికొని యావీధి వెంటనే పోవలయునని యూహించెను. పాప మామెకు గమ్యస్థానమునకుఁ ద్రోవ తెలియదు. ఊరక ముందు నకు నడచుచుండెను.

ఇంతలో నుద్యానమున దక్షిణమువైపునుండి యెవరో వచ్చు చున్నట్లు కనిపెట్టెను. వారెవ్వరై యుందురని యామె వితర్కించు కొనియెను. అప్పుడు పొదలమాటుననుండి వెలువడిన విష్ణుగుప్తుఁ డామె కన్నులఁ బడియెను. సుందరి యేమియును చలింపలేదు. తనమేలి ముసుఁగుసవరించుకొనఁబోయెను కాని, యదిగాలివిసరునఁ జెదరిపోయెను.

ఆసమయమున విష్ణుగుప్తుఁ డామె సుందరవదనారవిందమును సందర్శించెను. ఆతఁడప్పుడు పుష్పాసవపానమత్తతచేఁ దూలుచుండె

వసంతకాలము-ఉద్యానము-చల్లనిసాయంసమయము - నవ యౌవనము - సురాపానమత్తత-ఎట్టయెదుట దివ్యసుందరీరూపసందర్శనము-ఒంటిపాటు. ఇవియన్నియును విష్ణుగుప్తునకు మోహోద్రేకమును గలిగించెను.

అతఁడు సంభ్రమముతో నామెను సమీపించి "సుందరీ! దివ్య సుందరీ! ఏకాంతముగ నెక్కడకుఁ బోవుచున్నావు?" అని తడఁబాటు మాటలతోఁ బలుకరించెను

సుందరి యాతనిహృదయస్థితి నింతలో గ్రహించినది. ఆతనికిఁ బ్రత్యుత్తర మీయకుండ వెడలిపోవుట కవకాశము లేదని తలంచుకొని యెను. ఎటులైనఁ దప్పించుకొని పోవలయునని నిశ్చయించుకొనియెను.

"యువరాజా! ఈచీకటిలో నీయుద్యానమున కెవ్వరికొఱకు వచ్చితిరి?" అనియెను.

"ఎవ్వరికొఱకా? సుందరికొఱకు దివ్యసుందరికొఱకు"

"అంతటిభాగ్యవతి యగుసుందరి యెవ్వరు?" అని సుందరి తన తరళనయనములనుండి కటాక్షమాలికల నాతనిపైఁ బఱగించెను.

ఆచూపులు విష్ణుగుప్తుని చంచలహృదయమును మఱింత కలఁ గించెను. మదవిస్మృతి దానికిఁ దోడుపడియెను.

"సుందరి యెవ్వరా? అది యువరాజు కన్నులలో మెఱయు చున్నది, చూడు! చూడు!" అని కన్నులరమోడ్చి ముందునకుఁ బడఁ బోయెను.

సుందరి కొంచెము తొలఁగి నిలువఁబడియెను. సురాపానమత్తుఁ డగునాతనిచేష్ట లన్నియును బాగుగ గ్రహించెను. తనమోహన మంత్ర ముచే నాతఁడాకర్షింపఁబడినట్లు నిశ్చయించెను. ఒకసారి చిఱునవ్వు నవ్వెను.

విష్ణుగుప్తున కుద్రేకము కలిగెను. "ఓ! ఓ! వెన్నెల! మల్లె పువ్వుల మధుకలశమునందలితళుకు! నవ్వు! ఇంకొకసారినవ్వు! నీవే

సుందరివి. యువరాజునకుఁ దగినసుందరివి. చతురిక మంచిదికాదు. వసుమతి నామాట వినదు. నీవే సుందరివి యువరాజునకుఁ దగిన సుందరివి" అని యామెను సమీపింపఁబోయెను.

సుందరి కొంచెము వెనుకకు జరగి పయ్యెద సవరించుకొనుచు "ఏమి నాభాగ్యము! యువరాజునకు నాపై నంతదయ వచ్చినది? ఇన్నాళ్లకు నేను మీకన్నులఁ బడితినా?" అనియెను.

విష్ణుగుప్తుఁడు వికటహాసము చేయుచు, "ఇది మొత్తిపోదువు! సుందరీ! క్షమింపుము." అనియెను.

"ఎట్లు క్షమింపఁగలను? ప్రతిదినమును వచ్చుచు బోవుచుండు మిమ్ములను నేను సాభిప్రాయముగ, సానురాగముగ, నెన్ని సారులు చూచినను నిప్పటికిఁగాని నాపై దయగలిగినదికాదు"

"ఆ! ఆ! దయ నీకా? నాకా?"

"యువరాజునకే దయ యుండవలయును"

"ఔను నేను యువరాజునే. ఇప్పుడు నీకటాక్షమునకు లోఁబడి పోయితిని" అని యుద్వేగముతో నామెను బట్టుకొనఁబోయెను.

సుందరి యేమియును భయపడలేదు. ఆమె సౌందర్యవిలాసములామెను గాపాడఁగల వనువమ్మక మామెకుఁ గలదు విష్ణుగుప్తునిమధుపానమత్తతకూడ నామెకు శ్రీరామరక్షయైనది. ఆమె యాతని దప్పించుకొని,

"రాజకుమారా! సిరిరా మోకాలొడ్డువా రెవ్వరుందురు? అదృష్టవశమున నీయనుగ్రహము లభించినది. కాని, సమయముమాత్రము మంచిదైనదికాదు" అనియెను.

విష్ణుగుప్తుఁ డదరిపడి "ఏమి? ఏమి? చెప్పు! భయము లేదు" అనియెను.

"మీరు పుష్పాసవము గ్రోలియున్నారుగదా"

"అయిన నేమి? అది మహారాజలక్షణముకాదా?"

"ఔను. కాని, నాకాపరిమళముగిట్టదు"

"ఓసీ! దీనియం దెంతమహిమ యున్నదో నీకుఁ దెలియదు. సురల కమృత మెట్టిదో సుర మనకట్టిది"

"కావచ్చును. మా రాజకుటుంబమున కట్టిభాగ్యము కలుగ లేదు"

"కలుగ కేమి? క్రమముగా నభ్యసింపవచ్చును?"

"ఇప్పు డేమైనది? మీ స్నేహమువలన నన్ని భాగ్యములును కలుగ వచ్చును"

"అట్లే రమ్ము! ఇంద్రమందిరమునకుఁ బోవుదము రమ్ము"

సుందరి కరకంకణములు సవరించుకొనుచు నిలువఁబడియెను.

"ఏమి? నీకింకను సందేహ మేమి?" అని విష్ణుగుప్తుఁడు హెచ్చరించెను.

"ఏమియును లేదు. ఈసంధ్యాసమయమున మనమిరువురమును బోవుట యెవరైనను చూచినయెడల బాగుగ నుండదు. మీరు మాత్రము మరియొకరితో వెళ్ళుఁగరా"

"అట్లైన నీయభిప్రాయ మేమి?"

"అందఱును నిద్రించిన వెనుక—"

"అంతవఱకు నేనిచ్చట నుండవలెనా?"

"వలదు, వలదు. ఎవ్వరికి ననుమానము కలుగకూడదు. మీ రేగ వచ్చును. నేనొక్కతెనే బయలుదేరి మీ కేళిమందిరమునకు—"

"వచ్చెదవా? తప్పక వచ్చెదవా? ఎంతసేపునకు వచ్చెదవు?"

"రెండుజాములకు—"

"అంతవఱకు నీవోర్చి యుండగలవా?"

సుందరికి నవ్వు వచ్చెను. అది లోలోననె యడంచుకొని యొక్క

నిట్టూర్పు విడిచెను. "ఏమి చేయఁగలము? లోకమునకు వెఱవవలయును" అనియెను.

"సరే! రెండుయామములా! అంతకు దాఁటకుండ రావలయును."

"మహాభాగ్యము"

"తప్పక వచ్చెదవా?"

"ఆ. నాయదృష్టదేవతసహాయముగ నొక్కతెను బయలుదేరి వచ్చెదను"

"ఏదీ! ఒట్టుపెట్టికొనుము!"

సుందరి యెడమచేతిచిటికెనవ్రేలు చిటుక్కనవిఱిచి? ఇంత యొట్టు" అనియెను.

ఆయొట్టునందలియర్థ మాతనికి బోధపడినంతబోధపడినది అప్పటి యామె విలాసమున కాతఁడు విభ్రాంతుఁ డయ్యెను. ఆతని కామెను విడిచిపోవలయు నని లేదు. ఆమె మనసునకు భారముగ ప్రవర్తింప వలయు ననియులేదు. ఆమోహనవిగ్రహము నెదుట నెవ్వఁడు మఱు మాట చెప్పఁగలఁడు?

"సుందరీ! రమ్ము. వేగముగ రమ్ము. ఒట్టు మఱవకుము" అని విష్ణుగుప్తుఁడు వెడలిపోవుచుండెను.

సుందరి యేమి యాలోచించుకొన్నదో గాని యాతనిని వెనుకకుఁ బిలిచెను.

"ఆపిలుపుతోడనే యాతఁడు గిరుక్కున మరలి యామెను సమీపించి "ఏమి?" అనియెను.

సుందరి ఏమియును మాటాడక తల వంచుకొనియెను.

"సందేహ మక్కఱలేదు. నీయుద్దేశ మేమియో చెప్పుము."

"మఱేమియును లేదు. అర్ధరాత్రివేళ ద్వారరక్షకులను దాఁటి-"

"ఇదియా సందేహము! బాగుగనే తోఁచినది" అని యాతఁడించుక యోచించి "ఈముద్రిక నానవాలుగఁ జూపుము. నిన్నెవ్వరునభ్యంతరపెట్టరు." అనియుంగరము నొసంగెను.

సుందరి చిఱునవ్వు నవ్వుచు "ఇఁక నిరాతంకముగ రాఁగలను. యువరాజే నాచేతిలోఁ జిక్కిపోయినాఁడు" అనియెను

"అట్లే" అని నవ్వుచు నాతఁడు వెడలెను.

సుందరి యాతని వెంబడించి యుద్యానవనదక్షిణద్వారము వఱకును బోయెను. ఆతఁ డాద్వారమును దాఁటిపోయెను. సుందరికి నిర్బంధమును దాఁటిపోయెను. కొంతసేపటికామెయు నాద్వారమును దాఁటి పోయెను.

---

పదునేడవ ప్రకరణము.

పాటలీపుత్త్రము నాగరికతనందినపట్టణములలోనెల్లఁ బ్రసిద్ధికెక్కినది. ఆనిశాసమయమున వీధిదీపములచే రాజమార్గమంతయును బట్టపగలుగ నుండెను. సుందరి మేనిముసుఁగు సవరించుకొని యారాజమార్గమునుండి పశ్చిమాభిముఖయయి పోవుచుండెను. కాంతిమంతములగుకాచదీపములవెలుతురున నాసుందరితరళనయనంబులు మెఱుపుల మెఱయించుచుండెను. జను లనేకు లాత్రోవను బోవుచుండిరి. ఆయుధపాణు లగురక్షకభటులు సందందుఁ జరియించుచుండిరి. వారిచేతులలోఁ దళతళ మెఱయుచున్న చంద్రహాసములు మిగులఁ బదనైనవి. సుందరి బెళుకుచూపు లంతకంటెను బదనైనవి. ఆమె వారిని జూచి భయపడలేదు. జగజ్జేత యగుమదనునికుసుమాయుధముకడ మఱే యే యిత

రాయుధములు పనిచేయఁగలవు? ఎవ్వరును నామెను బలుకరించుట లేదు ఆజగన్మోహనాకారమును జిచ్చవడి చూచుచుండిరి. సుందరి వారిని దప్పించుకొని పోవుచుండెను. కొంతదూరము నడచెను.

అటనుండి యుత్తరముగ నొకసందుత్రోవకు మఱలెను. ఆమెకు జంద్రగుప్తుని భవనమున్నదిశమాత్రమే తెలియును గాని త్రోవతెలియదు. తనకుఁ దోఁచినత్రోవను బోవుచుండెను. అతివేగముగఁ బోవుచున్న యొకపురుషుఁ డామె కెదురయ్యెను. అతఁడామెను చూడలేదు. అట నింకెవ్వరును లేరు సుందరి యాతనిం జూచి "అయ్యా! చంద్రగుప్తభవనమునకు నాకు దారితెలిపెదరా?" అని మెల్లఁగ నడిగెను.

ఆపురుషుఁ డామెమాటలు వినలేక. తప్పించుకొని పోవుచుండెను.సుందరిగ్రీవాభంగయియాతనివంకఁ బార్శ్వముననుజూచెను. ఆతనిపాదముల సాచూపులు సంకెల లయ్యెను. ఆతఁడు మఱిముందడుగు వేయలేదు. ఆతనిహృదయమున నామెయందు గౌరవమో, దయయో, మఱియేమో, యుదయించెను.

"నీవెవ్వరు?" అని యాతఁడు ప్రశ్నించెను.

"నేనెవ్వతె నైననేమి? ఈయూరికిఁ గ్రొత్తదానను. నాకిప్పుడు చంద్రగుప్తునిదర్శన మవసరముగఁ గావలసియున్నది. ఈయబల కింత మాత్రము సాహాయ్యము చేయలేరా?"

"నాకుఁ జాలఁ దొందరపని యున్నది. స్త్రీతో మాటలాడుటకు నాకు నావకాశము లేదు."

"తొందరపను లుండవచ్చును. సజ్జనులకుఁ బరోపకారమునకు మించినస్వకార్యము లుండవు. అందును ఆఁడువారిప్రార్థనము నెవ్వరు త్రోసివేయఁజాలుదురు?"

సుందరి పలుకులలో నమ్రత మున్నది. ఆపురుషుని హృదయ మావాక్యములకుఁ గఱఁగిపోయెను.

"నేనిప్పుడు పోవుచున్న కార్యముకూడ నట్టిదే. ఆపదలలోఁ బడి పోవనున్న యబలల సంరక్షణమునకు నేను త్వరపడవలసి యున్నది"

సుందరి దూరాలోచన కలది. ఆవాక్యములవలన నాతఁడు చంద్రగుప్తునకో, వసంతునకో, సేవకుఁడయియుండునని యూహ గ్రహించెను. "అయ్యా! ఆయబల లెవ్వరో తెలిపెదరా?" అని యాతని నడిగెను.

"అదిచాలరహస్యము, చెప్పఁగూడదు."

"విదేశస్థురా లగుసుందరికిఁ దెలిసినంతమాత్రమున మీ రహస్యమునకు భంగము కలుగదు. ఈపట్టణమున నేనెవ్వరి నెఱిఁగి మాటాడఁగలను?"

పురుషునిహృదయము పనిచేయుట లేదు. కలఁగిపోయినది. ఆ పురుషుఁడు సంభ్రమముతో "నీవు సుందరివా?" అని ప్రశ్నించెను.

ఆవాక్యమువలన సుందరి కంతయును దెలిసిపోయినది. పరహృదయములను వశపఱచుకొని రహస్యములను దెలిసికొనుశక్తి యామెకుఁ జాల నున్నది. "అయ్యా! మీరు వసంతునికడ నుద్యోగులా?" అని యాతనిఁగూర్చి ప్రశ్నించెను.

"కాదు చంద్రగుప్తునియొద్ద" అని చెప్పి యాపురుషుఁడు పోఁ బోవుచుండెను.

"అయ్యా! కొంచెముసేపు నిలువుఁడు. మీయజమానుని భవనమునకు దారి చూపి మఱి పోవచ్చును"

"నేను నిలుచుట కవకాశము లేదు. సుందరి నిటకుఁ దత్క్షణము తీసికొనిరావలయు నని మాస్వామియాజ్ఞ యయినది"

ఆతఁడు తనకొఱకే పోవుచున్నాఁడని సుందరి గ్రహించెను. ఈసంగతియంతయును చంద్రగుప్తున కిదివఱకే తెలిసియుండునని యనుకొనియెను. పురుషునితో నిట్లనియెను.

"అట్లే చేయవచ్చును. ఈయబలయొకమహాపదనుమునింగి చంద్రగుప్తరక్షణమునకై యాసించుచున్నది. ఈమెప్రార్థనమునంగీకరించి దయయుంచి యీమెకు మీప్రభునిశరణముం గూర్చి పుణ్యముగట్టుకొనుము."

"సరే నేను తిరిగి వచ్చి నిన్నుఁ గొనిపోయెదను. అంతవఱకు నిటనే యుండుము"

"ఈచీఁకటిరేయి నియపరిచితస్థలంబున దీనురాలగు నబల నొంటి విడిచి చనుట నీవంటివానికిఁ దగదు. నన్ను నిరపాయస్థలంబునకుఁ జేర్చి మఱిపొమ్ము"

పురుషున కేమియును దోఁచుటలేదు. స్వామికార్య మాతనిఁ ద్వరపెట్టుచుండెను. ఆసుందరి ప్రార్థనము త్రోసివేసిపోవుటకు మన మంగీకరించుటలేదు ఆతఁడు సంభ్రమముతో "చంద్రగుప్తుని యానతికి వ్యతిరేకముగ నెవ్వరును జరియింపఁజాలరు. దయయుంచి నన్ను పోనిమ్ము" అనియెను.

"నీకేమియును భయములేదు. నాతో మాటలాడుటకూడ మీ ప్రభున కావశ్యకమే యని యెఱుంగుము. నన్ను మీప్రభునికడకుఁ జేర్చి యింకను నీకు పోవలసియున్నయెడల నప్పుడు పోవచ్చును. మనము మాటలాడినంతసేపైన నాలస్యముకాదు. నన్ను వేగముగఁ గొనిపొమ్ము" అని దీనముగఁ బ్రార్థించెను.

పురుషుఁడు మఱే మాటాడలేకపోయెను. "అట్లైన వేగముగ రమ్ము" అని వెనుకకు దారితీసెను.

సుందరి యాతని వెన్నాడి పోవుచుండెను. అవివేకుఁ డగువిష్ణుగుప్తుఁడు తనకు నమ్మినబంటైపోవుటయు, అపరిచితుఁ డగు నొకపురుషుఁడు తనకు మార్గదర్శియగుటయు, శుభసూచనము లే యని యామె తలంచుకొనియెను. క్రమముగా వారిరువురును జంద్రగుప్తమందిరము కడ కరిగిరి.

అప్పుడు పురుషుఁ డామెను జూచి "ఇదియే మహాప్రభునిమందిరము. నీవు లోనికిఁ బొమ్ము" అని చెప్పి తాను ముందునకుఁ బోవుచుండెను.

"అయ్యా! కొంచెమాఁగి మహాప్రభునితో నాయాగమనముం గూర్చి తెలిపెదరా?" అని సుందరి ప్రశ్నించెను.

"నేను లోనికిఁ బోఁజాలను అనవసరకార్యములకుం బూనుకొనిన నాకుఁ జిక్కు రాఁగలదు"

"మహోపకారముం జేసిననీప్రాణములమీఁదికి వచ్చునట్లు చేయుటకు నేనంగీకరింపఁగలనా? నీకేమియును భయము లేదు. పోయి మహాప్రభునితో మనవిచేయుము"

ఆమోహనమంత్రములనడుమఁ బురుషునిహృదయమువిశ్వాస మెట్లు నిలువఁగలుగును? "సరే! ఏమని చెప్పవలయును?" అనియడిగెను.

"సుందరి వచ్చినదని మనవిచేయుము"

"నీవుసుందరివా!" అనిపురుషుఁ డొక్కపరుగున లోనికిఁబోయెను. క్షణములో మరలివచ్చెను. ఆతనికేమియును చిక్కు కలుగలేదు. "అమ్మా! లోనికి దయచేయుము" అని యామెను దీసికొనిపోయెను.

వారిరువురు నొకభవనముఁ బ్రవేశించిరి. పురుషుఁడుమాత్ర మట నాఁగక మఱియొకపనిమీఁదఁ బోయెను. అందుఁ బరిమళతైల దీపములు ప్రకాశించుచుండెను.ఒకచోఁ జంద్రగుప్తుఁ డుచితాసనముపైఁ

గూరుచుండి "చాణక్యనీతి"ని బఠియించుచుండెను. నడుమనడుమం దలయెత్తి యేమేమో యాలోచించుచుండెను. ఆతని మొగ మెఱ్ఱవడి పోయెను. నడుమనడుమ నిట్టూర్పులు విడుచుచుండెను. అప్పుడుగూడ నాతనిసౌమ్యవదనము దర్శనీయముయి యుండెను.

సుందరి యాతని సమీపించి చేతులు జోడించి "మహాత్మా! భద్రమగుంగాక!" అనిపలికెను.

చంద్రగుప్తుండు మొగమెత్తి సుందరివంకం జూచి "అమ్మా! రమ్ము! ఇటం గూర్చుండుము" అని యొకపీఠమును జూపెను.

సుందరి కూరుచుండలేదు. దీనాననమును వంచి నిలువంబడి పోయెను.

"మీరు సేమముగ నున్నారా?" అని చంద్రగుప్తుండు ప్రశ్నించెను.

"అనాథలమయి యాపత్సముద్రమున మునింగిపోవుటకు సంసిద్ధముగ నున్నారము" అని సుందరి కన్నిటితోం బ్రత్యుత్తరమిచ్చెను.

"మీరక్షణవిషయమున వసంతుండు నాకు జాబువ్రాసినాండు" అని చంద్రగుప్తుండు చెప్పెను.

వసంతుండు, తనకాపదరానై యున్నదని తెలిసినతోడనే వసుమతికొకలేఖయుం, జంద్రగుప్తున కొకజాబును, వ్రాసిపంపెను. ఆయుత్తరములంగొని తెచ్చిన పరిచారిక శచీభవనమునకువచ్చి యటనున్న పరిచారికకు వసుమతియుత్తరము నొసంగి, యతివేగముగ రెండవయుత్తరమును గొనిపోయి చంద్రగుప్తున కొసంగెను సుందరి వసుమతియుత్తరమును తనపరిచారికవలన నందుకొని మోహలేఖ యని భ్రమించినది. పాపము! వసుమతి సిగ్గుచే నాలేఖను చించివై చినదిగదా!

సుందరి యావృత్తాంతమంతయును చంద్రగుప్తునకు నివేదించెను విష్ణుగుప్తునిదుష్ప్రవర్తనమును, వసుమతిదుస్థితియును, గూడ నాతనికి విన్నవించెను.

చంద్రగుప్తుఁడు చాల జాలిపడియెను. "మీ కేమియును భయము లేదు. ముందు వసంతరక్షణమునకై ప్రయత్నింపవలసి యున్నది" అనియెను.

"అయ్యో! ఇప్పుడు వసంతునకుఁ గలిగిన యాపద యేమో తెలిసినదా?"

"రాజభటులాతని నాకస్మికముగఁ బట్టుకొన్న ట్లాతనియుత్తరము వలనఁ దెలియవచ్చినది. ఆతని కారాబద్ధునిఁ జేసియుందురు"

సుందరి యదరిపడియెను. అంతలో నించుక యాలోచించుకొనియెను. తనయొద్దనున్న యుంగరమును చంద్రగుప్తున కిచ్చెను.

చంద్రగుప్తుఁడు దాని నందుకొని యాశ్చర్యముతో "ఇదియెట్లు లభించెను?" అని యడిగెను.

సుందరి యావద్వృత్తాంతమును పూసగ్రుచ్చినట్లుగ వాక్రుచ్చెను. చంద్రగుప్తుఁడు సుందరిమనోదార్ఢ్యమునకును, దూరదృష్టికిని సాహసవర్తనమునకును, తనలో మిగుల మెచ్చుకొనియెను.

ఆతని కీసమయమునఁ దానిదివఱకుఁ జదువుచున్న "చాణక్య నీతి" యందలికొన్ని భాగములు జ్ఞప్తికి వచ్చినవి. ఆతఁ డేమియు నధైర్యమును వహింపలేదు. సుందరితో నింకేమియును ముచ్చటింపనులేదు. దిగ్గునఁ దనపీఠమునుండి లేచి తలపై నొకకుల్లాయి నిడుకొని చేతనొఱలోనున్న చంద్రహాసమును ధరించి యెక్కడకో బయలువెడలెను. సుందరిని దనతో రమ్మని సంజ్ఞచేసెను. సుందరి యాసంజ్ఞ నింతలో గ్రహించినది. ఆమహావీరుని జూచినతోడనే యానారీమణికి మరింత ధైర్యము హెచ్చయ్యెను. చంద్రగుప్తుఁడు ముందును, సుందరి వెనుక

నుగా, బయులు వెడలి పోవుచుండిరి. ఆతఁడు త్రోవ నెవ్వరితోడను మాటాడలేదు. ఆతనినిఁ బలుకరింప సాహసించినవా రెవ్వరును లేరు. చంద్రగుప్తుఁ డనిన సేవకులకును, ప్రజలకును గూడ నధిక గౌరవమును, భక్తియును, గలదు. ఆతని యందలి సుగుణముల చేతను, సౌమ్యవర్తనముల చేతను, ప్రజ లాతని దేవునిగ భావించుచుందురు. విశేషించి పద్మనందుని క్రూరస్వభావాదులుగూడఁ బ్రజల కీతని యందుఁ దృఢభక్తి విశ్వాసములను సమకూర్చినవి. చంద్రగుప్తుఁడు కత్యాంతరములు గడచిపోవుచుండెను. సుందరి వానివెనువెంటనే యరుగుచున్నది.

వారిరువురును పట్టణములోఁ బ్రవేశించి, రాజమార్గమునఁ గొంతదూరము నడచిరి. పురమంతయు నింకను జనసంకులముగనే యున్నది. చంద్రగుప్తుఁడు రాజమార్గమును విడిచి పురమునందుఁ బశ్చిమదిక్కుగ నున్న యొక వీథి వెంట నడవనారంభించెను. ఆవీథిని దాటి మఱియొక సందుమార్గమునఁ బడి నడచుచుండెను. ఆతఁ డతివేగముగఁ బోవుచుండెను. సుందరియును శ్రమయనక యాతనితోడనే నడచుచున్నది. ఆతఁ డెక్కడికిఁ బోవుచుండెనో, యెందుల కేగుచుండెనో, సుందరికి గోచరించినది కాదు. ఆమె మనసునం దనేకవిధములైన యోచనలు పుట్టినవి. ఒకదానికి నామె మనసున స్థిరవసతి దొరకినది కాదు. ఆమె యాలోచించుకొనుచునే యుండెను. నడచుచునే యుండెను. చంద్రగుప్తుని హృదయమునఁగూడ ననేక సంకల్పములు బయలుదేరినవి. వెంటనే వికల్పములై పోవుచున్నవి.

క్రమముగ వారిరువురును పట్టణపు జివరకుఁ బోయిరి. అందొక మామిడితోఁట యున్నది. దానిచుట్టును బలమైన ప్రాకారము కలదు. అందొక చో ద్వారము కాన్పించుచుండెను. ఆమార్గమున వారిరువురు నందుఁ బ్రవేశించి కొంతదూరము నడచిరి. వారి కొకకుటీరము దృగ్గోచర మైనది. సుందరి యేమి యాలోచించుకొనుటకును నవ

కాశములేదు. ఆమె హృదయము సంభ్రమించుచుండెను. చంద్రగుప్తుఁ డాకుటీరమున కీవల సుందరిని నిలిపి తాను లోపలికిఁ బోయెను. గడియసేపటివఱకును కుటీరద్వారము ప్రక్క సుందరి యట్లే నిలిచియుండెను. లోపలఁ జంద్రగుప్తుఁ డెవ్వరితోడనో మాట్లాడుచున్నట్టు లామె గ్రహించినది. ఆమె దృష్టులును, మనసును, నా కుటీరమువైపునకుఁ ఒరగలిడుచుండినను, నామె యచటనుండి కదలలేదు. బయలంతయు నంధకారముగా నుండెను. దట్టముగ నున్న చెట్లచేత నావనమున నంధకారము మఱింతదళమై కన్నును గన్నును గానరాకుండెను. కుటీరము లోని దీపపుఁగాంతులుమాత్రము తలుపుసందులోనుండి చిన్నిచిన్ని మెఱపుతీవలవలె నపరిభాగమున నందంతటను ప్రసరించుచున్నవి. అల్లనల్లన బయలువెడలుచున్న పిల్లవాయువులతాఁకునఁ జెట్లక్రింది యెండుటాకుల మర్మరధ్వనులు వినవచ్చుచుండెను. వనమంతయు జీబురుమనుచు భయంకరముగఁదోఁచుచుండుటచేసుందరిపలుమాఱుసద్దయినదిక్కులకు దృష్టి సారించుచుండెను. ఏమియును గానవచ్చుటలేదు.

"ఈతఁ డీకుటీరమున కేల వచ్చెను? ఇందెవ్వ రున్నారు? ఎవ్వనితో నీతఁ డింతసేపు మంతనము సేయుచున్నాఁడు? మాకష్టముల నీయుదారపురుషుఁడు నిర్వర్తించునా? నందునివలన నేమియుపద్రవము రానున్నదో" ఈ మొదలయిన యాలోచనలామెహృదయమున నొక్కసారిగఁ బ్రవేశించి సంకులసన్నాహము సేయుచుండుటచే నామె బాహ్యమును మఱచిపోయెను తానెచ్చట నిలిచియుండెనో యామె యెఱుంగదు.

ఇంతలోఁ గుటీరద్వారము తెఱవఁ బడియెను. ఆకుటీరమందలి దీపపుఁగాంతు లగ్రభాగమునఁ గొంతదూరము వఱకుఁ బ్రసరించుచుండెను. సుందరియొక్క నిమిష మావెలుతురువంక వీక్షించెను. కుటీరమును వెలువడిపోవుచున్న యొకపురుషాకార మామెకుఁ గనఁబడెను.

ఆతఁడు దాని ప్రక్కనే నిలువఁబడియున్న సుందరి నీక్షించి "లోపలి కేఁగుము" అని చెప్పి వడివడిగ నావనమును దాఁటి పోయెను.



## షదునెనిమిదవ ప్రకరణము.

సుందరి కుటీరమునఁ బ్రవేశించెను. అందొకమహాపురుషుఁడు వ్యాఘ్రాసనముపైఁ గూర్చుండి యుండెను. ఆతఁడు సాక్షాత్కరించిన సదాశివునివలెఁ దేజోమూర్తియై యుండెను. మాంసలమై, గుండ్రనగు నాతనికంఠమున రుద్రాక్షనక్షత్రమాలిక మొలచినట్లుండి నిగనిగ మెఱయుచుండెను. ఎడమభుజముపై నుండి వక్షస్థ్సలముక్రిందుగ దక్షిణపార్శ్వమునఁ గటిప్రదేశమున నంటును ప్రేలాడుచున్న మూఁడుపోచలుగల బ్రహ్మసూత్రమాతనిసన్నని కావియంగరకాలోనుండి వెండితీఁగవలెఁ బ్రకాశించుచుండెను. ఆతనిముఖమున బ్రహ్మతేజస్సు మూర్తీభవించి యున్నది.

చంద్రగుప్తుఁ డాతనియెదుటభయభక్తి వినయవినమితుఁడై యొక దర్భాసనమునఁ గూర్చుండియుండెను. క్రమక్రమముగ నాతనిముఖమండలము క్రోధఘూర్ణితమగుచుండెను. బొమలుముడివడియెను. కోపతీవ్రముచేఁగలిగినహృదయతాపమువలనమాటిమాటికిఁ గాలసర్పమువలె రోజుచు నేమేమో యాలోచించుచుండెను. బ్రహ్మతేజోనిధి యగునామహాపురుషునిముఖమండలమునఁగూడ నరుణకాంతులున్నవి. అవి స్వాభావికములో, కోపతీవ్రముచేఁ గలిగినవో, గ్రహించుటకు సుందరి కవకాశము

లేదు. స్వాభావికముగ సుందరీముఖములమెఱుఁగుజెక్కులఁ గెంపుజాయ లుండుట కలదు. ఆపురుషునిముఖకాంతు లట్టివికావు. అవి యాతని గంభీరహృదయమునఁగూడ నిముడక పైకిఁ బ్రజ్వలించుచున్న క్రోధానల కీలాజన్యములే కావచ్చును.

సుందరినిలోనికిఁ బిలువనాజ్ఞాపించినది మొద లాపురుషుఁ డేమో యాలోచించుచునే యుండెను. ఇప్పుడు నాతఁ డాధ్యానముననే యుండెను.సుందరి లోనికిఁ బోయి యూరక నిలువఁబడలేదు."ఈమహాపురుషుఁ డెవ్వఁడై యుండును?" అని తలంచెను. ఎదుట భయభక్తులతోఁ గూర్చుండియున్న చంద్రగుప్తుని చూచెను. చంద్రగుప్తునంతటివాఁ డీతని దర్శనముం గోరి వచ్చుటనుగూర్చి యాలోచించెను. ఈమహానుభావుఁ డసాధారణప్రజ్ఞాధురీణుఁడై యుండు నని భావించుకొనియెను. మిగుల భక్తిభావముతో నామహాత్మునకునమస్కరించినిలువఁబడియెను. పురుషుఁ డామెను గూర్చుండు మని సంజ్ఞ చేసెను. కాని,సుందరి యట్లేనిలువఁబడి యుండెను.

పురుషుఁడు తనమొగంబును బార్శ్వమునకు మలపి గంభీరస్వరంబున "వృషలా! విష్ణుగుప్తుఁ డెంతికృతఘ్నుఁడు! ప్రాణదానమొసఁగిన హంతునిప్రాణములనే తీయఁజూచుచున్నాఁడు" అనియెను.

సుందరికి గుండె జల్లుమనియెను. ఇంతవఱ కామె వసంతుని ప్రాణాపాయమునుగూర్చి శంకించుకొనినదైన నుండలేదు. ఆపురుషుని వాక్యము లామెకు భయంకరములుగఁ దోఁచెను.

అప్పుడు చంద్రగుప్తుఁడు "గురువర్యా! పామునకుఁ బాలుపోసి పెంచుటవలనఁ గలుగులాభము మరణముకంటె వేఱేమున్నది! విష్ణుగుప్తుఁడు యువరాజు; కామాంధుఁడు; ఏమిచేయఁజాలఁడు?" అనియెను.

పురుషుఁడు నిట్టూర్పు విడిచెను. సుందరివంకఁ జూచి "వసుమతి నీ కేమగును!" అనియెను.

ఆగంభీరాకారుని యెదుట మాటలాడుటకు సుందరికి జంకుగలి గెను. "ఆమె నాప్రాణమునకుఁ బ్రాణము" అని నెమ్మదిగా బదులు చెప్పెను.

"నీవామెను ప్రాణపదముగఁ బెంచుకొనుచున్నావా?"

"ఔను."

"మీరాజ్యమును, మిమ్మును సంరక్షించుచున్నట్టియు, భావి మగధరాజ్యచక్రవర్తి యగునట్టియు విష్ణుగుప్తున కావసుమతి నిచ్చి యేల పెండ్లిచేయఁగూడదు?"

సుందరికి భయము తోఁచెను. ఆపురుషునియుద్దేశ మామె కనుమానము గలిగించెను. "అయ్యా! మోహమునకు స్వాతంత్ర్యము లేదు. అది సమయానుకూలముగ మార్పు నొందఁజాలదు." అనియెను.

"వసుమతికి, మగధదేశరాజ్ఞీమణి యగుట కిష్టముండదా?"

"లేదు. ఆమెకు వసంతుఁడే రాజ్యము. వసంతుఁడే యామె ప్రాణము. ఆమెకు వసంతునికంటె మఱి ప్రపంచమే లేదు."

"ఆమె కేమి తెలియును? ఆమెకష్టసుఖముల నెఱింగిన వారు బోధించి యామె యభిప్రాయమును మార్చి విష్ణుగుప్తునిపై మఱలింప వచ్చును."

సుందరి కావాక్యము లతికష్టముగఁ దోఁచుచుండెను. అయ్యా! ఆమెజీవితము వసంతునిజీవితమం దున్నది. ఆమెహృదయము వసంతుని హృదయమం దున్నది. భగవానుఁ డగుకుసుమాయుధునిచేఁ గూర్పఁ బడిన దంపతుల నెవ్వ రెడఁబాపఁగలరు? నిరంకుశాధికారమును వహించిన విష్ణుగుప్తునికూరభావము వారిప్రాణములహరించిన హరింపఁగలదుగాని వారిహృదయాంతరాళముల నిండి నిబిడీకృతం బగు ననురాగ తేజో లేశము నైన హరింపఁజాలదు" అనియెను.

అనుసప్పటికిఁ జంద్రగుప్తుఁడు లయకాలానలునివలె మండిపడుచు "ఏమీ! నాప్రాణమిత్రుఁ డగువసంతుని కకారణముగ నపకృతిసేయ సాహసించినదురాత్ముఁడు—వివేకహీనుఁడు—మూఢుఁడు— మరల నాయెదుట నిలువఁబడఁగలఁడా? జీవింపఁగలఁడా? నాబారిం బడిన యాతని నొరుఁ డెవ్వఁడైన రక్షింపఁగలఁడా?" అని కోపాతిరేకమున నొడలెఱుంగక యొఱనుండి చంద్రహాసమును బెఱికికొని లేవఁబోయెను.

పురుషుఁ డాతని వారించి శాంతవచనములతో "వత్సా! కేవల క్రోధమాత్రమున లాభము లేదు కార్యాలోచనంబునకు శాంతమును, నిదానమును, గావలయును. మనకిప్పుడు బలవత్క్రోధము కలిగియున్నది. ఇప్పట్టునమనమూరక విజృంభించుటతగదు. అతిగూఢముగ మెలఁకువతో ధైర్యమును వహించి కఠినప్రయత్నమునఁ గార్యము సాధించుకొన వలయును. మనవిశాఖులునివలన వసంతునిదుస్థితియును, చక్రవర్తి దుర్ణయమును వింటిమిగదా! స్వతంత్రస్వతంత్రుఁడగు చక్రవర్తికూడ నీ యకార్యము నింతరహస్యముగ నెందులకుఁ జేయుచున్నాఁడో యెఱుఁగవా? రాజకార్యము లెల్లప్పుడు నొక్కరీతిగా సాగిరావు. రాజనీతులు బహువిధములైనవి. అవి సమయానుకూలముగ మారుచుండును. ఆదురాత్ములచేతులలోఁ జక్రవర్తిముద్రిక యున్నంతవఱకు మనకును, లోకమునకును, నెమ్మది యుండదు. చక్రవర్తి యగుపద్మనందుఁడు పరమ లుబ్ధుఁడు. ఆతనినందనుఁడు పరమమూర్ఖుఁడు. ఇట్టి వారిపరిపాలనమున నెన్ని యకార్యములు పుట్టవు! ఎందఱసత్పురుషులహృదయములు పరితపింపవు? ఎందఱుమానవతులజీవితములు చలింపవు?" అనియెను.

"మహాత్మా! ఇట్టిదారుణకర్మముల మన మూరక చూచుచుండ వలసినదేనా?"

"కాదు. ప్రతీకారము చేయవలసినదే. కోపతీవ్రముచేఁ దొందరపడక నిదానించి శాంతముతోఁ బనిచేయవలయును."

"ప్రాణములమీఁదికి వచ్చుచున్నప్పు డింకను, నుపాధ్యాయ చాణక్యునిహృదయము శాంతినిఁ నే గోరుచున్నదా?"

"తత్తఱపడకుము. మఱేమియును భయములేదు"

సుందరివీనుల కావాక్యములు సుధాసేచనము లయ్యెను. ఆమె చాణక్యునిలోకాతీతప్రభావమును వినియున్నది. వసుమతితండ్రియగు మానపాలున కామహాత్ముఁడు ప్రాణమిత్రుఁ డనికూడ నెఱుంగును. ఆ పురుషుఁడే చాణక్యుఁడని తెలిసినవెనుక నామెహృదయమున ధైర్యము నెలకొనియెను.

చంద్రగుప్తుఁ డాతురతతో "ఆర్యా! వసంతరక్షణమున కిప్పు డేమైన నుపాయ మున్నదా?" అనియెను.

"ఉన్నది" అని చాణక్యుఁడు సుందరివంకఁ జూచెను

సుందరి చాణక్యునిపాదములపైఁ దనచూపులు పఱగించుచు నిలువఁబడియెను.

అప్పుడు చాణక్యుఁడు "బిడ్డా! రత్నగిరిరాజ్యమునకును మీకును గలిగినదుస్థితినిగూర్చి చాలవిచారించుచుంటిని. వసుమతికి నీసాహాయ్య మంగరక్షయై యున్నందుల కెంతయు సంతసించితిని" అనియెను.

"మహాత్ము లగుమీహృదయము మాయెడ దయార్ద్రమై యున్నది. మాకష్టము లన్నియును దీరిపోఁగలవని ధైర్యము కలుగుచున్నది." అని సుందరి వినయముతోఁ బలికెను.

"యోధాగ్రేసరుఁ డగురాధాకృష్ణవర్మయే యున్నయెడల మానపాలునితనయ యిట్లు దిక్కుమాలి యుండదు. రత్నగిరిరాజ్యమున కిట్టిగతి కలుగదు. ఆరాధాకృష్ణవర్మ యేమయ్యెనో నీకేమైనఁ దెలిసినదా?" అని చాణక్యుఁడు ప్రశ్నించెను.

సుందరి యప్రగల్భయై యేమియు మాటాడ కూరకుండెను. ఆమె కాతనివృత్తాంత మేమియును తెలియదేమో?

చాణక్యుఁ డీక నావిషయమునుగూర్చి ప్రశంసింప లేదు. "పాపము! వసుమతి కెల్లవిధముల నీవే దిక్కుగాఁ గనఁబడుచున్నావు. అబలవగు నీవేమి చేయఁగలవు?" అనియెను.

"మహానుభావా! నేనబల నని సందేహింపకుఁడు. నా ప్రాణపద మైనవసుమతికిని, నాకుఁ బ్రాణ మగునసంతునకును, మేలుగూర్చుపట్టున నా ప్రాణములనైన విడుచుటకు సంసిద్ధముగ నున్నదానను. ఇప్పట్టున నన్నెట్టికార్యమున నియోగించినను నెఱవేర్చుటకు నాజీవితమును ధార వోసెదను"

"చంపఁదలంచుకొన్న శత్రువు నెదిరింపవలసినప్పుడు ప్రాణములపై నాసవదలుకొని పనిచేయవలయునుగాని తప్పించుకొనఁ జూచునప్పుడంతటి సాహస మక్కఱలేదు. ఇప్పట్టున ధైర్యమును లాఘవమును జూపి కార్యమును సాధించుకొనవలసియున్నది."

"ఆర్యు లాజ్ఞాపించినట్లే చేయుటకు సంసిద్ధముగ నున్నదానను.

"ఇది చాల రహస్యముగ జరగవలయును. పూవునందుఁ బరి మళమువలె నాఁడువారిహృదయమున రహస్యము దాఁగ దని సందే హము కలుగుచున్నది.

"ఆవిషయమున సంశయింపకుఁడు. వసుమతీసంరక్షణమునకై చిరకాలముక్రిందటనే నేను నాయబలాత్వమును వదలుకొంటిని. ఇప్పు డామెప్రాణమును గాపాడుటకయి పౌరుషమునుగూడ వహించెదను."

"శిడ్డా! నీవట్టిదానవే యగుదువు. ఒకవేళ మనరహస్యము బయలువడుట తటస్థించెనేని అప్పుడుమాత్రము చంపుటకును, జచ్చుట కును, తెగించి యుండవలయును."

"నే నందులకు ముందే సిద్ధపడి యున్నదానను"

"అట్లయిన నీకుఁ గొన్నిసంగతు లుపదేశింపవలసి యున్నది. రమ్ము" అని చాణక్యుఁడు వ్యాఘ్రాసనమునుండి లేచెను.

ఆకుటీరమునకు దుత్తరభాగమునం దొకయఱ యున్నది. అందుఁ జాణక్యునిదేవతార్చనపీఠమున్నది. చాణక్యుఁడును సుందరియు నాయఱలోఁ బ్రవేశించిరి.

ఆపీఠమున కిరువంకలను జాణక్యునిచే వ్రాయఁబడినతాళపత్రి గ్రంథములు లెక్కలేకుండ నున్నవి. అందాతఁడు కొన్ని స్వయముగా రచించినవి. పూర్వపు గ్రంథములు కొన్ని. రాజనీతిని బోధించు గ్రంథములే విస్తారముగా నున్నవి. ఆగ్రంథములయందలి సారాంశములను దనయనుభవముచే గ్రహించి "చాణక్యనీతి" యను నొక గ్రంథము నాతఁడు రచించెను. అది యీదేవతార్చన పీఠముపై నున్నది. ఆగ్రంథ మంతయును జంద్రగుప్తుఁడు కంఠపాఠము చేసినదే. ఆతఁడెప్పుడు నదే చూచుచుండును. వసంతుఁడు చదువు మానునప్పటి కది సగముమాత్రమే వ్రచియింపఁబడినది. ఆతఁ డంతవఱకే చదివియున్నాఁడు. ఆపీఠమున కెదురుగ సమీపమున రెండుగజములచతురము గల రాతి కట్టడముపైఁ గృష్ణాజినములు పఱుపఁబడి యుండెను ఎంతప్రేమాస్పదులైన నాతనియానతిలేనిదే యీయఱలోనికిఁ బోఁ గూడదు. ఆకారణమున నే చంద్రగుప్తుఁ డిప్పుడచ్చటికిఁ బోలేదు. చాణక్యుఁ డన్ని విద్యలయందుఁ బరిపూర్ణుఁడే. అం దభిమానవిద్య నీతిశాస్త్రము. ఆతనికి మంత్రశాస్త్రమునందుఁ గూడ నిట్టియభిమానమే కలదని కొంద ఱందురు. ఆతనికి నిలువెల్లమాయయే యనువారుఁగూడఁ గొలఁదిమంది యున్నారు. కావచ్చును. ఆతఁ డెప్పుడు నొక్కరీతిగా నుండఁడు. ఒక్కచోట నివసింపఁడు. కొందఱకుఁ గేవలము క్రూరస్వభావుఁడుగను, మఱికొందఱకుఁ

కేవలదయాస్వరూపుఁడుగను, దోఁచుచుండును. ఎట్లైనను నాతఁడు సర్వ సముఁడు కాఁడు. ఆతనికిఁగూడ గర్భశత్రువులు కొందఱున్నారు. ఆతని శిష్యులకు లెక్కయే లేదు. వారు సామాన్యులు కారు అయినను వారందఱు నిప్పు డాతనికి శుశ్రూష చేయుచుండుట లేదు. వారివారి పనులలో వారున్నారు శత్రుపక్షమునఁబని సేయుచున్నను, చాణక్యునిశిష్యు లెప్పుడు నాతనికి విధేయులే. ఇది యాతని దయాప్రభావమో, మంత్ర ప్రభావమో, మాయాప్రభావమో, మనకుఁ దెలియదు.

సుందరి నిప్పు డాయఱలోని కేలతీసికొనిపోయెనో, యేమిబోధించెనో, యెవ్వరికిని దెలియ లేదు. చాణక్యునిరహస్యము సముద్రము లోని బడబానలమువంటిది. అది యెన్నఁడును బయలఁబడినట్లు వినియుండ లేదు. అట్లగుటయే తటస్థించెనేని జగత్ప్రళయము కావలసినదే.

కొంతసేపటికిఁ జాణక్యుఁ డొక్కఁడు నాయఱనుండి యీవలకు వచ్చెను. సుందరి యేమైనది? ఆతనితో నీవిషయమునుగూర్చి ప్రశ్నించువా రెవ్వరు? ఆతఁడు ప్రస్తావింపనివిషయమునుగూర్చి యడుగుటకుఁ జంద్రగుప్తునంతటివాఁడుగూడ సాహసింపలేకపోయెను. ఆతని మొగంబున దృష్టినిల్పి చూచుచు నిలువంబడియెను.

"కుమారా ! నృపలా ! ఇఁక మనపని మిగిలియున్నది." అని చాణక్యుఁడు హెచ్చరించెను

"ఇప్పు డేమిచేయవలయును? చంద్రహాసద్వితీయుఁడనై సిద్ధముగా నున్నాఁడను."

కుమారా! సయుక్తికముగఁ దీర్పవలసినకార్యములకు శస్త్రము లక్కఱలేదు"

"ఆర్యు లాజ్ఞాపించినట్లే"

"రమ్ము. ఇంకను మనకుఁ జాలపను లున్నవి".

అప్పుడాయిరువురును గుటీరముతలుపులు మూసికొని యానిశా సమయమునఁ బురాభిముఖులై యెట కేనిం బోయిరి.

తలుపులుతీసినప్పుడు, గాలిచే లోపలనున్న దీప మాఱిపోయెను. పాపము! సుందరి వసుమతిక్షాఱ కాయర్ధరాత్రమునఁ జీఁకట్లోని యానతి శిరసావహించి అంధకారబంధుర మగు నాకుటీరమున నొంటిగఁ గలచి యుండుటకు సహించి యున్నదికాఁబోలును!

---

## పం దొ మ్మి ద వ ప్ర క ర ణ ము.

---

ఆకృష్ణపక్షమునందలియర్ధరాత్రమున శ్వేతారుణవర్ణమిశ్రితంబు లగు నస్పష్టచంద్రికలు పాటలీపురభవనంబులకు వింతమెఱుఁగుల నిచ్చుచుండెను. చంద్రకాంతమణిసౌధములపై బట్టబైటఁ గుసుమశయనంబుల మయిమఱచి నిదురించుయువతీమణులమెఱుఁగు లేఁజెక్కిళ్లకును, నాయరచందమామమొదలినిగ్గులకును, దారతమ్యముఁ గనుఁగొనవలసినదే. అయినను మన కిప్పుడు చందమామయందమును, కౌముదీవిలాసమును, వర్ణించుచుండుటకుఁ దీఱిక లేదు. రాత్రి ద్వితీయయామాంతమునఁ దోఁచుక్షీణచంద్రకాంతివిలాసములఁ జూచుట కెవ్వరు కని పట్టుకొని యుండఁగలరు? విచారమున మునుంగియున్నవారును, శాసనబద్ధులయినరక్షకభటులును, విరహులును, మొదలగు నస్వతంత్రులుదక్క మఱి యెవ్వరానిశీథసమయమున మేల్కొనుగ నిద్రింప కుందురు? కారా

గృహారక్షకుల కప్పుడే రెండువంతులు గడచినవి. ఇప్పుడు మూఁడవవంతు జరగుచున్నది. పాప మాకారాగారమున నొకపురుషుఁడు తలవంచుకొని విచారించుచుండెను. ఆద్వారమునందలి యినుపయూఁచలనడుమనుండి చంద్రకిరణము లాతనిపైఁ బడుచుండెను. ఆవెన్నెలవెలుతురున నాతఁ డెవ్వఁడో మీరానవాలుపట్టి చెప్పలేరు. ఆతని నిదివఱకు మీ రొకటి రెండుసారులు చూచియున్నారు. కాని, యిప్పు డతఁడు మీరు చూచి నప్పటియాకారముతో లేఁడు. ఆవిశాలవక్షస్థ్సలంబును, నాకోమలదీర్ఘ బాహుదండంబులును, కంచుకాలంకృతంబులై యుంటలేదు. ఆనగు మొగంబున గభీరమందహాసకాంతులు స్ఫురించుటలేదు.ఆయుత్తమాంగ మున నుష్ణీష మలంకరింపఁబడియుండలేదు. అసంస్కృతంబులగు విశాల కుంతలములు ముడిసడలి చెదరి యొడలిపైఁ గప్పుకొని యున్నవి. కోప తీవ్రతవలనను, హృదయావేగమువలనను, నాతనిముఖమండల ముదయ కాలారుణమండలమువలె నెఱ్ఱనై యుండెను. ఆతనికి నిద్రాదేవత యెడమై పోయినది. అదృష్టదేవత యేమైపోయినదో యాతఁ డెఱుఁగఁడు.

ఆతఁడు సిన్నటియుదయమువఱకును నున్నతోద్యోగి యగు రాజబంధుఁడు. ఇప్పుడో కారాబద్ధుఁడగురాజద్రోహి. పాపమాతఁడు వసంతుఁడే.

"ఔరా; ధననందునిపరిపాలన మెంతనిరంకుశముగ నున్నది? అకారణముగ సాధువుల బాధించునాతనిప్రభుత్వ మెంతకాలము నిలువఁ గలదు? ఆతని కెన్నఁడు నేను కలనైన నపకారము చేసి యెఱుఁగనే. క్రూరులకోపమునకుఁ గారణ మేమిలకు? ఆతనికి నేను జ్ఞాతివర్గములోని వాఁడనుగదా! అదియే కారణ మైయుండవచ్చును. ప్రాణాధికప్రియుం డగునందనుని ప్రాణములం గాపాడినమహోపకారి కిదియా ప్రత్యుప కారము? ఛీ! కృతఘ్నులకు ధర్మము లతోఁ బనియేమి? పాపము! పులియింటఁ

బడినకురంగాంగనవలె నావసుమతి యీరాక్షసహాతకులచేతులఁ బడి యేమి కానున్నదోగదా! ఆలావణ్యరాశి నన్ను మనసారఁ బ్రేమించి యున్నట్లు నాహృదయమే చెప్పుచున్నది. నాఁడామహావనంబున సుందరి వెనుకనుండి నాపైఁ బ్రసరించినదయారస శీతలంబులును, విమోహ నిశితంబులును, నపాంగప్రదర్శితంబులును, నగువలపుచూపు లిప్పటికిని నాహృదయమున నాటుకొనియే యున్నవి. కుశలప్రశ్నావసరంబున మోహసూచకంబు లగునామె విలాసచేష్ట లిప్పుడును నాకన్నులయెదు టనే కనఁబడుచున్నవి. శచీభవనమున నేను దర్శింపఁబోయిననాఁడు నా ముద్రికామూలమున నానామమును గ్రహించి వెలుగుపడినదియుఁబోలె, చూచుచుఁ దనప్రేమైక కటాక్షంబుల నాపైఁ బఱఁగించి నన్నాదరించుట నే నెఱుంగనా? అది మఱవఁగలనా? ఆకుసుమకోమలి జగన్మోహనాకారము నాహృదయఫలకమున లిఖింపఁబడియే యున్నది. సెలవుఁ దీసికొను పట్టున "అయ్యా! తఱచు మీదర్శనముకంటె మాకింకఁ గోరఁదగినదే మున్నది? అని వచించిన సుందరి పలుకులలో నెంతయర్థమున్నది? ఇఁక మరల నాకాసుందరీముఖల దర్శించుభాగ్యము లభించునా? ఓమోహ నాంగీ! ప్రాణప్రియా! వసుమతీ! సుకుమారహృదయ వగునీవీ దుర దృష్టవంతు నేల కామించితివి? ధనలుబ్ధుఁడును, దురాశాపీడితుఁడును, నసూయాపరుండు నగుధననందుని కితఁడు జ్ఞాతివర్గములోనివాఁ డని యెఱుంగవా? ఆతని కుద్యోగినై యున్నవాఁడ నని యైన నెఱుంగవా? పుట్ట లోఁ గాపురము సేయువానికి నెమ్మది యెక్కడిది? అయ్యో! ప్రాణే శ్వరీ! ఈయర్థాయుష్మంతునికొఱకు నీచిరజీవితము నేల ధారవోయఁ దలంచితివి? నేను మిమ్ముసందర్శించి వెడలిపోవుచుండఁగా నగపడు నంతవఱకు జాలక మార్గములనుండి తొంగితొంగిచూచుచుంటివానవు. అట్టినీవు మరల నాదర్శనమును స్వప్నమునం జేయుచుందువా? ఇనీ

నేనెంతటి కృతఘ్నుఁడను. అమూల్యధనంబగు హృదయమును నా కొఱకు సంపూర్ణముగ నొసంగిన నిన్నెంతనిర్దయురాలినిగాఁ జూచుచున్నాఁడను? నావియోగము సహింపనినీకు నిద్ర యెట్లువచ్చును?— హా! జీవితేశ్వరీ! వినన్నుఁడ నగునాచే నిదివఱకుఁ బంపఁబడిన లేఖయు నీకు యమలేఖ కాలేదుగద! సుందరి యెదుట నుండగాఁ గ్రేఁగఁటిచూపైన నాపైఁ బ్రసరించుటకు సిగ్గుపడుచుండునీవు దాసిచేఁ బంపబడిననాలేఖ నెట్లు చదువఁగలవు? అయ్యో! చదువకున్న నత్యావశ్యకంబు లగునందలివిషయము లెట్లు తెలియును? నీకొఱకు వ్రాయఁబడినలేఖను సుందరి చదువుట కంగీకరింపదే! సుకుమారహృదయ వగు నీ వాలేఖను జదివి ప్రాణములు విడిచినను, సిగ్గుచేఁ జదువక లేఖను విడిచినను, నాప్రాణములు విడువవలసియేయున్నది. ప్రియా! నాకొఱకు విచారింపకు మని నీకెవ్వరిచే వార్త నంపను? హృదయేశ్వరీ! ఏమియు నక్కఱలేదు. మనయిరువురిహృదయములు నేకీభవించియున్నవి. ఇరువురి జీవితములు నేకీభవించియున్నవి. ఇరువురికష్టములు నేకీభవించినో యున్నవి. ప్రాణప్రియుల మగు మన మిరువురము నొకరికష్టముల నొకరుచూడకుండ వియోగముచే నీలోకమును విడిచినను, ఒకరిసుఖ మొకరిని విడువకుండ సంయోగముచే నీలోకమును మఱచినను, సమానమేయని నిశ్చయించుకొని భవిష్యన్మరణమునకు సంసిద్ధుఁడనై యున్నాఁడను—ప్రాణేశ్వరీ! ఇది యెట్లు? నాకష్టములు మరణముతోఁ దీరగలవు. దురాత్ముల చేతిలోఁ బడినయబలవగు నీకు మరణమునకైనను స్వాతంత్ర్యము లేదే ఈరహస్యములు తెపటివఱకు దాఁగిన దాఁగవచ్చునుగాని యింక నెంతకాలము దాఁగును? పాపము బ్రద్దలుకాక మానదు. ప్రాణమిత్రుం డగు చంద్రగుప్తుఁ డసాధారణుఁడు. ఆతఁడు రాజు గాక పోయినను, నాతనిపలుకు లీరాజ్యమున వేదవాక్యములుగాఁ బరిగణింపఁ

బడుచున్నవి. ఆతఁ డీరాజ్యమునకుఁ గిరీటములేని సార్వభౌముఁడు. ముద్రికలేని శాసకుఁడు. అఘటనఘటనాసమర్థుఁ డగు చాణక్యగురుని ప్రజ్ఞ యద్వితీయము. అట్టిమహాత్ముని శిష్యుఁడనై, యట్టిచంద్రగుప్తుని మిత్రుఁడనై, యుత్తమక్షత్రియవంశజుఁడనై, పౌరుషవంతుఁడనై యున్న నేనుకాలవశంబునఁ గొయ్యబొమ్మవలె నీకారాగృహంబున దొరలాడుచున్నాఁడఁ గదా! హా! కాలమా! నీవెంతకుఁజాలవు" అని, యీరీతిగ నాతఁడు పరితపించుచుండెను.

పాప మాయర్థరాత్రమునఁ గష్టములలో నున్నయాతని నెవ్వరు పలుకరింతురు? ఎవ్వ రాతని కాలోచనములఁ జెప్పుదురు? కాలము గడచి పోవుచున్నది అది యెప్పుడు నొక్కరీతిగనే నడచుచుండును కాని, కష్టములలో నది కదలుచున్నట్లే యుండదు. సుఖానుభవసమయమునఁ గాలము పరుగెత్తుచున్నట్లుండును. వసంతున కిప్పుడు నిముసములు యుగములుగఁ గడచుచున్నవి చంద్రుఁ డప్పు డాకాశగోళమున నాలవ భాగమునందుండి వెలుంగుచుండెను. మృదుకవెన్నెలలు నిరాఘాటముగఁ గారాగారమునఁ బ్రవేశించుచుండెను. ఆవెన్నెల వెలుతురున వాఁడియున్న వసంతునిముఖకమలము విస్పష్టముగ నగపడుచుండెను. రక్షకభటుని చేతిచంద్రహాసమునఁ జంద్రకిరణములు తప్తరజతప్రభల నీనుచుండెను.

వసంతునికన్నులు మూఁతపడలేదు. కాని, బాహ్యప్రపంచమును మాత్రము చూచుటలేదు ఆతనిదృష్టులు భావనాప్రపంచమునఁ బ్రసరించుచున్నవి. అందుఁ బాటలీపురము లేదు. కారాగృహమును లేదు. అది యుద్ధరంగము. వసంతుఁడు రథముపైఁ గూర్చుండియుండెను. నొగపై వసుమతి కూర్చుండి గుఱ్ఱముల నడపుచుండెను. ఆతని రథపార్శ్వమునఁ జంద్రగుప్తునిరథ మున్నది. వసంతుఁడు విష్ణుగుప్తునితో హోరాహోరిగఁ బోరాడుచుండెను. ఇంతలో నాతనికి పద్మనందుఁ

డద్దము వచ్చెను. వసంతుఁ డాతనితలఁ దెగనఱకుటకుసిద్ధముగ నుండెను. "ఎవరువారు" అను నొకధ్వని యాతనిబాహ్యశ్రవణములఁ బ్రవేశించెను. ఆతనిభావన లన్నియును జెదరిపోయినవి. అప్పుడువసంతుఁడు కారాగారముననున్న తన్నుఁదాను చూచుకొనియెను. అదరిపడియెను.

ఆతనిహృదయభావములకంతరాయముఁ గలిగించినవాఁడు కారాగారరక్షకభటుఁడే. ఎవ్వరో యటకు వచ్చుచున్నట్లువాఁడు కనిపెట్టి యట్లు ప్రశ్నించెను. ఆతని కేమియును బ్రత్యుత్తరము రాలేదు. ఒక్కింత సేపున కచ్చటికి మేలిముసుఁగు నైచుకొన్న యొకయువతీమణి వచ్చి నిలిచెను.

"నీ వెవ్వతెవు? ఇచ్చటి కీరాత్రిసమయమున నేలవచ్చితివి?" అని రక్షకభటుఁడు ప్రశ్నించెను.

"నేను వసంతునిబందుగురాలను, ఈతనితో నొక్కమాటాడి పోవలయు నని వచ్చితిని" అని యాతరుణి బదులు చెప్పెను.

వసంతుఁ డాకంఠధ్వని నాలకించెను. ఆతని కది చాతకమునకు జలదగర్జనమువలెనే యుండెను.

"వలనుపడదు. రాజాజ్ఞ లేనిదే కారాబద్ధునితో మాటాడఁ గూడదు. పొమ్ము. పాపము, నీవాఁడుదానవుగాన నూరకుంటిని. ఇటకుఁ బరు లెవ్వరు వచ్చినను, తల నఱకివైచుటకు మాకు రాజాజ్ఞయైనది" అని భటుఁడు కఠినముగఁ జెప్పెను

"మరణదండమునకు సిద్ధముగనున్న మావసంతునితోఁ గడసారి యొక్కమాటాడి పోవుటకు నాకు రాజాజ్ఞయైనది."

"ఆయుత్తరవు నీయొద్ద నున్నదా" ఏది?"

ఆయబల యొకయుంగరము నాతనికిఁ జూపించెను. భటుఁడు దాని నందికొని వెన్నెలవెలుతురునఁ జూచి కన్నుల కద్దుకొనియెను.

భటుఁడా యుంగరము మరల నామె కిచ్చివైచి "అమ్మా! మాది సేవక జీవనము. రాజాజ్ఞ ననుసరించి యెంతకాఠిన్యమునైన వహింపవలసి యుండును. ఇదియును రాజాజ్ఞయే కదా! నీవు పోయి మాటాడ వచ్చును" అనియెను.

"నాయనా! నీవు చాల మంచివాఁడవు. న్యాయమార్గము నవలంబించి నాకు మావసంతుని కడసారిసందర్శనమును లభింపఁజేసితివి. సంతోషపూర్వకముగ నేనొసంగుచున్న యీతృణమును గ్రహింపుము" అనికొన్ని సువర్ణనిష్కములు నాతని కొసంగెను. ఆతఁడానందముతో వాని నందుకొని కొంచెము తొలఁగియుండెను.

ఆస్త్రీ కారాగారద్వారము నొద్దకుఁ జనియెను. ఇనుపయూఁచల నడుమనుండి వెన్నెలవెలుఁగున వసంతునిఁ జూచెను. ఆతఁడప్పుడు నిలువఁబడి యుండెను. ఆస్త్రీ నాతఁడానవాలుపట్టెను. ఆమె సుందరియే.

దీనాననుఁడై యున్న వసంతునిఁ జూచి సుందరి నిర్విణ్ణయై యేమియు మాటాడలేకపోయెను. వసంతుఁడేమో మాటాడఁదలఁచెను గాని దుఃఖవేగమున నాతఁడు నోరెత్తలేకపోయెను. ఒక్కింతసే పిరువురును స్థాణువులవలె నుండిరి.

వసంతుఁడు గద్గదస్వరముతో "వసుమతి సేమముగ నున్నదా?" అని ప్రశ్నించెను.

"ఇంతవఱకు జీవములతో నున్నది?"

"కడసారి నేనంపినయుత్తరమును జదువుకొన్నదా?"

వసంతుఁడు రక్షణవిషయమే కాకుండ వసుమతికిఁ దనహృదయమును వెల్లడించుటకుఁగూడ నామె కా యుత్తరము వ్రాసియుండును. పాపమామె చదువుకొనలేదని యాతని కెట్లు తెలియును? సుందరి యాయుత్తరమును గూర్చి యేమియును చెప్పఁ దలఁచుకొనలేదు.

"అంతయును దెలిసినది జరిగినదానికయి విచారించుటవలన లాభము లేదు. రాఁబోవుదానినిగూర్చి యాలోచించుకొనవలయును." అనియెను.

"నాకేమియును విచారము లేదు. నాప్రాణప్రియ యగు వసుమతికిఁ జంద్రగుప్తరక్షణము దొరకిన దనుసంగతి వినువఱకును నా హృదయము తహతహ నొందుచున్నది."

"వసుమతి నెవ్వరు రక్షింపఁగలరు? వసంతుఁడే రక్షింపవలయును"

వసంతుని నేత్రములు బాష్పపూరితము లయ్యెను. ఒక్కనిట్టూర్పు విడిచి "సుందరీ! అది యెట్లు పొసంగును?" అనియెను.

"అధైర్యము వలదు. ఎప్పుడును చీఁకటిరాత్రులే యుండునా?"

"వసంతునకు వెన్నెలయైనను చీఁకటియైనను నీయొక్కరాత్రియే కదా."

"అమంగళము శాంతించుఁగాక"

"అయ్యో! ఇంకను శుభోదయమునకే యాసించుచున్నావా?"

"ఆశయే కాదు త్రేపటియుదయమె శుభోదయము కాఁగలదు" అని మెల్లఁగఁ బలికెను.

"అది యెట్లు?"

సుందరి యాతని చెవిలో నేమేమియో చాలసేపు ముచ్చటించెను. క్రమక్రమముగ నాపలుకులు వినుచున్నకొలఁది వసంతునిముఖము వికసించుచుండెను. సుందరి యెల్లవిషయములు నాతనికి నివేదించి యాతనియొద్ద సెలవుఁ గైకొని వచ్చినదారినే వెడలిపోయెను.

---

## ఇరువదియవ ప్రకరణము.



ప్రభాత మగుచున్నది. ప్రభాతవృత్తాంతమును వ్రాయ మాచేయి యాడుట లేదు. ఆప్రభాత మెవ్వరి కుత్సాహజనకముగ నుండును? ఆ మందమలయానిలము లెవ్వరియొడలికి హాయిగ సోఁకుచుండును? ఆపక్షుల కలకలారావము లెవ్వరివీనులకు విందుగ వినఁబడుచుండును? ఆ తేజో మూర్తియరుణకాంతులు తమకనుదమ్ముల విప్పి యెవరానందముతో నాలోకింపఁగలుగుదురు? ఆయినునియభ్యుదయమున కెవ్వరు ప్రమోద వార్ధిలో నోలలాడఁగలుగుదురు? ఎవ్వ రాశయనాగారములనుండి లేచి లోకయాత్ర సేయఁ బ్రయాణోన్ముఖు లగుచుందురు? ఆమనోహరో ద్యానకుసుమామోదము లెవ్వరుఘ్రాణేంద్రియములు తనివిదీర గ్రహింప గలుగుదురు? ఆపద్మసరస్సుల నెవ్వరు తిలకింతురు? ఆవికచారవింద సంచారసమ్మదములగు షట్పదములసంగీతము లెవ్వరు విందురు? ఆపల్లవరాగమునకును ప్రభాతకాంతులకును భేద మెవ్వరు కనిపెట్టు దురు? ఆయైక్యభావము నెవ్వరు గ్రహింతురు? వసంతునివృత్తాంత మెఱుంగనివారి కివి యన్నియు గోచరించును. వారాలోకింతురు. వారా మోదింతురు. అలజడినొందుచున్న మనముల కివియెవ్వియుఁ గనఁబడవు. మనకు నీవిశోకఁ బనియును లేదు. పాప మావసంతుఁడు వధ్యస్థానము నకుఁ దిసికొనిపోఁబడుచున్నాఁడు. అక్కడికిఁ బోవుదము రండు.

నాఁడు మహావనమున శాలికాముఖపద్మ వీక్షణమున వ్యాకోచ భావము నొందియున్న వసంతునివప్పు మొగమేనా యిది? సరోవరమును బాసి వాఁడియున్నపద్మమువలెఁ గళావిహీనమై యిట్లున్న దేమి? నాఁడు పుంఖానుపుంఖములుగ యోధరక్షణమునకై యలుగులను విడిచిన

వసంతుని దీర్ఘబాహుశాఖలేనా యివి? శృంఖలాబద్ధములై యిట్లున్న వేమి? నాఁడు శచీసౌధమున ముద్రిక నిచ్చి నెపమునఁ దనపేరుప్రకాశము చేసినవసంతుఁడేనాయితఁడు? అప్రగల్భుఁడై యిట్లునడచుచున్నాఁడేమి! ఆహేతువులు మనకుఁ దెలియవు. ఆతఁడు వధ్యస్థానమునకుఁ గొనిపోఁబడుచున్నాఁడు. ఆతనిచేతుల కినుపసంకెలలు తగుల్పఁబడి యున్నవి. ఇరుపార్శ్వములను వెనుకను ముందును విచ్చుకత్తులతో నున్న తలవరులు నడచుచుండిరి.

వారు నలువురుమాత్రమే యుండిరి. ముందొకయుత్తమాశ్వముపై నొకపురుషుఁడు ఖడ్గహస్తుఁడై యతి భయంకరాకారముతోఁ బోవుచుండెను. ఆతఁడెవ్వఁడై యుండునని చదువరులు శంకింపనక్కఱలేదు. ఆతఁడు యువరాజగు విష్ణుగుప్తుఁడు. మహారాజాజ్ఞ సంపూర్ణముగ నెఱవేర్చుటకయి యాతఁడు సంసిద్ధుఁడై వచ్చెను. వారందఱును వధ్యస్థానమును బ్రవేశించిరి. ఆస్థానమునకు నలుతట్టుల నాకసముతో నొఱయుచున్న మహావృక్షములు విస్తారముగా నుండెను. ఆచెట్లతోపు నడుమ నధ్యశిలయున్నది. విష్ణుగుప్తుఁడు గుఱ్ఱమును దిగెను. రాజాజ్ఞను వసంతునకుఁ జదివి వినిపించెను. ఆతనిశిరఃఖండనము చేయుటకయి తలవరుల కాజ్ఞ నిచ్చెను నీయిష్టదేవతాప్రార్థనముఁ గావించుకొమ్మని వసంతుని హెచ్చరించెను. వసంతుఁ డిప్పుడేమని యుత్తర మిచ్చెను? ఆతఁడుభగవద్ధ్యానములో మగ్నుఁడయ్యెనో,యాలోచనాధీనుఁడయ్యెనో, మనము చెప్పలేము. ఒక్కనిమిషము కన్నులు మూసికొనియెను "ధ్యాన మైనదా?" యని విష్ణుగుప్తుఁడు తొందరపెట్టుచుండెను. ఏ కారణముననో సంకెలలు విప్పుటకుమాత్ర మాజ్ఞ నిడలేదు. తలవరులు తమతమకత్తులపదనును సరిచూచుకొనుచు సవరించుకొనుచుండిరి. ఆకత్తులమెఱపులు మృత్యుదేవతాకటాక్షము లని కన్నులు తెఱచిన వసంతుఁడు గ్రహించెను. మృత్యుదేవతకు నేఁడు తనపై సంపూర్ణాధికార

వచ్చిన దని యాతఁడు తెలిసికొనియెను. ఈయపమృత్యు దోషము తాననుభవింపవలసిన దేనా యని యాతఁడు తలపోసి చూచెను. ఇంతలో మృత్యుంజయుఁ డాతనితలపులో నిల్చెను. ఆర్యచాణక్యుఁడు నదేవిధముగఁ గనఁబడియెను. ఆశివునిజటాజూటమునఁ జంద్రుఁ డున్నాఁడు. ఆతఁడు బాలచంద్రుఁడు. చాణక్యునిజటాజూటమునఁ జంద్రుఁడు కానవచ్చుచుండెను. కాని, యీతఁడు సంపూర్ణకళలచే విరాజిల్లుచుండెను. వానినాతఁడు స్మరింపసాగెను. ఆస్మరణచేనాతని కెక్కడలేనిధైర్యమును వచ్చెను. మృత్యువును దిరస్కరించు గంభీరవాక్యములతో నాతఁడు విష్ణుగుప్తుని జూచి.

"మహారాజు నానేరమును బ్రకటించెనా?" అని యడిగెను.

"అది మేము వినలేదు."

"ఆజ్ఞాపత్రమునం దపరాధము నిర్దేశింపఁబడినదా?"

"లేదు"

"నేరమును బ్రకటింపకుండ దండనమును విధించుట రాజధర్మమగునా?"

"నీనేరమును గూర్చి మహారాజె యెఱుంగును. ఆయన యెఱిఁగి యుండి విధించినయీదండనము ధర్మానుమత మనియే నాయభిప్రాయము."

"నానేరమును విచారణసేయలేదు. దానిని నిర్ధారణ మెట్లు చేసెను?"

"దానినిగూర్చి నీతో ముచ్చటింపవలసినపని లేదు. నీవు ద్రోహివి. అందులకుఁ దగినశిక్ష ననుభవించుటకై సిద్ధముగ నుండుము."

ఈముష్కరప్రలాపములు వసంతునకుఁ గోపోద్రేకమును గలిగించినవి. ఆతని మొగ మెఱ్ఱవడియెను. కన్నుల నగ్నికణములు రాలుచుండెను. చేతులు పని సేయఁబోయినవిగాని శృంఖలాబద్ధములై యుండు

టచే వానికి స్వేచ్ఛ కలిగినదికాదు. ఆతఁడు గంభీరస్వరముతో నిట్లని చెప్పఁదొడంగెను—

"మీ రిచ్చట కాకపోయినను యమునియొద్దనైన దీనికిఁ దగిన సమాధానము చెప్పి తీరవలయును. ఎవ్వరి ద్రోహకృత్యములును నచ్చట బట్టబయలు కాకమానవు. జీవులకుఁ దగిన శిక్ష విధించున్యాయా న్యాయదక్షుఁ డాతఁడుగాని నీవును, నీతండ్రియును గారు మనమందఱ మాతనియొద్దకుఁ బోవలసినవారమే. నీవిప్పుడు నన్నేమో చేయుదు వనుభయము నాకావంతయును లేదు. నేననుభవింపవలసినదాని కెప్పుడును సిద్ధముగనే యున్నాఁడను. కాని, రేపు, నీవును నీతండ్రియునుగూడ నావలెనే మృత్యుదేవతకు సన్నిహితబాధువు లైనప్పుడు, నావలెనే వధ్యశిలను గనులఁ జూచునపుడు, నావలెనే మీమీనేరములను గూర్చి మీకు వినఁబడకుండ నున్నపుడు, మీరెట్టివిచారమునకు లోనగుదురో యోచించుకొనుము. అప్పుడు నీవుసమాధానమే చెప్పించుకొనఁ దలఁచెదవేని నాకీసమాధానమును జెప్పి నన్ను వధింపుము. బోనులోనున్న సింగమును వధింపనేవచ్చును. దానివలన గీర్తి రానేరదు. అంతమాత్రమున క్షాత్రమునిలువఁబోదు. పురుషత్వము రాదు. ఐశ్వర్య మనంతమైనదికాదు. సామ్రాజ్యము నిత్యముకాఁబోదు. లోకమున నెట్టివేవియును నిలిచిపోవు ధర్మాధర్మములు రెండే నిలిచిపోవుచున్నవి. దుర్మార్గచింతనము గలవారలకు ధర్మమునందు రుచియుండునని యెవ్వరు చెప్ప సాహసింతురు? వారుసుకృతములకై చూతురని యెవ్వరు నిర్ధారణము చేయఁజూతురు? మన యొక్కర ముప్పొంగిన ప్రయోజనము లేదు. మన మహారాజపదవి శాశ్వతమైనదికాదు. తాడిచెట్టు తాను భూలోకకల్పవృక్షము నని మిన్నంటుచున్నది. దాని నాశ్రయించినవారలు బ్రహ్మానందమునే పొందుచున్నా మనుకొనుచున్నారు. కాని, వానియందలి మంచిచెడ్డలు చెప్పుటకు వానికధికారము లేదు. లోక మున్నది.

సజ్జనలోకముచేఁ గొనియాడఁబడినవారిజన్మము యుత్తమమైనది. అది చూచుకొనవలయును. ఈమిన్నంది మిడిసిపడుటలో లాభము లేదు. లాభము లేదు. న్యాయమును జూడవలయును. సత్యమును గ్రహింపవలయును. ధర్మమును విడిచి నడవరాదు. ఈనడతలు, నీముష్కరవాక్యములు, నీశాసనములు, నీయధికారములు, నిదండనములు, నీదుష్కార్యవిజయములు, నిపాపచింతనములుఁ బ్రయోజనకారులు కానేరవు. శస్త్రజీవి శస్త్రముచేతనే మృతినొందును. మోసకృత్యములఁ జేయువాఁడు వానిమూలముననే మృత్యువువాతఁ బడిపోవును. కపటవృత్తి యెప్పుడును శాశ్వతసుఖమును సంపాదింపఁజాలదు. ఇది నిశ్చయము. నిశ్చయము.—"

వసంతుఁ డదేవిధముగ నుపన్యసించుచుండెను. విష్ణుగుప్తుఁడు దురాగ్రహావేశుఁడై "చూచెదరేల? శిర ముత్తరింపుఁడు. తలఁకుఁడు. రాజాజ్ఞనెఱవేర్పుఁడు." అని తలవరులఁ దొందర పెట్టసాగెను. ఈవాక్యములు వసంతునకు వినఁబడ లేదు. వసంతునిధర్మోపన్యాసమును వినుచు నావేశులై యున్నతలవరులకును నీయాజ్ఞ చెవినిబడినది కాదు. వారిహృదయములు కఱఁగి నీరై పోయినవి. ఇఁక వారిచేతులలోనికత్తు లెంతపదనుగా నున్న నేమి? వారిహృదయములయందు దయాభావ ముదయించినది. వారికత్తులతళతళత్కాంతులలో నిప్పుడు క్రూరస్వభావము గోచరించుట లేదు. అవి వారిబుజములపై కట్టఁ బ్రాలినవి. విష్ణుగుప్తుఁడిప్పు డేమిచేయఁగలఁడు? చాల నలజడినిబొందెను. తానే యాపని నిర్వర్తింపవలయు నని యాతని కొకసంకల్పము కలిగినది. వెంటనే దానికి వికల్పమును గలిగినది. గౌరవలోప మని కాఁబోలును! ఏమియును దోఁచక పిచ్చివానివలె నటునిటు ప్రచారము చేయసాగెను. వసంతుఁ డింక నదే రీతిగ నుపన్యాసము నిచ్చుచుండెను.

ఇంతలో నాప్రదేశమునకుఁ గొందఱుజనులు వచ్చిరి. వారివెనుక మఱికొందఱు వచ్చిరి. ఇంకను గొందఱు వచ్చిరి. వేఱొకకొందఱు గుంపులుగుంపులుగ రాఁజొచ్చిరి. ఎచ్చటఁ జూచిన జనులే. ఏమూలఁ జూచినను జనులగుంపులే. ఇట్లు కొలఁదికాలములోనే యాప్రదేశ మంతయును బహుజనాకీర్ణమై పోయినది. వారి కోలాహలము హెచ్చ య్యెను. వీరందఱెవ్వరై యుందురు? వసంతుని జూచుటకై వచ్చిన పట్టణవాసు లని తోఁచుచున్నది. అయినచోఁ బట్టణమునం దెచ్చటను నేఁడు వసంతుఁడు శిక్షింపఁ బడు నని ప్రకటించి యుండలేదే. వీరెట్లువచ్చిరి? వసంతుని మరణదండన వృత్తాంతమును గడచినరాత్రి చాణక్యునివలన విని వసంతునియం దభిమానముగలప్రజ లందఱు నిట్లు వచ్చుచుండిరి. విష్ణుగుప్తుఁ డీప్రజాసమూహమును జూచి నివ్వెఱపడ సాగెను. ఆతఁడు రహస్యముగ వసంతుని జంపింపవలయు నని తలంచి యుండును. అట్లుకానియెడల నాతఁ డీప్రజలను జూచి ఱిచ్చపాటును బొందనేల?.

ప్రజలిసుకవేసిన రాలకుండునట్లుగ నావన మంతయు నాక్రమించిరి. వధ్యస్థానముచుట్టును జుట్టివేసిరి. స్థలము చాలకయో, వసంతుని జూడవలయు ననియో, కొందఱు చెట్లపై కెక్కసాగిరి. కొందఱు త్రోసికొని ముందునకు వచ్చుచుండిరి. కొంద ఱీదుష్కృత్యమును జూడలేమని దూరముగనే నిలువఁబడి పోవుచుండిరి. అందఱు నన్నివిధముల మాట్లాడుకొనుచుండుటచే నావన మంతయు గగ్గోలుగ నుండెను. ఒకరిమాట యొకరికిఁ దెలియుట లేదు. చెట్లపై నున్నవా రందఱును గ్రిందనున్నప్రజల నుద్బోధించుచుండిరి. ప్రజలందఱును గుంపులుగుంపులుగఁ గేకలువేసికొనుచు నావధ్యస్థానమును జుట్టివేయసాగిరి. చేయి మెదపుటకు సందులేదు. కత్తి నెత్తుట యెట్లు? ఊపిరి యాడుటకైన నవకాశము లేదు. ఆజ్ఞ యేమి వినఁబడును? విష్ణుగుప్తుఁ డీప్రజా

సందోహమును జూచి మిక్కిలి భయపడసాగెను. అతఁడొకతలవరిని సమీపమునకుఁ బిలిచి యాతని చెవిలో నేమియో చెప్పెను. వెంటనే యాతఁడు తనచేతనున్న ఖడ్గము నట్టె క్రిందఁ బడవైచి యాప్రజలసందు నుండి మెల్లఁగ దాఁటిఁబట్టెను. ఆవేగములో నున్న ప్రజ లీతని వీక్షింప లేదు. వీక్షించినను సరకుచేయ లేదు. వానినిగూర్చి యాలోచించుట కాప్రజల కవకాశ మెక్కడిది?

తలవరి యేగినకొన్ని నిమిషముల కొకయానవపురుషుఁ డొకయుత్తమాశ్వము పై నెక్కి యాజనులనడుమనుండి తప్పించుకొనుచువచ్చుచుండెను. ఈప్రజాసంక్షోభమున నాగుఱ్ఱము బెదరలేదు. దానినాలుగు కాళ్ళయందును, మొగమునందును, శ్వేతచిహ్నములుండెను. అది యశ్వమునకుఁగల మంచిలక్షణములలో నొకటి. దీనినే యశ్వశాస్త్రజ్ఞులు "పంచకళ్యాణి" యని పిలిచెదరు. ఇది మాటలువచ్చినగుఱ్ఱము. కానియెడల నాజనులగుంపులో నెవ్వరినిఁ ద్రొక్కకుండ మెలఁకువతోఁ దప్పించుకొనుచు వేగముగ నెట్లు నడవనేర్చును? మనుష్యులగుంపు పాయాశ్వికుని వంకఁ జూడసాగెను. భక్తి భావముతోఁ దొలఁగి గుఱ్ఱమునకు దారి నొసంగుచుండెను. ఆపురుషోత్తముని జూచినతోడనే ప్రజలముఖములు వికసించినవి. "న్యాయమును విచారింపుఁడు" అని యాజనమధ్యము నుండి యేకముగా నొక్కధ్వని వినఁబడియెను. పురుషుఁడు చేయెత్తి వారి సంభ్రమమును నివారించెను. మాటాడకుండ సంజ్ఞచేతనే యాపని జరిగిపోయినది. జనుల గౌరవభక్తులకుఁ దావైయున్న యీమహాపురుషుఁడు మనచంద్రగుప్తుఁడే. చంద్రగుప్తుని జూచినతోడనే జనులసంభ్రమాంధకారములు విరిసిపోయినవి. అతఁ డేమిచేయునో యని ప్రజ లెల్ల నిలువఁబడి చూచుచుండిరి. సందడి కొంత యడఁగినవెనుక చంద్రగుప్తుఁడు తిన్నఁగ వధ్యస్థానముచెంతకుఁ బోయి యచ్చట గుఱ్ఱమును దిగి విష్ణుగుప్తునిజూచి యిట్లనియెను.

"వసంతుఁ డొనరించినయపరాధ మేమి?"

"అదిమహారా జెఱుఁగును"

"నేరమును నిర్ధారణచేయకుండ నికఠినశిక్ష విధించుట ధర్మవిరుద్ధ మని తలంచెదను"

"ధర్మవిరుద్ధము కాదు. ఆతనికి విధింపఁబడినశిక్షనుబట్టి యాతఁ డొనరించినది మహాపరాధ మని వెల్లడి యగుచున్నది"

"ఈనేరమున కీశిక్ష యని స్పష్టముగ నెఱింగింపకున్న నాదండనము ధర్మవిరుద్ధమే యగును"

"ఈతఁడు రాజద్రోహ మొనరించినాఁడు. దానికై యిట్టిదండన మనుభవించుచున్నాఁడు ఇప్పుడు స్పష్టముగఁ దెలిసినదా?

"రాజద్రోహ మనఁగా నెట్టిది?"

"అది మహారాజుచేఁ బ్రకటింపఁబడ లేదు"

"దండనము ప్రకటింపఁబడినదా?"

"ఏల ప్రకటింపఁబడవలయును?"

"ఈనేరమున కీశిక్ష విధింపఁబడిన దని ప్రకటింపఁబడనిచో శిక్ష వలనిలాభ మేమి?"

"అది సామాన్యశాసనము. నిగూఢములగు రాజకార్య విషయముల ద్రోహులగువారలను శిక్షించునపుడు నేరములు ప్రకటింపఁబడవు"

"నేరములు విచారింపఁబడునా?"

"అది ప్రభువులచిత్తములో నుండును"

"సర్వస్వతంత్రుఁ డగురాజు తన చిత్తవృత్తినే నమ్మి మరణ దండనముల విధించుట ప్రజాద్రోహము కాదా?"

"ఈ చర్చలతోఁ బ్రసక్తి లేదు. రాజాజ్ఞ నెఱవేర్చుటయే ముఖ్యధర్మము"

"సరే. రాజనఁగా నెట్లుండవలయునో నీకుఁ దెలియునా?"

"తెలియు కేమి? ఇటువంటి స్వామిద్రోహుల యెడల నిట్లే యుండవలయును"

"వసంతుఁడు స్వామిద్రోహి యనియేనా?"

"ఆ! ఆతనిపక్షమున వచ్చిననిప్పుడు స్వామిద్రోహివే. ఈప్రజలును స్వామిద్రోహులే"

"ప్రజలలో నిందఱు రాజద్రోహులుగాఁ గనఁబడుట కేమి కారణము?"

"బుద్ధిలేక—భయములేక—ప్రాణములపై నాశలేక—"

"నీకా? ప్రజలకా?"

"ఏమీ కండకావరముచే నెడలెఱుఁగక మాటలాడు చున్నావు?"

ఈవాక్యములు చంద్రగుప్తున కసహ్యములుగఁ దోఁచెను. ఇట్టి స్వార్థపరునితోఁ బ్రసంగించుటవలన నిఁకఁ బ్రయోజనము లేదని యాతఁడు గ్రహించెను. ప్రజ లాతనివాక్యసారమును గ్రహించినట్లు కని పట్టెను. ప్రజలెల్లఁ జంద్రగుప్తునిమొగమువంకఁ జూచుచు నాతని వాక్కు నుండి యేమి వినఁబడునో యని యుద్రేకించుచుండిరి. చంద్రగుప్తునిహృదయము గంభీరముగనున్నది. అప్పు డొక్కమాఱుగ నెల్లి విరియనై యున్న కోపావేగమును లోలోన నె యడంచుకొని ప్రజలవైపున కొక్క సారి దృష్టి సారించెను. ప్రజలచూపులును జంద్రగుప్తునిమీఁద నే యున్నవి. ఈసమయమున విష్ణుగుప్తుఁడు "నలుకుఁడు. తల త్రెగ నలుకుఁడు" అని తలవరులను హెచ్చరించెను. "వలదు. వలదు. మీ జీవితములపై నాశ గలదేని వసంతునివంకఁగన్నెత్తియు నైనఁజూడకుఁడు" అని వారించుచుఁ జంద్రగుప్తుఁ డొక్కయంజలో వధ్యశిల సమీపించెను. తలవరు లూరక చూచుచుండిరి. వా రేమిచేయఁగలరు? శాంత మైనధర్మమునందు క్రూరమైనరాజాజ్ఞ యేమియును బనిచేయఁజాలదు.

ప్రజలకన్ను లన్నియు వసంత చంద్రగుప్తులపై నున్నవి. అప్పుడు విష్ణుగుప్తునిహృదయ మెట్లుండెనో యెవ్వరును జూడలేదు. కోపవేగము ననో, భయోద్రేకముననో, యాతఁడు నిలువునను గడగడ వడఁకపోవు చుండెను తలవరులు స్మృతి తప్పియుండలేదు. వారిచేతులలోఁ దళతళ మెఱయుచున్న చంద్రహాసములు లేకపోలేదు. అవి చాలఁ బదనైనవే యగును. అయినను వారిహృదయములు మెత్తఁబడిపోయినవి గదా! ఇప్పు డాకత్తు లేమి చేయఁగలవు? విష్ణుగుప్తుఁ డేమిచేయఁగలఁడు?

చంద్రగుప్తుఁడు వసంతునిసంకెలలు విఱిచివైచెను. "ఇంకను జూచెద వేమి?" అని హెచ్చరించుచుఁ దనగుఱ్ఱముపై దృష్టి సారించెను. అది చంద్రగుప్తుని హృదయము గ్రహించిన దానివలెనే సకిలించెను. అంతలో మెఱపుమెఱపిన ట్లయ్యెను. ఆజనులసందడినుండి తప్పించుకొని యాగుఱ్ఱ మతివేగముగఁ బోవుచుండెను. అప్పుడు వధ్యస్థానమున వసంతుఁడు లేఁడు. ఇదియంతయు నొకఱెప్పపాటుకాలములో జరగుటచే నియదద్భుతకృత్యము నందలి యాథార్థ్యము నెవ్వరును గనిపెట్టలేక పోయిరి. వసంతుఁ డాగుఱ్ఱముపై నధివసించియే యుండెను. ఆసమయ మునఁ బ్రజలలోఁ బెద్దకలకలము జనియించెను. జరిగినవిశేషముం దెలిసి కొనుటకై ప్రజ లొకరినొకరు త్రోసికొని ముందునకు వచ్చుచుండిరి. కొందఱు చెట్లకొమ్మలనుండి క్రింది కుఱుకుచుండిరి. కొందఱు విష్ణు గుప్తునిపైఁ బడఁజూచుచుండిరి. వసంతునిమరణము తప్పిపోయిన దని యందఱును దెలిసికొనిరి. ఆయానందమునఁ గరతాళధ్వనులు సేయుచుఁ జంద్రగుప్తునిఁ గీర్తించుచుండిరి.

ఆసందడిలో నున్నవారికి భయంకరఘంకాధ్వను లేవియు వినఁ బడవు. ఒక్కింతసేపటిలో వారిచుట్టు నొకప్రచండసైన్యము ముట్ట డించియుండెను. నాలుగు మూలలనుండియును వాఁడి నారసములు

గుంపులుగుంపులుగఁ బైకివచ్చి పడుచుండెను. ఆబాణాఘాతములచేఁ గొందఱు ప్రాణములనువిడుచుచుండిరి. కొందఱుగాయములగుచుండెను. నిరాయుధులగునాప్రజ లందఱు నాసేనాసాగరమున మునిఁగిపోవలసిన వారై యుండిరి. అప్పు డతిభయంకరంబులగు కేకలతోడను, ధిక్కార ములతోడను, కోలాహలముగ నుండెను. ఆసమయమునఁ జంద్ర గుప్తుఁ డెత్తైనవధ్యశిల నారోహించి, సైనికులవంకఁ జేయెత్తి నిలువఁబడి యెను. చంద్రగుప్తునిముఖమండలమున లోకమోహనకరం బగునింత తేజ మేగో యిమిడి యున్నది తోడనే బాణపాత మాఁగిపోయెను.

అప్పుడు చంద్రగుప్తుఁడు మేఘగంభీరభాషణములతో, "ఓ సైనికులారా! నిరాయుధు లగునిందఱప్రజల నకారణముగ నేల వధియించెదరు? నాకును, లోకమునకును, బరమేశ్వరునకును, న్యాయమనితోఁచినయీకార్యమునకుఁ గడంగినవాఁడను నేను. ప్రేక్షకు లగునీప్రజల కెంతమాత్రము నిందు నిమిత్తము లేదు. దయాపూర్వక ముగ, ధర్మబుద్ధితో, బహిరంగముగ నేనొనరించిన యికార్యము శాసనవిరుద్ధ మనుచుమహారాజు నేరముగఁ బరిగణించునేని యా విషయమై న్యాయస్థానమునఁ బ్రత్యుత్తర మిచ్చుటకు నేనే బాధ్యుఁడనై యున్నాఁడను. అకృతాస్త్రులగుప్రజలు మీ కేమియు సహాయము కలిగించువారు కారు. కలిగింపను లేరు. ఈనిర్దోషులను విడిచిపోనిండు. వలయునేని నేను మీతో వచ్చెదను" అనిపలికెను.

ఆవాక్యములు విన్నతోడనే సైనికు లందఱును నిశ్చేష్టులై నిలువఁబడిపోయిరి. ప్రజలు చెల్లాచెదరై పోయిరి.

యువరాజగువిష్ణుగుప్తుఁడు చంద్రగుప్తునిపై నేరమును మోపి యాతనిఁగొనిరావలయు నని సైనికుల కాజ్ఞాపించి నగరున కరిగెను. తోడనే సైనికు లాతనిఁబట్టి తీసికొనిపోయిరి.

---

# ఇరువదియొకటవ ప్రకరణము.



నిన్నటిరాత్రి యంతయును విష్ణుగుప్తుని కన్నులలోనే గడచిపోయెను. సుందరియాతని నమ్మించి మోసముచేయుటచే నర్ధరాత్రమున శచీభవనమున కాతఁడుపోయిచూచుసరికి వసుమతిగాని, సుందరిగాని యందగపడలేదు. ఆభవనముకొల్లగొట్టఁబడినకోటవలెఁ దెఱవఁబడినద్వారములుగలిగి యుండెను. ఆతఁడప్పుడు నిలువున నీరైపోయెను. మధుపానమత్తుఁడయి తాను సుందరి కొసంగిన ముద్రికామూలమున వారు నిరాతంకముగఁ జాఱిపోవుట కవకాశము గలిగినదని యాతఁడుచాల విచారించెను. వసుమతి ప్రేమతో లిఖించుకొన్న వసంతాంగుళీయకముద్రణపత్త్రిమును చతురికమూలమున సంపాదించి, దానిపై నసత్యలేఖసృష్టించి కపట మార్గమునఁ దండ్రిని నమ్మించి చేసినప్రయత్నమంతయును విఫలమైనందులకుఁ జింతించెను. చేఁజిక్కిన వసంతుఁడు చంద్రగుప్తసాహాయ్యమునఁ దప్పించుకొనిపోయినందులకుఁ జాలఁ దల్లడిల్లుచుండెను. ఎటులైన వసంతుఁడు వసుమతిం గలిసికొని యామె నపహరించికొని పోకమానఁడని యాతఁడు లోలోనఁ గుందుచుండెను. వసుమతి యికఁ దనకు దక్కదని యాతఁడు నిరాశఁ జెందుచుండెను. చంద్రగుప్తునిఁబట్టుకొనుటచే బ్రజలలోఁ గలుగుచున్న యల్లకల్లోలమునుగూర్చి యాలోచించుచున్న పద్మనందుఁ డీవిషయముంగూర్చి యంతగాఁ గలుగఁజేసికొనకుండుట కాతఁడు మిగులఁ బరితపించుచుండెను. వసుమతి యెట్లు తప్పించుకొని పోయినదో యాతనికి బోధపడలేదు.

ఈసంక్షోభ మడఁగువఱకును వసుమతిని పద్మనందుఁడే దాఁచియుంచెనో, లేక యీగందరగోళములో నామెయే తప్పించుకొని యెటకేనియుం బోయినదో, యెవ్వరికిని దెలియలేదు.

విష్ణుగుప్తుని హృదయము చలించిపోయినది. వసుమతీవసంతుల వెదుకఁబంపిన సేవకు లేవంకనుండి యేమివార్తలు దెచ్చెదరో యని యాతఁడు పురము నలుదెసలఁ జరించుచుండెను. ఆకల్లోలసమయమున నొంటరిగఁ జరింపఁగూడ దనువివేకమైన నాతనికిఁ గలుగలేదు. పురము నలువంకలను పిచ్చివానివలెఁ దిరుగుచునేయుండెను. క్రమముగ నాతఁడు చాణక్యునియాశ్రమముకడ కరిగెను.

రేయెల్ల నిదుర లేకపోవుటచేతను, హృదయమునందలివిచారముల చేతను, విష్ణుగుప్తునికన్ను లెఱ్ఱఁబడిపోయెను. ఆసంధ్యాసమయమునఁ బశ్చిమదిక్తటంబునఁగూడ నెఱ్ఱనికాంతులే తోఁచుచున్నవి. సూర్యుఁ డిప్పుడు తనతేజము నగ్నియం దిడి యస్తమించుచున్నాఁడు. అటఁ జాణక్యకుటీరమునఁ బ్రజ్వలించుచున్న యగ్నిహోత్రునియందును రక్త కాంతులే తోఁచుచుండెను. ఆయాశ్రమద్వారమున నేదో పనిచేయు చున్న చాణక్యునికన్నులును నెఱ్ఱగనే కనఁబడుచున్నవి. ఆతనిమొగము కూడ నెఱ్ఱవడియున్నది. ఇన్నియును గూడుటచే నిప్పు డెల్లెడను సంధ్యా రాగమే తోఁచుచుండెను.

అప్పుడు చాణక్యుఁడు తన్ముగోలచే నొకదర్భమూలమును ద్రవ్వు చుండెను ఆదర్భమోడు పలువురునడచుదారిప్రక్క నున్నది. ఆతఁడిటు నటు చూడక, యారి బిఱ్ఱబిగిసికొనిపోయియున్న యానేలను గష్టము తోఁ ద్రవ్వుచుండెను.

విష్ణుగుప్తుఁ డాబ్రాహ్మణుని చేష్టలఁ జూచి యచ్చట నిలువఁబడి పోయెను.

"ఆర్యా! ఏమిచేయుచున్నారు?" అని ప్రశ్నించెను.

చాణక్యుఁడుకోపముతో "మూలచ్ఛేదముఁ జేయుచున్నాఁడను" అని యుత్తర మిచ్చెను. దానియర్థమును మందుఁడగు విష్ణుగుప్తుఁడు తెలిసికొనలేదు

"దేనిని?" అని మరలఁ బ్రశ్నించెను.

"ఈదర్భను. అంకురసహితముగ"

"ఎందుచేత?"

"ఇది నా కాలిలో గ్రుచ్చుకొనినది. దీని నిచ్చట నుంచిన నాకే కాదు. లోకులకుఁగూడఁ జాల నపాయమును దీసికొని రాఁగలదు"

"దీనితల నఱికినచో చాలదా? అంతశ్రమపడి పెల్లగింప నేల?"

"దీనిని సమూలముగ నాశనము చేయవలయును లేనిచో నెన్నటి కైన మరల నంకురింపఁగలదు"

"ప్రకృతిసిద్ధమగు నంకురమునే నశియింపఁజేయుట కష్టము కాదా?"

"సాధ్యమయినంతవఱ కట్లుచేయవలయును. వసుమతికి దుష్ట లోకమువలెనే రాజమార్గమునకుఁ గంటకసముదాయ మంత యపాయ కరమైనది"

విష్ణుగుప్తునికావాక్యములయందలిపరమార్థము తెలిసినదికాదు. కాని, కొంచె మనుమానమును భయమును దోఁచెను. లోకా తీతచరిత్రుఁ డగుచాణక్యుఁడనిన నందఱకును భయమే. ఆతనియెదుట నెవ్వరును నిర్భయముగ నిలిచి మాటాడఁజాలరు. విష్ణుగుప్తుఁడు నవ్వుచు "అయ్యా! ఈదర్భప్రోహముపై నింతపట్టుదలయేమిటకు!" అనియెను.

చాణక్యుఁడు పరశురామునియపరావతారమని యాతఁ డెఱుం గఁడు. అపాండవము చేయనుద్యుక్తుఁడైనయశ్వత్థామవలెనే కోపో ద్రేగుం డగుచాణక్యుఁడు నందవంశముపైఁదీవ్రదృష్టులఁ బఱఁగించుచుండె నని యాతనికిఁ దెలియలేదు. ఆతఁడు నలువంకలకును జూచెను. ఎదుట నున్నకుటీరమున నెవ్వరో యువతీమణి సంచరించుచున్న ట్లాతనికిఁ బొడకట్టెను. ఆమె సుందరివలె నాతనికగపడియెను. సంభ్రమముతోఁ

గుటీరమునఁ బ్రవేశింపవలయునని యాతఁడు చూచెను కాని, యింతలోఁ జాణక్యునియద్భుతచరిత్రములు తలంపునకు వచ్చి యాతనిహృదయమునకు భయము గలిగించెను. కనిపట్టి యావంకకే చూచుచు నాతఁడు నిలువఁబడిపోయెను.

అంతలోఁ జాణక్యుఁడాద్రోణమును బైకిఁ బెల్లగించివైచెను. దానిని క్రిందఁబెట్టి నలఁగఁగొట్ట నారంభించెను. ఆత్రోవను బోవు వారందఱు నాచర్యను జూచి వెఱగుపడసాగిరి. విష్ణుగుప్తుఁడావంక జూచుటలేదు. ఆతనిదృష్టి యంతయును గుటీరమువంకనే యున్నది. ఆబ్రాహ్మణుఁడింకను నాపని ముగింపలేదు. అచ్చటనున్నయొకరాతి పలకపైనాదర్భద్రోణము నుంచి తనకలశోదకములం జిలికి దానిని మొదలంట నఱిగఁదీసి, కమండలుజలంబులఁగలిపి యానీటిని గడగడ దాహము పుచ్చుకొనియెను. విష్ణుగుప్తుఁడీయద్భుతకృత్యమునకుఁ జాల ఱిచ్చపడి పోయెను. ఆతని కేమియుఁ దెలియలేదు. చాణక్యుఁడు తనపని ముగించుకొని తిన్నఁగఁ దనకుటీరమునకుఁ బోయెను. విష్ణుగుప్తుఁడు వానిని వెంబడించెను. ఇరువురును గుటీరమునఁ బ్రవేశించిరి. ఆకుటీరమున సుందరి యున్నదేమో యని యాతఁడు వెదకెను. కాని, యామెజాడ కాన్పింపలేదు. విష్ణుగుప్తుఁడు సుందరినిగూర్చి చాణక్యుని నడుగలేదు. అటునిటు కొంతసేపు పరీక్షించి చూచి యాతనియొద్ద సెలవు దీసికొనియెను. చాణక్యుఁడాచూపులయర్థమును గ్రహించెను. ఆతఁడు "అయ్యా! తలుపు దగ్గఱగఁజేర్చిమఱిపొమ్ము" అనిచెప్పెను. విష్ణుగుప్తుఁడు తలుపుమూసి పైని గొళ్ళెముపెట్టి యేమో పనిగలవానివలె నతివేగముగ నాకుటీరము వెనుకదారినే వెడలిపోయెను.

ఇంతలోఁ జాణక్యునికుటీరమున కవ్వలిభాగమునఁ బొగయును, మంటలును, లేచి నిముసములో నవి కుటీరముచుట్టును వ్యాపించెను. అప్పటి కప్పుడే కనుచీఁకటి పడుచుండెను. నలుగురు నచ్చటికి వచ్చు లోపల నాయిల్లంతయు మహాగ్నిజ్వాలలోఁ బడిమండిపోయెను

ఆచుట్టుపట్టులం దున్నజను లీయకాలప్రళయమును జూచి పరు గెత్తుకొని వచ్చిరి. కాని, వారందఱుఁ జేరుసరికే కార్యము మించిపోయి నది. సుందరియు నీకుటీరమునందే యుండియున్నది. ఆమెయును బైకి వచ్చుట కవకాశము లేకపోయెను. పాపము! మేటులకొలఁదిగనున్న చాణ క్యాచార్యునినీతిశాస్త్రాదిమహాగ్రంథములన్నియు నాతనిప్రక్కనే పడి యగ్నిహోత్రమున కాహుతియై పోయినవి. ఆపుస్తకములె జనులు వచ్చు సరికి మహాజ్వాలలలోఁ గాలిపోవుచుండెను. ఎవ్వరికి నార్పుటకయిన శక్యముకాకపోయెను. ప్రజ లనేకవిధముల దుఃఖింపసాగిరి. ఆప్రజల రోదనములకు హద్దులేదు. వారలకుఁ జాణక్యుఁడన్న గురుపదము ఇట్టి సకలనీతిశాస్త్రపారంగతుని, ఇట్టిసర్వోత్తమగురుని, ఇట్టిబ్రహ్మచర్యనిష్ఠా గరిష్ఠుని, ఇట్టిలోకోపకారధురీణుని, ఇట్టిస్వార్థత్యాగశీలుని, ఇట్టిబ్రహ్మ తేజోధురంధరుని, ఇట్టివిజ్ఞానసంపన్నుని పోఁగొట్టుకొని యేప్రజలు రోద నము సేయకుందురు? ఏప్రజలు హాహాకారములు సేయకుందురు? ఏ ప్రజలు తల్లడిల్లకుందురు? ఏమైననేమి ? అన్నియును గతించినవి. గృహ దాహమైపోయినది. సుందరీచాణక్యులప్రాణములతోఁగూడనం దేమియును మిగులలేదు. ఎవ్వరికి నేమియుఁ గన్నులఁ బడలేదు. బండ్లకొలఁదినున్న పుస్తకము లన్నియు నుసియైపోయినవి. "ఓశాస్త్రములారా! ఓపురా ణములారా ! ఓయితిహాసములారా! ఓమహాగ్రంథములారా! మీరు పవిత్రమైనయగ్నిహోత్రమున నాహుతియైపోయితిరా ? ఓచాణక్య

## ఇరువదియొకటవ ప్రకరణము.

గురూత్తమా! నీగ్రంథరాజములను నితోడనే తీసికొనిపోయితివా అని తత్సమీపప్రజలు మిక్కిలి విలపింపసాగిరి. అందఱును నాబ్రాహ్మణోత్తమునిశిష్యులే. అందఱు నాతనిభృత్యులే. ఎవ్వరు వచ్చి యేమి చేయఁగలిగిరి? ఇంతకును దైవఘటన మీఱునన్నది.

ఇప్పుడు ప్రజలనేకవిధములఁ జెప్పుకొనఁజొచ్చిరి ఈయకార్యకరణము దుర్మార్గుఁడగు విష్ణుగుప్తుఁడు చేసెనని కొందఱు చెప్పుకొనసాగిరి. వసుమతిని ఈచాణక్యుఁడుహరించెనుకోపమున వసంతుఁడింతపని చేయించెనని మఱికొంద ఱనుకొనసాగిరి. ఈరెండువిధములలో మొదటిది ప్రజలలో మిక్కిలి విరియఁబాఱెను. రెండవది రాజోద్యోగులును, తదనుచరులును, నగరవాసులును, జెప్పుకొనఁజొచ్చిరి. కాని, యిందలి యాథార్థ్యమేమో మన కేమియును గోచరించుటలేదు. సుందరీచాణక్యులీకుటీరములోఁ బడిపోవుటమన మెఱుఁగుదుము. గృహదాహమునుజూచి యున్నాము. ఎవ్వరీదుర్మార్గమున కొడిగట్టిరో మనము నిర్ధారణఁజేసి చెప్పలేము. నిజము నిడివిమీఁదఁ దెలియవచ్చును.



## ఇరువదిరెండవ ప్రకరణము.



పద్మనందునిమనసు కుదుటఁ బడినది. ఆతని కిప్పుడు వసుమతిని గూర్చినవిచారముగాని, పాఱిపోయినవసంతునిగూర్చిన విచారముగాని యంతఁగా దోఁచుటలేదు. ఎవ్వఁడు తనకు బలవద్విరోధియై, ప్రక్కలోని బల్లెమువలెఁ జరియించుచుండెడివాఁడో, యెవ్వనికడఁ దననిరంకుశప్రభుత్వము తృణప్రాయముగఁ బరిగణింపఁబడుచుండెడిదో, అట్టిచాణక్యుఁడు దురంతమగుకాలమునఁ బడిపోయెను. పద్మనందుఁ డెంతటిచక్రవర్తియైనను, తనయూరనే నివసించియున్నసామాన్యబ్రాహ్మణునియెడఁ దనకుఁ గలశత్రుత్వముసాధించుకొనలేకపోయెను. ఆతనియొద్దనున్న చాలమంది దండనాయకులకును విశేషముగఁ బ్రజలకును, చాణక్యునియెడల గురుభావము గలదు. వారాతనివాక్యములను వేదవాక్యములుగఁ దలంచుచుండిరి. ఆకారణమున నాతనికిఁ బద్మనందుఁడు ప్రత్యక్షముగ నేమియు నపకారము చేయలేకపోవుచుండెను. చాణక్యుఁడు మొట్టమొదటఁ బద్మనందునికడఁ గొంచెముహెచ్చుతగ్గుగ మంత్రిగనే చరియించుచుండెడివాఁడు. ఆతనిబోధనములు కపటప్రియములును, దురాశాపరములును, నగుపద్మనందునకు శ్రుతికటువులుగాఁ దోఁచుచుండెడివి. క్రమక్రమముగా నాతనియాలోచనముల నంగీకరింపకుండుటయే గాక సభలో నవమానించుటకుఁగూడ వెనుదీయకుండుటచేఁ జాణక్యుఁడు పద్మనందునికడ నుద్యోగము వదలికొనియెను. చాణక్యపద్మనందులవిరోధముంగూర్చి యనేకు లనేకవిధములుగఁ జెప్పికొనుచుందురు. ఒకనాఁడు చాణక్యుని విందునకుఁబిలిచి పద్మనందుఁ డవమానించె నని కొందఱును, ప్రత్యక్షముగ నాతని నేమియును చేయఁజాలక విషాన్నము పెట్టినను నామహాత్మునికాయన్నము జీర్ణమైపోయె నని కొందఱును, తనబిడ్డలకు విద్యాగురుత్వము నంగీకరింపకుండుటచేఁ బద్మనందుఁ డాతని నిరసించె నని కొంద

ఱును, ముఖ్యమంత్రియగు రాక్షసునిదుర్బోధనవలనఁ జాణక్యుని బరిభవించి యుద్యోగమునుండి తొలఁగించె నని కొందఱును, చెప్పుకొనుచుందురు. ఏది యెట్లున్నను చాణక్యపద్మనందుల కాంతరంగిక మగుబలవద్విరోధ మున్నమాటమాత్రము సత్యము.

అట్టిచాణక్యునిబలవద్విరోధము నేఁటితోఁ దీఱిపోయినది. ఆ సంతోషమువలనను, చంద్రగుప్తుని బాధించుటవలననేగాక చాణక్యుని మృతిచేఁగూడఁ బ్రజలలోఁ గలిగినయల్లకల్లోలమువలనను, చంద్రగుప్తుని ద్రోహమునుగూర్చిన విచారణము నేఁటిరాత్రి కాఁపివేయఁబడినది. చంద్రగుప్తుని కారాగారమునం దుంపక యొకమేడలో నుంచి ద్వారములయొద్ద సేనలను గాపుంచెను. ఆభవనమునకు దక్షిణమున వెనుకవైపున నగాధమగుకందకముతప్ప మఱి యేమియును లేదు

రాత్రి రెండవ యామము లింకను కాలేదు. అంధకారము బంధురమై యుండెను. నాటిరాత్రి పాటలీపుత్రప్రజలకు గాఢాంధకారముగ నుండెను. ప్రజలందఱు నక్కడికిన క్కడికిపోవుచుండిరి. "దయాళుఁడగుచంద్రగుప్తుఁడు మనకొఱ కాదురాత్మునిచేతులలోఁ బడిపోయెను. మహాత్ముఁడగుచాణక్యుఁడుగూడ నాకస్మికముగ మందిరముతోఁగూడ మండిపోయెను. ఇఁక మనకష్టసుఖములకుఁ దోడుపడువా రెవ్వరు? ఱేపు తప్పకుండఁ జంద్రగుప్తునిపై రాజు తననిరంకుశప్రభుత్వమును నిరాఘాటముగ నుపయోగింపక మానఁడు. అనాథుల మగుమన మేమి చేయఁగలము" అని యీవిధముగ జనులెల్లరు గుజగుజలువోవుచుండిరి. రక్షకభటులు పుర మంతటను విచ్చలవిడిగఁ జరియించుచుండిరి.

అంధకార మపాయకర మైనది. అందుఁ జాల దుష్కార్యములు జరుగుచుండును. కొన్ని మంచిపనులకుఁగూడ నది తోడుపడుచుండును. రహస్యమునకు నిగూఢహృదయమువలెనే గూఢవ్యాపారమున కంధకార మనుకూల మైనది.

అట్టిగాఢాంధకారసమయమున నొకభవనమునకు వెనుకవైపున నున్నకందకమున కవ్వలియొడ్డున నొకవిశాలవటవృక్షముపై నెవ్వరో మనుష్యులు నెమ్మదిగ మాట్లాడుకొనుచున్నట్లు వినవచ్చుచుండెను.

"ఆకొమ్మపైఁ గత్తినాటు వేసినప్రదేశ మగపడినదా?"

"ఈచీఁకటిలో నేమియు నగపడుట లేదు. చేతులతోఁ దడవు చున్నాను"

"అటనున్న రెమ్మలపై నాకులన్నిటిని దీసివైచితి నని యాతఁడానవాలు చెప్పియున్నాఁడు"

"సరే! ఆకొమ్మ యిదియే. ఆతనికత్తినాటుపై పాలుపొంగి కత్తిపోటు కలిసికొనిపోయినది. ఇదిగో రెండుపలవలుగల చిన్నకొమ్మగూడ నిట నున్నది"

"ఆపలవలలోనుండియే తిన్నగఁ జూచినయెడల సౌధాగ్రమున నున్న ద్వార మగుపడునఁట! అదియే, గుఱి"

వారట్లు మాట్లాడుకొనినకొన్ని నిమిషములకు మేడగోడకు లక్కడ నేదియో తగిలినధ్వని వినఁబడియెను తోడనే క్రిందికందకములో బుడుంగుమని చప్పుడయ్యెను. కొంతసేపైనతరువాత మరలనట్లే చప్పుడులు కలిగెను. ఈసారి తగిలినదెబ్బ గోడకుఁ దగులలేదు. ద్వారకవాటమునకుఁ దగిలిన ట్లయ్యెను.

చెట్టుపైనుండి "అదియే" అనునొకధ్వని వినఁబడియెను. కొంతసేపటి కెవ్వరో యామేడతలుపులను దెఱచివైచిరి. మేడపై నున్నవారు చల్లనిగాలికొఱకు తలుపులను దెఱచికొని యుందురు. ఆలోపల వెలుఁగు కనఁబడుచుండెను. ఎవ్వరో యాద్వారముకడకు వచ్చి యిటునటు చూచి మరల లోనికిఁ బోయిరి.

మరలఁ జెట్టుపైనుండి "ఆతఁడే చంద్రగుప్తుఁడు" అను నొకవాక్యము మెల్లఁగవినవచ్చెను. వెంటనే "రుంయి" మను నొకశబ్ద మయ్యెను.

అప్పుడే మేడపైనున్న ద్వారమునందలి పైకప్పుపై టక్కుమని చప్పుడయ్యెను. ఈసారిమాత్రము కందకములోని జలము నిశ్శబ్దముగనే యుండెను.

చంద్రగుప్తుఁడు మరల ద్వారముకడకువచ్చి పరిశీలించిచూచెను. ద్వారబాధపుగమ్మి కొకయలుఁగు గ్రుచ్చుకొనియుండెను. దానికొక సన్నని తెల్లపట్టుదారము కట్టఁబడి యుండెను. చంద్రగుప్తుఁడాదారమును విప్పి కొంచెముకొంచెముగ లాగెను. అది యింకను వచ్చుచుండుటచేఁ గ్రమక్రమముగ దానిని చేకొనుచుండెను. కొంతసేపటి కాతని కంతకంటె బలమైనత్రాడు దొరకెను. అదేప్రకారము చేయనకొలఁది నాతనికి వరుసగా నొకపగ్గము దొరకెను. అదిచాల బరువుగనుండెను. ఇంకను లాగెను. కాని యాపగ్గము బిగిసికొనిపోయి మఱిజరగలేదు. అప్పుడాతఁ డాపగ్గమును మెలివైచి లోపలిదూలమునకుఁ గట్టివైచెను. వెంటనే దీప మాఱిపోయినది. చంద్రగుప్తుఁడాద్వారమునొద్ద నిలువఁబడి నిరీక్షించుచుండెను.

కొంతసేపటి కాపగ్గమును బ్రాఁకికొనుచు నెవ్వరో వచ్చుచున్నట్లాతఁడు కనిపెట్టెను. ఆత్రాడు పైనుండి యొకపురుషుఁడు వచ్చి యాద్వారమునుండి లోపలఁ బ్రవేశించెను. ఆతఁడును జంద్రగుప్తుఁడును నొక్కనిమిషములో నేమేమియోమాటలాడుకొని వెనుకకు మరలి యాత్రాడునుండి మెల్లఁగ నవ్వలియొడ్డున నున్నవృక్షముపైకి దిగిపోయిరి. ఇంతలో నాపగ్గమును తెగిపోయెను. ఆగాఢాంధకారమున నావచ్చినవారెవ్వరో మనకుఁ దెలియలేదు. ఆచెట్టుపైనుండి మఱియేశబ్దమును వినఁబడను లేదు.

ఇది మొదటిభాగము.

---

శ్రీరామచంద్ర.

# వసుమతీవసంతము.

## రెండవభాగము.

### మొదటిప్రకరణము.

ఇంకను సాయంకాలము కాలేదు. సూర్యుఁడు శాంతతేజుఁడై యాకాశపశ్చిమకోణమునందుఁ జాలదూరమునఁ బ్రయాణము సేయుచుండెను. పూర్వాభిముఖముగ బయలువెడలుచుండిన యాతనివిమలాంశువులు చల్లఁగఁ జెట్లయాకులమీఁగను, కొమ్మలమీఁదను, బ్రాఁకుచుండెను. ఆకారణమున వృక్షములన్నియుబంగారునీరానినయట్లు సువర్ణమయములై శోభిల్లుచుండెను ఆసువర్ణవికారకోమల తరుపత్త్రములు మనోహరములై యుండుటచేఁగాఁబోలు, మందపవమానుఁ డల్లనల్లనఁ గదలించుచు వినోదించుచుండెను. చెట్లకొమ్మలసందునున్న కులాయములపైఁ గూడ లేఁతయెండ ప్రసరించుచుండుటచే నా గూండ్లన్నియు బంగరుశలాకలచే నిర్మింపఁబడినట్లుగఁ గానిపించుచుండెను. వానియందున్న విహంగకిశోరములు తమతల్లులరాకలకయి మెడలుజిక్కించి జిక్కించి చూచుచుండుటచే వానిముఖములు సువర్ణమయములై కనఁబడుచుండెను. అది యెంతటిభాగ్యము? ఆనీరెండ పోఁకినంత సేపటిదే. నీరెండ క్రమక్రమముగ వృక్షాగ్రముల కెగఁబ్రాఁకుచుండెను. శకుంతసంతాన మింకను గూండ్లకుఁ జేరుకొనుటలేదు. వాని కలకలారావములు

మాత్రము వినఁబడుచున్నవి. కొన్ని పక్షు లాకాశమునుండి యెగిరి పోవుచుండెను. వానినిలయము లచ్చటికిదూరమున నుండియుండును.

ఆసమయమున గంగానదీపూర్వతీరము మీఁదుగ నుత్తరాభిముఖులై యిరువురాశ్వికులు ప్రయాణముసేయుచుండిరి. వారివెనుక నొకసవారిని మోసికొనుచు బోయలు నడచుచుండిరి. ఆపల్లకితలుపులు బంధింపఁబడియుండుటచే నందున్న వారెవ్వరో మనకుఁ దెలియుటలేదు. బోయలు మూల్గుటలేదు. గుక్కుమిక్కుమనకుండఁగనే నడచుచుండిరి. వారివెనుక మఱియిరువురాశ్వికులు గూడ వచ్చుచుండిరి. మొదటి యాశ్వికు లిరువురిలో నొకఁడు.

"మనము చీఁకటి పడకుండఁ గలశపురమునకుఁ బోవఁగలమా" అనియెను

"పాలే మనితోఁచుచున్నది. బోయలు మనతో నడవలేకుండ నున్నారు. ప్రొద్దుగ్రుంకుసమయ మగుచున్నది. ఇంకను నాపురము పది క్రోశము లుండుననుకొనియెదను"

"అయినచో మనమొంటలో నడివడిగఁ బోయితిమేని కొంచె మించుమించుగఁ జేరికొనవచ్చును."

ఈవిధముగ వారు సంభాషించుకొనుచు కళ్లెములను సడలించి గుఱ్ఱములను హెచ్చరించిరి. గుఱ్ఱములు కొంచెము వేగముగఁ బోవుచుండెను. బోయలును వానివెనుకనే చుఱుకుగ నడచుచుండిరి. వారిని వెంబడించి వెనుకనున్నయిరువు రాశ్వికులును దమతమగుఱ్ఱములను గూడ శీఘ్రముగ నడపించుచుండిరి. గాలియును వారికనుకూలముగనే విసరుచుండెను. ఈవిధముగ వారందఱు నొకయర్ధక్రోశమేగిరి. అది యరణ్యమార్గము. వారునడచుదారినిబట్టి యచ్చట రెండుమూఁడు త్రోవలువారికిఁగనిపించెను. ఏమార్గమునఁబోయినఁ గలశపురముపోవునో వారికివిశదపడినదికాదు. నిత్యమునడవులయందు సంచరించువారికిఁ గూడ

నొకటిరెండుసారులే ప్రయాణముచేసినవారి కాయడవిత్రోవలు గుర్తించుట చాలఁగష్టము. వెనుకముందుఁజూడక యేగినయెడల నేయరణ్యములోనో పడిపోవుట తటస్థించును. ఉన్న నీరెండయును బోయెను. సూర్యుఁడు పశ్చిమపర్వతపంక్తుల చాటునకుఁ బోయెను. దారి చూచికొనుచు నాలసించినయెడలఁ జీఁకటిలో నాయరణ్యమునఁ జాలఁజిక్కులు పడవలసివచ్చును. తెలియకుండఁ బోయిన దుర్గమారణ్యానఁ గతి. ఈభయముచే వారిగతి మందగించినది. ఆదారికిఁ గొంచెము దూరమున నొకమనుష్యుఁడు నడచుచుండెను. మొదటియాశ్వికుఁ డాతనిబిలిచి "అయ్యా! కలశపురమున కేమార్గముపోవును?" అని ప్రశ్నించెను. ఆతఁ డీమాటలు వినిపించుకొనెనో లేదో సమాధానము చెప్పకుండఁగనే వారిదృష్టిపథంబునుండి దాఁటిపోయెను. ఆశ్వికు లను మానముతో మెల్లఁగ నడచుచుండిరి. మరలఁ గొంతదూర మేగునఱికొక యడవివాఁ డాసమీపవృక్షముక్రిందఁ గూర్చుండి వారికి దృగ్గోచరుండయ్యెను. ఒకయాశ్వికుఁ డాతనియొద్ద కేగి "అయ్యా! కలశపురమున కేగుబాట యేది?"అనిప్రశ్నించెను. వాఁడు శాగుగ నెత్తఁగియున్న వానిచలెనే తీరమును విడిచియున్నయొకసన్ననిమార్గము వారికిఁ జూపి "ఈ త్రోవనుబోయినఁ గలశపురమునకుఁ బోవుదురు."అని బదులుచెప్పెను.

"ఆపుర మిచ్చటి కెంతదూరమున్నది?"

"పది క్రోశములుండును."

"త్రోవ సరిగానున్నదా?"

"త్రోవ తిన్నగనేయున్నది. కాని యక్కడక్కడ గుట్టలు మొదలగునవి తగులుచుండును. చీఁకటిపడినచోఁ గ్రూరజంతువులబాధవిస్తారముగ నుండును. వెలుఁగు వేసికొని పొందు భయములేదు."

"నీకేమైన నిచ్చెదము. మాకుఁ ద్రోవ చూపుటకయి వచ్చెదవా?"

వాఁ డందులకంగీకరింపలేదు. వారందఱు మరల దారితీసిరి. ముం దున్న యాశ్వికు లిరువురును నందందుఁగల యానవాళ్లను జూచికొనుచు నిదియే కలశపురమార్గమని సరిపుచ్చుకొని యాదారిని నడవసాగిరి

అప్పటికప్పుడే చీఁకటులు క్రమ్ముకొనుచుండెను. అవి చీఁకటి రాత్రులు. క్రూరమృగసంచారమైన యాయడవియందా చీఁకటిలో నడచుట చాల నపాయకరమే. అప్పుడు ముందున్న యాశ్వికులలో నొకఁడు బోయలలో నొకని బిలిచి "నీయొద్దనున్న కొఱవిపాలకట్టను వెలిఁగించి దారిజూపుటకు నడువుము "అని యాజ్ఞాపించెను. వాఁడట్లు కట్టను వెలిఁగించి పల్లకిముందు నడచుచుండెను ఆవెలుతురులో వారు ప్రయాణము చేయుచుండిరి.

తామున్న స్థానముతప్ప నెచ్చటఁజూచిన నంధకారమే. క్రూరగమృగముల భయంకర కంఠరవములు వినఁబడుచుండెను ముందుముందుఁ బోయినకొలఁది నడవియంతయు జీబుగనుండి భీతిని నెలకొల్పుచుండెను. ఆశ్వికులు తమతమఖడ్గము లొఱలనుండి దూసికొని నడచుచుండిరి. ఒక్కొక్కచో నడవిమృగములు సమీపమందున్న పొదలనుండి దూసికొని పరుగెత్తుచున్న చప్పుడులు వారికి వినవచ్చుచుండెను. పక్కలనున్న పొదలలో గలగలశబ్దములు తఱచు వినవచ్చుచుండుటచే బోయలు భయపడసాగిరి. వారిగతి మందగించినది. ఆశ్వికులు వారిని హెచ్చరించుచు నెట్లో తీసికొనిపోవుచుండిరి. అక్కడక్కడ దూరమునుండి పక్షులకూఁతలో, ఈలలో, వారలకు వినవచ్చుచుండెను. ఆశ్వికు లవి విమర్శించి యాలకించుచుండిరి. వారికేమియును విశదపడుట లేదు.

వారట్లు నడచుచునే యుండిరి. వెనుక మృగమో, యేదో, పరుగెత్తుకొని పొదలలోనికిఁ బోయినట్లు వారికిఁ జప్పుడు వినఁబడియెను. పల్లకి నాఁపి యాశ్వికు లాచోటును వెదకిరిగాని వారికేమియుఁ గాన్పింపలేదు. వెలుఁగు మధ్యమునన్న వీరిని దూరమునందున్న మనుష్యుఁడు

గాని మృగముగాని చూడవచ్చును. కాని, వీరికి దూరవస్తుదర్శన మేమియు లేకుండఁబోయెను. అక్కడక్కడఁ జెట్లపైనున్న పక్షులఱెక్కల చప్పుడును, పొదలలోని క్షుద్రజంతువుల సీత్కారములును, కీచు రాలనిస్వనమును, దప్ప నావనమున వారి కేమియు వినఁబడుట లేదు. ఇవి యాలకించుచు నాయాశ్వికులు బోయలతో నడచుచుండిరి. కొంత దూర మేగిరి. ఒకపొదమాటున నుండి వింతశబ్దమేదియో వారికి విన వచ్చెను. మనుష్యుల గుసగుసయని వారనుమానించిరి. మృగముల యుచ్ఛ్వాసనిశ్వాసములధ్వనియని యింకొకమాటు తలంచిరి. వారు నడక మాని కొందఱాదిక్కునకేగి చూచిరి. ధ్వని యాఁగిపోయినది. కాని, యేమియును గనఁబడలేదు. ఆశ్వికులకుఁ గూడ నేమియోభయము తోఁచెను. వారు బోయలను కొంచెము చుఱుకుగ నడువుఁడని హెచ్చరించిరి. తమగుఱ్ఱముల వేగముగఁ బోనియసాగిరి. ఆమార్గము గుట్టలతోఁ గూడినదగుటచే గుఱ్ఱపుడెక్కలచప్పుడు విశేషముగ విన వచ్చుచుండెను వారివెనుకను అదేమాదిరిగ గుఱ్ఱపుడెక్కలసద్దు విన వచ్చుచుండెను. వారికి దివినఁబడకపోవుటచేతనో, ప్రతిధ్వనియనియో, వారు దాని గాటింపలేదు. బహుశా అది ప్రతిధ్వనియే యైయుండును. గుఱ్ఱములు కొంచెము వేగముగనే పోవుచున్నవి. బోయలును వానిని వెన్నాడినడచుచుండిరి. నడక వేగమునఁగొఱవిపాలకట్టుమంటలు వెనుకకుఁ బోవుచుండెను. ఆవెలుతురు ముందునకుఁ గాన్పించుటలేదు. ముందు నడచుచున్న గుఱ్ఱము దూరమున నేదియో యొకవింతవస్తువును జూచి బెదరెను. ఆముందు మెఱపు మెఱసినట్లయ్యెను. ఆశ్వికుఁ డది వీక్షించెను గాని యాతనికి దానిస్వరూపస్థితి తేటపడినదికాదు. ఏపులియో యైయుండునని యాతఁడు భావించుకొనియెను. ఈలోందరలో గుఱ్ఱము కాలున కేదియో తగిలి ముందున కొఱఁగెను. కాని పడలేదు. వెంటనే యది యథాప్రకారము నడువసాగెను. ఆశ్వికుఁడు దాని నక్కడ నాపి

యాస్థలమును బరీక్షించిచూచెను. ఆదారికడ్డముగ కొన్ని తీఁగలు పొదల నుండి జారిపడియుండెను. కొన్ని తెగిపడియుండెను. ఈతీఁగలే దీనికాళ్లకుఁ దగిలియుండుననీ వారందఱు నిశ్చయించుకొనిరి. ఒకయాశ్వికుఁడు ముందునకుఁ బోయి పరీక్షించిచూచెను. అందేపులియు నాతనికిఁ గనఁ బడలేదు. ఆతని కనుమానము తోఁచి యాచుట్టుప్రక్కలఁ బరీక్షించి చూడసాగెను. అంతయు నంధకారమే. ఏమియునుగోచరింపలేదు. పొద లలో గలగలధ్వనియు, చెట్లకొమ్మలయాకులమర్మరధ్వనియుఁ దప్ప నాతని కేమియును వినఁబడలేదు.

ఆశ్వికులు మరల దారివెంట నడవసాగిరి. బోయలు వారి నడుమ నడచుచుండిరి. ఇట్లతికష్టముమీఁద జాముఁరాత్రికిఁ గలశపురసమీప మున నడచుచుండిరి. దూరమునుండి పురమునందలిసందడి వినవచ్చు చుండెను. అందఱకు ధైర్యమువచ్చినది. వారు శీఘ్రముగఁ గొన్ని నిమిషములలోఁ బురప్రవేశముచేసిరి. ఆపురము గంగానది యొడ్డుననే యుండెను. రాజమార్గమునఁ బ్రవేశించి కొంతదూరము పోయిరి. ఆవీధిని దాఁటి పడమటిదిశనున్న యొకవీధికి మరలిరి ఆవీధిచివరకుఁ బోయిరి. గంగానది సమీపమందే యుండెను. అక్కడ నొకయింటి ముందు పల్లకినిదింపిరి. ఆయింటికావలఁ గొన్ని కుటీరములుతప్ప మఱేమి యునులేవు. ఆవల నదియే. ఆయింటితలుపు మూయఁబడియుండెను. ఆశ్వికులు తమతమగుఱ్ఱములనుదిగిగంగయొడ్డుననున్న చెట్లకుఁ గట్టుఁడని బోయల కాజ్ఞాపించిరి. ఒకపురుషుఁడు తలుపు తట్టి,

"అయ్యా! చంద్రచూడశాస్త్రిగారున్నారా?" అనిపిలిచెను.

లోపలనుండి "ఎవరువారు?" అను కేక వినఁబడియెను.

"అయ్యా! మేము పరదేశులము. దయచేసి తలుపుతీయుఁడు" అని పురుషుఁడు పిలిచెను.

"వచ్చుచున్నాము" అని లోపలనుండి మరలఁ గేక వినఁబడి యెను. ఇంతలో నక్కడ కాయిదాగుపోరుగు మనుష్యులు కొందఱు వచ్చిరి. వారు "మీరెవరు?" రనిపురుషునిఁ బ్రశ్నించిరి, "కాశీపురమని యాతఁడు సమాధానము చెప్పెను. కాని వారిది కాశీమాత్రముకాదు. కొంతసేపటికి గొళ్లెము తీసి తలుపు తెఱవఁబడియెను. ఆగుమ్మములో నేఁబదియేండ్ల పురుషుఁ డొకడుండెను. ఆతఁడే చంద్రజూటశాస్త్రి. ఆతఁ డీవలికివచ్చి,

"విశాఖలుఁడా! అందఱువచ్చినారా?" అనియెను.

"చిత్తము."

"ప్రొద్దుండఁగనే వత్తురని వంటలుచేయించి సిద్ధపఱచితినే! ఇంత యాలస్యమైనదేల?"

"శ్రీవ సరిగఁ దెలియకుండుటచేతను, బోయలు మాతో రా లేక పోవుటచేతను, నాలస్యమైనది."

"అందఱును భద్రముగ వచ్చినారా?"

"తమదయవలనవచ్చె."

ఇట్లు వారు సంభాషించుకొనుచుండఁగా లోపలనుండి నలుబది యేండ్లుకల యొకపుణ్యాంగన యీవలికివచ్చి "ఆచిన్నదివచ్చినదా?" అనిప్రశ్నించెను ఆమె చంద్రజూటశాస్త్రి ధర్మపత్ని. శాస్త్రి "ఆ వచ్చినది. ఆపల్లకిలోనున్నది. లోపలికిఁ దీసికొనిపొమ్ము" అని యామె తోఁ జెప్పెను. ఆమె తిన్నఁగఁ బల్లకిమొద్దకు బోయి తలుపులు తెఱచి "అమ్మాయీ! రమ్ము. లోపలికిఁ బోవుదము" అనిపిలిచెను. ఆపల్లకినుండి యిరువదియైదేండ్లయువతి యీవలికి వచ్చెను. ఆపిమ్మటఁ బదునాలేండ్ల బాలిక వచ్చెను. ఆయువతిబాలిక చేయిఁబట్టుకొని యాయింటియామెతో లోపలికిఁబోయెను. ఆయువతీమణి కనకలత. ఆబాలిక వసుమతి. చంద్రజూట శాస్త్రి యాపురుషులనుతగినరీతినాదరించిభోజనములకు లెండని చెప్పెను.

వారు తమదుస్తులనుదీసి గంగకుఁబోయి స్నానములుచేసివచ్చిరి. వారంద ఱుచితరీతి నందుభోజనములుచేసిరి. భోజనానంతరము శాస్త్రియు విశాఖులుఁడును నేకాంతముగ నేమేమొ చాలసేపు మాటలాడుకొనిరి. బోయలు తిండితిని చల్లగాలికై గంగానదియొడ్డుననుండు చెట్లక్రిందికిఁబోయి పరుండిరి. రాత్రి చాల ప్రొద్దుపోవుచునది. మార్గాయాసమునొంది వచ్చిన వారి నాచావడియందున్న శయ్యలపైఁ బరుండ నియోగించి శాస్త్రి లోపలికిఁబోయి తలుపుగొళ్లెము వేసికొనియెను.

---

## రెండవ ప్రకరణము.

---

చంద్రచూడశాస్త్రిగృహము పెంకుటిల్లు కాగు. పూరిచే నేయఁబడినది. ముందు వీథవైపున నొకపెద్దచావడి యున్నది. ఆచావడి దాఁటినతరువాత విశాలమైనపడనయున్నది. దానికావల మరల నొకపూరి ల్లున్నది. అదియు నంతవిశాలమైనదికాదు. ముందు నసారా యుండెను లోపలి కేఁగినంతోడనే యొకపెద్దచావడి కనఁబడును. ఆయింటిలోని పడమటివైపున నొకవిశాలమైనహాలున్నది. ఆహాలున కుత్తరపుమూల శాస్త్రి దేవతార్చనపుగదియును, దక్షిణపుమూల వంటగదియు నుండెను. తూర్పువైపున రెండుగదు లుండెను. అందు మొదటిగది శాస్త్రి పడకటిల్లు రెండవది దొడ్డివైపునకుండెను. ఆగదికి తూర్పుదక్షిణముల గవాక్షము లున్నవి. ఈనూతనస్త్రీ లిరువురును నాగదియం దుండిరి. భోజనము లైనపిదప శాస్త్రిగారిభార్య వారియొద్దఁ జాలసేపు కూర్చుండి కష్టసుఖములను గూర్చి ముచ్చటించెను. రాత్రిచాలప్రొద్దుపోయెను. ఆమె తనపడకటింటికిఁ బోయెను. అందున్న స్త్రీలిరువురును, నాయింటి

యీామెయీాదరమునుగూర్చి ముచ్చటించుకొనుచుఁ దమతమశయ్యల పైఁ బండుకొనిరి. ఆలోపల తైలదీప మొకచో వెలుంగుచుండెను, గాలి వచ్చుటకై రెండువైపులనున్నకిటికీలను దెఱచి యుంచిరి.ఆయింటివెనుక నున్నదొడ్డి చాలఁబెద్దది. ముందర కొన్నిపూవులచెట్లును, వానినడుమ నొకనూయియు నుండెను. ఆవెనుకఁ గొన్నిమామిడిచెట్లుండెను. వాని కావల నడవివృక్షములును, డొంకలును,తీఁగలు విస్తారముగ నుండెను. మామిడిచెట్లు దాఁటినతరువాత నున్నదొడ్డియంతయు నడవివలె నుండెను మనమందులోనికిఁ బోయితిమేని యేమూల నెవ్వరున్నదియుఁ దెలియలేము. ఆదొడ్డిచుట్టును గోడ శిథిలమైయుండెను.

రాత్రిరెండుజాములు తిరిగినది. దొడ్డియంతయుఁ జీఁకటిగ నే యున్నది. ఆదుబ్బులలో మనుష్యులు మాట్లాడుచున్న సందడి వినవచ్చు చుండెను. చెట్లనున్నతీఁగ లొక్కొక్కచోఁ గదలుచుండెను. మఱి కొంతసేపటికి గుసగుసలును, ఎండుటాకులు నలఁగుచున్న చప్పుడును విన వచ్చెను. ఉత్తరక్షణమున కవి యన్నియుసుజల్లారినవి. ముందున్న మామిడి చెట్లలో నొక చెట్టుక్రింద నిద్దఱుమనుష్యులు కూర్చున్నట్లగపడుచుండెను ఇంక లోపల నెంతమందియుండిరో మనముచెప్పలేము. అందున్న కీచురాలనిస్వనమె వినవచ్చుచున్నదిగాని వారు మాటలాడుచు నున్న సద్దేమియు వినవచ్చుట లేదు. ఒకఁడు మెల్లఁగ ముందునకు వచ్చెను. ఆతనిచేతియందు చక్రాకృతిగల విచిత్రాయుధ మొకటియు, ఖడ్గ మొక టియు నుండెను. వాఁడొకగవాక్షముప్రక్క నిలువఁబడి లోపలికిఁ జూచుచుండెను. లోపలిస్త్రీ లిరువురును నింకను నిద్రింపలేదు. మాట లాడుకొనుచుండిరి. వారిరువురును గనకలతావసుమతు లని వేఱుగఁ జెప్పనక్కఱలేదు.

వసుమతి "మనమిక్కడ నెంతకాలముందుము?" అనెను.

కనకలత "మనవెనుక నామఱునాఁడే వారును బయలుదేరి యుందురు. వారు రెండుమూఁడుదినములలో వచ్చి మనలను సురక్షితముగఁ దీసికొనిపోఁగలరు "

"వారు తప్పక వచ్చెద రని నీవెట్లు చెప్పఁగలవు? వారెట్టి యాపదలలో మునిఁగి యుండిరో మన కెట్లు తెలియును? "

"మఱేమియును భయము లేదు. చాణక్యునిమతివిశేషమే వారి కంగరక్ష కాఁగలదు"

"విడువకుండఁ బయనము సాగించుటచే మనమిటకు నెలదినములకు వచ్చితిమి, వారుకూడ నంతతొందరగ వచ్చెదరా?"

"రాకేమి? వసంతుఁడు నిన్నెప్పుడు చూతు నెప్పుడు చూతునని త్వరపడుచుండును. సుందరి నిన్ను విడిచి యొకక్షణమైన నిలువఁగలదా?"

"పాపము! సుందరియును, చాణక్యుఁడును మహానలజ్వాలలోఁ బడిపోయి రని వారి కెట్లు తెలియును? వారు పాటలీపురమును, ఆనాఁటి యర్ధరాత్రముననే విడిచి వైచిరిగదా "

వసుమతి దీనవదనయై "వారు వచ్చువఱకైన మనమిచ్చట నిరపాయముగ నుండఁగలమా?" అనియెను.

"భయములేదు. మనపోకడ యెవ్వరికిని దెలియదు."

"మన మిఁక నెక్కడికిబోవుదుమో నీకుఁ దెలిసినదా?"

"అది విశాఖిలునకును దెలియలేదఁట! వారువచ్చువఱకు మనల నిచ్చట నుంచుటకే చాణక్యునియాజ్ఞయైనదఁట!"

వసుమతి నిట్టూర్పు విడిచి "కనకలతా! మన కంతటియదృష్టము పట్టునా?" అనియెను.

"అమ్మా! మనకష్టదినములు గడచిపోయినవి. నీవు ధైర్యమును వహించి శుభమున కెదురుచూచు చుందుము."

ఈసంభాషణములోఁ దానేమో గ్రహించినట్లుగాఁ గిటికీయొద్ద నున్న పురుషుఁడు సంతోషించెను. ఆస్త్రీ లిరువురు నిట్లుసంభాషించు కొనుచు మార్గాయాసముచే నిద్రకు లోఁబడిరి. పురుషుఁ డీకఁ దన పనిచేయవచ్చునని యాలోచించుకొనియెను. ఆతఁ డతివేగముగ మరల మామిడితోఁపునకుఁ బోయి యందేమో గుసగుసలాడి రెండవపురుషుని తోఁగలిసి కిటికీయొద్దకు వచ్చెను. ఒక ఱెక్కలపురుగు నాకిటికీగుండ లోనికి విడిచిపెట్టెను. అది జుంజురుమని రొదసేయుచుఁ బోయి దీప మార్పివేసెను. ఈసంగతి నాస్త్రీ లెఱుఁగరు. రెండవపురుషుఁడేమో మఱచినట్లుగ వ్రేలు కఱచికొనసాగెను. అది యేమని మొదటివాఁడు ప్రశ్నించెను.

"ఇరువురను గూడ మోయవలసివచ్చినదిలే. గుర్తింప మఱచితిమి" అని యాతఁడు చెప్పెను. ఆపురుషు లిరువురును దనచేతనున్న యాయుధములతో నాకిటికీ క్రిందిగోడను ద్రవ్వ నారంభించిరి. అది మట్టిగోడ. గునపముతోఁ ద్రవ్వినయెడలఁ జప్పు డగును. చప్పుడు గాకుండ గన్నము త్రవ్వుపనిముట్లు వారియొద్దనున్నవి. మూఁడునాలుగు గడియలలో నాగోడకు సడిచప్పుడు లేకుండఁ బెద్దకన్నము త్రవ్వి వారా గదిలోఁ బ్రవేశించిరి. ఇరువురును లోపలికిఁ బోవఁగనే మఱియిరువురు వెనుకనుండి వచ్చి లోపలఁ బ్రవేశించిరి. మొదటియిరువురును నాస్త్రీల యొద్దకుఁ బోయి గట్టిగఁ బట్టుకొనిరి వారు కేకలువేయవలయు నని ప్రయత్నించిరికాని నోరు నొక్కుటచే నవకాశము కలిగినదికాదు. మాటాడినచో గొంతుకోసివేయుదుమని బెదరించిరి. వసుమతి నిర్విణ్ణయై మాటలేకుండఁ బడియుండెను. వెనుకవచ్చినయిరువురును గదితలుపు తీసికొనివచ్చి పెరటితలుపు తీసి చప్పుడుగాకుండ శాస్త్రిపరుండియున్న గదితలుపు పైనిగొళ్ళెము పెట్టిరి. కనకలత కొంచెము కేకలువేయఁ బ్రయత్నించెనుగాని యామెనోట గుడ్డలుకుక్కి వేసిరి. ఆస్త్రీల నిరువుర నా

దొంగలు చల్లఁగ వాదొడ్డిమార్గమున నావలకుఁ దీసికొనిపోయిరి. పాపము! అబలలు. ఆ క్రూరకర్తుల చేతులలోఁ బడిపోయిరి. వారెట్టికష్టములఁ బెట్టుదురో కదా! మరలఁ గొన్ని నిమిషములలో నిరువురుమనుష్యులు ఖడ్గహస్తులయి లోపలఁ బ్రవేశించిరి. వారి కింకను దృష్టి జనింప లేదు. ద్రవ్యములకై కాదు. వాఁకిటిలోనున్నవారిని సంహరింపవలయు నని వారు యోచించుకొని లోపలఁ బ్రవేశించిరి.

వారిచేతులయందలికత్తులు తళతళ మెఱయుచుండెను. వారు తిన్నఁగ నడవతలుపు తీసికొనిరి. ఆచప్పుడు విని విశాఖులుఁడు లేచి "శాస్త్రిగారా!" అని ప్రశ్నించెను. దానికి బలమైనకత్తిదెబ్బయే ప్రత్యుత్తర మిచ్చెను. ఆకత్తి యాతనిభుజముమీఁదినుండి హృదయము వఱకును భేదించుకొనిపోయెను. ఆతఁ డొకకేక వేసి మఱి మాట లేకుండఁబడిపోయెను. ఇంతలోఁ దక్కినముప్పురును లేచి "ఏమి? ఏమి" అని కలవరపడఁ జొచ్చిరి. వారికేమందరగోళ మేమి తెలియును? నిరాయుధులై యుండిరి. వారికిని మొదటివానివలెనే చంద్రహాసప్రహారణములు బాగుగఁదగిలినవి. అర్ధరాత్రిపు నుంచినిద్రావస్థలో దొంగపోటుగ వచ్చి చేసినపని కెవ్వరడ్డుపడఁగలరు? వారునాకత్తిపోటులకు గేకలు వేయుచుఁ గ్రిందఁబడిపోయిరి. ఈకేకలు విని లోపలనున్న శాస్త్రియు వానిభార్యయుఁ దలుపుదీసికొని రాఁబోయిరి. తలుపు వచ్చినది కాదు. వారందుండి పెద్దపెద్దకేకలు వేయసాగిరి. ఈకోలాహలమును విని చుట్టుపట్టులనున్న మనుష్యులు గోడలుదాఁటి వచ్చుసరి కాదొంగలు పాఱిపోయిరి. వాఁకిటనున్న మనుష్యులలో ముప్పురు చచ్చిపడియుండిరి. విశాఖులుఁడు మాత్ర మింకను జీవములు విడువలేదు. మూల్గుచు బాధపడుచుండెను. గాయము బలముగఁ దగిలినది. వాఁకిటనురికినవారు వీధితలుపులు తీసివైచిరి వారికి వారు చాలమంది ప్రోగుపడిరి. విశాఖులునకుఁ దగినచికిత్స చేయ మొదలుపెట్టిరి. కొందఱు లోపలికిఁ బోయి

శాస్త్రి గదితలుపును దీసెను. ఆయన యావలికివచ్చి "ఆస్త్రీ లెక్కడ?" అని తొందరగా నాగదియొద్దకు జనియెను. ఆగది చీకటిగా నుండెను. వెంటనే శాస్త్రి తనగదిలోనికిఁబోయి దీపము వెలిగించి తెచ్చి చూచెను. అందెవ్వరును లేరు. గోడకు పెద్దకన్నము న్నది అయ్యో! దొంగలు నాకొంపఁ ద్రవ్వి రని యాతఁడు కేకలువైచుచు వాకిటిలోనికి వచ్చి, వాకిట జరిగినస్థితిఁ జూచి మిక్కిలి తత్తఱమును పొందసాగెను. బాధ పొందుచున్న విశాఖులు నొద్దకు వచ్చి "అయ్యో! విశాఖులుఁడా! సముద్ర మంతయును దాఁటి యీపిల్లకాల్వలోఁ బ్రాణములను విడుచుచున్నాఁడవా?" అని దీనముగఁ బలికెను.

"నేను స్వామికార్యమును నెఱవేర్చితిని." అనివణకుచు నాతఁ డుత్తర మిచ్చెను.

"బలమైనగాయము తగిలినది. నీబాధయెట్లున్నది ?"

"నాకు సుఖముగనే యున్నది నాకై విచారింపకుఁడు. దొంగలు—శత్రువులు—పాపమాయబలులు—హా! ప్రాణములు పోవుచున్నవి " అని యాతఁడు మఱిమాటాడలేదు. స్వామి భక్తియుతుం డగువిశాఖులుని ప్రాణవాయువులు తమయనుచరులతోఁబోయికలిసికొనియెను.

ఆతనిమృతికిని స్త్రీలరక్షింపలేమికిని చంద్రజూటశాస్త్రి మిక్కిలి విచారింపసాగెను.

"హా! రాజకుమారునకేనేమని యుత్తరము చెప్పుదును! నా మిత్రునకేమిజాబు వ్రాయుదును?" అనియనేకవిధములఁబలవింపసాగెను. కొందఱుపౌరులు భటులును బల్లెములనుదీసికొని గంగానదియొద్దు నుండి చాలదూరమువఱకు వెదకుచుఁబోయిరి. కాని యది చీకటిరాత్రి యగుటచేసాహసించి యొకరునుడొంకలలోనికిని, పొదలలోనికిని,బోయి చూడలేకపోయిరి. శాస్త్రిగారిస్నేహితు లాతని నూరార్చి బోయలను రప్పించి వారికికొంతడబ్బిచ్చి వాకిటనున్న శవములను దీయించి గంగానదియొద్దను వారికుచితక్రియలఁ గావించిరి.

## మూఁడవప్రకరణము.



వసుమతియును, కనకలతయును, చోరులచే నపహరింపఁబడి పది మాసములు కావచ్చినది. ఇంతవఱకు వారిజాడ యేమియును తెలియఁ బడుట లేదు.

సింధునదంబున కుపనదియగు విపాశానదీతీరంబున నున్న లతా నికుంజమునం దొకయోధుఁడుశయనించియుండెను.ఆతఁడేమో యాలో చించుచున్నట్లుండెను. అది చల్లనివెన్నెలరాత్రి. ఆతఁడు మధ్యవయ స్కుఁడగుదృఢతరశరీరుఁడు. యౌవనమున శారీరకమానసికశక్తులు సంపూర్ణముగ నుండును. యౌవనులహృదయములు భూమ్యంతరాళ ముల సంచరించుచు నెన్నెన్నియో పరిణామములఁగాంచుచుండును. ఆ పరిణామములకు లెక్కలేదు. ఆయూహల కవధిలేదు. ఇప్పు డాతని హృదయమున నేమున్నదో యథార్థముగ మనము తెలిసికొనఁజాలము.

రాత్రి రెండవజాముకూడ గడచినది. ఆతనికి నిదుర వచ్చుట లేదు. ఇటునటు పొరలుచుండుటచే నాసాంద్రములగు నీలకుంతలములు విడివడి చెదరియుండెను. అతనిహృదయతాపమునం బొడమినచిఱుచెమ్మ టలంతో లేదీవగొమ్మలచిగురుటాకులనుండి దొరలువిపాశానదీతరంగ శీకరము లేకీభావమును పొందుచుండెను. ఆఘర్మసలిలబిందువులలోఁ జంద్రకిరణములుమిలమిలమెఱయుచుండెను. చలువగాలితాఁకునంగదలు ననదీఁగగొమ్మలమాటుననుండి దాఁగిలిమూఁత లాడుజాబిల్లిరేకయా తనివిశాలనయనములలోఁ బ్రతిఫలించుచుండెను. తరంగశీకరసేచనంబున నార్ద్రీకృతంబులగు చిగురుటాకులపై వెన్నెల పూవులుపూయించు చుండెను. లేఁజిగురుటాకుల మెక్కుచుండుటనో, నిదురమంపుననో గాని తీయమామిడిగున్నపైనుండి కోకిల యాఁగియాఁగి 'కో' యునిగూయు

చుండెను. అరవిరిమొగ్గల విఁయించుచు నాఁడు బైటవెన్నెలలోనుండి కమ్మతెమ్మెరలు వీతెంచుచుండెను.

ఇవి యన్నియు నాతని హృదయాకారముల నుద్దీపింపఁ జేయుచుండెను. ఎడ తెగనిమనఃపరిశ్రమవలన నాతని కాయాసమధికమయ్యెను. దేహపరిశ్రమమున నిద్రయు, మనఃపరిశ్రమమున జాగరమును, తోఁచుట సామాన్యధర్మము. దేహమనఃపరిశ్రమముల నలసియున్న యాతండాయాలోచనములనడుమ నిద్దురయును జాగరమును గానియొకయవస్థకు లోనయ్యెను. అప్పుడాచంద్రకిరణప్రసారమున నార్ద్రింబులగు నాతనికన్నులు మూఁతవడియెను.

అప్పు డాతనిహృదయమునందలి స్మృతిపటంబున నేదియో పూర్వగాథ గోచరించుచుండెను. ఒకమనోహరకేళీభవనమున జగన్మోహనరూప యగుపదునాలుగేండ్లతరుణి యాతని యెదుట నిలువఁబడి యుండెను. అట నొకబంగరుఁదూఁగుటుయ్యెలలో నైదేండ్లయాఁడుబిడ్డ శయనించియుండెను. ఆయువతీమణి తనవంక భయసంభ్రమములతోఁ జూచుచుండెను. వారిరువురికి నివిధముగ సంభాషణజరిగెను.

"ప్రియా! నాకు దేశాంతరము పోవలసివచ్చినది, అని యోధుఁడు పలికెను ఆయువతీమణి సుకుమారతను లత చంచలవిద్యుద్వల్లరివలెఁ గంపించుచున్నట్లయ్యెను. గద్గదస్వరముతో "ప్రాణేశ్వరా! అది యేమి? అబల నగునన్నిట నొంటి విడిచి యేగుటకు మీహృదయ మె ట్లంగీకరించినది" అనువాక్యము లాతనికి వినఁబడియెను. ఆచెలువ కాటుక కన్నులనుండి యశ్రుబిందులు ముక్తామణులవలె జాలువారుచున్నట్లు తోఁచెను.

యోధుఁడు "జీవితేశ్వరీ! విచారమేల? వియోగమును సహింపనోర్చినకాంతయే వీరున కిల్లాలుగావలయు నని యెఱుఁగవా?"అనియెను.

"నాధా! మనము కలిసికొని యెన్నాళ్లయినది? ఇంతలోనే యెడఁబాయవలసివచ్చెనా?"

"రాజకార్యములు మనయిచ్ఛవచ్చినట్లు జరగవు. నే నిప్పుడు పాంచాలము పోవలయును."

"నన్నుఁగూడ మీ వెంటఁ గొనిపోఁగూడదా?"

"అయ్యో! అదియెట్లు? మనరాజునకును, రాజ్యమునకును, మనకును గూడ నాధారమైయున్న తల్లిలేనియీముద్దుబిడ్డ నెవ్వరు పెంచెదరు?"

ఆమాటవినినతోడనే యాతరుణీమణి యాబిడ్డనెత్తికొని ముద్దు పెట్టుకొనుచు, "ఈచిన్నతల్లినిగూడ మనవెంటఁ గొనిపోవచ్చును" అనియెను.

"వలదు. అది చాలశీతలప్రదేశము. ఈపసికూన నటకుఁగొనిపోవలనుపడదు."

ఆకాంత కన్నుల నిరుదెచ్చుకొనుచుఁ దలవంచుకొని నిశ్చేష్టయై నిలువఁబడిపోయెను.

యోధుఁడు "ప్రాణప్రియా! నీవు క్షత్రియస్త్రీవి కావా? ఇంత యధైర్యము నేల వహించెదవు?" అనియెను.

ఆమాటల కాచెలువ కోపగించుకొని "నేను ధైర్యవతినే కాని, నిర్దయాత్ముఁడ వగునీవిలాసములు నాహృదయమును గలఁచివైచినవి" అనియెను.

"సతీమణీ! క్షమింపుము" అని యోధుఁడు వేఁడుకొనియెను.

ఆసంబోధన మామె కేదియో బోధించెను. పతిమాట కెదురాడఁగూడదనునుద్దేశ మామెసుందరవదనమునఁ బొడగట్టుచుండెను.

"ప్రాణేశ్వరా! నేనీముద్దుబిడ్డతో నెట్లో దినములఁ గడపుకొనియెదను" అనియెను.

"ప్రియా! నీసౌశీల్యమునకు సంతసించితిని. నాకూరుగ నీముద్దు బిడ్డను ప్రాణప్రదముగఁ బెంచికొనుచుండుము ధైర్యమునువహించి నిర్మలహృదయముతో నాకు సెలవిమ్ము"

"మరల మీరెన్ని నాళ్ళకు వచ్చెదరు?"

"ఈచీఁకటిరాత్రులు గడచినతోడనే వెన్నెలరాత్రులలో వచ్చెదను"

ఆమె మఱి మాటాడలేదు. యోధుఁడు కలంగినహృదయముతో నాసుందరిచుబుకమును బుడుకుచు "ప్రియా! పోయిరమ్ము" అని యెను. కొంతసేపటి కాతనికి "ఎన్ని వెన్నెలరాత్రులు గడచినవి! ఎన్ని యేండ్లు గడచినవి" అనువాక్యములు వినఁబడియెను ఆతఁడు ఉలికిపడి కన్నులు విచ్చిచూచెను.

అప్పటికిఁ జంద్రాస్తమయమయినది. ఆపొదరిల్లంతయు నంధకారపూరితమై యుండెను. ఆతనిహృదయమునఁగూడ గాఢాంధకారము వెల్లివిరియుచుండెను. ఆతని భావనాప్రపంచమంతయును మాయమై పోయినది. కొంచెముసేపటికాతఁడు నిశ్చేష్టుఁడయి యుండెను. ఒక్క నిట్టూర్పువిడిచి లేచి నిలువఁబడియెను. మరల నిట్లాలోచించుకొనియెను. "జీవితములు స్వప్నములవంటివి. జరగిపోయినదానికై విచారింపఁ గూడదు. ఈమాయాప్రపంచమున నిశ్చలమగునానంద మెట్లుకలుగును? ఈ హృదయవికారములు ముందుప్రయత్నముల కభ్యంతరములు కావచ్చును. అంతయును మఱచిపోవలయును. ఇతఁ డాతఁడుకాఁడు. ఇది మఱియొక జన్మము" అని యనుకొనుచు నాతఁ డాతీరమున నున్న యెత్తైనకొండలగుంపులోఁ బ్రవేశించెను.

ఆనడుమదుర్గ మున్నది. ఆదుర్గమున కుత్తరమున హిమాలయ పర్వతములున్నవి. దక్షిణమున శతద్రూనదివఱకును మహారణ్యము. దానినే తపోవనమందురు. అందె చాలమంది యోధులు సంచరించు

చుందురు. అచ్చటచ్చట తపస్వులయాశ్రమములున్నవి. ఈచరిత్రము జరుగుచున్న కాలమున రాజకీయకల్లోలములు విశేషముగ నుండుటచే నచ్చట నిప్పుడు యోధులుగూడఁ దిరుగుచుండిరి. పైనివ్రాసినదుర్గమునకుఁ బశ్చిమమున సింధునదివఱకు నరణ్యమేగాని జనపదము లేదు. ఉత్తరమున హిమాలయముప్రక్కగఁ గాశ్మీరమునకుఁ బోవుమార్గ మున్నది. మూఁడు వైపుల నదులు, ఒకవైపునహిమాలయము నుండుటచేనాదుర్గముపరుల కభేద్యమైదుర్గమమై యున్నది. అందెంత సైన్యమున్నదో యెచ్చటనున్నదో లోనికిఁబోయిచూచినవారికే తెలియను. ఇతరులకచ్చట దుర్గమున్న సంగతియే తెలియదు. ఆదుర్గమునందే మన యోధుఁడు ప్రవేశించి యట నున్న భటునితో నేమో యాలోచించుచుండెను.

"విజయా! వారెవ్వరై యుందురు?"

"అయ్యా! గంగాతీరమువఱకుఁ బోయివచ్చిన మనచారులు చెప్పినయోధులే యైయుందు రని నాయభిప్రాయము"

"నిజముగ వారేయగుచో మన కార్యమున కెల్లవిధముల సహకారులు కావచ్చును"

"ఎవ్వరైననేమి? దేవర సంపూర్ణముగఁ దలంచినచో దేవునినైన దాసునిగఁ జేయఁగలరు"

"వారిరువురు నొకరికొక రీడుతీయ లేకుండఁ బనిచేయుచున్నారఁట!"

"ఇరువురగుటలోఁగూడ నాయనుమానమునకు బలీయమగు కారణ మగపడుచున్నది"

"ఔను. నేను నట్లె యూహించితిని"

"ఊహయేకాదు. నిశ్చయముకూడనదియే యయియుండును"

ఇట్లు సంభాషించుచుండఁగాఁ దపోవనమార్గమునుండి యొక బాలయోగి యామార్గమునఁ బ్రవేశించెను. యోగులకుఁ బ్రవేశింపరాని చోటు లేదుకాఁబోలు! ఆతఁడు నిరభ్యంతరముగ నారహస్యస్థలమున నున్న యోధుని సమీపించెను. ఆతఁడు వచ్చినతోడనే భటుఁడెచ్చటికో వెడలి పోయెను. ఆమార్గమున నెవ్వరెచ్చటికిఁబోవుచున్నదియుఁ గ్రొత్తవారికిఁ దెలియదు.

యోధుఁడు యోగింజూచి "విశేషములేవైనఁ దెలిసినవా?" అని యడిగెను.

"అన్నియుఁ దెలిసినవి. వారేవీరు"

యోధుఁడు సంతోషముతో "నిజముగానా? నిజముగానా?" అనియెను.

"సత్యము. సత్యము. ఆకాలము నీకాలమును సరిపోయినది. ఆరూపములు నీరూపములు సరిపడినవి. ఆగుణములు నీగుణములు నొక్కటియే"

"ఇటుఁ గూడ నద్భుతకార్యములు చేయుచున్నారా?"

"ఆ. చేయుటకేమి? దైవము వారిపక్షమునఁ బనిసేయుచున్నది"

"వారిచరిత్రమంతయును మొదటినుండియును గ్రహించితివా?"

"రాజయోగానందుని శిష్యుఁడనగు నాకంతమాత్రము వివేకముండుటలో వింతయేమున్నది?"

"ఏదీచెప్పుము!"

అందొకనియం దొకవిధమగు నాకర్షణశక్తి యున్నది. మూఁడు లోకములు నేలఁదగినలక్షణము లాతనికడ నున్నవి. వాని జూచిన తోడనే యెట్టిరాజాధిరాజైనను దాసానుదాసుఁడు కావలసినదే. రెండవ యోధుఁ డాతని కించుమించుగా సమానుఁడు. ఆ తేజోమూర్తుల

దర్శించినంతమాత్రముననే రాజ్యకల్లోలములచే దేశమువిడిచి యడవులం దిరుగుచున్న యోధులు చాలమంది తమసేనలతో వారినాశ్రయించిరి. అందొకని ప్రభునిగను, ఒకని సేనానాయకునిగను జేసికొనిరి?"

"వా రిప్పుడేమిచేయఁజూచుచున్నారు?"

"ఏమిచేయుట కేమున్నది? రాజున్నాఁడు. సేనలున్నవి. ఇంకఁ గావలసిన దేమున్నది? రాజ్యమును స్థాపింపఁదలఁచి ప్రయత్నించుచున్నారు"

"రాజ్య మెచ్చటనుండి సంపాదించెదరు?"

"వారెచ్చటనుండిన నచ్చటనే రాజ్యస్థాపనమగును"

"వారిప్పు డెచ్చటనున్నారు?"

"శతద్రూనదీతీరమునందలి శైలారణ్యమున"

"మనకుఁ జాలసమీపముననే వచ్చియున్నారే!"

"వచ్చుటయేగాదు. అచ్చటఁ గొంతకాలము నివసించుటకుఁ దగిన ప్రయత్నములు సేయుచున్నారు."

"వారికి మనసంగతు లేవైనఁ దెలిసినవా?"

"తెలియ లేదు. కాని, తపోవనమాహాత్మ్యమును, రాజయోగానంద స్వామివారిప్రభావమును, మాత్రము వారు వినియున్నట్లు తెలియ వచ్చినది.

ఇట్లు సంభాషించుకొని వారిరువురును వెడలిపోయిరి.

---

## నాల్గవ ప్రకరణము.



నిర్జనారణ్యములయందును, పర్వతగుహలయందును, మహామునులు నివసింతురని మనము వినియున్నాము. సంగరహితులై, నిశ్చలజ్ఞానముచే వెలుంగువారల కాప్రదేశము లత్యంతయోగ్యములై విశేషజ్ఞానప్రదములయి యొప్పారు ననుట సత్యము. నిజముగ మనకుఁ గానవచ్చు ప్రకృతిచిత్రము లన్నియు నందుండియే వారు గ్రహింతురు. తత్త్వవిజ్ఞానులయి, నిర్మలపరబ్రహ్మస్వరూపమును దిలకింతురు. కావున నట్టి వివిక్తపరిదేశము లెట్టిమార్గముల నున్న నేమి ముక్తిసాధనమునకు మెట్టులవంటి వని పెద్దలు చెప్పుచున్నారు. ఆమెట్లమీఁదనే మనము మహాత్ములఁ జూడఁగలుగుదుము.

ఒకనాఁటియుదయకాలమున శతద్రూనదికిని, యమునకును, మధ్యభాగమునయున్న శైలారణ్యమున నొకమహాతపస్వి యొంటరిగఁ బోవుచుండెను. ఆతఁడు కాషాయవస్త్రధారియయి యుండెను. కాషాయవస్త్రధారణమాత్రమున మునియని చెప్పరాదని తలంపరాదు వంచకయోగులు, జనపదములయం దుండిన నుందురేమో కాని, మహారణ్యముల దుర్గమశైలముల నెవ్వరిని వంచించుటకయి యాతఁడీవేషమును ధరించును? ఇచ్చట నెవ్వరు లేరే! నిశ్చయముగ నీతఁడు సంసారకామిని వంచించుటకయి యీప్రాంతములం జేరి యుండును. ఈయరణ్యవృక్షములనిడఁ గోరి యుండును.

ఆమునీంద్రునికాయము బలిష్ఠమైన దని తెలియుచుండెను. నలుబదియేండ్లకు మించనివయసునకుఁ దగినట్లుగనే యాతనిశరీరదార్ఢ్యము వెలయుచున్నది. ఆతఁడు కంఠమున మనోహరరుద్రాక్షమాలికలును, హస్తమున దండకమండలములును గలిగియుండెను. నల్లనిగడ్డమును

ఒత్తగుమీసములును, సువర్ణచ్ఛాయలఁ దులకించుచున్న యాతని ముఖమండలమునకు విశేషాలంకారములయి యొప్పుచుండెను. కన్నులతి విశాలములయి యించుక రక్తరేఖామిశ్రితములయి యున్నవి. యోచనా సదన మగుఫాలము సమవిలాసమయి సంపూర్ణతేజోవిరాజిత మగు చుండెను.

ఆతఁడు హిమాలయమునుండి దక్షిణాభిముఖుండయి చను చుండెను. శైలారణ్య మత్యున్నతపర్వతపంక్తులతోడను, ఆకాశము నొరయుచున్న వృక్షములతోడను, సూర్యాతపమున కభేద్యమై రాజ యోగులకొక పెట్టనికోటగ నలరారుచుండెను. తపస్వి వలయాకారముగ నున్న పర్వతమధ్యప్రదేశమునఁ బ్రయాణము సేయుచుండెను.ఆమధ్యభాగ ము మనోహరలతాగుల్మములచేఁ జుట్టుకొనఁబడియుండెను. ముని యా ప్రదేశమునకుఁ గుడిచేతిమీఁదుగ మఱికొంతదూర మేగెను.అదిశతద్రూ నదీతీరప్రాంతము. ఆసమీపమున నేయొకదుర్గము నిర్మింపఁబడుచుండెను పరిజను లాయాపనులయందు నియోజితులయి పనులు సేయుచుండిరి. ముని దానిని గాంచినతోడనే యత్యాశ్చర్య మగ్నుఁడయ్యెను. ఆతఁ డీవఱకు కందు మనుష్యులు మసలుటయే చూచియుండలేదు. ఇప్పుడు దుర్గమే నిర్మింపఁబడుచున్నది అందొకవృక్షచ్ఛాయ నిరువురుమను ష్యులు కూర్చుండి యేమియో యాలోచించుకొనుచుండిరి. యోగి వారి నల్లంతదూరమునఁ జెట్లచాటునుండి చూచెను. వారిని చూచిన తోడనే యాతనికి బదరికాశ్రమవాసు లగునరనారాయణులు జ్ఞప్తికి వచ్చిరి. వారిట్లు శిలాసార్థము వచ్చియుండిరా? యని యాతఁడు శంకిం చెను. ముని ముందునకు నడువలేదు. అక్కడనే నిలిచి వారియాకార ములను బరీక్షించుచుండెను.

అందొకపురుషమూర్తి మునిచిత్తము నాకర్షించెను. ఆమనో హరగంభీరవిగ్రహము నాతఁ డట్టె ఱెప్పవేయక చూచుచు నాలక్షణ

ముల, మననము సేయఁదొడంగెను. ఆతనివదనమండలమునుండి వింత తేజ మొకటి వెలివిరియుచుండెను. ఆ తేజమును సంపూర్ణచంద్రబింబము నందును, నాతఁడు సువ్యక్తముగఁ గాంచియుండఁడు. లావణ్యతేజో మయము లగునాముఖలక్షణముల నాతఁడు చూచుచు నత్యాశ్చర్య ముతో "లోకపాలనాదక్షుతవహించినయీమూర్తి యీసుర్గమారణ్య ముల నేలవసియించియుండె" నని తలపోయసాగెను. సర్వమును దనకు వ్యక్తమైనట్లు తలయూఁచెను. అనంతసంచారిణి యగులక్ష్మి వివశ యయి యాతనివిశాలవక్షస్థ్సలమునఁ గన్నులఱమోడ్చియున్నట్లు లాత నికి ద్యోతకమయ్యెను. ఈలక్ష్మి యిట్లేల నిమీలితనేత్ర యయ్యె నని యాతఁడు తనదివ్యదృష్టిచేఁ జూడసాగెను. మహాత్ముల యంతర్దృష్టికి గోచరింపనియంశ మేమియుండును? సర్వము నాతఁడు గ్రహించెను. మెల్లఁగ నాపురుషపుంగవులున్న తావునకు సమీపముగఁబోయెను. పురు షులిర్వురును నీమహాత్ముని జూచి లేచి నమస్కరించిరి. "మనోరథఫల సిద్ధిరస్తు" అని ముని యాశీర్వదించెను. ఆముర్వురు నావృక్షచ్ఛాయ నాసీనులయిరి. ముని వారిప్రశ్నల కవకాశ మీయకుండఁగనే యిట్లనియెను.

"వత్సలారా! మీవృత్తాంతము సర్వమును నీశ్వరానుగ్రహమున నేను గ్రహించితిని. మీకు సర్వవిధముల జయము కలుగును. మీ కష్టదినములు గడచినవి. అచిరకాలములోనే మీకు మనోరథములు సిద్ధింపఁగలవు" అని వాక్రుచ్చెను.

పురుషులిరువురు నావాక్యముల కాశ్చర్యమగ్నులైరి. యోగి కన్నులుమూసికొని యోచనానిమగ్నుఁడయికొంతవడికి మరలఁ గన్నులు తెఱచి యొకపురుషునిగాంచి యిట్లనియెను.

"వత్సా! మీపూర్వవృత్తాంతమును దెలుప మీ కంతయిష్టముగ నుండదేమో దాని నాఁపి భవిష్యత్తునుగూర్చి యించుకఁ జెప్పవల

నని యుత్సాహపడుచున్నాఁడను. ఇప్పుడు లక్ష్మీకటాక్షము నీకుఁ గలిగినది. ఆమె ప్రోత్సాహినియయి నీకెల్లవిధముల మేలుసేయవలయు నని నిరీక్షించుచున్నది. శీఘ్రకాలములోనే నీవు మహా రాజాధిరాజ వగుదువు. అప్పుడు నీరక్షణము మాబోంట్లకవశ్యకర్తవ్యము. మాయాశ్రమప్రదేశములును, సర్వమును, నీయధీనమం దుండును. నీవు సాధు సంరక్షకుఁడవై చిరకాల మీయవనిని బాలింపఁగలుగుదువు నీవీప్రదేశమున నీశక్తిసామర్థ్యములచేనిందున్న యోధులనొకసైన్యముగాఁ జేర్చుకొని యీదుర్గమును గట్టుచున్నాఁడవు. ఈపని నీకు సులభసాధ్యమై యీశ్వరకటాక్షమున నిది దిగ్విజయముగఁ బరిసమాప్తి కాఁగలదు" అని వచించెను.

ఈసాధువాక్యములు వినినంతోడనే యాపురుషునకు మఱింత యద్భుతము కలిగెను.

యోగి "నలయునేని నీవు మాయాశ్రమమునకు రావచ్చును. ఈశతద్రూనది కవ్వలియొడ్డుననే మాతపోవన మున్నది" అని వచించెను.

పురుషుఁడు "మహాప్రసాదము" అని వినయమును జూపి "తాము రాజయోగానంద స్వాములవారా?" అని ప్రశ్నించెను.

రాజయోగానందస్వామి తపోవనమునందు నివసించియున్నాఁడనియు నాతఁడు చాలమహిమాసంపన్నుఁడనియుఁ బురుషు డిదివఱకు వినియుండుటచే నట్లు ప్రశ్నించెను.

స్వామి "అవును" అనియెను.

ఈమునిపుంగవునియద్భుతమేధాశక్తి మన కత్యాశ్చర్యమునే కలిగించుచున్నది. కాని, దివ్యమునులహృదయములకుగోచరింపనియంశ మేముండును? జ్యోతిషశాస్త్రవేత్త లగుమహానుభావులు కొందఱు గ్రహగతుల గణించి మానవుల భూతభవిష్యదర్థంబులఁ గరతలా

మలకంబుగ విశదీకరింతురు. కొందఱు పండితులు కేరళశాస్త్రాను సారముగ మనుజుల యోగాదులు నిర్ధారణ సేయుదురు. సంసారక్లేశ భారవిముక్తులగు యోగులుకొంద ఱుత్తర యోగినీమతము ననుసరించి సర్వప్రపంచసంగతులనంతలో గ్రహించి వ్యక్తీకరింతురు. ప్రాపంచకతత్త్వము నామూలముగ గ్రహించి పరబ్రహ్మస్వరూపమును దివ్యజ్ఞానముచేఁ జూచుచున్న మహాత్ముల కన్నిశాస్త్రములును తలంపులోననే మూర్తీభవించి మెలఁగుచుండును అన్ని విషయములును నద్దమునందువలెనే స్పష్టముగ గోచరించుచుండును. ఈయోగి చాలమహిమగలవాఁడనియే మనము నిశ్చయింపవలసి యున్నది. మహాత్ముల శక్తిసామర్థ్యములనంతము లయినవిగదా!

పురుషుఁ డించుక యోచించి యోగి యథార్థస్థితి దెలియు నుపాయమును కనిపెట్టెను. ఈపురుషునిక్రింద నున్న యోధు లందఱును నీయోగి నెఱిఁగియే యుందురు. వారంద ఱాదేశవాసులే. ఆకారణమునఁ బురుషుఁడు.

'మహాత్మా! దుర్గప్రదేశమును జిత్తగింపఁ గోరుచున్నాఁడను" అనివిన్నవించెను.

యోగి యాతనిభావమును గ్రహించెనో లేదో కాని "అల్లే యక్కడికిఁ బోవుద మురండు" అనియెను. మువ్వురును లేచిరి. తిన్నఁగ నాకట్టుచున్న దుర్గములోఁ బ్రవేశించిరి

ఆయోగిమహిమ యేమి దెలిసికొనిరో కానినాఁడు మొదలాపురుషు లిర్వురు నాతనికిఁ బ్రియశిష్యులయి మెలంగుచుండిరి. వారు మన చంద్రగుప్తవసంతులే. శైలదుర్గమున నాఁటిరాత్రి యోధుఁడు ప్రశ్నించినది వీరినిగూర్చియే



## అయిదవప్రకరణము.

---

రాజయోగానందస్వామి యాశీర్వచనప్రభావమునఁ గొన్ని మాసములలో శైలారణ్యమునందవలిదుర్గము నిర్విఘ్నముగ నిర్మింపఁబడియెను. ఆదుర్గమునకుఁ బడమటిదిక్కునఁ బ్రవహించుచున్న శతద్రూనది నాధారము చేసికొని తక్కినమూఁడుదిక్కులందును గభీరమైనయగడ్త యేర్పఱుపఁబడియుండెను. ఆదుర్గమునకు బంగ్రెండు ద్వారములుండెను. అందేఁబదివేలసైన్యమువఱకు నుండవచ్చును. దానికి గుప్తదుర్గ మనిపేరు పెట్టిరి. కోట యన్ని ద్వారములయందును ద్వారపాలకులు ఖడ్గపాణులై కావలికాచుచుండిరి. కోటకందకమునకవ్వల చుట్టును గొండలచే నావరింపఁబడి యుండెను. ఆపర్వతపంక్తులచేతనే యందు దుర్గమున్న దని పైనుండిచూచువారెవ్వరును దెలిసికొనఁజాలరు. అవి యెత్తైనవృక్షముల చేతను, దట్టమైన లతలచేతను, పొదలచేతను, నల్లుకొనఁబడియుండెను. ఆ దుర్గమునకు దక్షిణమునమాత్రము చిన్నచిన్న గుట్టలుండెను. కాని యంతయునరణ్యమే. ఆకారణమున నట రక్షకభటులెప్పుడునుండియా త్రోవ నెవ్వరైనవచ్చుట తటస్థించినయెడల నేక్రూరమృగభయమో కల్పించిమఱియొకమార్గమునకు మరలించుచుందురు. ఆమాటలవినక యందుఁబ్రవేశించినవారు మరలఁ బ్రాణములతో నివలకువచ్చుట యెవ్వరునుజూడలేదు.

ఒకనాఁటిరాత్రి వర్షము విశేషముగఁగురియుచుండుటచే గొండ కనుమలనున్న రక్షకభటులందఱును నిలువలేక దుర్గమునకుఁబోయియుండిరి. వర్షము వెలిసినపిదప మరల రావచ్చునని వారూహించుకొనియుందురు కొండలప్రక్కనుండి వర్షప్రవాహములు గలగల ప్రవహించుచుండెను. వర్షమింకను బాగుగ వెలియలేదు.

చీఁకటియంతట దట్టముగ నల్లికొని దారితెన్ను నగపడక యుండెను. ఇది చెట్టు, ఇది పుట్ట, ఇది పల్లము, ఇది మెరక, యను వివేచనము కలుగుట కవకాశము లేకుండఁబోయెను. మేఘగర్జనములు కొండగుహలలోఁ బ్రతిధ్వనించుచుండెను. అందందు సంచరించు వన మృగములు వర్ష వేగమునకునిలువలేక యిటునటుపరువెత్తుచు పెద్దపెద్ద బొబ్బలతో నావనమంతటను జెల్లాచెదరుగఁ దిరుగుచుండెను. నీటివెల్లు వలకుఁ గొట్టుకొనిపోవుచున్న కృష్ణసర్పము లందందు దొరకిన వృక్ష మూలముల నాశ్రయించి బుసలుకొట్టుచుండెను. కప్పలబెకబెకారావ ములచే భూనభోంతరాళములు మారుమ్రోయుచుండెను. ఆయంధ కారమున నట్టిభయంకరారణ్యమున నాక్రూరజంతుసంకుల భీషణారావ ములనడుమ మనుష్యమాత్రుఁ డెవ్వఁడు బ్రదికి సంచరింపఁగలఁడు?

క్రమక్రమముగ వర్షము వెలిసినది. కొంతసేపటికి జలప్రవాహ ములును తగ్గినవి. భూమి నీటిలోనుండి బయటఁ బడియెను. రాత్రి రెండు జాము లైనది. అది కృష్ణపక్ష మగుటచేతను, నాఁ డష్టమి యగుట చేతను, అప్పుడే చంద్రోదయ మగుచుండెను. ఇంకను మబ్బు బాగుగ విడిపోనికారణమున వెన్నెల యంతతేటగ లేదు. ఆవెన్నెలకాంతియై నను వృక్షాగ్రముల మీఁదను, పర్వత శిఖరములమీఁదను,మాత్రము ప్రసరించుచుండెను. చెట్లక్రిందను, పొదలలోనను, గాఢాంధకారమే. చంద్రుఁడు పైకెక్కినకొలఁది కొమ్మలసందులనుండి తడిసియున్న నల్లని భూమిపైఁ బొడపొడలుగఁ దోఁచువెన్నెలకాంతులు నీలాంబరము పై నున్న మల్లెపూలరాసులవలె రమణీయముగఁ గనఁబడుచుండెను.

ఆసమయమున నాయరణ్యదక్షిణపార్శ్వమునుండి కొండకనుమల దాఁటి యొకపురుషుఁడు ఖడ్గహస్తుఁడై మెల్లఁగ దారిఁజూచుకొనుచువచ్చు చుండెను. ఆతఁడందు సంచరించ నలవాటు లేనికారణమున నొక కొండ కనుమవెంటవచ్చుటకుమారుగ నొక రాతిమిట్ట చిట్టచివరకెక్కినలుదెసలఁ

బరికించుచుండెను. దూరముననుండి యెవ్వరో యీదారిని వచ్చుచున్నట్లు కనిపట్టెను. "రానిమ్ము స్వామియాజ్ఞ నెఱవేర్చి కృతకృత్యుఁడ నయ్యెద" నని యనుకొనియెను. వెంటనే మెట్లపైనుండి దిగి దుర్గ సమీపమున నున్న వృక్షపంక్తిలోఁ బ్రవేశించెను. ఆచెట్ల దాఁటి యాతఁడు ముందునకుఁబోవక లతాపత్త్రములచే నిబిడీకృతం బగు నొక వృక్షము నెక్కి గుబ్బుగొమ్మలలో దాఁగియుండెను.

కొంతసేపటికి వెనుకనున్న పురుషుఁ డాసమీపమున నందందుఁ దిరుగుచుఁ గ్రమముగా నిచ్చెట్టు నొద్దకు వచ్చెను. ఆతని కెట్టయెదుట దుర్గము కానిపించెను. ఆతఁడు దుర్గమును జూచి యాశ్చర్యముతో "ఈదుర్గ మెవ్వరిదై యుండును? నేనుకొన్ని మాసములక్రిందటఁ దక్షశిలా నగర మేగునప్పు డీమార్గముననే నాసహచరులతోఁ బోయి యుంటిని. అప్పు డిందీదుర్గమును జూచియుండ లేదు. ఇం దెవ్వ రుండియుందురు? మాప్రభు వనేకప్రయత్నములు చేసి వెదకుచున్న పురుషు లిందుండి యుందురేమో? దీని యానుపాను లన్నియును జూచి మఱిపోవలయును. ఈ వృత్తాంతము మాప్రభునకు నివేదించి బహుమానము నందెదను" అని యనుకొనుచు వెన్నెలవెలుతురునఁ దన్నెవరైనఁ జూచెదరేమో యని మొదటిపురుషుఁ డెక్కియున్న చెట్టునీడను నిలువఁబడి యుండెను.

ఆచెట్టు పొన్నచెట్టు. దానికొమ్మలు గుజ్జుగను, నేలకుఁ జాల సామీప్యముగను నుండెను. ఆచెట్టుపై నున్నపురుషుఁడు కదలినయెడల నాకులపైనున్న వర్షబిందువులు క్రిందివానిపై జలజల రాలును. ఆకారణమునఁ బైనున్నయాతఁడు చిన్నకొమ్మలపైకి దిగుటకుఁ బోక నెమ్మదిగాఁ జెట్టు మొదటి పలవలోనికి దిగియెను. క్రిందిపురుషుఁ డచ్చటికి రెండు మూఁడుగజములదూరముననుండెను. అప్పుడు మొదటిపురుషుఁడు పలవ

పైఁ గూరుచుండి తిన్నగ గుఱిచూచి తన కుడిచేత నున్న ఖడ్గమును ముందునకు వంగి క్రిందనున్నవాని పైకి విసరెను. అది గుఱితప్పక యాతని వెన్నునుండి గుండెలవఱకును బలముగ గ్రుచ్చుకొనియెను. ఆపోటుతో నాతఁడు "హా! చచ్చితిని" అని యొక పెద్ద కేక వైచి క్రిందఁ బడిపోయెను.

చెట్టుమీఁద నున్న యాతఁడు క్రిందికి దుమికి తనకత్తిని దీసికొన వలయునని ప్రయత్నించుచుండెను. ఈలోపలఁ గోటదక్షిణద్వారమున నున్న రక్షకభటులు లీయార్తనాదమును విని పరుగెత్తుకొని వచ్చిరి. వారు వచ్చులోపల మొదటివాఁడు రెండవవానిహృదయమును భేదించి తనఖడ్గమునూడఁ బెఱికికొనియెను. ఆకత్తిఁదీసినతోడనే యాతనిప్రాణము లెగిరిపోయినవి పురుషునిమొడలును మొగమును రక్తమయమయ్యెను. ఇంతలో రక్షకభటులు వచ్చి మొదటిపురుషుని బట్టుకొని "నీవెవ్వరవు? ఈతని నేల చంపితివి?" అని బలవంతపెట్టి యడుగసాగిరి. కాని, వారి కాతఁ డేమియు నుత్తర మీయలేదు.

అప్పు డాభటులు హంతకుఁడగు మొదటి పురుషుని, చచ్చిపడి యున్న రెండవ పురుషుని మృతకళేబరముతోఁగూడ దుర్గద్వారము చెంతకుఁ దీసికొనివచ్చిరి. అప్పటికిఁ జాలమంది సేవకులు లోపలినుండి పరుగెత్తుకొని వచ్చియుండిరి. "వీఁడెవ్వఁడో మన వృత్తాంతమును దెలిసి కొనుటకయి వచ్చెను. చంపుఁడు! పొడువుఁడు!" అనికొందఱును "చంపిన కారణమేమియో తెలిసికొనినవెనుక నీతనిగూడ నాతనితోడనే పంప వచ్చును" అని మఱికొందఱును బిగ్గఱగ మాటలాడసాగిరి. కోటముందు వినఁబడుచున్న యీకలకలము విని దుర్గములోనివారు కొందఱు లేచిరి. కొందఱు "దొంగలుదొంగ" లని కేకలువైచిరి. ఆకేకలతో నందఱును లేచిరి. ఇంతలో దుర్గాధిపతి యగుచంద్రగుప్తుఁడు లేచి యుచితరీతి

నచ్చుటికి విచ్చేసెను. అతని వెనుక వసంతుఁడుకూడ లేచి వచ్చెను. రక్షకభటులు జరిగినదంతయును చెప్పి శిక్షార్హుఁడగు నాపురుషుని రాజు ముందటఁ నిలువఁబెట్టిరి.

ఆపురుషుఁడు చంద్రగుప్తునకును వసంతునకును నమస్కరించి నిర్విచారముగ నిలువఁబడియెను. వారాతని ధైర్యమునకు మిగుల నాశ్చర్యపడిరి.

అప్పుడు చంద్రగుప్తుఁ డాపురుషుని జూచి "నీవెవ్వరు?" అని ప్రశ్నించెను.

"నేను స్వామిభక్తుఁడను" అని పురుషుఁడు బదులుచెప్పెను.

"అకారణముగ మార్గస్థులను దొంగపోటుగ హింసించు హంతకులు స్వామిభక్తు లెట్లగుదురు?"

"ఈతఁడు మార్గస్థుఁడు కాఁడు, రాజద్రోహి"

"ఈతనిప్రభు వెవ్వరు?"

"నందుఁడు"

చంద్రగుప్తుఁడు మండిపడి "నీవు నందునిచారుఁడవా?" అని గద్దించి పలికెను.

"నేనట్టివాఁడను గాను. నందభటునిప్రాణముల హరియించిన వాఁడను."

"అతని నీవేల చంపితివి?"

"చంద్రగుప్తునకు ద్రోహము తలపెట్టుటచేత"

చంద్రగుప్తున కనుమానము కలిగెను. ఆతఁడు ప్రాణముల కాసించి కపటమార్గమును ద్రొక్కుచున్నాఁ డని తలంచెను. "నినివాస మెక్కడ?" అని ప్రశ్నించెను.

"పాటలీపుత్రమున"

"పాటలీపుత్త్రప్రజలకుఁ జాంద్రగుప్తునిపై నభిమాన మెందు లకు"

"ఆప్రజలకన్ను లన్నియును జంద్రగుప్తునిమీఁదనే యున్నవి. అందుఁ జాణక్యునిశిష్యుఁడ నగునా కాతనిపై భక్తి యుంటుట కాశ్చర్య మేమి?"

చంద్రగుప్తునకు మఱింతయనుమానము కలిగెను. ఈయొక్క ప్రశ్నలో నాతనిసత్యచరిత్రమును దెలిసికొనవచ్చునని తలంచెను "ఓయీ! చాణక్యుఁ డగ్నిజ్వాలలోఁ బడిపోయెనుగదా! ఇంక నాతనికి శిష్యులెక్కడ నుందురు?" అనియెను.

పురుషుఁడు కర్ణములమూసికొని "అమంగళము శాంతించుఁ గాక! శత్రువులును, తెలియనిప్రజలు, నట్లునమ్మియున్నారు. ఆమాటయే నిజమైనయెడల నీయుత్తర మెట్లు మీకు వ్రాయుటతటస్థించును?" అని తనయంగీలోనుండి యొకయుత్తరముఁ దీసి చంద్రగుప్తున కొసంగెను.

చంద్రగుప్తుఁ డాయుత్తరము నందుకొని యిట్లుచదువుకొనియెను.

"వత్సా! మురాకుమారా! కలశపురమున వసుమతిని శత్రువు లెత్తికొనిపోయి రని విని చాల చింతించితిని. అది దైవగతి.ఆమెకై. యీప్రాంతముల వెదకించుచున్నాఁడ. నందపక్షపాతు లగురాజుల నారసి నీవుకూడ నాయాచోటుల వెదకించుచుండుము. వసంతునకు ధైర్యము చెప్పుచుండుము. నేనిచ్చట నందవధోద్యోగమున నున్నాఁడ. సమయమును నిరీక్షించుచున్నాఁడను. నీయభ్యుదయమును విని పర మానందము నొందినాఁడను. ఇక్కడ విశేషములంగూర్చి మరల నుత్త రము వ్రాసెదను. అచ్చటివిశేషములఁ దెలుపుచుండుము."

చాణక్యుఁడు"

ఈయుత్తరము చదివినతోడనే చంద్రగుప్తున కమితానందము కలిగెను. వసంతునిహృదయముమాత్రము వసుమతీస్మరణమువలన కలక

నొందుచుండెను. ఆయుత్తరమునుబట్టి యాపురుషుఁడు చాణక్యశిష్యుఁడే యని చంద్రగుప్తునకు నమ్మకము కలిగెను.

ఈసందర్భమునందెలిసినచాణక్యుని చరిత్రముంగూర్చి చదువరులు సందేహింపనక్కఱలేదు. ఆతఁడు సకలవిద్యాపరిపూర్ణుఁడు. అగ్నిస్తంభన విద్యవలననో మఱియేమాహాత్మ్యముననో, యాతఁడు జీవించి యుండవచ్చును. అలనాఁటిరాత్రి మిత్రుఁడగు నిందుశర్మతో వచ్చి చంద్రగుప్తునిఁ గోటలోనుండితప్పించిన మహాత్ముఁడుచాణక్యుఁడే. నందవంశమును నాశనముచేయకుండ, మగధరాజ్య సింహాసనమునఁ జంద్రగుప్తుని స్థాపింపకుండ నాసంకల్పసిద్ధుఁ డూరక మరణించునా?

చంద్రగుప్తుఁడు పురుషునివంకఁ జూచి "నీముఖమండలము రక్తసిక్తమై యుండుటచే నిన్నానవాలు పట్టలేకున్నాను. నీపేరేమి ?" అనిప్రశ్నించెను.

"భద్రుఁడు" అని యాతఁడు చెప్పెను.

చంద్రగుప్తుఁ డాపేరు నిదివఱకు వినియే యున్నాఁడు. "నీవు విశాఖులునితమ్ముఁడవుకావా ? నిన్నుగుర్తుపట్టలేక పోతిని ! భద్రా! నీవీపురుషునెందులకుఁ జంపితివి?" అనియెను.

"నేఁటి యుదయమునుండియు నీతఁడు నన్ను వెన్నాడి వచ్చుచున్నాఁడు. ఆతనికిఁ దెలియకుండ నేనును, నాకుఁదెలియకుండ నాతఁడును నీసమీపవనమునఁ బ్రవేశించితిమి. యమునానదియొడ్డున నీతఁడు తనమిత్రునితో సంభాషించినమాటలనుబట్టి యీతఁ డీపాంచాలరాజులలో నెవ్వరికో వేగునడుపుచున్నట్లు తెలియవచ్చినది. ఈతఁ డేదోలేఖకూడఁ దీసికొనిపోవుచున్న ట్లనుమానించితిని. ఆకారణమున నీతని నూరక విడిచిన నపాయము రాఁగలదని యూహించి యీతని వెనువెంటనేవచ్చితఱివేచియిచ్చటసంహరించితిని" అని పురుషుఁడు చెప్పెను.

"అటులైన నీతనివస్తులలో నేదైన లేఖ దొరకునేమో వెదకుఁడు" అని చంద్రగుప్తుఁ డాజ్ఞాపించెను.

రక్షకభటు లట్లు వెదకి యతనియంగీలో నున్న లేఖను దీసి చంద్రగుప్తునకిచ్చిరి. ఆతఁ డాయుత్తరమునందుకొని యీక్రిందివిధముగఁ జదివెను.

"ప్రియమిత్రమా !

రత్నగిరిరాణి పరిచారికాసహితముగ నీయొద్దకుఁ గొనిరాఁబడిన దని విని యానందించితిని. కల్లోలము లణఁగువఱకు నామెను నీయొద్దనే యుంచి సంరక్షింపుము. ఇచ్చట ప్రజలందఱును రాజద్రోహులై పోవుచున్నారు. నేనును, సమయానుకూలముగ శాసించుచున్నాఁడను. చాణక్యుఁడు చచ్చియును సాధించుచునే యున్నాఁడు. చాల నలజడిగా నున్నది. నాకు శత్రువులై పోయినవారినిగూర్చి నీవును తగినంతప్రయత్నము చేసి వెదకించుచుండుము. తఱచుగ నుత్తరములు వ్రాయుచుండుము.

మహారాజాధిరాజ పద్మనంద"

ఇట్లు లేఖను జదివెను. కాని, యది యెవ్వరికి వ్రాయఁబడినది యేమాత్రము బోధపడలేదు. చాకుఁడు చంపఁబడినందులకుఁ జంద్రగుప్తుఁడు విచారించెను. వసుమతిజాడ నరయుటకయి మరలఁ గొంత యవకాశము దొరకెను. ఆమె పాంచాలదేశమునం దున్న రాజులలో నెవ్వరియొద్దనో యుండు నని నిశ్చయింపఁబడియెను.

ఈయుత్తరముల మూలమున వసంతునిహృదయము కలఁగి పోయెను. వసుమతి యెట్టిపాటునకు లోనైనదో యనువిచార మాతని హృదయమును వేధించుచుండెను. వసుమతినిఁ జోరు లపహరించిన మూఁడుదినములకు వసంతుఁడును జంద్రగుప్తుఁడును కలశపురమునకుఁ బోయిరి. అచ్చట పిడుగువంటి యీవార్త నాలకించిరి. నాఁటనుండియు నామెయీగడ యేమియును దెలియుటయే లేదు.

---

## ఆఱవప్రకరణము.

ఎచ్చట హృదయము లగ్న మగుచుండునో యచ్చట భావ ముదయించుచుండును. భావమునకు వికారములున్నవి. అదిక్షణక్షణము నకును, వింతవింతరూపములను దాల్చుచుండును. దానిరూపము లనం తము లైనవి. ప్రపంచమునందలియన్నిరూపముల నది ధరింపఁగలదు. హృదయముకురమునందుఁ బ్రపంచ మంతయుఁ బ్రతిఫలించుచుండును. దానికొక తెర యున్నది. అట్టితెరఁ దీసినయంతభాగమందు నది గోచ రించుచుండును. అది యెంతవఱకు గోచరించుచుండునో యంతవఱకే దానితో భావ మైక్యము నొందుచున్నది. లేదా యారూపమును ధరించుచున్నది. భావమునం దిట్టియద్భుతశక్తియే లేనియెడల నిప్పుడా వసంతునిహృదయమునందు వసుమతీమోహనవిగ్రహ మెట్లు ప్రదీపిత మగుచున్నది?

వసంతుఁ డిప్పు డెందున్నాఁడు? దేహపరిశ్రమాగారమున లేఁడు కార్యాలోచనామందిరాంగణమునం దిరుగుట లేదు. సమరశాస్త్రాభ్య స్తులఁ బరీక్షించుటలేదు. శత్రుకార్యతంత్రములకుఁ బ్రత్యాలోచనము

సేయుట లేదు. అదృష్టాధిదేవత యొడిలో వినోదించుచున్న చంద్రగుప్తుని పజ్జ గూర్చుండి యుండలేదు. నూతనదుర్గమున శయనాగారములోఁ బరుండి యుండెనా? లేదు. మఱి యెందున్నాఁడు?.

శీతలమందమందానిలవిలసితం బగుచోట, సరసప్రసూనసౌరభ సముచితం బగుచోట, తరంగశీకరవిక్షిప్తం బగుచోట, తరులతాపల్లవ శోభితం బగుచోట, రసాలశాఖాచుంబిత నదీజలంబగుచోట, నానా విధవిహంగ విలాస యోగ్యంబగుచోట, నాతఁడు కూర్చుండి యున్నాఁడు. అది శతద్రూనదీతీరము.

నది వేగముగఁ బ్రవహించుచున్నది. ఆ ప్రవాహవేగమున మర్మర ధ్వనులు బయలు వెడలుచుండెను. పవనసంచలనంబున నానదినుండి బయలు వెడలుచున్న తరంగమాలికలలో మనోహరశబ్దంబు లుత్పన్నంబు లగుచుండెను. చందమామ యాయూర్మికాళికలలోఁ దూఁగు చుండెను. తారకలుగూడ నందందు పూవులవలె మెఱయుచున్నవి. తరంగచలనవేగంబున నదియంతయు మెఱుపుతీఁగలతో నిండిపోవు చుండెను. చంద్రునినిర్మలాకారము సువిస్పష్టముగఁ గనఁబడుట లేదు. ఆకా శమును నందుఁ బ్రచలిత మగుచునే యుండెను. తరంగములయంచుల యం దది తలసూపుచుండెను. వసంతుఁ డీప్రకృతిచిత్రములను జూచు చుండెనా? లేదు.

అందాతఁ డేమి చేయుచుండెను. హృదయమునందుఁ బ్రదీపిత మగు చున్న వసుమతీమోహనమూర్తిని గాంచుచుండెను. దానితో మాటాడుచుండెను. ఆతనిభావనాబలమే యట్లు మాటాడించుచున్నది. అందులకాతనిహృదయమే సాక్షి. వసుమతి యెవ్వరికిఁ గనఁబడకుండఁ బోయినను వసంతునకుమాత్రము లోపలను, వెలుపలను నంతటను, గాన్పించుచునే యున్నది. వసుమతి యిప్పుడు విశ్వరూపమును దాల్చినది. అట్లుకానియెడల నాతఁడు సంపూర్ణకళలచే నాకసమున వెలుఁగుచున్న

చందురు నేల "వసుమతీ" యనిపిలుచును? ఆవెన్నెలనిగ్గు నామె మైచాయయని యేల కౌఁగిలించుకొనఁబోవును? రూపముగలవస్తువులకు రూపమునుగల్పించుట యుక్తమే. భూమ్యాకాశముల యంతరాళమున నెచ్చటఁజూచిన నాతనికి వసుమతియే కాన్పించుచున్నదే! అది యెట్లు? అది మోహావికారమువలనఁ గలిగినతన్మయత్వము. దానిచే నాతనికి సర్వమును వసుమతిగనే కనఁబడుచుండెను. ఆతఁడు కన్నులుమూసి కొనియెను. అప్పుడువసుమతి కాన్పించుచునేయున్నది. మరలఁ గన్నులు విప్పెను. ఎదుట వసుమతి యున్నది. మునుపటివలెఁ జెంత సుందరి మాత్రము లేదు. మాటలాడుపట్టున సుందరి యీతనికిఁ బ్రత్యుత్తర మిచ్చుచుండెడిది. ఇప్పుడు వసుమతితో నేమని మాటలాడును? నిత్య సాన్నిధ్యముచే వసంతున కాశంకయును వీడిపోయినది.

ఆతఁడు "వసుమతీ"యని పిలిచెను. ఆమె యాతనితో మాటాడ లేదు. వసుమతిముగ్ధ ఎప్పుడునీవఱకువసంతునితో మాటాడియుండలేదు. ఇప్పుడునుమాటలాడలేదు. వసంతునిహృదయమున కీయర్థమే వ్యక్తమై నది. ఇదిపూర్వపరిచయస్మృతి. ఈస్మృతి కర్థమేమని మీరడుగవచ్చును. దీనికనుభవజ్ఞానమే టిప్పణమై యున్నది. వసంతునకు వసుమతినిజూచుట మాత్రమే యనుభవమున్నది. ఆతఁ డప్పుడు మాటాడలేదు. ఇప్పు డామెమాత్ర మెట్లుమాటాడును? ఆకథాంశమంతయు ముగిసినది. ఆతఁడు మరలఁ బిలువలేదు. ఆతఁ డా మోహనాకారమును జూచు చుండెను. ఱెప్పవాల్పక చూచుచుండెను. ఆ తేజోమయాకారము, నామోహన తేజోమయాకారము, నాపరిపూర్ణ మోహన తేజోమయాకారము, నాతఁడుచూచుచుఁ జూచుచునుండఁగనే కనుదమ్ములిట్టెమూఁతవడియెను. అమితతేజస్సును గన్నులు భరింపకయో, వివశత్వమునఁ గనుఱెప్పలు బరువులెక్కియో! మూఁతపడియుండును. ఆతఁడు కొంతసేపటివఱకు

మరలఁగన్నులువిప్ప లేదు. ఆసమయమునం దాతనిపై నిద్రయావేశించి నది. కాని, యది సుషుప్తిమాత్రము కాదు. ఆనిద్రలో "వసుమతీ! వసుమతీ"యనియాతఁడు రెండుపర్యాయములుమాత్రము పలవరించెను. దీనినిబట్టి యాతఁడేదియో స్వప్నమును గనుచుండె నని తెలియుచున్నది. ఆస్వప్నవృత్తాంతమును వినుఁడు.

వసంతుఁడు వధ్యశిలయొద్ద నుండెను. కూడఁ దలవరులున్నారు. కాని, వారందఱు సుందరియాకారముతో నుండిరి. వధ్యశిల కొంత సేపటికి వసుమతి యైనది. వధ్యశిలకును వసుమతికిని గలసంబంధము నాతఁడు యోచింపసాగెను ఎంతయోచించినను నది యాతనికి విడి పోయినదికాదు. వధ్యస్థానమం దున్నతోఁట యంతయు శచీసౌధమై పోయినది. అన్నియును మారినవి. విష్ణుగుప్తుఁడుమాత్రముమారిపోలేదు. అన్నియు నాతనికి సమంజసముగనే తోఁచినవిగాని తలవరులు సుందరీ రూపమును దాల్చుట యాతని కర్థమైనదికాదు. సుందరియగ్నిజ్వాలల నుండి తప్పించుకొని పాఱిపోవుచుండెను. వసంతుఁడుపన్యాసమునిచ్చు చుండెను. ఆయుపన్యాస మంతయు వసుమతినిగూర్చియే. విష్ణుగుప్తుఁ డాయుపన్యాసమును వినుట లేదు. వసుమతివంకఁ జూడసాగెను. వసం తుని యుపన్యాస మంతటితో నాఁగిపోయినది. విష్ణుగుప్తుఁ డుపన్యాస మును జెప్పుమని యాతని బలవంతపెట్టెను. ప్రజలందఱును జంద్ర గుప్తునితనభుజములపై నిడుకొనితీసికొనివచ్చిరి. అందఱుభుజములమీఁ దను జంద్రగుప్తుఁడే కనఁబడుచుండెను ఇంతలో శచీసౌధము శతద్రూ నదిలో మునిఁగిపోయినది విష్ణుగుప్తుఁ డాసమయమున వసుమతి నెత్తి కొనియెగిరిపోయెను ఎగురుచున్నవిష్ణుగుప్తుని బట్టికొనుటకై వసంతుఁడు చేతులుసాచెను. అందలేదు. ఆతనిభుజములమీఁద వసుమతి లేదు. అదివసంతుఁడు చూడలేదు. విష్ణుగుప్తుఁడు తలక్రిందుగఁ బడిపోయెను.

అప్పుడు వసుమతికి దెబ్బతగిలిపోవునేమోయని వసంతుఁడు "వసుమతీ! వసుమతీ" యని కేకవైచెను. దీనిగాథ యింతవఱకు మనకుఁదెలిసినది. ఇంతలో వసంతుఁడు కదలుటచే స్వప్న మాఁగిపోయినది. ఆతఁ డులికిపడి లేచెను. అప్పుడు శతద్రూనదీజలతరంగశబ్దములలో మనోహరగానరసమాధుర్యము లీన మగుచుండెను.

కాంభోజరాగము—ఆదితాళము.

* 1. చారుమతి రాధిక యబలరా!
జయ మదనగోపాల! ॥చారు॥

2. నిరంతరమధురానగరవిహరణ
పరతఁ జిక్కి చెలువ నేల మఱచెదు ॥చారు॥

3. అనునిమిషము మనమున నినుఁ దలఁచుచు
నతనుశరనిహతి నలసి తడఁబడుచు
తనులత వడఁకఁగ నదరి బెదరి వగ
మనసు చెదర నసురు విడునఁగలదుర! ॥ చారు॥

ఈపాట పాడుచున్నవా రెవ్వరో మన కగపడుట లేదు. వసంతుఁడేమో యాలోచించుకొని యాస్వరము వినవచ్చుదిక్కు ననుసరించి వెడలిపోయెను.

---

* 1. సా స్స ని ధ పా ధ ప మ గ రి సా
ధ ధ ప మ గ గా పా ధ ॥ సాస్స॥
2. స రీ స ని ధ ప ధా ప మ గ ప ధ స రి
స రి గ సా ని ధ ప ధ పా ధ మ గ ప ధ ॥ సాస్స॥
3. స రి స ని ధ ప ధ ని ధ ప మ గ మ ప ధ ని
ప ధ ప ని ధ ప ధ ప మ ప [illegible] గ మ ప ధ ప
మ గ మ ప మ ప ధ ప ని ధ ప స ని ధ ప ధ
రి స ని ధ ప ధ స ని ధ ప మ ప మ గ ప ధ ॥ సాస్స॥



# ఏడవ ప్రకరణము.



చరిత్రజ్ఞానము పూర్వజన్మస్మృతివంటిది. పూర్వము మన మె ట్లుంటిమో, ఏమేమి చేసితిమో, తెలిసికొనవలయు నను నభిలాష ప్రతి మనుజునకునుగలిగియుండును. కాని, యది యసాధ్యమైనవిద్య. మహాత్ము లావిద్యను సాధింపఁగలుగుదురు. సామాన్యులకది దుర్భేద్యముగా నుండును. మహానుభావు లగుమనఋషులు పూర్వజ్ఞానమునుగలిగియుండి రని మనము పురాణాదులవలన వినుచున్నారము. మనదేశమున నా దినములలో నట్టిమహనీయులు చరిత్రకోశములవలెఁ బ్రకాశించుచుండిరి. రానురాను, నట్టిశక్తి ప్రజలయం దడఁగిపోయినది. పూర్వజ్ఞానము నశించినది. అందువలన మనకు నిజమైనచరిత్రములు కావలసివచ్చినది. కాని, యవి వ్రాయువా రెవ్వరు? వాని నెఱింగియున్న మహాత్ములు మన కిప్పు డగపడుట లేదు. ఆకారణమున మనకుఁ జరిత్రములు లేనికొఱఁత కానవచ్చినది. మనమిప్పుడు మనపూర్వచరిత్రమును దెలిసికొనఁ గోరుట తెక్కలుఁ లేనిదే యాకాశమున కెగురఁదలంచుట యైనది.

పశ్చిమఖండవాసు లట్లుగాక మొదటినుండియు గ్రంథరూపముగఁ దమతమదేశచరిత్రములను వ్రాసియుంచికొనిరి. వారిలోఁ గొందఱు మనదేశమునకు వచ్చుట తటస్థించినప్పుడు మనదేశచరిత్రములనుకూడఁ దామెఱిఁగియున్నంతవఱకుపక్షపాతబుద్ధితో డనో, న్యాయైకమతితో డనో, న్యూనాధిక్యముల నిరూపించుచు వ్రాసియుంచిరి. ఆయితరభాషా చరిత్రముల నాధారము చేసికొని మనపూర్వచరిత్రము కొంతకొంత యస్పష్టముగనో, సూచనమాత్రముగనో, తెలిసికొనఁగలుగుచున్నారము. మనపూర్వరాజులు స్థాపించిన శిలాశాసనములనుబట్టియు శాశ్వతకార్య ములనుబట్టియుఁగూడఁ గొంత తెలిసికొనుచున్నారము. మనకథాకాలము

నాఁటికి గ్రీకు దేశ రాజగు నలెగ్జాండ రీదేశముపై దండెత్తివచ్చుటచే నా కాలమును, నప్పటికొండఱుకొండఱు రాజులును, వారిచరిత్రములయం దెక్కెరి. ఆకారణమువలన నితరభాషలయందు రచియింపఁబడినచరిత్రములే మన కాధార మైనవి. అట్టియాధారములచేతనే మనము, చరిత్రములను, మఱియితరగ్రంథములను, నిప్పుడు వ్రాసికొనఁగలుగుచున్నాము. ఈసందర్భమున మనకథా కాలమునాఁటి దేశ చరిత్రములఁ గొంతవఱకుఁ దెలిసికొనవలసి యున్నది. ఇంతమాత్రమునఁ జదువరుల కీప్రకరణమునం దభిరుచి యుండకపోదని తలంచుచున్నాము.

క్రీ ము. 327 సం॥ లో గ్రీకు దేశపురాజగు నలెగ్జాండరు మనదేశమునుజయించుటకై యాఫ్ఘనుస్థానముమీఁదుగసింధు దేశమునఁ బ్రవేశించెను.క్రమముగ నాయా దేశములను జయించుచు సింధునదిని దాఁటి పాంచాల దేశములోని తక్షశిలానగర ప్రాంతముల నాతఁడు దండువిడిసెను. ఈసమయమునఁ బాంచాలరాజు లన్యోన్యకలహములలో మునిఁగి యుండిరి. అప్పటి తక్షశిలరాజు "అంభిరుఁడను వాఁడు" సింధువితస్తానదుల మధ్య దేశమును బాలించుచుండెను. అంభీరునకును, నాకేశినీవితస్తానదుల మధ్య దేశమును బాలించుచున్న పురుషోత్తమునకును, బ్రబలవిరోధము. ఆకారణమునఁబురుషోత్తముని సాధింపవలయు ననియంభీరుఁడు తన సేనలతో నలెగ్జాండరునకు సాహాయ్యమేగి పురుషోత్తమునోడించెను. మఱియు వితస్తానదిప్రక్కనున్న లావణదేశాధీశ్వరుఁడగు సౌభూతినిఁగూడ నలెగ్జాండరునకు దాసునిఁ జేసెను. కాలవశమున సౌభూతి లొంగిపోయెనే గాని యంభీరునిపైఁ గ్రోధాగ్ని యాతనిహృదయమున రాజుచునే యుండెను.

పురుషోత్తముఁడు చాల బలశాలి. విశేషసైన్యములు గలవాఁడు. పాంచాల మంతయుఁ బాలింపఁగల శక్తిమంతుఁడు. అట్టివాని యౌన్నత్యమును నంభీరుఁడు చూడలేక పోయెను. మగధ దేశమును

పాలించుచున్న పద్మనందుఁ డితని నెలుఁతైనఁ గడతేర్చి పాంచాల మంతయు నాక్రమించుకొనవలయుననియంభీరునితో స్నేహము జేయుచుఁ గాలమును గనిపెట్టి యుండెను. కాని, పిట్టపోరు పిల్లితీర్చినట్లుగ నడుమ నన్యదేశీయుఁ డగు నలెగ్జాండరు వచ్చి పాంచాల మంతయు నాక్రమించుకొనియెను అలెగ్జాండరు మహావీరుఁడు ఆతనికి యుద్ధములోఁ బరాజయమనునది లేనే లేదు. ~~పురుషోత్తము~~ఁ డాతనితోఁ జేరి తనజ్ఞాతియు, శీలకోటరాజునగు మఱియొకపురుషోత్తముని జంపించెను. ఆతని సంతతివా రాశ్రయవిహీనులై కొండలఁబట్టి పోయిరి. ఇట్లు క్రమక్రమముగఁ బాంచాలమంతయు జయించి ఆదేశమును పురుషోత్తముని యాధిపత్యముక్రిందనుంచి క్రీ. పూ. 325 సం॥లో నలెగ్జాండరు తనదేశమునకు మరలెను. అన్యోన్యవైరములచే చాలమంది రాజులు తమప్రాణములతో రాజ్యముల నావిదేశీయున కొప్పగింపవలసినవారైరి.

అంభీరునికోరిక నెఱవేఱినను పాంచాలప్రభుత్వమాతనికి సంపూర్ణముగఁ దక్కినది కాదు. అది పురుషోత్తమునియందే నిలుపఁ బడినది. అంభీరునకా కారణమున మరల లోలోపలఁ గ్రోధాగ్ని రవులుచునే యుండెను. అలెగ్జాండరు తాను జయించిన దేశమును రక్షించుటకై తన సైన్యము కొంత సింధునదికవ్వల నిలిపి దానికొక యధ్యక్షుని నియమించెను. ఆసేనావ్యయ మంతయు నంభీరుని నెత్తిమీఁదనే పడియెను

కొంతకాల మయినపిమ్మట పాంచాలదేశనాయకుఁ డగుపురుషోత్తముఁడు వ్యాధిగ్రస్తుఁడై యీలోకమును విడిచెను. ఈ సమయమునకయి చాలమంది రాజులు వేచియుండిరి. వారిలో మగధదేశ సార్వభౌముఁ డగుపద్మనందుఁ డొకఁడు. అంభీరుఁడు రెండవవాఁడు. అలెగ్జాండరావలికిఁబోయినప్పటినుండియుఁ బాంచాలమంతయు నొక్క కబళముగా × గ్రసింపవలెనని చిన్నచిన్న సేనలతో యోగసాహాయ్యమున విశేషసైన్యమునకధికారియైనమీపదుర్గములనుగొట్టి సాధించి, ప్రచండతేజస్వియై

యున్న చంద్రగుప్తుఁడుమూఁడవవాఁడు. మొదటిరాజు చాలదూరము నందున్నవాఁడు. ఏమి చిక్కులలో నుండెనో యాతఁడురాలేదు. రెండవ వాఁడగునంభీరుని కీసమయమున లావణాధిపతి యగు సౌభూతితోఁగల హము సంప్రాప్తమయ్యెను ఆతఁ డీకఁ గోటనెల్లు విడిచిపెట్టి రాఁగలఁడు? ఇంకను గాశ్మీరము మొదలగు చిన్న చిన్న దేశముల రాజులు కలరుగాని వారాపురుషోత్తముని సేన నెదిరించుపాటిసామర్థ్యము లేని వారు. మూఁడవవాఁ డగుచంద్రగుప్తుఁ డీసమయమునఁ దనబుద్ధిసామర్థ్య ములచేఁ బురుషోత్తమునిబలముతో సమానమగు బలమును జేర్చుకొని యుండెను. చారులమూలమునను, యోగికరుణవలనను,నీసమాచారము నాతఁడు తెలిసికొనియెను. సేనలుమడియకుండ రాజ్యమునుస్వాధీనము చేసి కొనవలయుననియాతఁడు యోచింప సాగెను. తనసేనాసమూహముతో శతద్రూనదినిదాఁటియోగియాశ్రమమునకువచ్చిచేరెను. మహాయోధుఁ డచ్చటికిఁ రాలేదు. కాని, యాతనిసైన్య మంతయును వచ్చినది. ఆ సైన్యమున కిరువురురాజపుత్త్రవీరు లధ్యక్షులుగ నుండిరి. వారిరువురు క లెగ్జాండరుచేఁ జంపఁబడిన శిలకోటరాజగు ద్వితీయపురుషోత్తముని పుత్త్రు లగుమహావీరులు. శత్రుల కోటలోని రహస్యముల బాగుగఁ దెలిసిన వారు. చంద్రగుప్తుఁ డన్ని సైన్యములను మూఁడుభాగములుగఁ జేసి యా రాజపుత్త్రుల కిరువురకును నొకభాగమును, నొకభాగము వసంతునకును, నొకభాగము మహాయోధునకును, విభజించి యిచ్చెను. మఱికొందఱు, స్వామిభక్తిగలరాజపుత్త్రవీరులను, గూర్చుకొనితా నాసేనలమధ్యమున ముందును వెనుకనుగూడ నుండుట కేర్పాటుచేసికొనియెను. ఆ చుట్టు పట్టుల నుండు మఱికొందఱుచిన్న చిన్న రాజులుగూడఁ దమపూర్వవైర మును బాటించి చంద్రగుప్తునకు సాహాయ్యముఁ జేయ తమ సేనలతో వచ్చి కలిసికొనిరి. రాజయోగానందస్వామియనుజ్ఞ వడసి చంద్రగుప్తుఁడు విపాశానదిని దాఁటెను. ఈలోన మహాయోధుఁడుగూడ వచ్చి చేరెను

వీరందఱు హిమవత్పర్వతమునకుఁ గొన్నిమైళ్ల కివ్వలనున్న మెట్ట మార్గమున లోయలవెంటఁ బ్రయాణము చేయసాగిరి. కొన్నిదినముల లోఁ బౌర పురమునకు దగ్గఱనున్న యొకయరణ్యప్రాంతమున విడిసిరి.

రాత్రియైనది. పౌరపురప్రజ లందఱు నింకను విచారములోనే మునిఁగి యుండిరి. కోటలోనివారందఱును బ్రభువియోగముచే నితరమును మఱచియుండిరి అంతఃపురములును దుఃఖాశ్రయములుగనే యున్నవి. ఈకోట కిరువదినాలుగుద్వారములు గలవు. ద్వారము లన్నిటిని మాత్రము బంధించి యుంచిరి. రాత్రి రెండుయామములు దాఁటినది. అన్నిద్వారములను నొక్కసారిగ కొన్నిసైన్యములు వచ్చి ముట్టడించినవి. అన్నిద్వారములయందున్న రక్షకులను నొక్కక్షణములో గ్రుక్కుమనకుండ సంహరించినవి. తలుపులు మూయఁబడి యుండుటచేఁ గోటలోఁ బ్రవేశించుట దుస్సాధ్యముగ నుండెను అప్పు డిరువురుపురుషులేమేమో యాలోచించుకొని, కొన్ని త్రాటినిచ్చెనల నాయత్తపఱచిరి. అవి పైకెట్లు పోఁగలవు? ఇంతలోఁ గొందఱువీరులు ముందునకు వచ్చి యొకబురుజుసమీపమున ద్వారమునకుఁ బ్రక్కఁగ నొకనిపై నొకఁడుగ గోడ నాధారముఁ జేసికొని నిలువఁబడిరి. ఒకఁ డెట్లో శ్రమపడి బురుజుపై కెగఁబ్రాఁకెను. అతఁడువసంతుఁడు. వానివెనుక మహాయోధుఁడును, నావెనుక శిలకోటవీరులును, త్రాటినిచ్చెనలపై నెక్కి బురుజుల నాక్రమించిరి. ఇట్లుచాలమంది సైనికులు బురుజులపై కెక్కి లోపలికి దుమికి కోట యుత్తరద్వారములలో నొకదానిని తెఱచివైచిరి. తక్కినద్వారములయందు శత్రువులు రాకుండ ఖడ్గహస్తులయి చాలమంది సైనికులు యోధులతోఁ గాచికొని యుండిరి. చాలసేన లోపలఁ బ్రవేశించుసరికి కలకలము హెచ్చయ్యెను. అప్పటికిఁ గోటలోనిసైనికులు మేలుకొనిరి. పాపము వా రసంసిద్ధులై యుండిరి.

ఆయుధములకై కొందఱు పరువులెత్తుచుండిరి. అట్టి శత్రువులపైఁ గవిసి వారల దారుణఖడ్గధారలకుఁ గొందఱు గుఱియగుచుండిరి. అంతటను మహా కల్లోలము పుట్టెను. పదులు వందలు వేలకొలఁదిజనులు శత్రువులతోఁ బెనఁగులాడి వీరమరణము నొందుచుండిరి. కోటయంతయును మహా కల్లోలములో మునిఁగిపోయెను. ఏమూలఁజూచినను నేడ్పులే. ఏమూలఁ జూచినను శత్రుల యట్టహాసధ్వనులే ఏమూలఁజూచినను కత్తుల తళతళత్కాంతులే ఆర్తనాదములు హెచ్చయ్యెను. అంతఃపురము నందుఁగూడఁ గోలాహలము బయలుదేరినది అందుఁగూడ నేడ్పులును, పెడబొబ్బలును, చాలవినవచ్చుచుండెను. అందిప్పు డిరువు రశ్వత్థామలు విహరించుచుండిరి. వారు శీలకోటరాజపుత్త్రులు. ఈసంకులప్రయత్నములఁ జంద్రగుప్తుఁ డేమఱియుండలేదు. ఒకయుత్తమాశ్వము నెక్కి యన్నిచోట్ల వీరవిహార మొనరించుచుండెను. ఎదిరించినశత్రువునే యాతఁడు చంపుచుండెను. అంతఃపురములోఁ జాలసైన్యము చొరఁబడినది. కొందఱు యోధులును, రాజబంధువులును, ప్రాణములకుఁ దెగించి శత్రువులపైఁ గత్తిగట్టి నిలిచిరి. పాప మీమహాసముద్రములో వారు నలుసులు గాలేదు. శీఘ్రకాలములోనే వారు వీరశయన మలంకరించిరి. కోటయంతయు వశముగఁ జంద్రగుప్తునికి స్వాధీన మయ్యెను. బురుజులపై నిప్పుడు చంద్రగుప్తుని కేతనములే శత్రువులకు భయంకరముగఁ బ్రకాశించుచున్నవి. చంద్రగుప్తుఁడు తనమహోన్నత పదవియందలి కొన్నిమెట్లు నిప్పుడు దాఁటెను. కోటలోఁ జావక మిగిలియున్న సేనావార మంతయు నాయకవిరహితంబగుటఁ జంద్రగుప్తునికి లోఁబడి పోయెను. ఆక్షణమె జయదుందుభు లన్నిదిక్కుల నొక్కసారిగ విడువక మ్రోయుచుండెను.

---

# ఎనిమిదవ ప్రకరణము.



తక్షశిలానగరమునకు దక్షిణమున నున్న దుర్గమారణ్యమునందలి యొకకొండగుహలో నిరువురుసన్యాసులు నెలదినములనుండి నివసించి యుండిరి. వారిలోఁ బగలొకరు రాత్రియొకరునుగా నానగరమునకు భిక్షకొఱకుఁ బోవుచుందురు. పగలు పోవుచుండుయోగి జ్యోతిషము నందు నైపుణ్యము గలవాఁడై యుండెను. జనులందఱును వానికడఁ దమ యదృష్టమును దెలిసికొని యానందించుచు వానిఁ బరదైవతముగ భావించుచుండిరి. రాత్రిపోవుసన్యాసి ప్రశ్నశాస్త్రమున గట్టివాఁడు. ఆనగరమువారిలో నందఱును నాయోగులమాహాత్మ్యమును దెలిసినవారే గాని వారియాశ్రమము నెఱింగినవా రొక్కరును లేరు. యోగులకడ మంత్రము లుండును. ఓషధులయం దద్భుతశక్తు లున్నవి. నిరంతర మారణ్యకు లగుయోగులకడ నీరెండుమహిమలు నుండును. వా రగపడుచు నంతలో మాయ మగుదురు. ఆకస్మికముగ సాక్షాత్కరింతురు.

రాత్రి పదిగడియ లైనది. భిక్షకుఁబోయినసన్యాసి యింకను రాలేదు. రెండవసన్యాసి యాతనికొఱ కెదురుచూచుచు నాలోచించుచుండెను. దివ్యజ్ఞానముగలమునిచంద్రున కంతయాలోచన మొందుల కని సందేహము కలుగవచ్చును. ఇతరులకుఁ బ్రశ్నలు చెప్పునప్పుడన్నియును నిశ్చయముగనె తోఁచుచుండును. స్వవిషయమున నన్నియును సందేహములే. అన్యవస్తుప్రకాశకం బగుదీపస్తంభమున కంతయు నంధ

కారమే గదా! వెలుపలఁ బిండియారఁబోసినట్లు వెన్నెల కాయుచుండఁగా గాఢాంధకార పూరితమగు నాపర్వతగర్భమున సన్యాసి యొక్కఁడు నింక నాలోచించుచునే యుండెను.

ఇంతలో రెండవయోగి భిక్షఁ దీసికొనివచ్చెను.

"ఇంతయాలస్యమైనదేల?" అని మొదటిసన్యాసి ప్రశ్నించెను.

"నగరుదాసి యదృష్టమును జూచుచుంటిని"

"అందు విశేష మేమైన నగపడినదా యేమి?"

"విశేష మున్నను లేకున్నను, నాప్రసంగమువలన రహస్య చరిత్ర మొకటి బయటఁ బడినది."

"రాజరహస్యమా?"

"ఔను."

"ఏమది?"

"ఆరాజభవనమున నొకసుందరి నిర్బంధింపఁబడుచున్నదఁట"

"ఏమీ! ఆభీరునిరాజ్యమున సతీమణులుకూడ బాధింపఁబడుచుందురా?"

"ఆమె మగనాలు కాదు. కన్యక."

"ఆరాజున కిప్పుడు మరల నొకచిన్నపడుచును బెండ్లియాడవలయునని యున్నది కాఁబోలును! పడుచుఁదనము వెడలుచున్న కొలఁదిని దుడుకుఁదన మధిక మగుచున్నది."

"ఆతఁడు పెండ్లియాడవలయు నని కాదు. తనమిత్రునకుఁ బెండ్లి చేయవలయు నని యామెను గొని తెచ్చెనఁట."

"ఆసుందరి యాతని వరించి యున్నదా?"

"లేదు మఱియొకని వలచియుండుటచేతనే యింతనిర్బంధము."

"అది యన్యాయముకాదా?"

"అధికారుల యన్యాయ మన నెట్టిది"

ఆమె వలచియున్న పురుషుఁ డామెను రక్షించుటకుఁ బ్రయ త్నించుట లేదా?

"ఆతఁ డెటనుండునో యారాజునకుఁ దెలియదు. పాపమాకన్యక కును దెలియదు"

'పోనిమ్ము ఆమె యెవ్వరో తెలిసినదా"

"ఆవిషయమును దెల్పుటకొఱకే యింతయాలస్య మైనది"

"తేలినదా?"

"ఆదాసికిఁగూడఁ దెలియదని తేలినది"

"పాపమాయనాథస్త్రీరక్షణమునకుమనముపూనుకొనవలదా? లోకావనంబునకై స్వార్థత్యాగముం గావించుకొనిన సన్న్యాసులమైన మన కది విధాయకకృత్యము గాదా?"

"అవును. కొలఁదికాలములో నామెకు నిర్బంధవివాహమో, ప్రవాసశిక్షయో, తటస్థింపనున్న దని కూడఁ దెలిసినది"

"అట్లయిన మనము త్వరపడవలయును. తపోవనంబునకుంబోయి గురుస్వాములతో నాలోచించి, యింకులకుఁ బ్రతీకార మవశ్యముగ జేయవలయును.

"సరే. భోజనము చేసి యిప్పుడే ప్రయాణము సేయుదము"

వారిరువురును దమతమ కొబ్బరిచిప్పలయందు భిక్షాన్నమును వడ్డించుకొనిరి. లోపల గాఢాంధకారము. ఆసన్న్యాసికాపురమునకు వెన్నెలయును గఱవైనది. ఆచీకటిలో వారెట్లుభుజించుచుండిరో? మన కుఁదెలియదు. వారుసిద్ధులు. వారికడ నంజనము లుండవచ్చును. లేక పోయినను నోటికిని జేతికిని నడ మేమున్నది? భోజన మైనది. కమండ

లూదకముచేఁ జేతులుదోలుచుకొని ప్రయాణోన్ముఖులైరి. నారుసరుదు కొనుట కేమున్నది? దండకమండలములం దీసికొని బయలుదేరి గుహా వెలుపలికి వచ్చిరి. పుచ్చపువ్వువలె వెన్నెలఁ గాయుచుండెను. వారి కావెన్నెలవెలుగున నొకపురుషుండు దృగ్గోచరుం డయ్యెను.

ఆతఁడీరహస్యసంభాషణమును వినియుండునా?ఆయర్థరాత్రమున నాగాఢాంధకారపూరితమగు పర్వతగుహాంతరాళమున నేకాంతముగ నిరువురు సంభాషించుకొన్న విషయముఁగూడ నెవ్వరైన వినిపోయి రేమో యని యనుమానింపవలసివచ్చినది. ఔను. రహస్యమునకు నియతిలేదు. దాని కగ్నిజ్వాలవలెఁ బైకిఁ బ్రాంగుటయేస్వభావము. రెండవకంటివాఁడెఱుఁగకున్నంతవఱకే రహస్యము. పెదవి దాఁటినఁ బృథివిదాఁటును. గోడలకుఁగూడఁ జెవులున్నవి. ఆపురుషునకుమాత్రము చెవులులేవా?

అందొకసన్యాసి యాపురుషుని సమీపించెను. ఆపురుషుతలపై నొకతెల్లనిపాగయుండెను. శరీరమంతయు నున్నితోఁ జేయఁబడిన కంచుక ముతోఁ గప్పఁబడియుండెను. ఆతఁడు తనవక్షోభాగము నానించుకొని సారంగియనుజంత్రమునుమీటుచుండెను. వెన్నెలవెలుగుననాతని మొగ మునను పట్టువర్ధనముగూడ స్పష్టముగఁ గానవచ్చుచుండెను. సన్యాసి కేదిమోస్మృతికలిగినది.

"భక్తస్వాములా?" అని ప్రశ్నించెను.

స్వామియు సన్యాసికంఠస్వరము నానవాలు పట్టినట్లుగ "యతీంద్రా!" అనియెను

"మిమ్ముఁ జూచి చాలదినము లయినది. కలశపురమునందలి పావన మగు నామందాకినీతీరము నిప్పుడు చూచుచున్నట్లే యున్నది. ఆవృక్షు చ్ఛాయను మనము మాట్లాడుకొనుచున్నట్లే యున్నది"

"యోగీంద్రా! అవును. శతద్రూతీరమున మఱియొకసారి కలిసి కొంటిమి. జ్ఞప్తియున్నదా?"

"అది క్షణకాలము అయినను నావెన్నెలరాత్రి యిప్పుడు మరల మనోగోచరమగుచున్నది. ఆ సంగీతము మాచీనులలోఁ బ్రతిధ్వనించు చున్నది"

"యతీంద్రా! మీరు సర్వాంతర్యాములవలె నన్ని చోటులఁగనం బడుచున్నారు. మీమహిమ చాలగొప్పది"

"ఓవిష్ణుభక్తాగ్రేసరా? నీముందు మాగొప్ప యేమున్నది? నీవ్రనుమాతోడనే యెక్కడఁజూచినను బ్రత్యక్షమగుచున్నావు"

"అది మీకరుణామాహాత్మ్యముననే కలుగుచున్నది"

"హరిదాసస్వామి! నీరాక యెక్కడనుండి?"

"కర్మమునుండి"

"ఇప్పు డెందాఁకఁ బోయెదవు?"

"అది యీకర్మక్షయించిపోవునందాఁక"

"మాతోఁదపోవనమునకు మాగురుస్వాములకడకు వచ్చెదవా?"

"అయ్యా! ఈదాసుఁడు రాజయోగానందస్వాముల వారిని దర్శించియే వచ్చుచున్నాఁడు"

హరిదాసుఁడు సత్యముననే వచించెను. ఆతనికి రాజయోగానంద స్వామిదర్శన మిచ్చినాఁడు. ఒకటి రెండు దినము లాతిథ్యమును గూడ నిచ్చెను కాని, యీతని మతాంతరభావములు తన యోచనా సముద్ర మును గలఁచివేయుచుండుటచేతనో, భక్తిశీలుఁడగు నీతని మధురవాక్య శ్రవణమునను, మనోహరగాన సుధారససేచనంబునను, గలుగు తన్మ యత్వముచే నితర కార్యములయందు మఱపు గలుగుచుండుటచేతనో, గాని మూఁడవదినముననే యాతని కనుజ్ఞ యొసంగెను. దాసున కింకను దపోవనమునఁ గొన్నిదినము లుండి యీస్వామివలనఁ గొన్నివిషయము లను దెలిసికొనవలయు ననియే యున్నది. కాని, తనయంతఁ బానందు నివసించుట కాతని కిష్టము లేకపోయెను. ఆతని కింకను బోవలసిన తీర్థము

లున్నవి. తిరుగవలసిన దేశము లున్నవి తెలియవలసిన విశేషము లున్నవి త్రుంకవలసిన నదులున్నవి ఒక్కచోటనే చిరకాల ముండుట కవకాశమే లేదు.

"అయ్యా! నాకు సెలవొసంగుడు. ఈపరిచయము నూాత్రము మఱవకుఁడు. దయ యుంచుఁడు" అని వారియొద్ద సెలవు గయికొని హరిదాసుఁడు వెడలిపోయెను.

సన్న్యాసు లిరువురును దపోవనాభిముఖులయిపోయిరి.

---

## తొమ్మిదవ ప్రకరణము

సంగీతము లోకమోహనకర మైనది. దానియం దొకవిధమైన యాకర్షణశక్తి యున్నది. పరబ్రహ్మానంద సంపన్ను లగు తుంబురునారదాదులుకూడ సంగీతామృతసేవనమున మైమఱచుచున్నారు. శారదాదేవి నిరంతరవీణాగానమువలననే సరస్వతి యయినది సంగీతమాధుర్యమునకుఁ జొక్కి జీవలోక మంతయుఁ దన్మయత్వమున సంపూర్ణానంద మనుభవించుచున్నది. ఇట్టిపరిపూర్ణానందము వ్రేపల్లెయందలి గొల్లపశుచుల కొక శరద్రాత్రియందు లభించినది. నాఁడు గోపాలకృష్ణుని మురళీగానమున నమృతము వర్షించినది. ఆయనుభవముచే నందలి పశుపక్షికీటకాదులుగూడ నిప్పటికి నాస్వరముల ననువదించుచున్నవి. షడ్జపంచమశ్రుతులవలె రాధాకృష్ణు లీగానములోననే యైక్యమయిపోయిరి. రాజగోపాలుని మోహనాకారముతో నాతని మధురగానము యమునానదీనిర్మలజలంబులఁ జాలకాలము ప్రతి ఫలించినది. ఆయలవాటుచే నిప్పటికి నానదీతరంగము లాపాటలకు లయ నెఱపుచున్నవి.

బృందావనమునందలి పూపుటీరములలో నాపాట లింకను ప్రతిధ్వనించుచునే యున్నవి. రాధాకృష్ణునివేణుగానమున రాగ మున్నది. ప్రతి వసంతమునందును బృందావనమునందలి లేఁజిగురుగొమ్మ లారాగమునే ప్రకటించుచుండును. బృందావనకోకిలములు పూర్వము రాధామాధవులతోఁ గలిసి పాడుచుండెడివి. ఆదినములు గడచి చాలకాల మైనది. అంతయును మఱచిపోయినవి. అవి యిప్పు డొక్క-పంచమస్వరమునే గానము సేయుచున్నవి. వసంతకాలమునఁ జగురుగొమ్మలచాటునుండి కోకిల కంఠమెత్తి యొక్క-పంచమస్వరమును గానముసేయు నంతమాత్రముననే లోకము పారవశ్యము నొందుచున్నది. తాండవకృష్ణునివేణుగాన మెంతమనోహరముగా నుండెడిదో యారాధాదేవికే తెలియును. ఆశరద్రాత్రియందలిపండువెన్నెలలో నావేణుగోపాలుని మొగంబునఁ జూపు్కలు నిలిపి తమ్మును లోకమును మఱచియున్న గోపసుందరీమణులకే తెలియును. మోరలుపైకెత్తి చెవులు టిక్కించి మేఁతలుమాని వినుచున్నగోవత్సములకే తెలియును. ఈయున్నిటికిని సాక్షియయి యమునానదీతరంగముల నుయ్యాల లూఁగుచున్న చందమామకే తెలియును. మన కెట్లు తెలియును? మనము భక్తిభావహృదయులగు తపోధనులము గాము. అనురాగహృదయలగు గోపికాసుందరులము కాము. మన మాకాలమును, నామనోహరగానమాధుర్యమును, మనహృదయమున భావింపలేము

సంగీతమున శృంగారరసము మూర్తిభవించియున్నది. అదియే భక్తిభావమున కంగము. భక్తులగానమునందు వేణుగోపాలకృష్ణుఁడు రాధాసహితముగ నృత్యము సేయుచుండును. ఇట్టిసంగీత మన్న తక్షశిలానగరనాథుఁడు చెవిఁగోసికొనును. నేఁడాతనికట్టి యదృష్టముపట్టినది. ఆతఁ డిప్పు డంతఃపురమున రాణులచేఁ బరివేష్టింపఁబడి సవిలాసముగఁ గాలము గడపుచున్నాఁడు. గోపసుందరులనడుమనున్న గోపాల

కృష్ణునితో నాతని బోల్చుటకు వలనుపడదు. తారకాగణమధ్యస్థుండగురాకాచంద్రునితోఁ బోల్పవచ్చును. చంద్రుఁడు సనాథలగుయువతీమణులకు మనోహరుఁడే కాని వియోగవతులకుమాత్రము మారకుఁడు. ఆకారణముచే సీతనికి నాతనికిఁ బోలిక సరిపడినది. ఆభవనము విశాలమై, చంద్రశిలానిర్మితమై, యుండెను. గ్రీష్మాతపతాపము లేకుండ గవాక్షములకడఁ బన్నీటిచేఁ దడుపఁబడినవట్టివేళ్ళ తడకలు గట్టఁబడి యుండెను. ఆగది యంతటను దట్టమగుమెత్తని రత్నకంబళముపైఁ దెల్లనిపఱుపు వేయఁబడి యుండెను. ఆగదిగోడలపైఁ జుట్టును, రాధాకృష్ణ విలాసము, బృందావనవిహారము, గోపగోపరిపాలనము, గోవర్ధనోద్ధరణము, కాళియమర్దనము, గోపికావస్త్రాపహరణము, రాసక్రీడ, జలక్రీడ, అష్టమహిషీగోపాలము మొదలగు కృష్ణలీలలం దెలుపుచిత్రపటము లమర్పఁబడి యుండెను. వీవనలు విసరుటకును, నవుమ నవుమఁబన్నీరు చిలుకుచుండుటకును జేటికలు నియమింపఁబడియుండిరి అంతఃపురస్త్రీలెల్లరు రాజును బరివేష్టించి కూర్చుండియుండిరి.

వారికెదురుగా నొకహరిదాసుఁడు సారంగమును వక్షమున నానించుకొని శ్రుతిచేసికొనుచుండెను ఆభక్తుని మీరిదివఱకు వెన్నెలవెలుతురునఁ జూచుటచే నానవాలు పట్టలేక పోవచ్చును. నాఁడిరువురసన్న్యాసులకు గుహాముఖమున సాక్షాత్కరించిన దీతఁడే. ఈహరిదాసుఁడు సంగీతమున భూలోకగంధర్వుఁడు.

కొంతకాలముక్రిందట మగధదేశమునందలి యొకసామంతరాజ్యమున రాధాకృష్ణవర్మ యనునొకరాజపుత్త్రకవి యుండెడివాఁడు. ఆతఁడిరువదియయిదేండ్లప్రాయముననే సంగీతసాహిత్యచక్రవర్తి యయ్యెను. ఆతఁ డనేకకృతులను రచియించెను. ఆదేశమునందలి గాయకచక్రవర్తులు మహారాజసభలలోఁ బాడుచుండుకృతులలో మిగులఁ బ్రశస్తి వహించిన వానుకవిచంద్రునికృతులే. ఆకారణమున నారాజపుత్త్రుని

పవిత్రనామమును, కృతులును, జగద్విదితములై యుండెను. ఒకచిన్న రాజునకు సేనానాయకుఁ డగునాతనిచరిత్రముమాత్రము చాలమందికిఁ దెలియదు. ఈహరిదాసుఁడు పూర్వాశ్రమమున నాతనికిఁ బ్రాణప్రియుఁ డయి యుండెను. చిన్నతనమునుండియు నతనియొద్ద సంగీతవిద్య నభ్యసించెను ఆతఁడు రచియించినకృతు లన్నియు నీతఁడు మనోహరముగఁ బాడఁగలఁడు. ఆరాజపుత్త్రునకు గార్యాంతరమున నాదేశమును విడిచి పోవలసివచ్చెను. అప్పటి కీతఁడు పసివాఁ డగుటచేఁ నితనిగూడ దీసికొనిపోలేదు. తరువాత సంతవఱకాతనికినితనికి సమావేశము కలుగలేదు క్రమముగా నితనికాగీతములవలననే భక్తిభావ ముదయించినది. ప్రపంచవిషయములం దభిమానము పోయి వైరాగ్యముకలిగినది. ఇప్పుడు మునివ్రత మవలంబించి తీర్థయాత్రలం జేయుచు నీశ్వరతత్త్వమును గానముచేసి తన్మయత్వమున నానందించుచుఁ గాలము గడపుచున్న వాఁడు. అంభీరుపసపర్యల కానందించి యాతనిప్రార్థనచేఁ గొంతకాల మిట నుండుట కంగీకరించెను. ఈతనికంఠస్వరమాధుర్యము వర్ణనాతీతమైనది.

శ్రుతులు సరిపడినవి. గాయకుఁడు సభవంకఁ జూచెను. అందఱ దృష్టులు నాతనిముఖముపైనే ప్రసరించుచున్నవి. అందఱముఖపద్మములు వికసించియున్నవి అందొకపదియేడేండ్లకన్నియమాత్రము కృష్ణచతుర్దశీచంద్రరేఖవలె శుష్కించి యున్నది. ఆసుకుమారశరీరము గ్రీష్మప్రతప్తంబగుమల్లికావల్లరివలె నొగిలి యుండెను. అయినను కాంతి మంతముగనే యుండెను. ఆమనోహరాంగకములు చిక్కి యున్నవి. ఆయధరపల్లవము వాఁడియున్నది. ఆమెవదనబింబమున వికసనభావ మగపడుటలేదు. వెలవెలపోవుచుండెను. కచమండలము సంస్కరింపఁబడి యుండలేదు. మాసినచీరధరించియుండెను. ఆమె పరిచారికయా? కాదు. రాణులనడుమనే కూర్చుండి యున్నది. ఆమెకడ నొకపరిచారిక నిలువఁబడి యుండెను. ఆ కన్నియకూడ హరిదాసుని జూచుచుండెను.

ఆచూపులలో నానందము లేదు. ఆమెహృదయమునకుఁగూడ నానందము లేకపోవచ్చును. ఈయానందసమయమున నామె నెవ్వరును జూచుటలేదు. ఆయువతీమధ్యమున నున్న యామెను గాయకుఁడు చూచెనో, లేదో?

హరిదాసుఁడు రాగము నాలాపించెను. కంఠస్వరము తంత్రీస్వనముతో లీయమై వచ్చుచుండె. ఆగానమాధుర్యమున సందఱహృదయములు నైక్యమై పోయినవి. సభ్యులకాస్వరకల్పనములనడుమ హృదయసంకల్పము లేవియుఁ బుట్టుట లేదు. చిత్రసంగతులలోఁ దామును జిత్రములై పోయిరి. మూర్ఛనలకు మూర్ఛిల్లుచుండిరి. నడుమనడుమఁ జిలుకుచుండు పన్నీటితుంపురులవలన వారికిఁ జైతన్యము కలుగుచుండెను. ఆమెహృదయ మెంతసుకుమారమయినదోకాని యాకన్నియ రాగమాలాపించినతోడనే తన్మయత్వమున మైమఱచెను. మరలఁ దెలివిఁ దెచ్చుకొనలేదు. పాప మీగానామృతమును తనివిదీరఁ గ్రోలుభాగ్యమామెకు లేదు కాఁబోలును!

గాయకుఁడు ముందుగా వసంతమునుగూర్చి పాడెను. చంచలతరంగములఁ బ్రతిఫలించుచంద్రకిరణములవలె సభ్యులహృదయములయందు భావములు మెఱసిపోయెను. పొడవువెన్నెలలోనిసముద్రమువలె నానందరసము పొంగిపోయెను. కాని యింకను వారికిఁ దనివి తీరలేదు. కేవలగానప్రియుం డగురాజుమాట చెప్పవలసిన దేమున్నది? సభ్యుల కందఱకును గోరికలు మెండయ్యెను. ఒకరు నవనీతచోరుని దుండగములం బాడించిరి. ఒకరు రాసక్రీడయందలిపాటఁ బాడించిరి. గోపికాగీత మొకరుపాడించిరి కృష్ణలీల నొకరుకోరిరి. కాని, గాయకుఁడు రాధామాధవసంవాదమును పాడెను. రాణులందఱు నొక్కొక్క పాటఁ బాడించిరి. హరిదాసుఁ డన్నియును బాడెను.

గాయకుఁ డింకను పాడుచునే యుండెను. ఆయువతీమణి యీ పాటలేవియు వినినట్లు లేదు. మరల స్మృతి కలిగినట్లే యున్నది. గాయకునివంకఁ జూచుట లేదు. ఆమెతల తిరుగుచుండెను. పెదవులు మెదలుచుండెను. గాయకులకొకయలవా టున్నది. శ్రుతి వినినంతనే వారికి లోపల నొకవిధమయినయుత్సాహము కలుగును. ఒక్కసారి కంఠమెత్తి పాడవలెనను నాయుత్సాహము పొంగుచునే యుండును. ఆయువతీమణి గానకావలయును. లేదా, యీగాన మామె కున్మాదము కలిగించి యుండవచ్చును

మనోహరవస్తుసందర్శనమునఁ గాని ప్రియవాక్యశ్రవణమునఁ గాని హృదయతాపము శమించుట స్వభావము ఒకానొకసమయమున నట్టిసందర్శనశ్రవణములే సంతాపకారణములు కావచ్చును. సకలజీవానందదాయకం బగుసంగీత మామె కిప్పుడు శ్రవణభేదనముగ నున్నది. సకలలోకనయనానందకరం బగునా తేజోమయాకార మామెకన్నులకు మిఱుమిట్లుగొలుపుచున్నది. అప్పటియామెయవస్థ నెవ్వరు చూతురు? ఎవరియానందము వారిది. పాప మామెకూడ నేదో పాడుచునే యుండెను. ఆపాట యెవ్వరికిని వినఁబడుట లేదు. గాయకుసగానమున లీనమయి పోయినది ఆయున్మాదావస్థలో నామెహృదయమున నెన్నియోభావములు పుట్టెను. అవి యన్నియును బైకి పొంగుట లేదు. హృదయముననే యడఁగిపోవుచుండెను. హృదయావేగమునఁ దనులత కంపించుచుండెను కన్నులు తిరుగుటచే నామె చలువరాతిగోడకుఁ జేరగిలఁబడియెను. సమీపముననున్న పరిచారిక యామెను బట్టుకొనియెను.

సాయంతన మయినది. గాయకుఁడు గానము నాఁపివేసెను. సభ యంతయును దన్మయత్వమునఁ గొంతసేపు నిశ్శబ్దముగ నుండెను. భవనమున నింకను మనోహరతంత్రీస్వనములు వినవచ్చుచునే యుండెను అవి వారలహృదయభావప్రతిబింబములా? లేక యాకన్నియ యేమయిన బాడుచున్నదా ?

గాయకుఁడా బాలికవంకఁ జూచెను. ఆమె స్మృతితప్పి పడిపోయినది. ద[illegible]ం డగునాభక్తున కామెపై నకారణవాత్సల్యము కలిగెను. భక్తులహృదయము లతిమృదులములు.

“రాజా! ఆబాలికయెవ్వరు?” అని ప్రశ్నించెను.

“ఈమె రత్నగిరిరాణి”

“రత్నగిరి యిటకుఁజాలదూరమే! ఈమె యిక్కడ కేలవచ్చినది?”

“చోరులచే బలవంతముగఁ గొనిపోఁబడుచు నాచే సంరక్షింపఁబడినది. నాఁటినుండియు నాయొద్దనే యున్నది”

“ఎంతకాలమునుండి”

“ఇంచుమించుగ నేఁడాది కావచ్చినది”

అంభీకుఁడు చెప్పినదానిలోఁ గొంత యసత్యమున్నది. ఆతఁడామెను చోరులనుండి రక్షింపలేదు. నందభటులు వారిని వెంబడించి నాఁటిరాత్రి చంద్రజూటశాస్త్రియింటఁ బ్రవేశించి పరిచారికాసహితముగ నామెనుహరించి యీతని కొప్పగించిపోయిరి. గుప్తదుర్గప్రాంతమున జంపఁబడినపురుషుని యొద్దనున్న యుత్తరము పద్మనందుఁ డీమెనుగూర్చి వ్రాసినదే. పాపము వసుమతి యేఁడాదినుండి కనకలతాసహాయయయి యీతక్షశిలానగరదుర్గమునఁ ద్రిజటాసహాయయయి లంకలో నశోకవనమున నున్న సీతామహాదేవివలెఁ బరితపించుచు నతికష్టముగఁ గాలము గడపుచున్నది. నిరంతర వసంతస్మరణమున నామె జీవించియున్నది. ఇప్పటి హరిదాసునిపాటలవలన నామెకుఁ బూర్వస్మృతి కలిగినది. ఈపాటలన్నియు నామెకుఁ గూడ వచ్చును. సుందరి యీపాటల నామెకు నేర్పెను. ఆకారణమున సుందరి తలంపునకుఁ బారి నిర్దయురాలయి తన్ను విడిచియున్నదనువిచారమున నామె మూర్ఛిల్లినది. మహానలజ్వాలలం బడి మండిపోయినసుందరి యీమె నెట్లు కలిసికొనఁగలదు?

# పదియవ ప్రకరణము.



పౌరనగరరాజ్యలక్ష్మి సంపూర్ణముగఁ జంద్రగుప్తుని వరియించినది. ఆదయాశీలునిపరిపాలనమునఁ బ్రజలెల్లరును బురుషోత్తముని మఱచిపోయిరి. అచ్చటి చిన్న చిన్న సామంతు లందఱును జంద్రగుప్తునకు లోఁబడి కప్పముల నర్పించి యాతనిచల్లనివెల్లగొడుగునీడను హాయిగఁ గాలము గడుపుచుండిరి. అనంతమగువిజయసేనాసముద్రము చంద్రగుప్తునకుఁ గొంగుబంగారమై యుండెను. ఆతని కంగబలము నర్థబలముఁ గుదిరినవి. దైవబలముకూడ సంపూర్ణముగ నున్నట్లాతనివిజయములే నిదర్శనముగఁ దోఁచుచున్నవి. ఆతని తేజోబలపరాక్రమాదిగుణంబుల కోటువడి పురుషోత్తమునిదాయాదులు కూడఁ జంద్రగుప్తునకు మిత్రులైరి. ఆ కారణముచే నూతనరాజ్యమున నాతనిప్రభుత్వము నిరాఘాటముగ నెలకొల్పఁబడినది. అయినను నచ్చటచ్చట గ్రీకునాయకులవిజయధ్వజములాదేశమున నిరంకుశముగ నెగురుచున్నంతవఱకుఁ జంద్రగుప్తునికి నెమ్మది కలుగదు. ఇంకను నందందుఁ జిన్న చిన్న రాజ్యములలోఁ గల్లోలములు పుట్టుచునే యున్నవి.

చంద్రగుప్తుఁడు గంభీరహృదయుఁడు. దూరదృష్టి కలవాఁడు. తలపెట్టినకార్యమును సాధించువఱకును వెనుదిరుగని తీక్ష్ణహృదయుఁడు. ఆతనికిరణమన్నఁ బండువుగా నుండును. ప్రజలను బిడ్డలవలెఁ గాపాడుటయే యాతనిపరమధర్మము. ఆతనియానతికిఁ దిరుగులేదు. తనయుద్ధములును, విజయములును, రాజ్యసంపాదనమును, జీవితమును, బ్రజారక్షణమునకే యని చంద్రగుప్తునియుద్దేశము. వసంతుఁ డాతనికి దక్షిణభుజమై యుండెను. ధీరోదాత్తుఁడగువసంతుఁడు వసుమతీవియోగమున మగ్నుఁడై

యుండినను, రాజకార్యావసరంబుల నద్వితీయ ప్రజ్ఞానిధియై చంద్రగుప్తునకుఁ దోడునీడయగుచునే యుండెను. చంద్రగుప్తుఁ డొకనిముసమైన వసంతు నెడఁబాసియుండ లేడు. వారెప్పుడును రాజ్యాంగవిషయములనుగూర్చియే యాలోచించుచుందురు. నిరంతరమట్టివ్యాసంగమే లేని యెడల వసంతునిజీవితకుసుమ మీసరికి వసుమతీవియోగదావానలమున హుతమై పోవలసినదే.

చంద్రగుప్తవసంతు లిప్పు డాలోచనామందిరమున నున్నారు. వారు రాజకీయవిషయములనుగూర్చియే మాట్లాడుకొనుచుండిరి.

“వసంతా! వార్త లేవైనఁ దెలిసినవా?”

“కాశ్మీరదేశాధీశ్వరుఁ డగు పుష్కరాక్షుఁడు నెలదినములనుండి సైన్యములను గూర్చుకొనుచున్నాఁడఁట. యుద్ధయాత్రకు వలయు సాధనసామగ్రు లన్నియును సిద్ధపఱచుచున్నాఁ డని తెలియవచ్చినది.”

“ఎందులకో యేమైనఁ దెలిసినదా?”

“లావాణదేశాధిపతి సౌభూతియు నట్టి ప్రయత్నములలోననే యున్నట్లు తెలిసినది. వారిరువురికు నేమైనఁ గలహము జరుగు నేమో యనితలంచెదను”

“కాదు కాదు. అట్లెన్నఁడును జరగదు. ఆతనికి నీతనికిని నట్టి సంబంధ ముండుటకుఁ గారణము లేదు ఒకవేళ వారిరువురును గలిసి మనపైకి వచ్చుటకుఁ బ్రయత్నము సేయుచుండి రేమో?”

“అది యసంభవము. వారికి స్వప్నముననైన నట్టి యూహ కలుగుట కవకాశము లేదు. అగాధ మగు మహాసముద్రము నీఁదవలయు ననియు, నాఁకలిగొనియున్న సింగము నదలింపవలయు ననియు జీవితాశగల యెవ్వఁడు కోరుకొనును?”

“అయినను మన మేమఱి యుండరాదు. సేనలఁ బదిలపఱచి జాగరూకులమై కనిపెట్టియుండవలయును”

ఇట్లాలోచించుకొనుచుండఁగా రాజయోగానందస్వాములవారు వారియెదుట సాక్షాత్కరించిరి. తోడనే వారిరువురును మహానందముతో లేచి యామహాత్మునకు నమస్కరించిరి. యోగి వారిని దీవించెను. అంతట నుచితాసనములఁ బరివేష్టించిరి.

యోగి "వత్సలారా! విజయుల రగుమీకు సేమమా?" అని కుశలప్రశ్నముఁ జేసెను.

"దేవరయకారణవాత్సల్యంబున నింతవఱకు సేమముగ నేయున్నారము" అని చంద్రగుప్తుఁ డుత్తరమిచ్చెను.

"విశేషము లేమైన నున్నవా?"

"త్రికాలవేదు లగు మీ రెఱుంగనివిశేషము లేవియుండును?"

"ఇన్నినాళ్లకు మనప్రయత్నము ఫలించినది"

"వసుమతివృత్తాంత మేమైనఁ దెలిసినదా?"

"ఆ తెలిసినది."

వసంతుని మొడలు జల్లుమనియెను. "మహాత్మా! వసుమతి జీవించియున్నదా?" అని యాతురముతోఁ బ్రశ్నించెను.

యోగి—తక్షశిలాదుర్గమున నంభీగుని చే రక్షింపఁబడుచున్నది.

చంద్ర—ఆమె నాతఁ డేల రక్షింపవలయును?

యోగి—అపహరించి కొనితెచ్చుటచేత—

చంద్ర—ఆతఁ డపహరించెనా?

యోగి—పద్మనందునిభటులాతని కామె నొప్పగించిపోయిరి.

కోపవేగమున వసంతునియొడలు వడఁకిపోవుచుండెను. "ఏమి! పద్మనందునిక్రూరవ్యాపారములు పాంచాలమువఱకును వ్యాపించినవా? కపటబుద్ధి యగునాపాపాత్ముఁడు మగధపాంచాలములకు నడుమ రక్తనదులు ప్రవహించు నని యెఱుంగఁడు కాబోలును" అని వీరావేశ వివశుఁడై పలికెను

చంద్ర—"వసుమతి యెంత కాలమునుండి యటనున్నది?"

యోగి—"రెండుసంవత్సరములనుండి."

హరిదాసునితోఁ గపటచిత్తుఁ డగునంభీరుఁ డేఁడాదినుండి వసుమతితనయొద్దనున్న దని చెప్పినమాట యసత్యము. యోగిచెప్పిన యీ విషయమే సత్యమైయుండవచ్చును.

యోగి—"మాశిష్యుల కొకహరిదాసునివలనఁ దెలియవచ్చిన దఁట!"

చంద్ర—"అట్లైన మన మిప్పుడు తడయరాదు. అంభీరునిపైనెత్తి వేగమ పోవలసియున్నది గదా!"

యోగి—"సేనలన్నియును సిద్ధముగ నున్నవా?"

వసం—"అన్నియును సిద్ధముగ నున్నవి దురాత్ముల నిర్జించుటకుఁ జంద్రగుప్తునిసేన లెప్పుడు నెదురుచూచుచునే యుండును. ఈవసంతుని కరవాల మంభీరునిశిరఃకర్తనము సేయుటకుఁ ద్వరపడుచున్నది"

యోగి—"ఆతనిజయించుటకుఁ గూడ మనకుఁ దఱియైనది."

చంద్ర—"ఎట్లు మహాత్మా?"

"లావణదేశాధిపతి యగుసాభూతికిని తక్షశిలానాయకుండగు నంభీరునకును జాలకాలమునుండి విరోధమనుసంగతి మీకుఁ దెలిసినదా?"

"అవును. వినియున్నాము. ఇప్పుడేమి?

"సాభూతి మనతో మైత్రి నెఱపుచున్నాఁ డనుమిష పెట్టి యాతని జయించుటకయి యంభీరుఁడు గ్రీకులను బిలిపించెను. వారు లావణదుర్గమును ముట్టడించుటకు వారముదినములలో రానై యున్నారు."

"అట్లయిన గ్రీకు లచ్చటికి రాకుండ, మార్గముననే మనము మన సైన్యములతో నడ్డుకొనవలసియుండును వారిని మరల నీదేశమున నడుగు పెట్టనిచ్చితిమేని మనకుఁగూడ జాల నపాయకరమే"

"అట్లు కాదు. ఆగ్రీకు సైన్యముతో నంభీరుని సైన్యములోఁ గొంత భాగము సాహాయ్యముగా రావలసియున్నను. ఆతనికి ముందుముందు మనపై నెత్తిరావలయు నను దురుద్దేశముకూడనున్నది. ఈసమయమున మనము తక్షశిలాదుర్గమును ముట్టడించితిమేని సులభముగా జయింపవచ్చును. లావణదుర్గము గ్రీకులకుఁ జిక్కకుండ మనయోధుని సైన్యములతో సాభూతికి సాహాయ్యముగఁ బంపవలయును. ఇందువలన గ్రీకులకు తక్షశిలానాయకుని గోలుపోవుటయు, లావణదుర్గమును జయింపలేకపోవుటయు, ననురెండునష్టములు కలుగును. ఆనిరుత్సాహమున నలసియున్న గ్రీకుల మనము జయించుట సులభముగా నుండును. కాఁబట్టి మీరు మీసేనలతోఁ దక్షశిలాదుర్గమును ముట్టడించుటకుఁ ద్వరపడవలయును."

"కాశ్మీరరాజుకూడ సైన్యములను గూర్చుచున్నాఁడఁట! ఎందులకో తెలియ లేదు"

"మనకొఱకే. ఆయేర్పాటు లన్నియు నిదివఱకే చేసితిని. ఆతఁడు సేనాసహితముగఁ దక్షశిలాదుర్గమును ముట్టడింపనున్న మీకు సాహాయ్యము చేయనై యున్నాఁడు. ఇంతకాలమున కంభీరునియందలి పగఁదీర్చుకొనుటకు సమయము లభించిన దని యాతఁడుప్పొంగి పోవుచున్నాఁడు. పాంచాలరాజ్యలక్ష్మి యిఁక సంపూర్ణముగ నిన్నాశ్రయించినది. రత్నగిరిరాజపుత్త్రిక యగువసుమతికడగండ్లు దీరఁగలవు. వసంతకళ్యాణముతో నీవును బట్టాభిషిక్తుఁడవు కాఁగలవు. తగినయాలోచన మంతయుం దెలిపి యోధుని సైన్యములతో లావణమున కనిపెదను. మీరు మీకార్యములయం దప్రమత్తులై మెలంగవలయు. ఈశ్వరానుగ్రహమున జయము కలుగుఁగాక!" అని యాశీర్వదించి గురుస్వామి యంతర్థానుఁడయ్యెను. వసంతచంద్రగుప్తులు విజయయాత్రాప్రయత్నములం జేయఁబోయిరి.

---

## పదునొకండవ ప్రకరణము.



నేఁటిరాత్రి యంభీరునకు హరిదాసునిపాటలు వినుచుండుటకుఁ దీఱిక లేదు. సేనానాయకుల కానతు లొసంగుట యందును, సేనల బురికొల్పుటయందును,మగ్నుఁడై యుండెను. మహాబలుండగు నాశూరశిఖామణి యుద్ధములయం దారితేరినవాఁడు. ఆతనిదుర్గముకూడఁ ఘనశిలానిర్మితం బగు నెత్తైనప్రాకారము నడుమనుండుటచే నెట్టిశత్రువులకు నభేద్యమై యుండెను. ప్రాకారముచుట్టు పండ్రెండుగజముల వెడల్పున నున్న యగడ్త యగాధజలపూరితమైయుండెను. దండనాయకులు సేనలతో బురుజులపై నిలిచి జాగరూకులై కనుగలిగి చూచుచుండిరి. కోటలోనిసైనికుల ప్రోత్సాహకోలాహలధ్వనులును, భయంకరభేరీరవంబులును, దిక్కుల మారుమ్రోయుచుండెను. అంధకార బంధురమగు నానిశాసమయమున కరదీపికాసహస్రములచే దుర్గప్రాకార మంతయు మహాశివరాత్రినాఁటి దేవాలయప్రాకారమువలెఁ బ్రకాశించుచుండెను. ఆప్రదీపప్రకాశము నడుమ మెఱయుచున్న యాదుర్గము దావానలజ్వాలాపరివృతం బగు వెండికొండవలె వెలుఁగుచుండెను. వివిధాయుధద్యుతులును, కిరీటప్రభలునుఁ, గన్నుల మిఱుమిట్లు గొలుపుచుండుటచే సైనికుల కాదీపప్రకాశము గాఢాంధకారముకంటె నెక్కువయుపయోగము నీయకుండెను. దీపములకు సమీపప్రకాశము స్వభావము. వెలుతురున నున్నవారిదృష్టు లంధకారమునఁ బ్రవేశింపఁజాలవు. చీఁకటిలోనున్నవారు వెలుఁగున జరగుచున్న దంతయును గనిపెట్టఁగలరు. వారిచూపులు వెలుతురున్నంత వఱకుఁ గనిపెట్టుచుండెను. జామురాత్రి యైనది. బురుజు లన్నియు సేనలతో నిండిపోయెను. రణభేరులు మ్రోఁగుచునే యున్నవి. దండ

నాయకులు సైనికుల హెచ్చరించుచుండిరి. ఎవ్వరు నొక్క క్షణమైన నేమఱి యుండుట లేదు. అందఱును కార్యవ్యగ్రులై యుండిరి. ఆరాత్రి నిద్రాదేవత యానగరమును విడిచిపోయినది. జాములు గడచుచున్నవి. ఆనీలాకాశమధ్యమున మినుకుమినుకుమని మెఱయుచున్న చుక్కలొక్కటొక్కటిగ నాయోధులశిరస్సులను దాటిపోవుచుండెను. వారికేమియు నగపడుట లేదు వారిదృష్టులుమాత్రము నలుదెసలఁ బ్రసరించుచున్నవి. ఆచూపులలోనే వేగుచుక్క పొడిచినది. వారికాసందడిలోఁ గోడికూఁత వినఁబడుట లేదు. ప్రభాతవాతపోతములు విసరుచున్నవి గాని యెప్పటివలెఁ బరిఖాసరోజపరిమళములు వచ్చుట లేదు. గజమద గంధమిశ్రితమై వీతెంచుచుండెను. చూచుచుండఁగనే తెల్లవాఱినది. దుర్గముచుట్టును బ్రచండసైన్యము ముట్టడించియుండెను. రాత్రియంతయు నిశ్శబ్దముగ నేనుఁగులచేఁ ...ట వాఁడినారసులపైఁ గొంత సేనపరిఖ దాఁటి వచ్చి ద్వారస్థానమును జేరినది.

ఇప్పుడు కోలాహలముగ లోపలను, వెలుపలను గూడ రణభేరులు మ్రోఁగుచున్నవి. చంద్రగుప్తుఁడు తూర్పుదిక్కునసింహద్వారము కడ ననంతమగు గజసైన్యముతో నిలిచి యుండెను. ఆద్వారమునకెదురుగనున్న పరిఖ పూడ్చి వేయఁ బడియెను. వెనుక భాగమునఁ బుష్కరాక్షుఁ డాశ్విక సేనలతో నుద్రేకించుచుండెను. సేనావాహిని దుర్గమును జుట్టుముట్టుకొని యున్నది. వసంతుఁడు సేనలను బ్రోత్సహించుచు నొకయశ్వముపైనుండి చుట్టును దిరుగుచుండెను. భేరీభాంకారములవలనను, వసంతుని వీరాలాపములవలనను, సేనలకు వీరావేశము కలిగెను.

ఆదుర్గము దుర్గమమైనది. పైకెగఁబ్రాఁకుటకుఁ గాని గునపములతోఁ ద్రవ్వుటకుఁగాని వలనుపడుట లేదు. అనంత మగుసైన్యము

బురుజులపై నుండి బాణవర్షమును గురియించుచుండెను. ఆబాణఘాత ములవలన ననేకు లొక్కసారిగఁ బడిపోవుచుండిరి. రక్తమును జూచిన కొలఁది చంద్రగుప్తసైనికులకు పీరావేశ మధికమగుచుండెను. వారికిఁ బ్రతిపక్షులశరవాహినుల నష్టకొనుట కోడనేసరిపోవుచున్నదిగాని దుర్గ ప్రవేశమున కవకాశముకలుగుటలేదు. తెగించి కోటగోడలకెగఁబ్రాకు చున్నవారిని పైవారు బల్లెములతోఁ బొడిచి కూలఁద్రోయుచుండిరి.

కోటఁ బట్టుకొనుటకు మార్గ మేదియును వారికి గోచరించుట లేదు. దుర్గద్వారములు దుర్భేద్యములై యుండెను. అయినను, జంద్ర గుప్తసైన్యమునకుఁ బ్రభుమంత్రోత్సాహశక్తులు పూర్ణముగ నున్నవి. వారు తమప్రయత్నములను వదలుట లేదు. కోటగోడల కెగఁబ్రాకు చునే యుండిరి. గునపములతోఁ ద్రవ్వుచునేయుండిరి. శరాసారమును గురియించుచునే యుండి[illegible] గాతములఁ గూల్చుచునే యుండిరి. వారికిఁ జావ[illegible] లును, భయ్యము[illegible]

[illegible]ను. [illegible]

"ఆహాహా! యోధులారా! అసహాయశూరులగుభటులారా! లోకమునఁ బవిత్రజన్మమున్న మీదేయని చెప్పవచ్చును. మీరాజు కొఱకు మీజీవితమును వినియోగించుచున్నారు. మీరాజ్యముకొఱకు మీరక్తము నొలికించుచున్నారు. మీకీర్తికొఱకు మీప్రాణములను దృణప్రాయముగ విడుచుచున్నారు. స్వామిభక్తి మీహృదయములం దున్నది. సాహసము మీప్రయత్నములం దున్నది. స్వర్గము మీచేతిలో నున్నది. కాని జయముమాత్రము చంచలస్వభావముగలయదృష్టము ననుసరించుచున్నందుల కెంతయు విచారముగనున్నది. ఆయదృష్ట దేవతాశీతలకటాక్షములు మీరాజుపైఁ బ్రసరించుచున్నవి ఆవిషయమున ననుమానము లేదు. దానికి మీయుత్సాహమే నిదర్శనము" అని వారల యుత్తరాత్మ ఘంకాధ్వనులతో బోధించుచుండెను.

సైనికులు తమపట్టు విడువక పనిచేయుచుండిరి. ఒక్కసారిగ బురుజులపై శరాసారమును బొగించి శత్రు సేనల నురుమాడు చుండిరి. మరల బురుజులన్నియును భటులతో నిండిపోవుచుండెను. శత్రుసేనలతోఁ జంద్రగుప్త సైనికుల ధైర్యసాహసములును వర్ధిల్లు చుండెను అంతటను వసంతునివీరాలాపములు వినవచ్చుచునే యుండెను. వెనుకఁ బుష్కరాక్షుఁడును, నెదుటఁ జంద్రగుప్తుఁడును, నంతటను వసంతుఁడును హెచ్చరించుచుండుటచే సేనాసాగర మంతయు నుప్పొంగి పోవుచుండెను.

అంభీరుఁడుమాత్రము సామాన్యుఁడు కాఁడు. ఆతనిసైనికులు నసామాన్యులే. వారు పైనుండుటచేఁ గ్రిందివారి నశ్రమమున నోడింపఁ గల మను నుత్సాహముతోఁ బనిచేయుచుండిరి. ఒక్కొక్కసారి వారు గురియించుశిలావర్షమునఁ బడి చంద్రగుప్తభటు లెందఱో పేరులే కుండఁ బోవుచుండిరి. వారి వాఁడినారసముల కనేకులు ప్రాణముల నర్పించుచుండిరి. గాయములనుండి నెత్తురు వరదలై స్రవించుచున్నను లెక్కలుగలఁ జేగురుకొండలవలె వారు కోటగోడల కెగఁబ్రాఁకు చుండిరి. బలమైనగాయములు తగిలినను గునపములతో దుర్గప్రాకారము నొక్క పోటు పొడిచి మఱి ప్రాణములను వదలుచుండిరి. వారిప్రయత్నము లేవియుఁ గొనసాగుట లేదు.

కోటలు మాటలతోఁ జేఁజిక్కునా ? ఎంతరక్తము భూమిపైఁ బ్రసరింపవలసియుండును ? ఎందఱుస్వార్థత్యాగులయి తమజీవితముల ధారవోయవలయును? ఎంతబలము నాశనము కావలయును ? ఎన్ని కష్టములకు సహింపవలయును ? ఎంతకాల మోర్చి యుండవలయును ?

చంద్రగుప్తుఁడు ప్రళయకాలరుద్రునివలె మహోగ్రుఁడై యుండెను. సైన్యమున రక్తము ప్రసరించుచున్నకొలఁది నాతనికన్నులెఱ్ఱ వడిపోవుచుండెను. భటులప్రాణానిలము లెగురుచున్నకొలఁది నాతని

హృదయమునందలి క్రోధానలము ప్రజ్వలించుచుండె. దుర్గద్వారమును భేదించుటకు గజఘటలను బురికొల్పెను కవాటములను దాఁకుట కేనుఁగులఁ బురికొల్పు చుండిరి. ఒకదానివెనుక నొక్కటిగ వచ్చి తమ కుంభస్థలములతో నేనుఁగు లాయినుపశలువులను దాఁకుచుండెను. కాని గ్రంథులపైఁ గూర్పఁబడిన బలమైనవాఁడిగల గుబ్బలతాఁకున వన కుంభములు పగులుచుండుటచే నొకసారి తాఁకినయేనుఁగు మఱియొకసారి తాఁకలేఁ పోవుచుండెను. కవాటము లింకను పగులలేదు. శత్రుసైన్య మావంక కనంతముగ వచ్చి గజసైన్యమును జెల్లాచెదరు చేయు చుండెను. అరుణకిరుణుఁ డాకాశమధ్యమునఁ బ్రతాపమూర్తియై వెలుఁగుచుండెను. ఇరువాగులందును బ్రతాప మతిశయించుచుండెను.

ఆసమయమున "వాఁడిమేకులతాఁకునకోర్వక యేనుఁగులు వెను దిరుగుచున్నవి. ఈదుర్గమింకను నరబలి గోరుచున్నది. రాజభక్తిగల భటులు కీర్తికొఱ కిప్పుడు ప్రాణములను విడువవలసి యున్నది. దుర్గ ద్వారములతో స్వర్గద్వారములను భేదింపఁగలధీరు లెవ్వరో కవాట ముల కడ్డముగఁ వెన్నుల నానుకొని నిలువఁబడుఁడు. త్వరపడుఁడు" అను గంభీరాలాపములు వినవచ్చెను. ఆవాక్యములు వసంతునివి.

తోడనే చంద్రగుప్తుఁ డేనుఁగుపై నుండి క్రిందికుఱికెను ఒక్క యుదుటున శరవేగముతోఁ గోటగోడ కెగఁబ్రాఁకి బురుజుపైనున్న సేనలఁ జెల్లాచెదరు చేసినైచెను. భటులు గుంపులుగుంపులుగ వచ్చి కవాటముల కడ్డముగ నిలువఁబడుచుండిరి. వసంతుఁడు-వారిపై నేనుఁగు లను దాఁకించుచుండెను. పిడుగులు పడుచున్నట్లు భయంకరశబ్దములు పుట్టుచుండెను. సాహసము! రాజనీతి యొక్కొక్కప్పు డతిదారుణ మైనది. ఉద్రేకజనకము లగువీరాలాపములలో నద్భుతశక్తి మూర్తీభవించి యుండును. అనేకులగుభటులప్రాణము లాదుర్గద్వారమున నెగిరిపోవు చున్నవి. ఇంకను సైనికులు వచ్చి పడుచునే యుండిరి. ఏనుఁగులు

తాఁకుచునే యుండెను. కొంతసేపటికి వేయిమందిభటులను బలిగొన్న యాకవాటము పాపము బ్రద్దలయ్యెనో యనునట్లు తలుపులు బ్రద్దలయి విరిగి పడిపోయెను. సైనికుల జయజయధ్వనులతో దిక్కులు బ్రద్దలగుచుండెను గుంపులు గుంపులుగ యోధులు కోటలోఁ జొరఁబడిరి. ఆసంరంభమునకు సంభ్రమించి వెనుకబురుజుపైనున్న సేనలు క్రిందికి దిగెను. ఇరువాగులకును సంకులసమర మారంభమయ్యెను కోట ద్వారము లొకసారిగ తెఱచివేయఁబడినవి. నాలుగుమూలలనుండియును వీరభటులు కోటలోఁ బ్రవేశించి శత్రువుల నురుమాడుచుండిరి. కోటలోనివారందఱు ప్రాణములకు తెగించి పోరాడుచుండిరి. ఒకమూల చంద్రగుప్తుఁ డఖండసైన్యమును దననిశితకరవాలమున కెరసేయుచుండెను యోధుఁడు నాతనియంగరక్షకులును వచ్చి కలిసికొనిరి. ఒకమూల వసంతుఁడు గజబలమును మరలించి శత్రుభటులను మట్టించుచుండెను. పుష్కరాక్షుఁ డశ్వబలముతో శత్రుల నరికట్టి బల్లెములతోఁ గ్రుమ్మించుచుండెను. ఆసంకులయుద్ధమున నెవ్వరెట్లురణముచేయుచున్నారో విమర్శించిచూచుట కనువుపడ లేదు. ఎక్కడఁజూచినను జంద్రగుప్తునికిరీటకాంతు లపరాహ్ణసూర్యకాంతులతోఁ గన్నులు మిఱుమిట్లుగొలుపుచుండెను.

ఉభయసేనాసాగరంబులు నుప్పొంగి యొండొంటిపైఁ బడునప్పుడారణరంగ మల్లకల్లోలమై యుండెను. వివిధాయుధసంఘర్షణంబులును, భేరీ భాంకరణములును, గజఘీంకారములును, హయ హేషలును, పౌరుషాలాపములును, శ్రవణభేద్యములయి వినవచ్చుచుండెను. ఉద్రిక్త రక్తప్రవాహముంగూర్చి యూహించి తెలుపుదమన్నచో నిప్పటివారి కట్టివర్ణనములు రుచియింపక యాథార్థ్యవిషయంబున ననుమానము జనియించునేమో యని సందేహించుచున్నాము.

అంభీరుఁడు తన యఖండసైన్యముతో రణరంగమున నిలిచి తన పేరునకును, ప్రతిష్ఠకును, దగినట్లు పోరాడెను. వసంతచంద్రగుప్తులతో ల్లల నెదిరింపలేక సేనలన్నియును జెల్లాచెదరయ్యెను. పాఱిపోవుచున్న సేనలఁ బుష్కరాక్షుఁడు మారిమసంగినట్లు నాశనము సేయుచుండెను. అంభీరునియదృష్టము తిరిగిపోయినది. కాలమునననుసరించి ప్రభుత్వములు మారుచుండును. కర్మము కాలముననుసరించియే యుండును. ఎక్కడ ననహానముండునో యెక్కడ నధర్మము తలసూపుచుండునో యచ్చట జయము దూరమగుచుండును. అసూయ దావానలమువలె జన్మస్థానమునునశింపఁ జేయుచుండును.

పాపము పాంచాలదేశమంతయు నేకచ్ఛత్రముగఁ బరిపాలింప వలయునని యెన్నియో ప్రయత్నములు చేయుచు నెట్టిదారుణకర్మములనైన నంగీకరించియున్న యంభీరు డిప్పుడు మహావీరశిఖామణియగు వసంతునిచేతులలో దారుణరణరంగమునఁదనయాశలతోఁబాటు ప్రాణములను విడిచిపెట్టవలసినవాఁడయ్యెను. వసంతునిసాహసాదిసద్గుణములు చంద్రగుప్తుని సంతతవిజయములకుఁ దోడుపడినవి.



## పంద్రెండవ ప్రకరణము.



స్వదేశరాజులలో నంతఃకలహములు కల్పించి యొకపక్షమున నిలిచి పోరాడినప్పుడును, విదేశీయులగు గ్రీకులతోఁ గలిసి తోడి రాజుపైఁ గత్తిఁగట్టినప్పుడును, తక్షశిలానగరేశ్వరునిపక్షమువహించిన విజయలక్ష్మి నేటికిఁ జంద్రగుప్తునివశమై పోయినది. ఎల్లవిధముల నాతనియభ్యుదయమునకుఁ దమజీవితముల ధారవోసిన సైనికు లెల్లరును

జేరులేకుండఁ బోయిరి. పాంచాలదేశమునందలి దుర్గములలోని కెల్ల నభేద్యమని ప్రశస్తివహించిన తక్షశిలాదుర్గ మిప్పుడు శాత్రవులకు స్వాధీన మైపోయినది. ఎవ్వఁడు గ్రీకుసేనాసాహాయ్యమునఁ బాంచాలమునం దంతటను దననిరంకుశప్రభుత్వమును స్థాపింపఁ దలంచెనో, ఆయంభిరుఁ డిప్పుడాయుశాహాలను బ్రాణములతోఁగూడ సంపూర్ణముగ వదలివైచెను. కాలము తిరిగిపోయినది. తెర పడిపోయినది. పొద్దు గ్రుంకిపోయినది. చంద్రగుప్తుఁ డిప్పుడు పాంచాలమున కంతకును బ్రభువయ్యెను. అతనివిజయధ్వజము తక్షశిలాదుర్గముపైఁ గూడఁబ్రకాశించుచుండెను.

చంద్రగుప్తునియభ్యుదయమున సేనాసాగర ముప్పొంగి పోవుచుండెను. చంద్రగుప్తుఁ డెంతప్రతాపమూర్తియో యంతదయాళుఁడు. ఎంతగౌరవమహితుఁడో యంతవినమ్రుఁడు.ఎంతచండశాసనుఁడో యంత కార్యవాది అతనికిఁ బ్రభుత్వమువలనరాజసము కలుగలేదు. ఐశ్వర్యమువలన గర్వము జనింపలేదు. పరాక్రమశక్తివలన దారుణోద్దేశములు పుట్టలేదు. అతఁడు సేనలను స్వీయముగ నాదరించెను. పౌరులను నంతఃపురజనంబును నలజడిపెట్టకుండుటకయి వారికాజ్ఞాపించెను. వసుమతీ కనకలతలకుఁగాని రాజాంతఃపురజనంబునకుఁగాని,యలజడికలుగకుండుటకయి చుట్టును సేనలకుఁ గట్టడ చేసెను.

అతఁడువిజయరసాశ్లేషానందమున మైమఱచియుండ లేదు.లావణదుర్గమును ముట్టడింపఁబోయినగ్రీకు సేన లాతనిమనసులోన నేయుండెను. తన సేనల కన్నిటికి నిట్లాజ్ఞాపించెను.

“ యోధవరులారా! నాయందలిప్రేమచే నాయభ్యుదయమును గోరి నాపక్షమునఁ బనిచేసి విజయమును సంపాదించినందులకుఁగృతజ్ఞుఁడనై యున్నాఁడను. చుట్టుపట్టుల గ్రీకుసేనావాహిను లున్నంతవఱకు మనకు నెమ్మది కలుగదు. ఆవాహినుల గాంధారదేశమున కవ్వల

మరలించినప్పుడుగాని మనవిజయము స్థిరపడినట్లు తలంచుటకు వలను పడదు. ఈదుర్గద్వారము బలహీనమై పోయినది. దీని నెల్లవిధముల మనము కాపాడికొనుట కీరాత్రి యప్రమత్తులమై ప్రయత్నింపవలసె యున్నది. వసంతుఁడు గజబలముతో సిదుర్గద్వారరక్షణమున నప్రమత్తుఁడై యుండ వలయును. కొంతబలముతో నేనును బశ్చిమద్వారమునసిలిచి యుండె దను. పుష్కరాక్షుఁడు దుర్గముచుట్టును దిరుగుచు హెచ్చరించుచుండ వలయును. కొంతమంది దండనాయకులు తమతమసేనలతో బురుజుల పై నిలిచి యుండవలయును. రాజనీతికిని దాక్షిణ్యమునకును జాల దూరము. ఈశాసనము నతిక్రమించి ప్రమత్తుఁడై యెవ్వఁడు సంచ రించునోయాతఁడు మరణదండనమునకుఁ బాల్పడవలసి యుండును ”

యోధు లందఱును నంగీకారసూచకముగ జయజయధ్వానముల నొనరించిరి. చంద్రగుప్తునిశాసనము నిరాఘాట మైనది. ఆగంభీరవచన ములు ప్రతిభటునిహృదయమునందును, ప్రతిధ్వనించుచున్నవి. ఆసైనికు లిదివఱకు స్వదేశరాజులయంతఃకలహములవలనఁ గలిగిన దేశోపద్రవ ములలోఁ జాల నాయాసపడి యుండిరి. ఆయల్లరులలోఁ దమతమరాజ్య ములను సర్వస్వమును గ్రీకురాజుల కొప్పగించి చాలకాలము వనవాస కష్టముల ననుభవించిరి. వారికష్టదినములు పోయినవి. చంద్రగుప్తుని సాహాయ్యము లభించినది. ఒక్కింతకాల మోర్చుకొని పనిచేసినచో నందఱియభీష్టములు సంపూర్ణముగ సిద్ధింపఁగలవు. దేశమునశాంతి నెలకొల్పఁబడును. శ్రీరామరాజ్యము స్థాపింపఁబడును. చంద్రగుప్త నియోగమున నందఱును తమతమయుద్యోగములం బ్రవేశించి జాగ రూకులయి యుండిరి. ఆనాఁటివిజయమున వారిహృదయము లుత్సాహ పూరితములయి యుండెను. ఇంకను వారికి యుద్ధమునఁ దనివితీరలేదు. మరల యుద్ధమున కెదురు చూచుచుండిరి.

వసంతుఁడు ప్రాగ్ద్వారమున గజబలముతోఁ గనిపెట్టియుండెను. ఆతనికి విచార మగపడుట లేదు. కాని కొంతవఱ కాతనిహృదయము కోటలో నంతఃపురమునయున్న వసుమతివంకకుఁ గూడఁ బోవుచుండెను. ఆగాఢాంధకారమునఁ గన్ను మిన్నుఁ గనఁబడుటలేదు. ఆచీఁకటిలో నాకస్మికముగా వసుమతి సాక్షాత్కరించినట్లయ్యెను. నిర్దయుండగు తన్నుఁ జూడనొల్లక తప్పించుకొని పోవుచున్నట్లుండెను. ఇది యంతయు నాతని హృదయవికారము. వియోగవంతుల కగపడునదంతయుఁ బ్రియావిలాసముగనే శోఁచుచుండును. గాఢాంధకారమున నేదే నొక ఛాయ పార్శ్వమునఁ బోవుచుండుట నాతఁడు చూచియుండును. తన్మయత్వముచేఁ దన్ను విడనాడి పోవుచున్న వసుమతిగ భావించుకొని యెను శోకనేయాతఁడు స్మృతిఁ దెచ్చుకొనియెను. కార్యాలోచ నాఘోరము, వియోగవిచారము, ఈరెంటికిని హృదయమున సాపడి నంతతావు దొరకుటలేదు. ఆభావములు పొంగిపొంగి పైకివచ్చుచుండె. విచారమును హృదయమునదాఁచి తీక్ష్ణభావమునువహించెను. కరవాలము నొక్కసారి ఝుళిపించి తదేకదృష్టితో సేనల బరీక్షించుచుండెను.

సైనికులందఱును మేల్కనియే యుండిరి. విజయవార్తల నత్యుత్సాహముతోఁ బ్రశంసించుకొనుచుండిరి. రాత్రి రెండవజాము గంట వినఁబడినది. భేరిమ్రోగించుచుండిరి. ఆసమయమున మనహరిదాసుఁడు వసంతునియెదుట సాక్షాత్కరించెను.

“ఎవరువారు?” అని వసంతుఁడు ప్రశ్నించెను.

“హరిదాసుఁడు” అని యాతఁడు పలికెను.

వసంతుఁ డేమో యాలోచించుకొనియెను. అలనాఁడు శతద్రూ నదీతీరమున గానముచేయుచున్నప్పు డీహరిదాసుని వసంతుఁడు చూచి

మాటలాడియున్నాఁడు. ఆతని నానవాలుపట్టి, ఇచ్చటికిప్పుడేలవచ్చితిరి?. అనియెను.

"అనాథయువతీరక్షణముకొఱకు మీసాహాయ్యముకోరి వచ్చితిని. దయయుంచి వేగమ రావలయును."

"ఎచ్చటికి?"

"అంతఃపురమునకు"

"అంతఃపురముచేరుటకు మాకు రాజాజ్ఞ లేదు. సతీరక్షణమునకు మహారాజగు చంద్రగుప్తుఁడే చాలియున్నాఁడు. ఆతనిఁ బ్రార్థింపుము"

"ఆమె యొకరిచే రక్షింపఁబడదు. నీవే రక్షింపవలయును"

వసంతుని గుండె జల్లుమనియెను. ప్రియముగలచోటఁ గీడు శంకించుట సహజము. పాప మంతఃపురమున నున్న వసుమతి కేమైన కీడు మూఁడినదేమోయనియాతనిహృదయము తల్లడిల్లుచుండెను. "అయ్యో! అంతటివిపత్సముద్రమున మునిఁగియున్న యబలయెవ్వతెయో మీకుఁ దెలియునా?" అనియెను.

"ఈప్రశ్నోత్తరములతోఁ గాలముగడుపుచుండుట కిది యదను గాదు. ఒక్కింత సే పాలసించితివేని శరణాగతనిరాసనము వలని దోషము."

"శాసనాతిక్రమణము వలని నేరముమాత్రము లేదా?"

"పాపము! నీవంటిదయాళుఁడగు యోధుని రక్షణమునాసించిన యాయబల బలవంతముగఁ బ్రాణముల విడువవలసిన దేనా?"

వసంతునిహృదయము చేవెట్టి కలఁచినట్లుగ నుండెను. ఆహృదయమున వసుమతి యాపదలోఁ బడిపోవుచున్న ట్లాతనికిఁ బొడకట్టెను. ఆతఁడుమనసు కుదురుపఱచుకొని యమంగళముల శంకింపఁగూడదని ధైర్యము తెచ్చుకొనియెను అంతఃపురమున సురక్షితముగ నున్న

వసుమతి కేమియు నపాయముకలుగదని నిశ్చయించుకొనియెను. వసుమతీసందర్శనమునకుఁ దవ్వరపడుచున్న యాతనికి క్షణమొకయుగముగ నగపడుచున్నను రాజకార్యభారమును వహించియున్నయాతఁ డారాత్రి నొక నిమిషముగ గడపవలయునని ధృఢనిశ్చయుఁడై యుండెను.

"అయ్యో! నా కేమియును సంబంధములేని కార్యమునకుఁబూనుకొని రాజకార్యము నతిక్రమింపఁజాలను. ఇందుమూలముననేదేని యుపద్రవమేతటస్థించిన యెడలఁ బ్రజలకును, దేశమునకును, రాజునకును, రాజ్యమునకును, గూడ మహాద్రోహము చేసినవాఁడ నగుదును." అనియెను.

"ఇప్పుడిచ్చటఁ గలిగిన యిబ్బంది యేమియునులేదు. ఒకవేళ గలిగినను దానిని తప్పించుకొనుటకు మార్గములున్నవి. నీయుపేక్షచే నాకన్నియ ప్రాణములే పోయినయెడల మఱిరావుగదా!"

వసంతునియూహాలు చెదరిపోవుచుండెను. అతనికి ధైర్యము నిలువఁబడుటలేదు. ప్రాణప్రియులవిషయమున నాపదనుగూర్చిన యనుమానము గూడ సత్యముగనే హృదయమును వేధించుచుండును. "అయ్యో! ఆకన్య యెవ్వతెయో యామెకుఁ గలిగనయాపద యేమో చెప్పకుండ నిట్లేలకలఁగించెదవు?" అనియెను

"ఆమె యెవ్వతెయో నే నెట్లు చెప్పఁగలను? ఇది యామె ప్రాణావసానసమయమున నాపైఁ బాఱవైచిన యుంగరము" అనియెను.

"ఉంగరము" అనువాక్యము వసంతుని శ్రవణములకు హాలాహలమువలె నుండెను. వడఁకుచున్న హస్తముతో నాయుంగరము నందుకొని పరిశీలించి చూచెను.

వసంతునిగుండె బ్రద్దలైపోయినది. ఆతని రక్తనాళములలో దావానలము ప్రవేశించినది అంగుళీయకస్పర్శనమాత్రమునం గలిగిన పూర్వస్మృతి హాలాహలమువలె లోపలఁబ్రవేశించి యాతని హృదయమును దహించివేయుచుండెను. కన్నులనుండి యొక్కయశ్రుబిందు

వైన వెడలినచో హృదయతాపము కొంతయుపశమించియుండును. కాని, విరహతాపతప్తంబులగు నాతని విశాలనయనము లట్టియవస్థలో లేవు. కాలసర్పమువలె రోజుచు నిశ్చేష్టుఁడై నిలువఁబడిపోయెను. అట్టియవస్థలో నాతనికి మరల రాజశాసనము తలంపునకు వచ్చుటచే నించుక బాహ్యస్మృతి కలిగెను. ఆమెందుచున్న హృదయానలమున నెన్నియో భావస్ఫులింగములు వెడలుచుండెను. అప్పటి యవస్థను బట్టి యాతఁడొక్కింత ధైర్యమును దెచ్చుకొనవలయునని ప్రయత్నించెను. పగటియుద్ధమును జ్ఞప్తికిఁ దెచ్చుకొనియెను తన్నెదుర్కొని యంభీరుఁడు పొడిచిన బల్లెపుపోటును, ఆసమయమునఁ దనకుఁ గలిగిన తీవ్రక్రోధమును ధ్యానించుకొనియెను. నిశితకరవాలాఘాతములచేఁ గూలుచున్న శత్రుభటుల వెచ్చని నెత్తురుతుంపురులవలన నలంకరింపఁబడిన తనభయంకరాకారమును స్మరించుకొనియెను. ఇప్పు డాతనిహృదయమున శోకానలముపై వీరరసము ప్రధూమితమగుచుండెను. అది యెంత సేపునిలుచును?

"అయ్యా! ఈయుంగరము నాది. నీకెట్లు వచ్చినది?" అని యడిగెను.

"ఈయుంగరము నీదైనప్పుడు దీనిని ధరించినయామె నీప్రాణమైయుండును. మహావీరశిఖామణివగు నీవు నీప్రాణము నితరుల రక్షణమునకుఁ బాల్పఱుచుట పౌరుషముకాదు"

వసంతునిహృదయమున నిప్పుడు శోకానలము ప్రజ్వరిల్లుచుండెను. వీరరస మొగిచిపోయినది. గద్గదస్వరముతో "ఆయాపదనొందుచున్నయబలామణి నాప్రాణమగు వసుమతియేనా?" అని నిశ్చేష్టుఁడై నిలువఁబడిపోయెను.

హరిదాసుఁడు వసంతునిచేతులతోఁ దట్టి "అయ్యా! నిమిషములు గడచినకొలఁది నామెకు మృత్యువు సమీపించుచున్నది. త్వరపడవలయును. ఆలోచించుట కవకాశము లేదు. ఆమెను రక్షించి క్షణ

కాలములో యథాస్థానమునకు రావచ్చును. ఇంతలో వచ్చునపాయ మేమియును లేదు. సైనికులెల్లరును జాగరూకులై యున్నారు. ప్రాణప్రియయగు సతీరక్షణముకంటె నుత్తమధర్మము వేఱొండు లేదు. నీ హృదయమును పదిలపఱచుకొని లెమ్ము" అని హెచ్చరించెను.

వసంతుఁడు తెలివిఁ దెచ్చుకొని చాలదూర మాలోచించుకొని యెను. ఒకవంక ప్రాణప్రియాప్రాణరక్షణము, ఒకవంక రాజకార్య నిర్వహణము. ఇవి రెండు నాతని కవశ్యానుష్ఠేయము లేన్నైయుండెను. ఒకటి ప్రాణోపద్రవమునుండి కాపాడుట. ఒకటి రానున్న సంఘోపద్రవమును దొలఁగింప సంసిద్ధముగ నుండుట. ఈరెంటికిని సామాన్యధర్మ మగపడుటలేదు. ఒకటి స్వార్థపరత్వము. మఱియొకటి స్వార్థత్యాగముతోఁగూడిన ప్రభుభక్తి. ఈయాలోచనము లేవియు నాతనికి సరిపడుట లేదు. ఇంకను హృదయమున మననము చేయుచునే యుండెను. ఎదుట నెవ్వరో యిరువురు యోధులు గుసగుసలాడుచున్న ట్లాతనికి వినఁబడియెను. వారు వసుమతిని జంపఁబోవువారివలె నాతని కగపడిరి. హరిదాసుని హృదయము వసుమతిపై నుండుటచే నాతని కీగుసగుసలు వినఁబడలేదు. వసంతునకు హృదయావేగము కలిగెను. అందు " హా ప్రియా! కడసారి విన్నపము నాలింపుము! కడపటిదర్శన మొసంగుము! రక్షింపుము. రక్షింపుము" అనునార్తవాక్యములు ప్రతిధ్వనించుచుండెను. ఆర్తత్రాణపరాయణులకు దీనాలాపములే యాకర్షణమంత్రములు. వసంతునకు దూరాలోచనసేయుట కవకాశములేదు. సైనికులందఱు మేల్కనియే యుండిరి. ఒక్కింతసేపటిలో మరలి రావచ్చునని తలంచెను. "అయ్యా! ఆస్థలమునకు దారి చూపుము" అని చెప్పుచు నా హరిదాసునితో వెడలి పోయెను.

---

## పదుమూఁడవ ప్రకరణము.



“హా నాథా! నన్ను వీడి స్వర్గమును జూడఁబోయితివా? నిర్భాగ్యలగు మీ రాణుల కేమిగతిచూపితివి? మాకంటె నీవు ముందుగ స్వర్గముఁ జూడఁగోనుట న్యాయమా? మేము నీసహధర్మచారిణులము కామా! సుఖదుఃఖములకు సమభాగినులము కామా? మేము నీ వెనుకనే వచ్చుచున్నాము. కొంతసేపాఁగుము. నీ కెట్టిమాయచావు తటస్థించినది?”

అను నార్తనాదము లంభీరుని యంతఃపురమునుండి వినవచ్చుచుండెను. అది కోటదక్షిణపార్శ్వమునం దున్నది. దానికి దక్షిణముగ నొక యంతర్గృహమున్నది. దానియం దగ్ని ప్రజ్వరిల్లుచుండెను. లంభీరుని రాణులందఱును భర్తృవియోగదుఃఖమున నగ్నిప్రవేశము చేయఁ జూచుచుండిరి. ఆ యార్తధ్వనులు వారివే. ఆ స్త్రీలమధ్యమున నొక బాలిక కూడ దుఃఖించుచుండెను. మూర్తీభవించిన శోకదేవతవలె నున్న యా బాలికను జేరి యా స్త్రీలందఱును—

“ఓసి దుర్భాగ్యురాలా! నీమూలముననే మాకిట్టిగతి కలిగినది. నీవు మాకోటలో నడుగుపెట్టితివి. నిర్ధూమధామముఁ జేయువఱకు విడువలేదు. నీపాపపుఁజూపులలో విషమున్నది. మాజీవితేశ్వరు నెడఁబాపిన నీకు నీప్రాణేశ్వరుఁడు మాత్రము దక్కునా? రమ్ము మాతోఁ గూడ నగ్నిప్రవేశముం జేయుము.” అని బలవంతపెట్టుచుండిరి,

పాపమా యబల “అమ్మా! నావలన దోషములేదు. నేను మీ కేమియు నపకారము చేసియెఱుంగను. కాలకర్మదోషమునఁ దటస్థించిన మీపతిమరణమునకు నన్నుత్తరవాదినిం జేసి యేల పాపముగట్టుకొనియెదరు? చిరకాలమునుండి నేనొక్క కోరికతో నున్నదానను. నడుమ

నెన్నియో విఘాతములు కలిగినవి. ఎన్నియో కష్టములు వచ్చినవి. ఎప్పటికైన నాకోరిక సిద్ధింపఁగలదను నాశతో నింతకాలము జీవించియుంటిని. అట్టియభీప్సితము సిద్ధింపనున్న యుక్తకాలమున నన్నేలచంపఁ జూచెదరు? మీరు సతీజనసామాన్యధర్మమును నాముష్మికసుఖకారణంబగు సహగమనవ్రతము నూనియున్నారు. నిరంతరప్రియసమాగతసౌభాగ్యము నుత్తరజన్మమునైనఁ బడయఁ గోరుచున్న మీరు చిరవియోగపరితప్తహృదయనై ప్రియసందర్శనభాగ్యమున కెదురుచూచుచున్న నాయానందమున కేలవిఘాతము సేయఁ జూచెదరు? ప్రియమరణదుఃఖాతిరేకమున యుక్తాయుక్తవివేకమును విడిచి కేవల సామాన్యస్త్రీసాధారణంబగు ననూయాపిశాచంబునకు లోనై యిట్టిదారుణకర్మమున కేల యొడి గట్టుకొనియెదరు? స్వర్గరాజ్యమును జూఱఁగొనఁదలంచిన మీరు మహారౌరవనరకద్వారముల నేల తెఱవఁ జూచెదరు? ఎలజవ్వనమంకురించుచున్న సమయమునఁ బెండ్లియన్న నెంతసంతోషముగనుండెడిదో, ప్రప్రథమముననుదయించిన మోహమునం దెంతశక్తియున్నదో, జీవితేశ్వరుని ప్రథమసమాగమమెంతయానందకరమైనదో, ప్రియవియోగమెంతదుస్సహమయినదో లోకానుభవముగల మీ రెఱుంగనిదికాదు. ఏమియు నెఱుంగని యీపూపపిందెనేల తునిమివేసెదరు? నాయీయవస్థ మీకుజాలిగలిగించుటలేదా? నాదీనాలాపములు మీహృదయమును గఱగించుటలేదా?"

అని యనేకవిధముల దీనముగఁ బ్రార్థించుచుండెను. పాపమీకోమలియెవ్వరు? వసుమతియె కాదా? మానపాలుని గర్భమునఁ బుట్టి మగధరాజుచే బలవంతముగ నరికట్టఁబడి చోరులబాధకు లోనై కడకు తక్షశిలాదుర్గాంతఃపురమున నిప్పు డీయవస్థలో నున్నది. ఆమెముఖమండలము కళాహీనమయి యుండెను. ఆచూపులలో నిప్పుడు ధవళకాంతులు స్ఫురించుటలేదు. వేఁడియూర్పులచే నధర

బింబము నల్లవడిపోయినది మనోహరాలంకారము లన్నిటిఁ దృణీకరించు నామెకచకలాప మిప్పుడు విరిసి యొడలంతటను జెదరి వ్రేలాడు చుండెను. ఆసుకుమారశరీరము కృశించి పలుచని నల్లమబ్బుచేఁ గప్పఁ బడినకృష్ణచతుర్దశీ చంద్రరేఖ వలెనుండెను. ఆమెకన్నులనుండి యొక్కటే ధారగ నశ్రువులు జాలువారుచుండెను. ఆమె నోదార్చువా రెవ్వరు? ప్రాణాపదముగఁ బెంచుకొనుచున్న సుందరి యీలోకమునే విడిచి పోయినదిగదా! ఓయీశ్వరా! నీవెంతనిర్దయుఁడవు? శిరీషకుసుమకోమలు లగు సుకుమారిణులకు భరింపరానికడగండ్లంగూర్చి నవ్వుచుఁ జూచు చుందువు. ఆమె యెంతకష్టపడుచున్నదో చూచుట లేదా?

పాపము! వసుమతి చావుఁగోరుకొనుచున్నంతకాలము చచ్చుటకు వలనుపడినదేకాదు. ఇప్పుడు వసంతువివార్త తెలిసినప్పటినుండియు నామెకు జీవితమునం దాశ కలిగినది. ఈసమయమున నామెకు బలవన్మరణము తటస్థించియుండెను. పిశాచములవలె నారాణులు చుట్టుకొనియుండిరి.

శోకానలము క్రోధాకారమునఁ బరిణమించుటచే నున్మాదినులై యున్నవారికి జాలియెట్లు కలుగును? వసుమతి దీనాలాపములు వారి తల కెక్కలేదు. బలవంతముగఁ దలపెట్టినకార్యమును దీర్పఁదలంచిరి. ద్వారమువెలుపలి దొడ్డిలోపలఁ జితిప్రజ్వరిల్లుచుండెను. కాలుచుండు కట్టెలచిటపటధ్వనులలో యమకవాటఘంటాధ్వనులు వినవచ్చు చుండెను. అగ్నికుండమునుండి నిలివెడెత్తుగా నగ్నికీలలు వ్యాపించు చుండెను.

అయ్యో! వసుమతి! చిన్నతనమున నెట్లుంటివోకాని నిన్నెఱిఁగి నంతవఱకు మాకు నీకష్టములను జూచుటకొఱకే సరిపోయినది. ఈ విపత్సముద్రతరంగములకు నేఁటితో విశ్రాంతి కలుగునాయేమి? విరహ పాండురంబులగు నీకోమలాంగకంబులు వైశ్వానరజ్వాలలలో మాయము

కావలసిన దేనా? ఈవిధముగా నీకష్టములన్నియుఁ దీరిపోవలసిన దేనా? నీమనోహర తనుకాంతులగ్నికీలలలో నైక్యముఁ కావలసిన దేనా? నీసుందర వదనచంద్రమండలమువహ్నిశిఖాసంతాపముచేఁ గఱఁగిపోవవలసిన దేనా? నీకీలోకమున ననుభవింపఁదగిన సౌఖ్యమేమియును లేదా? కటకటా! నీ హృదయమిప్పు డెంత పరితపించుచున్నదో? నీకీకష్టకాలమున నీతలిదండ్రులు జ్ఞాపకమునకు వచ్చుచున్నారు? లేరు. నీవు వారిని చిన్నతనమున నే మఱచిపోయితివి? నీమనసు సుందరిపైకిఁ బోవుచున్నదా? ఆమె యీలోకమున నున్నదను నాశయేమియును లేదే? నీవిప్పుడు వసంతుని ధ్యానించుచున్నావు. దైవమును ధ్యానించుట లేదు. నీకు వసంతుఁడే దైవము. దేవుఁ డెన్నఁడును దృగ్గోచరుఁడు కాఁడు. నీకు వసంతుని నట్లే భావించుకొనుచున్నావు. నీతనులత కంపించుచున్నది. నీమనోహరుఁడు నీయెదుట సాక్షాత్కరించెనా యేమి? నీప్రాణవాయువుల వసంతుని ప్రాణానిలములతో నైక్యము చేయఁ దలంచుచున్నావా! నీవలపు చాలఁ జెడ్డది నీయనురాగమునకుఁ బరిమితి లేదు. నీజీవితమే దుఃఖభాజనమై పోయినది. అదృష్టదేవత నీపైఁ బగసాధించుచున్నది.

అగ్నిప్రవేశసమయమైనది. రాణులామెను బలవంతముగఁ గట్టి తీసికొనిపోవలయునని సమీపించిరి.

“హా! ప్రియా! వసంతా! రక్షింపుము! రక్షింపుము” అనిపెద్ద పెట్టున రోదనము సేయుచు వసుమతి స్మృతిదప్పి పడిపోయెను. రాణులామెను గట్టి తీసికొనిపోవుటకు సిద్ధముగ నుండిరి. ఇంతలో నతివేగముగ నొకయోధుఁ డాస్థలమును సమీపించెను. శత్రుభీతిచే రాణులు చెల్లాచెదరైరి. ఒక్కపెట్టున నందఱు నవ్వాలిదొడ్డిలోనికిఁబోయి తలుపులు మూసికొనిరి. ఒకనిమిషములో “హా! పరమేశ్వరా!” యను నార్తధ్వను

లతోఁజిట పెటధ్వనులు వినవచ్చెను. ఇఁక నేమున్నది? రాణులయగ్ని ప్రవేశకర్మము పరిసమాప్తి నొందినది.

ఆయోధుఁడు వసంతుఁడే. అతఁడు లోనికరిగి చూచునప్పటికి వసుమతి స్మృతిదప్పి పడియుండెను. ఆమెను గాంచినతోడనే వసంతుని హృదయభావములన్నియును బొంగిపోయినవి. ఎక్కడిపాటలీపురము! ఎక్కడితక్షశిల! ఎక్కడివసుమతి! అతనికిఁ గన్నీరు చెక్కుల జాలువారుచుండెను. పెద్దపెట్టున "వసుమతీ!" యనిపిలిచెను ఆమె మాటలాడలేదు సుడిగాలితాకున నల్లాడు నరుణపల్లవములవలె వడవడవడకుచున్న హస్తములతో నామెతనువల్లిని స్పృశించిచూచెను. అప్పుడామె మైదీఁగ తప్తకాంచనసదృశమై యుండెను. ఆమె వక్షోభాగమునఁ జెమ్మయొగ్గి విసెను. గుండెలుతటతటఁ గొట్టుకొనుచుండెను. ఆమె సుందరవదనారవిందమును ఱెప్పవేయక చూచుచుఁ గొంతసేపుండెను. బాష్పావరోధమువలన నాతనిచూపులకు నడుమ నంతరాయము కలుగుచుండెను. కొంతసేపటికామె కనులు విచ్చి యొక్కసారిచూచెను. తోడనేకన్నులు మూఁతపడిపోయెను. వసంతునకదియొకడనారిమాపుగఁ దోఁచెను మరల "వసుమతీ!వసుమతీ!" యనిశోకగద్గదస్వరముతోఁబిలిచెను. ఆమెపలుకలేదు. ఆమెకనుగొలుకులు బాష్పపూరితములైయుండెను. ఆమెమనోహరవదనబింబమును గప్పివేయుచున్నముఁగురులను జక్కఁజేసి సకరుణముగ సానురాగముగ, సాభిప్రాయముగఁ జూపులుపఱగించెను. కన్నీటిచేఁ దడిసిన చెక్కులపై నంటియున్న కుటిలకుంతలముల నెడలించి కడసారి యొక్కముద్దుఁబెట్టికొనియెను. దుఃఖాతిరేకమున నాతనికన్నులనుండి వెడలుచున్న యశ్రుధారలచే వసుమతివదనమండలమును దడిపివైచెను. ఇప్పుడిప్పుడు వసుమతికి వసంతసంస్పర్శనమున నించించుక స్మృతి కలుగుచున్నట్లున్నది. సాయంతనచంద్రకిరణప్రసారమున నించించుక తేఱికొనుచున్న గ్రీష్మప్రతప్తవల్లికవలె వసుమతి సుకుమారాంగకములు

చైతన్యప్రకాశితము లగుచుండెను. తనుతాప ముపశమించుచున్నది. మఱియొకసారి కనుదమ్ములను విచ్చి చూచెను. ఆచూపులలో స్మృతి యున్నది. మరలఁ గన్నులు మూసికొనియెను.

ఎంతసిగ్గువసుమతీ! నీసుకుమారశరీరమును బరితపింపఁజేయుచు క్షణక్షణమునకు జీవితసంశయమును గలిగించుచున్న నీమోహముతోఁ గూడ నీలజ్జాభావమును వర్ధిల్లుచునేయున్నదా? ఎవ్వనిసందర్శనభాగ్యమును నిరంతరమును గోరుకొనుచుంటివో, యెవ్వనిహృదయానురాగమును నీయనురాగములో సరిచూచుకొనఁ దలంచుచుంటివో, యెవ్వని సంస్పర్శనానందము ననుభవింప హృదయమునఁ బరితపించుచుంటివో, యామనోహరుఁడు, నీవలపులపంట, నీజీవితేశ్వరుఁడు, నీయెదుట నిలిచి నీకొఱకుఁ బరితపించుచు నీకోమలాంగసంస్పర్శమునసుఖమో, యానందమో, యెఱుంగక యనుభవించుచుండఁగాఁ జూచియు నేలపలుకరింపలేక పోవుచున్నావు? పులకాంకితవై వచ్చుచున్న యానందరసాంబుధి యందలి లజ్జాతరంగములలో నేల మునిఁగిపోయెదవు?

వసుమతి తీవ్రశోకదావానలమానందరససముద్రముగఁ బరిణమించినది. మోహబడబానల మాసముద్రమును బొంగించుచుండెను. లజ్జాతరంగోద్రేకము మాత్ర మింకను నడఁగిపోలేదు. వసుమతి మఱి కన్నులు తెఱచి చూడలేకపోయెను. తన సమున్నతవక్షస్థలంబున వామకపోలమునాని వదనమండలమున నిశ్చలకటాక్షములఁబఱగించుచుఁ దన్మయుండయి యున్న ప్రాణేశ్వరుని కంఠమును తనవామబాహు వల్లరిచే బిగించి యించుక యెడమప్రక్కకొఱఁగి బిగ్గగవుంగిలించుకొని యెను. ఇదివఱకు వసంతుని చెక్కిలి చేరియున్నతావున నాతని విశాల వక్షస్థలమున్నది. ఆతని వామశిరఃపార్శ్వము వసుమతిదక్షిణకపోలము నాని యుండెను. తుమ్మెదఱెక్కలవలె నల్లనై యున్న మీసములు వసుమతి యధరబింబమును గప్పివేసెను. బింబ ప్రతిబింబన్యాయమున

వసుమతి హృదయభావములన్నియును వసంతునియందుఁ బ్రతిఫలించెను. ఇరువురిశరీరములును దపించుట లేదు. ఇరువురికన్నులును మూఁతపడియెను. ఇరువురకు నిట్టూర్పులు వెడలుచుండెను. ఇరువురు నానంద రసాంబుధిలో మునిఁగి పోయిరి ఇరువురును మోహోన్మాదమున మైమఱచిరి. ఇట్లిరువురు స్తబ్ధులై పడియుండిరి.

విరాధవధానంతరమునఁ బర్ణశాలలోఁ బరస్పర గాఢాలింగన సుఖంబున విస్మృతివహించినసీతారాములయనుభవించిన యానందమును, వసుమతీవసంతుల యిట్టిమహానందమును, ననుభవించి యుండరు.

ఈసమయమున హరిదాసుఁ డచ్చటికివచ్చి చూచెను. ప్రాపంచక విషయముల నుజ్జగించి లోకాతీతచరిత్రుఁడయి చరియించుచున్న యాభక్తశిఖామణికిఁ గూడ మహానందము కలిగెను. వారియానందమునకు స్మృతి కలిగింపవలయునని యాతనికిఁ దోఁచెను. సారంగమున రాధామాధవవిలాసము పాడవలయునని తలంచెను. శ్రుతులు సరిజేయఁ జూచుచుండఁగా "కోటలో! శత్రువులు! గ్రీకులు! కోటలోఁ జొరఁబడుచున్నారు! అడ్డుకొనుఁడు. పొడువుఁడు! యుద్ధము! యుద్ధము! లెండు! లెండు! త్వరపడుఁడు. త్వరపడుఁడు." అనుకోలాహలధ్వనులును, భయంకరభేరీధ్వనులును వినవచ్చెను. ఆనందపారవశ్యమున దమ్మును లోకమును మఱచియున్న వసుమతీవసంతుల కాభయంకర కోలాహలమేమియును వినఁబడలేదు. దేశద్రోహము చేసిన వానివలె హరిదాసుడు నిశ్చేష్టుఁడయి నిలువఁబడిపోయెను.

---

## పదునాల్గవప్రకరణము.



కోటయంతయును గ్రీకులచే నిండిపోయెను. ద్వారమునొద్ద వసంతుఁడు లేఁడు. భటులు వారికొత్తుల కెదురలేక ద్వారమును వదలి వైచిరి. వేలకొలఁది గ్రీకు లిఁక నాద్వారము వెంబడి వచ్చుచునే యుండిరి. కోటలోనున్న దండనాయకులు తమబలములతో వచ్చి వారి నాఁపవలయు నని యెదిరించుచుండిరి. కాని మహాశూరు లగు గ్రీకు భటులు వారిని దూసికొని ముందునకుఁ బోవుచుండిరి. పుష్కరాక్షుఁడు వారి నాఁగి సమరము చేయుచుండెను. పుష్కరాక్షుని సేనాసముద్రమున గ్రీకువాహిని లీనమై పోవుచుండెను. గ్రీకుల కిరువంకలను చంద్రగుప్తుని దండనాయకులు నిలిచి వారిని తాఁకుచుండిరి. గ్రీకునాయకులు యుద్ధములయం దారి తేరినవారు. వారు చంద్రగుప్తుని నెటులైనఁ బట్టికొని పోవలయు ననితలంచియుండిరి. సాహసముతోడను, ధైర్యముతోడను, మెలఁకువతోడను వారు శత్రువుల నెదిరించి పోరాడుచుండిరి. గ్రీకు సేనానాయకుఁ డెటుఁజూచినఁ దానయై పరాక్రమించుచుండెను. ఆకస్మికముగ నర్ధరాత్రమునం గలిగిన యీ దారుణసమరంబున నిరువాగులందును భటులు గూలుచుండిరి. సంకులసమరంబున స్వపక్షపరపక్ష వివక్ష లేకుండఁ బొడుచుకొనుచుండిరి. చిమ్మనగ్రోవులనుండి వసంతము వలె యోధులశరీరములనుండి రక్తము ప్రసరించుచుండెను. మహాసముద్రమున గాలివిసరునం బడునోడవలెఁ జంద్రగుప్తసేనామధ్యమున నున్న గ్రీకుసైన్యము ముందునకును వెనుకకును బార్శ్వములకు నూఁగుచుండెను. అటనుండి పుష్కరాక్షుని గడచి చంద్రగుప్తునిపైకిఁ బోవలయునని గ్రీకునాయకుఁడు ప్రయత్నించుచుండెను. కాని, యదియెట్లు పొసంగును? ఈకల్లోలమంతయును విని పశ్చిమద్వారమున నున్న చంద్ర

గుప్తుఁడు ముందునకు బయలుదేరివచ్చెను. ఆయదటున గ్రీకుసేనలు దుర్గ ద్వారమునకును వెనుకకు జరగెను. మరల ముందునకుఁ జొచ్చి యతి దారుణముగ సమరమునకు డీకొనుటచేఁ గోటలోని సేనలన్నియును జెదరిపోయెను.

ఆసమయమునఁ జంద్రగుప్తుఁ డొకయశ్వముపై నుండి గ్రీకులలోఁ బ్రవేశించెను. ఆతనిచంద్రహాసమునుండి రక్తము వర్షించుచున్నది. ఎందఱు గ్రీకుభటుల యుత్తమాంగములు నవదుర్గమునకు బలియైనవియో చెప్పలేము. ఆతనిజవనాశ్వము పీనుఁగులపైనుండి దాఁటుకొని వచ్చుచుండెను. గ్రీకుభటులు ప్రాణములకాశింపక యెదురుకొని పోరుచుండిరి. ఆచంద్రగుప్తునింబట్టుకొనవలయునని గ్రీకునాయకుఁడు సేనల హెచ్చరించుచుండెను. ఇరువాగులును పరస్పరజయాకాంక్షచే సమరము చేయుచుండెను. ఇరుబలఁగములు గెలుపోటముల వెనుకముందుల కూఁగులాడుచుండెను.

కోటలోని ముందరిభాగమున నెదిరించువారు లేక గ్రీకుభటులు విచ్చలవిడిగఁ జరియించుచుండిరి. బురుజులపై ధవళకాంతుల నీనుచు వర్తించుచున్న చంద్రగుప్తకేతనమును నఱకివైచి యట గ్రీకులజెండా నెత్తిరి. ఆసంరంభముంజూచి సహింపక చంద్రగుప్తబలంబులు మహాగ్రహావేశమున నొక్కుమ్మడి వారిపయింబడి కార్చిచ్చువలె గ్రీకుసేనా కాననమును దహించివైచుచుండెను. గ్రీకుభటులు పిక్కచెదరు లేకుండఁ దమనాయకుని ప్రోత్సాహమున గుంపులుగుంపులుగు వచ్చి చంద్రగుప్తునిపైఁ బడుచుండిరి సముద్రమువలె నుప్పొంగివచ్చుచున్న యాసేనకుఁ జంద్రగుప్తపుష్కరాక్షులు చెలియలికట్టవలె నిలిచిరి గాని, పార్శ్వములనున్న కాల్బలము గ్రీకులయపరిమితసేనలో మడఁగిపోవుచుండెను యుద్ధరంగమున నెచ్చటను వసంతుఁడగపడకుండుటచేతను, గ్రీకుసేనలు బిరాఘాటముగ లోనఁ బ్రవేశించుచుంటచేతను, వసంతుఁడు తప్పక

మరణించియుండునని చంద్రగుప్తుఁడుతలఁచుకొనియెను. ప్రాణమిత్రుఁడగువసంతునిముంచివైచిన గ్రీకుసేనాసముద్రము నింకించువఱకుఁ జంద్రహాసము నాతఁడు విడువఁదలఁచుకొనలేదు. గ్రీకునాయకుని తల నూడఁబెఱుకునంతవఱకు గుఱ్ఱమునుద్రిప్పఁదలఁచుకొనలేదు. దుర్గమారణ్యముం జొచ్చి పోవు కొదమసింగమువలె నాసేనాకాననమునఁ బ్రవేశించిచీల్చిచెండాడుచుండెను.

ఇప్పుడువసంతుఁ డేమిచేయుచున్నాఁడు? శత్రుసేనలవలనవసుమతికపాయము కలుగకుండ నాద్వారసమీపమున ఖడ్గపాణియయి నిలిచియటనున్నగ్రీకుయోధుల నుఱుమాడుచుండెను. తానొనరించిన యకృత్యమునకుఁ దన్ను నిందించుకొనుచుఁ జంద్రగుప్తునకుఁ దనమొగ మెగపఱపలేకపోయినను, తానుగూడఁ జాలినంతవఱకుఁ బోరాడుచునేయుండెను. అతఁడు గ్రీకుసేనలోఁ బడి చెల్లాచెదరు చేయుచుండినను మరల మరల సింహావలోకనమున నంతఃపురమువంకఁ జూచుచునేయుండెను.

ఇంతలోఁ గోటసింహద్వారమునొద్ద మహాకల్లోలముదయించెను. ఆద్వారముగుండ సేనలు తండోపతండములుగవచ్చి ప్రవేశించుచుండెను. నేల యీనినట్లుగ నేమూలఁజూచినను వారే. ఆసేన యెవ్వరిదో? కోటయంతయును మరల హాహాకారములతో మునిఁగిపోయినది. కపిత్థఫలంబులవలె శిరంబులెగిరి పడుచుండెను. కొందఱుభుజములు తెగి పడుచుండెను. కొందఱుకాళ్ళు ఖండింపఁబడుటచే బోరగిలఁ బడిపోవుచుండిరి. కొందఱు గుక్కుమిక్కుమనక ప్రాణములను విడుచుచుండిరి. కొంద ఱర్ధప్రాణముతోఁ గ్రిందఁబడి మూల్గుచుండిరి. ఏమఱుపాటునఁ దలయెగిరిపోవుటచేఁగొందఱమొండెములు కొంతవఱకు నడచి క్రిందకొఱఁగుచుండెను. "కొట్టుఁడు. పొడువుఁడు. నఱకుఁడు." అను వీరాలాపములు విశేషముగ వినవచ్చుచుండెను. కత్తులయొక్క మెఱపు

లకును, రాపిడులకును, భయపడక వారు గ్రీకువీరులు బెగడొందఁగన్నులు మూసికొని వారిశిరస్సులఁ దెగనఱకుచుండిరి. పోటున కొంకఁడు మొదలు పదిమందివఱకుఁ గూలుచుండిరి ఈవిధముగ సంకులసమరము జరగి పోవుచుండెను. విజయోత్సాహములో మునిఁగి విజృంభించుచున్న గ్రీకుసేన చాలవఱకు భూమిపై మ్రొగ్గినది. నూతనసేన యెవ్వరిదో మనకింకను దెలియలేదు. కోటలో ముందరిదెస నున్నగ్రీకువీరులు నిశ్శేషమై పోయిరి. ఈనూతనసేనలోఁ గొంతభాగము చంద్రగుప్తుఁడున్నవైపున కేగెను. అచ్చటగ్రీకుసేనానాయకుఁడు పోరుచున్నాఁడుగదా! ఈనూతన సేనానాయకుఁడు పుష్కరాక్షునకడ్డముగ గ్రీకుసేనాధిపతితోఁ బోరాడ సాగెను. పోరు మహాఘోరముగ నాదెస మరల నయ్యెను. అపరిమితమైయున్న యీనూతనసేనయెదుట నిలువఁబడి పోరలేక గ్రీకులు నలుదెసలకును బఱ్వులెత్తుచుండిరి గ్రీకునాయకుఁడు మాత్రము తనపట్టు వీడక శత్రువులతోఁ బోరుచునే యుండెను.

ఈయోధుఁ డెవ్వఁడై యుండునో? ఈతఁ డొనరించెడి యుద్ధమతి భయంకరముగ నున్నదే! అని గ్రీకునాయకుఁడు తలపోయసాగెను. ఆతఁడు రాజయోగానందశిష్యుఁడగు మహాయోధుఁడు. మహాయోధుఁడుగా కిట్టిదోర్బల మెవ్వరు నెఱుపఁగలుగుదురు? ఈతఁడు తనసేనతో లావణాధిపతియగు సౌభూతికి సాహాయ్య మేగెను. ఆకోటనుముట్టడించిన వారలే గ్రీకువీరులే వారికాదుర్గము స్వాధీనము కాకుండుటచే విసివి ముట్టడివిడిచియిటకువచ్చుచు నంభీరునిమరణమునుఁ జంద్రగుప్తుని విజయమును విని చెదరియున్న తూర్పుద్వారమును, వసంతుఁడు విడిచిపోయిన సమయమును, గనిపెట్టి బలవంతముగనీకోటలోఁ బ్రవేశించిరి. వీరులావణాదుర్గమును విడిచిన కొంతసేపటిలోనే మహాయోధుఁడును, సౌభూతియును, వీరికిఁ దెలియకుండ వీరిని వెంబడించియే వచ్చుచుండిరి. గ్రీకులు

కొంచెముముందుగఁ బ్రవేశించుటచే వారికోటలోఁ బడిరి. వెనుకవచ్చిన వీరిసంగతిని దెలిసికొని యిట్లువచ్చి కలిసికొనిరి.

మహాయోధుఁడును గ్రీకునాయకుఁడు నిప్పుడు పోరుచుండిరి. ఇరువురు సమానయోధులు. వారు కత్తియుఁ గత్తియుఁగలిపి చేయు యుద్ధము దర్శనీయ మైనది. గ్రీకునాయకుఁ డీవఱకుఁ జంద్రగుప్తునితోఁ బోరి చాల నలసియుండెను. అయినను ధైర్యమును వీడక యోధుని మార్కొని పోరుచుండెను. మహాయోధుఁడు తనపై వచ్చుచున్న శత్రుని చంద్రహాసపువ్రేటుల నతిలాఘవముతోఁ దప్పించుకొని యాతని నొప్పించుచుండెను. ఆమెఱుపులిరువంకలనున్న వీరులకన్నులకు మిఱుమిట్లు గొలుపుచుండెను. ఈసమయమున నలసియున్న గ్రీకువీరునిచంద్రహా సమాకస్మికముగ యోధునిఖడ్గప్రహారమున రెండుతుండెములయి నేలపైఁ బడిపోయెను. మహాయోధుఁ డాయుధములేనివారితో యుద్ధము చేయుఁడు కాఁబోలు! తనఖడ్గమునుగూడఁ గ్రిందఁ బడవైచి మెఱపు మెఱసిన ట్లొక్కదాఁటున గ్రీకువీరునిపైఁ బడి యాతని తనభుజపంజర మున బంధించివైచెను. నాయకుఁడు పట్టువడినతోడనే యున్నవారును వెనుకకుఁదిరిగిరి. వారందఱును జంద్రగుప్తునియొద్దనున్న వీరులచేఁ బట్టు కొనఁబడిరి. మిగిలినగ్రీకులందఱును జంద్రగుప్తునకు లోఁబడిపోయిరి. కోటయందు మరల జయభేరులుమ్రోఁగ నారంభించెను. చంద్రగుప్తుఁడు బురుజులపైకి దృష్టి సారించెను అందిప్పుడు గ్రీకులధ్వజము లేదు. ధవళకాంతులతోఁదనకేతనమే మెఱయుచుండెను. సౌభూతియు, నాతని కుమారుఁడు జయభూతియు, నందుండి చెదరినసేనల హెచ్చరించుచు జయజయశబ్దములతోఁ గోలాహలముసేయుచుండిరి. ఇంకను దెల్లవాఱ లేదు. వర్షముకురిసి వెలిసినట్లుగ నొక్కింతసేపటిలో రణవిప్లవము చల్లారి పోయెను.

---

## పదునేనవప్రకరణము



పాంచాలదేశమహారాజైన చంద్రగుప్తుఁడు నేఁడు సంపూర్ణవిజయోత్సాహముతోఁ దక్షశిలాదుర్గమునందలి రాజసభాస్థానమున సింహాసనాసీనుఁడయి కొలువు సేయుచుండెను. రణరంగమున వీరవిహారసమయమున నాతని ప్రతాపతేజోమయాకారము శాత్రవసేనాసముదయంబున కరువలెనే యిప్పు డాతనికిరీటమణిప్రభాపటలంబును సభ్యులకన్నుల మిఱుమిట్లు గొలుపుచుండెను. ఆతనిసమీపమున దపస్తేజోమూర్తి రీ స్సాభ్యం డగుమనరాజయోగానందస్వాములవా రొత్తుగఁ బెఱిఁగియున్న నల్లనిగడ్డమును సవరించుకొనుచు దనధీరశాంతస్వభావములు చూపఱహృదయములందు భయభక్తుల నుదయింపఁజేయుచుండ నుచితాసనమునఁ బద్మాసనస్థులయి కూర్చుండియుండిరి.

దక్షిణపార్శ్వమున వరుసగాఁ గాశ్మీర, కాంభోజ, గాంధార, సింధు, [illegible]వణ, కౌలూత, మలయనగరాధీశ్వరులును, మఱికొందఱు సామంతరాజులును, వినమ్రులయి సముచితాసనంబుల నాసీనులయి యుండిరి. వారినను గ్రీకురాజప్రతినిధి వినమ్రవదనుఁడయి కూర్చుండియుండెను. వామపార్శ్వమునఁ బదియాఱుగురుదండనాయకులు తమతమబిరుదములం దాల్చి వీరరసతరంగములవలెఁ గ్రమముగా నొకరితరువాత నొకరు కూర్చుండి యుండిరి సభయెల్లను నిశ్శబ్దముగ నుండెను. సభ్యుల వినయవీక్షణములు చంద్రగుప్తప్రభునిపాదపీఠమునఁ బ్రసరించుచుండెను. మహాయోధుఁడును, వసంతుఁడును, మాత్రము నాఁటి సభకు రాలేదు.

అప్పుడు చంద్రగుప్తుఁడు సభవంకఁజూచి "నామిత్రులగు రాజశేఖరులారా! రాజభక్తిశీలురగు యూథనాథులారా! నిన్నటియుద్ధమున

మనచేఁ జిక్కిన గ్రీకురాజప్రతినిధి నేమిచేయవలసియుండునో మీ మీ యభిప్రాయములను వినఁగోరుచున్నాఁడను" అని మృదుమధుర భాషణములఁ బ్రశ్నించెను.

ఇంతకుముందీరాజ్యము లన్నియును గ్రీకు నాయకుల నిరంకుశ ప్రతాపమున నట్టుడికినట్లు డికిపోయినవి దేశభక్తులగుచాలమంది యోధులకుఁజిరకాలము దారుణవనదుర్గములు శరణ్యములైనవి. భయంకరరణరంగమున ననేక యోధులు బలిచేయఁబడిరి గొప్పగొప్పపట్టణములు తగులఁబెట్టఁబడియెను. వేలకొలఁదిసతీమణులు మానరక్షణమునకుఁ బ్రాణములను గోలుపోయిరి. నిరంతరకలహములవలనఁ బ్రజలనెమ్మదికి భంగము కలిగినది. క్షణక్షణమునకుఁ బ్రభుత్వములు మారుచుండుటచేఁ బ్రజ లగతికు లగుచుండిరి. యుద్ధయాత్రావ్యయంబులు తమపైఁ బడుచుండుటవలనఁ గాపులు నిర్భాగ్యులై పోయిరి. చాలమందికి యుద్ధమే పనియగుటవలనను, కొన్నికుటుంబములవా రీకల్లోలములను సహింపలేక దేశమునువిడిచిపెట్టి పాఱిపోవుటవలనను, కృష్యాదివ్యాపారముల కభ్యంతరముకలుగుటచే దేశమునఁ గఱవులు తటస్థించెను. అందందుఁ బండినపంటలయినను బ్రజలకుఁ జిక్కుటలేదు రాజభటులు సేనలకొఱకు బలవంతముగఁ దీసికొని పోవుచుండిరి. అట్టిబాధ కోరువలేక ప్రజలందఱు నడవులఁబడి కాయగసరులం దినుచు మునివ్రత మవలంబించి యుండిరి. ఆకష్టముల ననుభవించిన ప్రజలే, ఆయవమానములను సహించిన యోధులే, యాకల్లోలములఁ దప్పించుకొనిపోయినరాజులే, మొట్టమొదట నీచంద్రగుప్తుని నాశ్రయించినవారు. వారే శతద్రూనదీతీరమున గుప్తదుర్గమును నిర్మించినవారు. వారే నిన్న మొన్నటియుద్ధములలోఁ దమ దేశముకొఱకుఁ బ్రాణముల ధారవోసినవారు వారే చంద్రగుప్తుని సైనికులు.

వారిలోఁ గొలఁదిమంది మాత్రమే స్వర్గమును జూఱఁగొని యున్నారు. చాలమంది యింకను జీవించియే యున్నారు. వారికా కష్టము లింకను జ్ఞాపకమున్నవి. వారి హృదయముల నున్న తీవ్రక్రోధా నలంబునకు గ్రీకుశబ్ద మాజ్యాహుతివలె నున్నది. వా రనుభవించిన కష్టముల కన్నిటికిని జాలవఱ కంభీరుఁడు కారకుఁడై యున్నాఁడు. ఆతఁడుస్వర్గమునకో నరకమునకో పలాయనుఁడై పోవుటచే నిప్పుడు గ్రీకు నాయకులు మాత్రమే యీయుపద్రవముల కన్నిటికి నుత్తరవాదులై యున్నారు. గ్రీకుశబ్ద మాదేశమున వినఁబడకుండఁ జేయవలయునను నంతటిదారుణకోపము వారిహృదయముల జాజ్వల్యమానమగు చుండెను.

చంద్రగుప్తుఁడు గంభీరుఁడు. ఆతనియెదుట నోరెత్తి యెవ్వరు తమ సంఘాగ్రాణాభిప్రాయమును దెలుపసాహసింపఁ గలరు? అందఱు నేక వాక్యముగ "మహారాజా! దేవర దివ్యచిత్తమునకు న్యాయమని తోచిన రీతిని జరగింపవచ్చును. చిరప్రవర్థిత క్రోధానలమునఁ బ్రజ్వలించు చున్న హృదయములు గల మేము మావాక్యముల యందుఁ బక్షపాత మును శంకించుచున్నారము" అనిపలికిరి.

చంద్రగుప్తుఁడు రాజయోగానందస్వాములవారివంకఁ జూచెను. స్వామి యిట్లు చెప్పెను. "స్వదేశరాజుల యాంతఃకలహములతో గ్రీకు లీదేశ మాక్రమించుకొనిరి. ఇంక బలవంతుఁడగు తక్షశిలాదుర్గనాయ కుని సాహాయ్యమున వారిరాజ్యము స్థిరపడినది స్వార్థపరత్వమున దేశ ద్రోహ మొనరించినయంభీకుఁడు శిక్షాపాత్రుఁడు. ఆతఁడీలోకమునే విడిచి పోయినాఁడు. ప్రాణమిత్రుఁ డగు నాతనియందలి కృతజ్ఞతవలనను, జేఁజిక్కినరాజ్య మూరకపోవుచున్నదను విచారముచేతను, గ్రీకుసేనలు మనపై నెత్తివచ్చుటకుఁ గారణమైనది. పరాజితుఁడగు శత్రువునకు శిక్ష యేమున్నది?"

"ఇందుల క్రీగీకునాయకుఁ డేమిచెప్పునో వినవలసి యున్నది" అని చంద్రగుప్తుఁడు పలికెను.

గ్రీకురాజప్రతినిధి లేచి నిలువఁబడియెను. ఆతని కాయపజయము మరణముకంటె నధికమై యుండెను. పాంచాల రాజ్యమంతయు నేకచ్ఛత్రముగఁ బాలించిన యాతఁడిప్పు డారాజ్యసింహాసనము నెదుటనే విచారింపఁబడుచున్నాఁడు ఆచంద్రగుప్తుని ప్రతాపము, దయ, సాహసము, ధర్మబుద్ధి, మొదలగు నుదారగుణములును, నాతనియందుఁ బ్రజలకుఁగలభక్తియును, సంపూర్ణముగఁ దెలిసికొనినవెనుక తనకుఁ బాంచాలము మరల దక్కుననునాశ వదలి పోయినది. నిరుత్సాహులగునాతనిసైనికు లాయుద్దేశమును బలపఱచిరి. ఇవి యన్నియు నాలోచించుకొని యాతఁ డిట్లనియెను.

" అయ్యా! చాల కాలముక్రిందట నలెగ్జాండరునకు నశురాలై పోయిన పాంచాలరాజ్యలక్ష్మి యాతఁడు స్వర్గరాజ్యలక్ష్మిని చేపట్టినను నసూయతో నేఁటికి సపాలఁబడి నిన్ను వరించినది. అపజయమన్న నేమో యెన్నఁడు నెఱుఁగని యాతనిసైనికులు కాలవశమున నీచే నిర్జింపఁబడిరి. ఎట్టులైన నీపోరు నా ప్రాణములతోడను, నీకొలఁది భటుల ప్రాణములతోడను, దీరునది కాదు. సమబలులగు రాజులశత్రుత్వమునలన దేశమునకును బ్రజలకును నెమ్మది యుండదు. జయ మెవ్వరికున్నను కల్లోలములుమాత్రము తప్పవు. నాప్రాణములపై నాశచే నేను మనవిచేయుట లేదు. మహావీరుఁడగు యోధున కపజయముకంటె మరణము మేలేమున్నది? ఇప్పట్టున నీకలహములను మరలఁ బెంచుకొనుటకంటె నిరువురము సంధిచేసికొనుటయే లోకమునకుఁ, బ్రజలకు, మనకును గూడ క్షేమకరము" అని విన్నవించెను.

చంద్రగుప్తుఁడు బాగుగ నాలోచించి యిట్లు చెప్పెను "ఎట్టులయినను మీమూలమున నీదేశము మహోపద్రవముల పాలయినది.

జరగిపోయినదానిం గూర్చి యెవ్వ రేమిచేయఁగలరు? ఇంతటినుండి మీరును, మీ సేనలును, గాంధారదేశమును దాఁటి యివ్వలకు రాకుండ నుండుటయే సంధి."

రాజప్రతినిధి కావాక్యములు శూలములవలె నుండెను. ఏమి చేయఁగలఁడు? కోపవేగమున నోఁడలు వడఁకుచుండెను. అయినను యుద్ధమునందు విసుఁగు జనియించినది. ప్రతాపనిధి యగుచంద్రగుప్తుని తోడి వైరము సామాన్యముగఁ దోఁచుటలేదు.

"అయ్యా! మీ మైత్రిగోరి యట్లే యంగీకరింతుము" అనియెను.

చంద్రగుప్తుఁడు సభవంకఁ జూచి మీయభిప్రాయమేమని యడిగెను. వారికి గ్రీకు లీదేశమును వదలిపోవుటయే కావలసినది. అందఱు నంగీకారమును సూచించిరి. సంధి కుదిరినది. గ్రీకు రాజప్రతినిధి సేనలతో విడిచిపెట్టఁబడియెను. ఆనాఁడే వారలచటనుండి వెడలిపోవుట కేర్పాటు కాఁబడెను. ఇరువురు దండనాయకులు గ్రీకుప్రతినిధిని సాగనంపిరి. తరువాత వసంతుఁడు సభకుఁ గొనిరాఁబడియెను.

వసంతుఁ డిప్పుడు కంచుకోష్ణీషాదరాజోచితాలంకారములను ధరించియుండలేదు. ఆతనిహృదయ మిప్పు డవమానశల్యముచే వేధింపఁబడుచున్నది. ఆతని ముఖమండలమున వీరపురుషోచిత మగు వికాసము లేక దీనభావము వ్యక్తమగుచుండెను. ఆతఁడు చిత్రప్రతిమవలె నిశ్చేష్టుఁడై సభాస్థలంబున నిలుపఁబడియుండెను.

చంద్రగుప్తుఁడు కృతఘ్నుఁడు కాఁడు. వసంతుఁడు తనకు దక్షిణభుజమై చేసినసాహాయ్యము నాతఁడు మఱచిపోలేదు. కాని, వసంతుఁడు రాజాజ్ఞోల్లంఘనము చేసియుండెను. రాజశాసన మాతని శిక్షనేనలు నిగా నిరూపించుచుండెను. చంద్రగుప్తునిశాసనమునకు భేదమ్మునకు లేదు. భగవంతునికివలెనె దానికిని సర్వసమత్వమున్నది. ఆ

మున చంద్రగుప్తుఁ డిప్పుడు ప్రాణమిత్రుఁ డగువసంతునకు మరణదండనము విధింపవలసినవాఁడై యుండెను. రాజనీతి క్రూరమైనది.

"రాజశాసనము నుల్లంఘించుటవలన మరణదండనము విధింపఁదగిననేరము నీపై మోపఁబడినది. నీవీవిషయమునఁ జెప్పుకొనవలసిన దేమైన నున్నదా?" అని చంద్రగుప్తుఁడు వసంతునిగూర్చి పలికెను.

వసంతునకుఁ గ్రొత్తగా విచారము కలుగలేదు. ఆవాక్యముల వలన నాతనికి భయముగలుగలేదు. ఏమనిన—చంద్రగుప్తునిబుజువర్తనమును, నాతనిశాసనమునందలిదార్ఢ్యమును, వసంతుఁ డెఱింగియుండి యిదివఱకే కృతనిశ్చయుఁడై యుండెను

"మహారాజా! నేను రాజాజ్ఞోల్లంఘనము చేసినమాట వాస్తవము" అని పలికి యూరకుండెను.

"నీవుశిక్షార్హుఁడ వైనట్లంగీకరించితివా?"

"దేశద్రోహము నంగీకరించిననేను శిక్షార్హుఁడనే"

సభ యంతయు నిశ్శబ్దముగ నుండెను. వసంతునిమరణదండనముంగూర్చి సభ్యుల కందఱకును చాల విచారముగ నుండెను. అట్టి సుగుణాలంకారుని, నట్టిరాజభక్తిపరాయణుని, నట్టిపరాక్రమతేజోధురీణుని, నట్టిపవిత్రచరిత్రుని, నట్టిదయాళుని మరణము దేశాభివృద్ధికిని, రాజ్యాభివృద్ధికిని, జాలభంగకర మైన దని వారు తల్లడిల్లుచుండిరి. చండశాసనుఁడగు చంద్రగుప్తుని యెదుట నెవ్వరు నేమియు మాటలాడలేక పోవుచుండిరి.

అప్పుడు రాజయోగానందస్వామి యించుక నే పాలోచించి రాజశాసన మతిక్రమించుటకుఁ గలకారణమడుగవలయునని చంద్రగుప్తునకుఁ ,,ను.

చంద్రగుప్తుఁడు. "వసంతా! రాజశాసనము నతిక్రమించుటకు లయినకారణమేమో చెప్పెదవా?" అని ప్రశ్నించెను.

"అనాథస్త్రీసంరక్షణము" అని వసంతుఁడు ప్రత్యుత్తర మిచ్చెను.

"ఆయబల యెవ్వరు"?

"వసుమతి"

"ఆమెకుఁ గలిగినయాపద యెట్టిది"

"అగ్నిప్రవేశముఁ జేయఁబూనియున్న యంభీరునిరాణులు వసుమతిని బలవంతముగఁ గాల్చివేయఁదలఁచిరి."

"దుర్గద్వారరక్షణమున నున్ననీ కీసంగతి యెట్లు తెలిసినది?"

"ఒకదయాశీలునివలన—"

"ఆతఁ డెవ్వరో తెలిపెదవా?"

"ఆతనివృత్తాంతమును నేను చెప్పఁదలఁచికొనలేదు."

అప్పుడు చంద్రగుప్తుఁడు "నీవు కేవలస్వార్థపరత్వమున రాజకార్యమునం బ్రమత్తుఁడవై చరియింపలేదని తెలుపుటకు నీకాధారమేమున్నది." అని పలికెను.

వసంతుఁడు మఱి మాటాడక యధోముఖుఁడై నిలువఁబడిపోయెను. సభ్యులహృదయములందు కరుణరసము పొంగి పొరలుచుండెను. "తుదకు విజయమే లభించినదికదా; వసంతుని యాచిన్న తప్పిదము దేవర క్షమింపవలయు" నని యందఱు నేకగ్రీవముగ రాజుతో మనవిచేయవలయు నని తలంచుచుండిరి. ప్రతాపనిధి యగు నా తేజోరాశియెదుట నెవ్వరును మాటాడలేకపోవుచుండిరి. రక్షించుటకుఁగాని శిక్షించుటకుఁగాని యాతఁడే దక్షుఁడై యున్నాఁడని యందఱు నిశ్చేష్టులయి చూచుచుండిరి.

చంద్రగుప్తుఁడు యోగివంకఁ జూచి "అయ్యా! ఇందలిసత్యము మన కెట్లు తెలియఁగలదు." అనియెను.

" ఇంకను దెలియఁ దగిన దేమున్నది"

" వసుమతియుపాయమును గూర్చియు, వసంతుఁ డెట్లు పోయెనో దానిని గూర్చియు తెలిసికొనవలయును"

" అందునుగూర్చి వసంతుఁడు చెప్పుచునేయున్నాఁడు గదా!"

" అది యంత విస్పష్టముగ లేదు."

రాజయోగానంద స్వామి మఱి మాటాడలేదు. వసుమతిని సభకుఁ గొనిరావలయు నని చంద్రగుప్తుఁ డాజ్ఞాపించెను. తోడనేయిరువురు భటులు పోయి యామెనుగొని తెచ్చిరి. ఆమెకు బాసటగఁ గనకలత కూడనుండెను.

అదృష్టహీన యగువసుమతిజీవితమునకు సుఖమనుమాట లేదు కాబోలును! జీవితేశ్వరుని గాఢాలింగనమున నొడలు మఱచియున్నప్పు డెట్టి యానందము ననుభవించినదో కాని మరల విచారముతోడనే మేల్కాంచినది. ఆమెలఁకునంతోఁ గూడ విచారమునే కాంచినది. ఆమె కెప్పుడును గష్టములమీఁదఁ గష్టములే వచ్చుచున్నవి. ఆమె నాశ్రయించిన సుఖముగూడ నిముసములోఁ గష్టముగా మారిపోవుచున్నది. ఆమె రాజశాసనమునుగూర్చి వసంతునివలన వినియున్నది. ఇప్పు డామె సభ కేలకొనిపోఁబడుచున్నదో యామెయెఱుంగును. తప్పక శిక్షగానున్న దని యామె నిశ్చయించుకొనియెను. ఆమె యెట్టికష్టములనైన ననుభవించినదిగాని యిట్లు సభకుఁ దెచ్చునవమానమును మాత్రముగాంచి యుండ లేదు ఆమె సుందరియెనుటఁ గూడ నిశ్చలముగ నిలువబడుటకు సిగ్గుపడుచుండెడిది. రాజసభలో నెట్లు నిలువఁగలదు?

జనపదమునకుఁ గొని తేఁబడిన యడవి లేఁడిపిల్లవలె బెదరుచుఁ దలవంచికొని యుండెను. దీనాననుఁడై పార్శ్వమున నిలువఁబడియున్న ప్రాణేశ్వరుని గాంచునరి కామెహృదయము జల్లు మనియెను. భయముచే సర్వాంగములు వడంకుచుండెను. కృశించిన మైందీఁగతో, వాడిన

చీరతో, వాఁడినమోముతో, బాష్పపూరితము లగు కనుదమ్ములతో, చెదరినముంగురులతో, నాచినశిరముతో, మూర్తీభవించిన శోకదేవత వలెఁ గంపించుచునిలువఁబడిన యాబాలికను సభ్యులుచూడలేక జాలిచేఁ గొట్టుకొనుచున్న హృదయములతోఁ దలలు వంచికొనిరి.

అట్టిదీనావస్థలో నున్నవసుమతిని వసంతుఁ డొక్కింతసూచెను. బాష్పపూరితనయనుఁడై కొయ్యనడిపోయెను.

అప్పుడు చంద్రగుప్తుఁడు వసుమతిం జూచి "అమ్మా! నీవీమర్గమున కెట్లువచ్చితివి?" అని ప్రశ్నించెను.

వసుమతి శోకగద్గదస్వరముతో "నందభటులు కలశపురమునుండి నన్నపహరించికొని తెచ్చి యంభీరుని నిర్బంధమున నుంచిరి"

"నీతో నెవ్వరయిన వచ్చిరా?"

"కనకలతకూడ వచ్చినది"

"పాటలీపుత్రమెట్లు విడువఁగలిగితిరి"

"మహాత్ముఁ డగుచాణక్యునియనుగ్రహమున"

సుందరికొఱకు మరల విష్ణుగుప్తుఁడువచ్చి యేమియల్లరిచేయునో యనుభయముచే నాఁటిరాత్రియే చాణక్యుఁడీమెను తప్పించెను.

"రక్షకభటుల నెట్లు తప్పించుకొంటిరి.?"

"వసుమతి వీరివెంట నంతఃపురమునకు రాఁగలదు. మీరేమియు నభ్యంతరము చేయవలదు." అనివిష్ణుగుప్తునిచే వ్రాయఁబడిన యుత్తరవును జూపించుటచే వారేమియు నడ్డుకొనలేదు"

చాణక్యుఁ డాయుత్తరువును సృష్టించి దానిపై విష్ణుగుప్తుని యుంగరపుముద్రను వైచెను.

"సుందరి యేమైనది?"

ఆమె మాటాడక యూరకుండెను.

"నీవిట నెన్నాళ్లనుండి యున్నావు?"

"రెండేండ్లనుండి" యని పలుకునప్పు డామెకన్నులనుండి నొక్కటేధారగ శోకబాష్పములు వెడలుచుండెను

ఆమెపలుకులకును, నప్పటియవస్థకును, సభ్యులహృదయములు నీరైపోయెను. రాజయోగానందస్వామి కావిచేలముకొంగు దనకన్నులను దుడిచికొనియెను. వసంతుఁ డిప్పుడు మనములో లేఁడు.

రాజయోగానందస్వామి చంద్రగుప్తుని జూచి "అయ్యా! ఈప్రశ్నలవలనఁ బ్రయోజన మేమి? ప్రస్తుతము తెలిసికొనఁదగిన యంశమేమైన నున్నయెడల దానింగూర్చి యడుగుము" అనియెను.

చంద్రగుప్తుఁడు ప్రత్యేకమావిషయమునుగూర్చియే యడుగఁ దలంపలేదు. సంభాషణవశంబున నిజము దెలిసికొనవలయునని యాతని యుద్దేశము "అమ్మా! నిన్నిచ్చట నంభీరుఁ డేమైన నిర్బంధించుచుండెడి వాఁడా" అని ప్రశ్నించెను.

"దురాత్ముఁ డగువిష్ణుగుప్తుని పెండ్లియాడుమని బోధించుట కంటె వేఱునిర్బంధ మేమియును లేదు"

"ఆతనిరాణులు నిన్ను బాధించుచుండిరా?"

"వారెన్నఁడును నన్నేమియును బాధింపలేదు"

"వారు నీయెడ దయఁగలిగియే యుండెడివారా?"

"నిన్నటివఱకట్లే"

"పాపము! వారు నిన్నరాత్రి సహగమనమే చే

"ఔను. నామూలమున వారికి వైధవ్యదు
దను కోపతీవ్రమున నన్నుఁగూడబలవంతముగ వగి
దలఁచి చాలవఱకు నిర్బంధించిరి."

"కనకలత నిన్ను రక్షించినదా?"

"లేదు. ఆమెను వారొకగదిలోనికిం ద్రోసి పైని గొళ్లెము వైచిరి"

"అట్లైన నీవాయాపదనుండి యెట్లు తప్పించుకొంటివి?"

వసుమతి మఱిమాటాడ లేకపోయెను కన్నుల నీరునించుచుం దలవంచికొని నిలువంబడిపోయెను.

"నిన్నాయాపదనుండి వసంతుండు తప్పించెనా?"

"ఔను" అని యేడ్చుచు వసుమతిపలికెను.

"ఆతని కీసంగతి యెట్లు తెలిసినది"

"అయ్యో! ఆవిపత్సముద్రమునం బడియున్న నేను పెద్దపెట్టున నేడ్చుచుం దయాళుం డగువసంతున కీయుంగరముం జూపి నాకష్టములం దెలిపి యాతని గొనితెచ్చుపుణ్యాత్ము లెవ్వరును లేరా! అని ప్రార్థించుచు నాయుంగరమును విసరివైచి శోకవేగమున మూర్ఛిల్లితిని. ఏపుణ్యమూర్తు లీతని కెఱింగించి కొనితెచ్చిరో నేనెఱుంగను. ఈనేర మంతయును నాది. ఈదయాళునియం దేమియును దప్పులేదు. మరణ దండనము నాకే విధియించి నేటితో నాకష్టముల నన్నిటిని తీర్చి వేయుండు. లోకావనంబునకై పరోపకారపరాయణుం డగునీదయాళుని రక్షించి పుణ్యము గట్టుకొనుండు అబలను వధియించుట పాపమని తలంపవలదు. జనియించినదాది సుఖమనుమాట లేక నిరంతరహృదయ పరితాపమున నతికష్టముల ననుభవించుచున్న నన్ను నాదుఃఖ ములనుండి వేఱుసేయుటవలన మీకుం జాల పుణ్యము రాంగలదు" అని ప్రార్థించెను.

"అమ్మా! చంద్రగుప్తుని శాసనము ధర్మమార్గమును విడిచి చరి యింపదు. అనపరాధిని యగు నొకయబల నకారణముగ శిక్షించుటకు శాసన మంగీకరింపదు. ఆపత్సమయమున నసహాయ వగు నిన్ను ప్రార్థించుట నేరము కాదు. ఒకసామాన్యభటుని మూలమున దీర్ఘదగినపనికిఁ గార్యభారమును వహించియున్న తానే రాజశాసనము నతిక్రమించి ష్ఠాయినందులకు వసంతుఁడు శిక్షార్హుఁడై యున్నాఁడు. నీవు మరల నంతఃపురమునకుఁ బోవచ్చును. రాజశాసనము నిన్ను సభకుఁ దెచ్చి నాదులకు మన్నింపుము" అని చెప్పి చంద్రగుప్తుఁడు వసుమతి నంతః పురమునకుఁ బంపివైచెను



పదియాఱవ ప్రకరణము.



సభాసదులు ముందేమిజరుగునో యని సంభ్రమముతోఁ జూచు చుండిరి. వసుమతివాక్యములవలనను, వసంతునివర్తనమువలనను, వసు మతీవసంతులొండొరులఁ బ్రేమించి యున్నారని వారికిఁ దెలియవచ్చెను

అప్పుడు చంద్రగుప్తుఁడు యోగివంకఁ జూచి "గురువర్యా! మీయభిప్రాయ మేమి?" అనియడిగెను.

యోగి చంద్రగుప్తుని హృదయమును గ్రహించెను. ఆతఁడు తనశాసనమునందలి దార్ఢ్యమును బ్రజలకుఁ జూపఁదలఁచి యున్నాఁడని తెలిసికొనియెను. "సభ్యులయుద్దేశమును గనుఁగొనవలయును" అని చెప్పెను.

చంద్రగుప్తుఁడు సభాసదులం గాంచి "శాసనానుసరణముగ మీకేమి తోఁచుచున్నది" అనిప్రశ్నించెను.

సభ్యులపక్షమునఁ బుష్కరాక్షుఁడు లేచి "మహారాజా! వసంతుఁడు నిష్కారణముగ శాసనము మీఱి చరించుపలేదు. అనాథస్త్రీరక్షణముగూడ రాజధర్మము. అంతేగాక తనప్రాణప్రియయగు నొకయబలామణి ప్రాణాపాయము నొందుచున్నదనుమాట వినినప్పు డెవ్వని హృదయము చలియింపదు? చెదరిపోయినహృదయముతో నున్న వసంతుఁడు దూరమాలోచింపలేక యింతలో నేమి యుపద్రవము వచ్చునను ధైర్యముతోఁ బ్రస్తుతోపద్రవము నుండి వసుమతిని సంరక్షించుటకుఁ బోయియుండును. ఆతని కది విధాయకకృత్యమే యని తెలుపుటకు సంశయము లేదు. మనసు కలఁగిపోవుటచేఁ దొందరపడి రాజకార్యమును మఱచినందుల కితఁడు పశ్చాత్తాపమును బొందుచునే యున్నాఁడు. ఇంతకంటె నీమహాపురుషునకు మరణదండనము వేఱుగ నక్కఱలేదని యే తోఁచుచున్నది. ఇందుమూలమున మనకుఁగూడ నంతగా నష్టము కూడఁ గలుగలేదు" అని విన్నవించెను.

చంద్రగుప్తుఁడు చాలసే పాలోచించెను. వసంతునివంకజూచి "నీవు కేవలస్త్రీరక్షణముననే గాక స్వార్థపరత్వమునఁగూడ రాజశాసనము నతిక్రమించితివి. అప్పుడు మహామోఘుఁడు తనసేనలతో వెంటఁబడకుండినచో దేశమంతయు నీమూలమున మహోపద్రవమున మరల మునిఁగిపోవలసివచ్చును. నీప్రియురాలిరక్షణముకొఱకు నీవు దేశద్రోహమునకైనసమ్మతించితివి. మోహాతిరేకమునయుక్తాయుక్తముల నెఱుంగక రాజభక్తినిగూడ మఱచిపోయితివి. శాసనము ననుసరించి నీకు మరణదండనము విధింపవలసి యున్నను, దేశమునకును, రాజునకును, ప్రజలకును, నీవుచేసిన సాహాయ్యము నీప్రాణములను గాపాడినది. ఏతరుణీమణియందలి యనురాగముననీవు రాజకార్యమునుదృణీకరించితివో యాసతీమణి నీకింక దక్కదు. ఇదియే నీయపరాధమునకుఁ దగినశిక్ష" అని కఠినముగాఁ దీర్పుచెప్పెను.

వసంతునిపైఁ బిడుగుపడినట్లయ్యెను. అతఁ డిప్పు డఘోరశోకమునఁ బడిపోయినాఁడు. అతనికావసుమతికంటెఁ బ్రపంచ మేమున్నది.! నిరర్థక మగునాతని జీవిత మింక నెవ్వరికొఱకు? మరణదండనములో నింత కంటె నాధిక్య మేమున్నది? నిరంతరము నాతనిహృదయమునఁ బ్రతి ఫలించుచున్న వసుమతీదివ్యసుందరవిగ్రహము సద్దములోని ప్రతిబింబము వలెఁజూచుచు నావిచారమునదుఃఖపూరితమగునీజీవితము నతికష్టముగఁ గడపవలసినదా ? హా! యెంతటికష్ట మెంతటికష్టము ! ఆతఁడు నిలువున నీరై పోయెను. సభ్యులందఱును విచారసముద్రమున మునిఁగి పోయిరి. పరస్పరానురాగముగల నాయికానాయకుల నిరంతరనిర్బంధ వియోగదుఃఖ మెవ్వరిహృదయములఁ బగిలింపకుండును ? దృఢతరముం బగురాజశాసనమునకుమాత్ర మట్టిజాలి కలిగినదికాదు. హా ! రాజ సేవ యెంతకఠినమైనది!

ఆసమయమునఁ బ్రతీహారి యొకపురుషునితోఁ బ్రవేశించి రాజు నకు వందనముచేసి యొకయుత్తరము నొసంగెను. ఆయుత్తరమును చంద్రగుప్తుఁ డుదయాపూర్వకముగ నందుకొని యొకసారి చదువుకొనియె ను. చదువుకొన్నకొలఁది నాతనిముఖకమలము వికసించుచుండెను. మఱి యొకసారి చదువుకొనియెను. ఆనందమును బట్ట జాలక సభ్యుల కా యుత్తరము నీక్రిందివిధముగాఁ జదివి వినిపించెను.

“వత్సా ! నాయాశీస్సునకు మించినవిజయమును గాంచితివి. పద్మనందుని సేనానాయకు లందఱును దైవానుగ్రహమున మనపక్షము నకుఁ దిరిగిరి. నందపుత్త్రులందఱును మరణమునకు లోఁబడిరి. పాటలీ పురదుర్గము మనకు స్వాధీనమాయినది. రాక్షసామాత్యునితో నందుఁడు నందకటకమునకుఁ బాఱిపోయెను. మరల నచ్చట యుద్ధప్రయత్నములు చేయుచున్నట్లు తెలియవచ్చుచున్నది. ఇచ్చటి మన సేనలును, ప్రజలును, సార్వభౌముఁడ వగునీకొఱ కెదురుచూచుచున్నారు. నీకు సహాయముగ

నున్న రాజమండలితోడను సేనలతోడను తత్క్షణము వచ్చి నందుని సంపూర్ణముగ జయించినమగధరాజ్యసింహాసనమునఁ జక్రవర్తిపట్టణమును స్వీకరింపఁ ద్వరపడుము. విజయమగుఁగాక !

చాణక్యుఁడు"

ఇట్లు చదివి వినిపించినంతోడనే సభయంతయును మహానందమున మునిఁగి పోయెను. "వేగముగ బయలువెడలవలయును" అనునుత్సాహ వాక్యములతో సభాస్థల మంతయుఁ బ్రతిధ్వనించుచుండెను.

రాజయోగానందస్వామి కొంచెము సేపు యోచించి "కుమారా! మనకు విజయములపై విజయములు వచ్చుచున్నవి. నీకు శత్రుఁ డనఁదగినవాఁ డొక్క నందుఁడుమాత్రమే యున్నాఁడు. ఆతఁడు పుల్లవిరిగినచెట్టువలెఁ బుత్రశోకమునఁ బొగులుచున్నవాఁడు. అయినను నాతఁడు సామాన్యుఁడు కాఁడు. రాజనీతినిపుణుఁడు. పరాక్రమనిధి చావునకైన తెగించి పోరాడకమానఁడు. ఇప్పుడు నాకొక్క యాలోచనము తోఁచు చున్నది. ఎవ్వఁడు నందునితోఁ బోరాడి జయించి యాతని శిరస్సును గొని తెచ్చునో యాతనికివసుమతి నిచ్చి పెండ్లిచేయునట్లుశపథముచేయ వలయును. ఇందు నీకుఁ దోడునీడయై నీవిజయమునకు జీవితమును ధార వోయుచున్న వసంతునకుఁగూడ నవకాశ మీయవలయును. దయనీయుఁడగువసంతున కట్టియవకాశ మొసంగవచ్చును"

చంద్రగుప్తుఁడు రాజయోగానంద స్వామివాక్యసారమును గ్రహించెను. యోధుల కిది ప్రోత్సాహకరముగ నుండు నని తలంచుకొనియెను. రాజనీతినిపుణుఁడగుచంద్రగుప్తుఁడు సభ్యులవంకఁజూచియిట్లనియెను.

"పరాక్రమనిధు లగుయోధవరులారా! ఎవ్వఁడు మహారణంబున నందశిరశ్ఛేదముం జేయఁజాలునో యాతనికి వసుమతి నిచ్చి పెండ్లి

చేయుదుము. ఒకవేళ దైవవశంబునఁగాని మఱియేకారణంబునఁగాని యట్లుతటస్థింపనియెడలరత్నగిరిరాజ్యలక్ష్మికినాతనిందప్పకర్తగాఁ జేయుదుము ఇది ముమ్మాటికిని సత్యము. మీమీపౌరుషములం జూపఁదఱియైనది. ఉత్తమోత్తమస్థానము నలంకరింప శూరులగు యోధులు ప్రయత్నించెదరుగాక!"

ఈయాజ్ఞ వినఁబడినతోడనే తరుణవయస్కులగు యోధుల హృదయము లుత్సాహపూరితము లగుచుండెను. వారికోరికలు ప్రేళ్లు దాఁటుచుండెను. సభ్యులకరతాళధ్వనులతో నాఁటికి సభ ముగింపఁబడియెను.

---

## పదునేడవప్రకరణము.

నెలదినములుగడచెను. తక్షశిలానగరమున నేఁడు సమరప్రయాణసన్నాహములు జరుగుచున్నవి. సైనికు లందఱును ప్రయాణసన్నద్ధులగుటకు సూచకముగా దుర్గమున భేరీనినాదములు వినవచ్చుచుండెను. ఈభేరీరవము వినినతోడనే సైనికులందఱును వీరరసపూరితము లగు నంతరంగములతోఁ దమతమనియమితకార్యములయందుఁ ప్రవేశించుచుండిరి. పురజను లీసేనావిన్యాసముఁ జూచువేడుకతోఁ గోటయొద్దకు గుంపులుగుంపులుగ వచ్చుచుండిరి. రణదుందుభులు విని యేనుఁగులు తొండములఁ బైకిసారించి యుత్సాహజనకము లగుఘీంకారములు సేయుచుండెను. గుఱ్ఱములు మెడలుసాచి మోరలుపైకెత్తి సకిలించి ముందంజవేయఁ గమకించుచుండెను. అప్పుడప్పుడె కూడుచున్న సైనికు లందఱును మీసములు దువ్వుచు, భుజముల నప్పళించుచు,

తోడలఁ జఱచుచు, వీరాలాపములతోఁ దమతమహృదయోత్సు క్యమును బ్రకటించుచుండిరి. యోధవరులు సింహనాదములు సేయుచు నిజశంఖములఁ బూరించుచుం దమతమవాహనములపై సగర్వముగ మందగమనంబుల బయలువెడలిరి. పురము నాలుగుదిక్కులను సైనికులకోలాహలధ్వనులు వినఁబడుచుండెను నేలయీనినచందమునఁ బట్టణమున నెక్కడఁజూచినను సైనికులగుంపులే, ఎక్కడఁ జూచిన నాశ్వికులే, ఎక్కడఁజూచిన నేనుఁగులసమూహమే, కానవచ్చుచుండెను. చతురంగబలసంకీర్ణములై రాజమార్గంబులు క్రిక్కిరిసి యుండెను ఈ సేనాసంకులసన్నాహముల చేఁ బట్టణమంతయు ఘూర్ణితమగుచుండెను ఆకదలివచ్చువివిధసేనావారంబంతయు మహాసముద్రమువలెనుప్పొంగు చుండెను. రథస్తంభములఁగట్టినవివిధవర్ణముల పతాకలు మనోహర కాంతుల నీనుచుఁ బురజనుల కానందమును గూర్చుచుండెను. యోధ వరు లందఱును వీరపురుషోచితము లగు కంచుకాద్యలంకరణములఁ దాల్చియుండిరి.

తనహృదయమునఁ బొంగిపొరలు వీరరసోత్సుకత్యమును బ్రకట నము సేయఁగోరి కాఁబోలు నొకయోధుఁడు వక్షస్స్థలంబున ధరించిన కవచమునకు వామభాగమున రక్తధారాచ్ఛాదిత మగుహృదయకమ లమును జిత్రించుకొనియెను. మఱియొకఁడు నిజబలోత్సేకమును బ్రక టనము సేయఁ దనవిశాలోన్నతవక్షస్స్థలమును, దీర్ఘబాహుదండము లను, సగర్వముగఁ జూచికొనుచుండెను వేఱొకఁడు తానెక్కినగుఱ్ఱపు గళ్లెమును బిగించి రికాబులతోఁ గాళ్లు తన్నికొని రిక్కించినవక్షస్స్థ లముతోడను, నొయ్యారముగ నెత్తినమొగముతోడను, జిత్రవిచిత్ర గతులఁ జనుదెంచుచుండెను. పురయువతీజనములు తమతమయున్నత సౌధోపరిభాగములనుండి కుసుమాక్షతలుచల్లుచు యోధుల కమితోత్సా హమును గూర్చుచుండిరి.

సైన్య మంతయు కోటసింహద్వారము కడనున్న విశాలబహిరంగ స్థలమున విడిసెను. ప్రయాణసన్నాహము లన్నియు ముగిసెను. సైన్యములకు మార్గావరోధములుగ నుండు నదులకును, నేటికాలువలకును, వంతెనలు కట్టుట, కంటక లతావృక్షములఁ దొలఁగించి బాటలు తీర్చుట, ప్రయాణశ్రమ నపనయింప సైనికు లందందు విడిసి భోజనాది కృత్యములు నిర్వర్తించుటకయి తగినవసతు లేర్పఱచుట, మొదలగు కార్యములయందు నిపుణమతులయిన సేవకు లీవఱకే నియమింపఁబడిరి. మహాయోధుఁడు సర్వసైన్యాధిపతిగ నియమింపఁబడియెను. వసంతుఁ డాతనికి సహకారిగ నుండుట కేర్పాటు జరిగెను. కాశ్మీరదేశాధ్యక్షుఁ డగుపుష్కరాక్షుఁడు గజసమూహమున కధిపతిగ నుండెను. లావణ రాజకుమారుఁ డగుజయభూతి యశ్వదళమున కధ్యక్షుఁ డయ్యెను. మహాయోధునకుమిత్రుఁడగు కాంభోజరాజు కాల్బలమునకంతకును దొర యయ్యెను. అంతఃపురస్త్రీలను దదితరపరివారమును సురక్షితముగఁ గాపాడుటకయి శిలకోటరాజపుత్త్రు లగువిక్రమసుందరసేను లిరువురును నియమింపఁబడిరి. భోజనవస్తుసామగ్రియును, నాయుధసమూహము లును, తదితరపదార్థములును, వారిసంరక్షణమునందే యుండెను. ఆయా సేనాధిపతులక్రింద దండనాయకులును, వారిక్రిందసహకారులును, వారి క్రింద లెక్కలేనిసైనికులును నియమింపఁబడిరి.

సైన్యమంతయు బారులుతీఱి ప్రయాణోన్ముఖమైయుండెను. కదలుటకు సేనాధిపతి యుత్తరవు కావలయును. అట్టియెడ సర్వసైన్యాధిపతి యగుమహాయోధుఁడు సేనామధ్యమున నొకయున్నతస్థానంబున నిలిచి యోధవరుల నుద్దేశించి యెలుగెత్తి మేఘగంభీరభాషణంబుల నిట్లనియెను.

"మహాయోధులారా! శ్రీమన్మహారాజాధిరాజ చంద్రగుప్త సార్వభౌముని ప్రకటనమును మీరందఱు వినియున్నారు గదా! శత్రు

సైనికమధ్యమున నందునిశిరఃఖండనము చేయుమహావీరాగ్రణికి వసుమతీ కరగ్రహణమహోత్సవమును, రత్నగిరిరాజ్యప్రాప్తియు, సిద్ధించును. కావున మీరందఱును మీమీబలపరాక్రమములఁ జూపి కీర్తిపాత్రు లగుటకు సమయము దొరకినది. అదిగాక పురుషుఁడు జన్మమెత్తినందు లకు సార్థకముగ రణరంగమున శత్రుల నిర్జించి భూలోకసౌఖ్య మనుభ వింపవలయును. లేదా, వీరమరణంబున స్వర్గలోకసుఖముఁ జూఱఁ గొనవలయును. ఈరెండును గీర్తిపాత్రములె. ఇది వీరధర్మము కావున మీరీధర్మమును నెఱవేర్చుటకయి సంసిద్ధులయి యుండవలయును."

యోధు లీవాక్యరత్నములను శిరసావహించిరి. అందఱు నంగీ కారసూచకముగఁ దమతమశంఖంబులఁ బూరించిరి. అప్పుడొక్కమా రుగ రణదుందుభులును మ్రోఁగింపఁబడెను. సేనాధిపతి యగుమహా యోధుఁడు సేనలు నడచుట కాజ్ఞ యొసంగెను. అప్పు డెల్లయెడల శుభసూచకము లగుమంగళతూర్యములు వినవచ్చుచుండెను. వసుమతీ కరగ్రహణమహోత్సవమొకదా దీనిఫలితము. తోడనే యిద్దఱిద్దఱు చొప్పునముప్పదిమంది యాశ్వికులు కేతనములతోఁ గ్రాలుచున్న కుంతము లం బూని గుఱ్ఱముల నేకలయప్రమాణముగ నడపించుచు సేనావాహినికి మార్గము దీసిరి. ఈయాశ్వికులకు వెనుక నేనుఁగులు బారులుతీరి నడచుచుండెను. పుష్కరాత్ముఁ డెఱ్ఱనినేత్రములతోడను, ముడివడు చున్నకనుబొమలతోడను, నించుకచలించుచున్న యధరముతోడను, విక శితములగుచున్నముకుపుటంబులతోడను, దనసమరోత్సాహమును బ్రక టించుచు భద్రదంతావళము నెక్కి దిక్కులఁ బరికించుచు నరుదెంచు చుండెను. ఆయేనుఁగులగుంపు వెనుకనలువదిమందియాశ్వికులు మునుపటి వలెనే యిద్దఱు వెనుక నిద్దఱుగఁ బోవుచుండిరి. వీరలవెనుక పండ్రెండు ధవళాశ్వములను బూన్చిన మనోహర మగువిచిత్రరథమున వజ్రకేతు

ప్రభలును, మణిమయకంచుకాద్యలంకరణకాంతులును, దక్షిణకరము నందలి చంద్రహాసద్యుతులును, శోభిల్లుచుండఁ జంద్రగుప్తుం డరుదెంచు చుండెను. ఇరువురు రాజకుమారు లాతని కిరుపార్శ్వములఁ జక్రరక్షకులై వచ్చుచుండిరి. ఆతనిరథమున కెత్తినసింహకేతనము భయంకరముగ మెఱయుచుండెను. శౌర్యలక్ష్మికి విలాసరంగస్థలమై యొప్పు నావిశాలోన్నత ఫాలప్రదేశమును, నర్ధనిమీలితపక్ష్మాంచలములనుండి వెలివిరియుచున్న గంభీరకటాక్షములును, విరళిత పుటంబులం గ్రాలు సమగ్రదీర్ఘ నాసికయును, వక్రభావవిలసితంబులగు సాంద్రభ్రూలతలును, నప్పు డప్పుడె కొనలుదేఱుచుఁ జుంబనాభిలాష రమణీయగండభాగముల నొఱసికొన యత్నించు నొత్తుమీసములును, పరిపూర్ణ చంద్రాకృతి నున్న ముఖమండలమును, నాతని శౌర్య గాంభీర్య ధైర్య సౌందర్యాది లక్షణములఁ బ్రకటించుచుండెను. పురయువతీజనమంతయు నారాజ చంద్రునిపైఁ గుసుమవర్షమును గురియించుచుండెను.

చంద్రగుప్తుని వెనుక నొక యున్నతరథముపై సేనానియగు మహాయోధుఁడు పోవుచుండెను. ఆతనిదక్షిణకరమున భయంకరఖడ్గము మెఱయుచుండెను ఉజ్జ్వలవిసిలకాంతుల నీనునాతనిశిరోవేష్టంబునఁ దెల్లనితురాయి మనోహరముగఁ గానవచ్చుచుండెను. ఒత్తుగఁ బెఱిగి విశాలోన్నతవక్షస్స్థలమువఱకు వ్యాపించియున్న నల్లనిగడ్డమును, గండ భాగములకడ చుట్టలుచుట్టలుగ విరిగియున్న గంఁడమీసములును, కొన దేరియున్న దీర్ఘనాసికయును, సాంద్రములై వంగి యొండొంటి నొఱసి కొనుచున్న కనుబొమ్మలును, రక్తరేఖామిశ్రితము లగువిశాలనేత్రము లును, వీరరౌద్రరసంబు లొలుకుచున్న యాతనిముఖమండలమునకు మరింత దుర్నిరీక్ష్యభావము నెలకొల్పుచుండెను.

మహాయోధునకు వామభాగమున వసంతుఁ డున్నతాశ్వము నెక్కి వచ్చుచుండెను. ఆతని మొగమున వీరశృంగారరసములు మూర్తీ

భవించి యుండెను. ఆతఁడు తనసోగకన్నుఁగవ పార్శ్వములకు మలపి కటాక్షములఁ బరగించునప్పుడా ప్రక్కల మెఱపులు మెఱసినట్లగుచుండెను. వానిం గాంచిన సైనికులకు వీరోత్సాహము లుప్పతిల్లుచుండెను. సుందరులకు మనోవికాస ముదయించుచుండెను. వీరులకాముఖమండలము వీరరసప్రపూరితమై చండకిరణమండలంబు క్రియఁ దుర్నిరీక్ష్యం బగుచుండెను. విలాసినీమణుల కయ్యది శృంగారరసప్రపూర్ణంబై దర్శనీయంబగు పరిపూర్ణచంద్రమండలంబునలెఁ గానంబడుచుండెను. వికసిత పుటంబులం గ్రాలు నాతనినసమగ్రనాసికయును, గంపించుచున్న యధర బింబమును జూడ నాతఁడెందులకో కృతనిశ్చయుండయి, తననిశ్చిత కార్యపర్యవసానంబునకు వేగిరపడుచున్నట్లగపడుచుండెను. ఆతనిఁజూచి సైనికులందఱును బరమోత్సాహము నందుచుండిరి. మేడలపై నుండి సుందరయువతీజనంబు లందినంతవఱ కాతనిపైఁ గుసుమాక్షతలు జల్లుచునేయుండిరి.

ఈరథములవెనుక నాశ్వికులు గొరులుతీరి వచ్చుచుండిరి. లావణ రాజకుమారుం డగుజయభూతి యుచితాలంకారశోభితుఁడయి వారిని నడపించుచుండెను. ఆవెనుక నంతఃపుర స్త్రీలున్నరథములును. నానావిధ పదార్థముల మోచికొనివచ్చు గాడ్రియలు మొదలగునవియు నడచుచుండెను. విక్రమసుందరసేను లిరువురు నుచితవాహనంబుల నెక్కి చూపఱకు మహానందముం గూర్చుచు నావెనుక వచ్చుచుండిరి. వీరివెనుక మరలఁ గొందఱాశ్వికులును, వారివెనుకఁ గాల్బలమును, నడచుచుండెను. కాంభోజుఁడు కాల్బలమున కధీశుఁడుగ నుండి నడపించుచుండెను. ఈ మహాసేన కిరుప్రక్కలను గొంచెముదూరముగ నైదాఱుగజముల కొక్కఁడునంతున నాశ్వికులు కుంతధరులయి నడచుచుండిరి. వంది మాగధకైవారంబులును, ఢంకాభేరీనిస్వనములును, సేనామధ్యమున నక్కడక్కడ సైనికులకుత్సాహకరముగ వినవచ్చుచుండెను. సేనలు పట్ట

ణముఁజేసి చాలదూర మేగెను సైన్యపరీక్షకై వసంతుఁడు మహాయోధు నాజ్ఞచే సేనాసమూహమున నందందు సంచరించుచుండెను.

కాని, యాతనిమనస్సాతనిలో లేదు. అది యనేకవిధముల సంచరించుచున్నది. ఒకింతలో నది వసుమతీసుకుమారవదనసందర్శన సుఖంబు ననుభవించుచుఁ గోరి వసుమతికడ కేగును. కాని, యశ్రుధారాచ్ఛాదితం బగునాకోమలముఖమండలమును జూచుటకు దానికి ధైర్యము చాలకుండెను. ఇఁక నచ్చట నిలుచుట మహాకష్టము. అది కోపఘూర్ణితమై నందకటకమునకుఁ బోయి నాదుఁడెంకడుండునో యని వెదకుచుండెను. వసంతునిమన స్సీవిధముగఁ బరిభ్రమించుచుండెను. ఇంక నాతని కెన్నియో తలంపులు పుట్టుచుండెను. ఎన్నెన్నియో కోరిక లూరుచుండెను. కాని, యొక్కవిషయమునమాత్ర మాతఁడు కృతనిశ్చయుఁడయ్యెను. రణాంతమునఁ దనకు వసుమతికరగ్రహణమో, లేక మరణమో కలుగవలయు నని మాత్ర మాతఁడు కృతనిశ్చయుఁడయ్యెను. పూర్వానుభవ మంతయు స్మృతికిఁ దెచ్చికొనుచు నాతఁడు తన యదృష్టముయొక్క స్పష్టాకృతుల నూహించుకొనియెను. తనకుఁ దప్పకుండ రెండవపక్షమే సిద్ధించు నని నిర్ధారణ చేసికొనుచుండెను. మరల నాశ యాతని వెనుక కీడ్చుకొనిపోవుచుండెను

వసంతుఁ డియాలోచనలలోఁ జిక్కికొని పరధ్యానముగఁ బోవుచుండెను. ఆతనికడ కొకయాశ్వికుఁడు వేగముగ వచ్చి వినమ్రుఁడై యాతనికి విధేయతను జూపెను కాని వసంతుఁ డాతనిఁ బరికింపలేదు.

"మహారాజునకు జయమగుఁ గాక!" యనియాశ్వికుఁడు పెంపరించెను. ఈసంకేతవాక్యమును వినినంతనే వసంతుఁ డులికిపడి యాశ్వికునివంకఁ జూచెను. ఆశ్వికుఁడేమియు మాటాడలేదు. వినమ్రుఁడయి దూరముగ నిలువఁబడి తనబల్లెమును వసంతునికడకుఁ జూచెను. అందొక యుత్తరము కట్టఁబడి యున్నది. వసంతుఁ డది గైకొని "ఇదియె

క్కడిది?" అనియడిగెను. ఆశ్వికుఁడు ప్రత్యుత్తరమీయలేదు. ఆతఁడు తనగుఱ్ఱమును మరలించి యొక్కయెడానున మాయమై పోయెను. వసంతుఁ డాశ్చర్యముతో నాలేఖను విప్పుకొనియెను. కాని, యాతని చేతులు గడగడవడఁకుచుండెను. శరీరమంతయు జెమ్మటలతో నిండి పోయినది. తత్తఱమున నందలిలిఖితార్థమును జదువయత్నించెను. కాని, యందలియక్షరము లేవియు నాతనికి గోచరించవికావు. ఆతఁడు తన మనసును దిటముచేసికొని యెట్టకేలకిట్లు చదువుకొనెను.

"మహావీరాగ్రణీ!

అంతయు నిట్లయినది. ఇది దైవప్రేరితము. నాయదృష్టమును గూర్చి నేనంతగాఁ జింతింపను. అది నాకుఁ బరిపాటియైనది. బాల్యము మొదలు నేఁటివఱకొక్కవిధముగనే యున్నది. ఇప్పుడావిషయమున నామనసును రాయిచేసికొంటిని. కాని యొక్కదానికై చింతవొడము చున్నది. నాబహిఃప్రాణము నాకొఱకు సర్వమును, బరిత్యజింపకొను చుండుటయేగాక పొందరానియిడుమలఁ బొందుచున్నది. అందులకై చాల దుఃఖించుచున్నాను. నాయీదుఃఖమునకుఁ దుది యెప్పుడో తెలియ కున్నది. నాఁడు రాజసభలో నాప్రాణేశ్వరునియొక్కయవస్థను జూచి నప్పుడే నేనీలోకమును విడువవలసినది. కాని నాకాయదృష్టము పట్టి నదికాదు. దాని కంతరాయముగ నాశాపాశ మొకటి పొడచూపి నాప్రాణములను బంధించినది. ఈపాశమే నన్ను భావికాలమున కీడ్చు కొనిపోవుచున్నది. పూర్వానుభవము కలిగియున్న నాకు నాయదృష్టము నం[illegible]టినమ్మకము లేకపోయినను నదృష్టవంతులయదృష్టిబలముచేనైన న[illegible]మును జక్కనగునని నమ్మియున్నాను. కష్టములపై వచ్చుకష్టములు శ[illegible]సూచనము లేయని నాయాశయము నేను సంపూర్ణముగ విచార [illegible]ను వదలివైచితిని. అమంగళశంకచే నాకన్నులనుండి యొక్క యశ్రుబిందునైన వెడలుట లేదు. మనయదృష్టము క్షత్రియోచితముగు

పౌరుషముపై నిలిచియున్నందులకు సంతసింపవలసి యున్నది. ఇప్పట్టున ధైర్యమును వహించి పౌరుషమును జూపి విజయము సంపాదింప వలయును. దురాత్ముఁ డగు నందునికంఠనాళములనుండి వెలువడు వెచ్చని నెత్తురుతో మనయదృష్టదేవతకు బలిభోజనము పెట్టవలయును. నా కొఱకు విచారింపవలదు. ప్రాణేశ్వరా! నీపాణిగ్రహణశుభసమయమునకు గాని, సహగమనపవిత్రక్షణమునకుఁగాని సంసిద్ధముగ నున్న దానను. విజయోత్సవానంతరమున రత్నగిరిరాజాస్థానముననో, వీరమరణానంతర మున సుధర్మాస్థానముననో. మనము కలిసికొనఁగలము. పురుషప్రయ త్నమున లోపము లేకుండఁ బనిచేయుదము. ఆవల దైవమున్నది. ఆదయాళుఁ డగు పరమేశ్వరుఁడు మనజీవితముల నిరర్థకములుగఁ జేయకుండుఁగాక! మనయనురాగహృదయములయందలి యుత్సాహమే మనకు సంపూర్ణ విజయము నొసంగుఁగాక! అంభీరుని నశ్రమమున జయింపఁ గలిగిన నీకు దుష్కృతదూషితుండును, జరాదూషితుండు నగు నందుని వధించుటొక లెక్కకాదు. జీవితేశ్వరా! పొమ్ము! చంద్రహాసద్వితీయుం డవై యుద్ధమునకుఁ బొమ్ము! ఇంకేమి వ్రాయుదు? నాచేతులు వడఁకి పోవుచున్నవి. నాలేఖినినుండి రక్తము స్రవించుచున్నది. నాకన్నులు చెదరిపోవుచున్నవి. నాకిఁకఁ గష్టములన్న భయములేదు. పొమ్ము! నీకు శుభ మగుఁగాక! విజయోత్సాహముతో మరల దర్శనమిచ్చెదవుగాక! కులదేవతలు నిన్నుఁ గాపాడుదురుగాక!

"వసుమతి"

ఈయుత్తరము చదివికొని వసంతుఁ డొక్కింతసేపు నిశ్చేష్టుఁ డయ్యెను. నిట్టూర్పు విడిచెను హృదయమేమియును చెదరిపోలేదు. కాని, యందెన్నియో భావములు కలిగెను. ఆప్రియలేఖ నొక్కసారివక్షు మునఁ జేర్చికొనియెను. కన్నులనద్దికొనియెను. ఎంతధైర్యమును వహించి యున్న నొకటిరెండశ్రుబిందువులుమాత్రము వెడలక మానినవికావు.

ఉత్తమక్షత్రియకులాలంకార యగుప్రాణేశ్వరి ధైర్యముతోఁ వ్రాసిన శుభలేఖనక్షరముదూషితము చేయవలసివచ్చినందులకు నిందించుకొనియెను. అప్పటిప్రయాణభేరీధ్వను లాతనిహృదయమున విజయోత్సాహమును బురికొల్పుచుండెను. నందశిరశ్ఛేదానంతరమునఁ గాని కవచమును విడువనని ప్రతిజ్ఞనొనర్చి రోషకషాయితాక్షుఁడయి చంద్రహాసమును సవరించుకొనుచు సేనలతోఁ గలిసి ప్రయాణము సాగించెను.

---

## పదునెనిమిదవ ప్రకరణము.

ఇది గంగాతీరమునందలియుత్తరపునభూమి. రాత్రి వెన్నెల యంతస్పష్టముగ లేదు. ఆకాశమునం దక్కడక్కడ మేఘము లావరించుకొనుచుండెను. ఆమేఘములు వర్షంపుమేఘము లగునో కాదో తెలియకున్నది. వానివెనుకనుండి నిమిషనిమిషమున కొకసారి మెఱపుతీవలు తళుక్కతళుక్క మని బయలుదేఱుచుండెను. గాలియును రేఁగి క్రమక్రమముగ హెచ్చుగాఁ జొచ్చెను. దానిమూలమునఁ జెట్లన్నియును నాకు ఱెక్కల విప్పిపైకెగిరిపోవుచున్నట్లుండెను. మేఘము లాకసమున వడివడిగఁ గూడికొనుచున్నకొలఁది నున్న వెన్నెలయును బోయి చీఁకటి యావరింప నారంభించెను. ఉఱుములుమాత్రము లేవు. మబ్బు దట్టముగఁ బట్టుటచే భూమ్యాకాశము లేకమై పోయినవి. మెఱపు లంతకంతకు హెచ్చయ్యెను. వానిచంచలకాంతులవలన భూమిపైనున్న పదార్థసంచయమునకు వింతరూపు లేర్పడుచుండెను. అవియును క్షణభంగురములే. మనకవి శాశ్వతానందమును గూర్పలేవు. ప్రపంచకమే యశాశ్వతమైనది. అట్టిదానియందుఁ బుట్టినవిమాత్రము శాశ్వ

తము లగునా? ఇప్పటిగాలిచే సంగీతవృక్షములుతలలూఁచుచు హాయిగ గానముసేయఁదొడంగినవి. తరుపత్త్రములు కొమ్మలపై నత్యంత మనోహరముగఁ దాళముల నెఱపు చున్నవి. ఆకాశనీలపటమును భేదించుకొని వచ్చుటకై యప్సరోంగనలు తొంగితొంగి చూచుచున్నట్లు తటిల్లతలు మెఱసిపోవుచుండెను. గాలి కొంచెము తగ్గుచున్నది. అప్సరోంగనల వీణాగానామృతమును నీవెప్పుడయినఁ జవిఁగొలితివా? లేదు. పోనిమ్ము తుంబుర నారదులగానమునైన వినియున్నావా? అదియును లేదు. పోనీ గానమును వింటివా? వినియుందువు. అయినచో మనోహరగానము వినుటకు నీకిష్టమే. ఇప్పుడీవనమధ్యము నుండి యొకమధురగానము— వినఁబడుచున్నది. నీవు వినుచున్నావా?' అది కిన్నరీనాదమో? వీణానాదమో? అప్సరోంగనామధురకంఠనినాదమో? కనిపెట్టలేము. దూరము నుండివచ్చుచున్నది. కాని, స్వర మత్యంతమనోహరమై యున్నది. సంగీతమునకు దూరశ్రవణమే యోగ్యమైనది. దానియందున్న మోహనశక్తి ప్రపంచమున మఱి దేనియందును లేదు. ఎంతసుఖము! ఎంత యానందము! వినుము! వినుము! గాలివిసరున వనతరుపత్త్రముల దూసికొని మాంద్యమును బొంది చల్లఁగ శ్రుతిసుఖముగ గాన మెట్లువినఁబడుచున్నదో? ఈమోహనగాన మెవ్వరిదై యుండును? నిర్జనప్రదేశముల ఖేచరులు విహారార్థులై తిరుగుచుఁ దమగానకళామాధుర్యమున భూతసంచయము నరికట్టుచుందు రని వినియున్నాము. ఈగానము తప్పక యాఖేచరులదే యైయుండును. గాన మంతకంతకు సమీపముగనే వినఁబడుచున్నది. పదములు విస్పష్టముగనే వినవచ్చుచున్నవి. గీతము చాల సరసమైనదియే. ఆగీతముయొక్క యర్థమును నీవు తెలిసికొనుచున్నావా? భీమజరాసంధులయుద్ధమున శ్రీకృష్ణుఁడు తాండవముసేయుచు జరాసంధమర్మభేదనమును గూర్చి యర్జుననకుఁ జెప్పువాక్యములఁ బ్రకాశము సేయుచున్నది. ఈగాథ భారతములో నున్నది. దీనిలోఁ జాలఁబర

మూర్ఛమున్నది. ఈమహారణ్యములో నిట్టిభావప్రకటనము సేయుట కేమివచ్చెనదో? కళ్యాణిరాగమాలాపింపఁబడుచుండెను ఆగానామృత లహరిలో వనమంతయు మునిఁగి తేలుచున్నట్లుండెను. గానమన్నిదిక్కుల నొకేవిధముగఁ బ్రతిధ్వనించుచుండెను. ఇప్పుడు మనకు గానమేదియో, ప్రతిధ్వనియేదియో, తెలియుట లేదు. అదేవిధముగ రాగ మాలాపన సేయఁబడుచుండెను.

కళ్యాణిరాగము వీరరసోచిత మైనది ఈనిర్జనారణ్యములో నిట్టివీరరసప్రబోధ మెందులకో? క్రమక్రమముగా మబ్బు విడిపోయినది. ఆకాశము కాంతిమంతమైనది. చంద్రకాంతు లంతటను మరలఁ బ్రసరింప సాగెను. గాలివిసరుట తగ్గినకొలఁది నేయారణ్యమున నెవ్వరో మనుష్యులు మాటాడుచున్న సందడికూడ వినవచ్చుచుండెను. క్రూరమృగారణ్య మధ్యమున నిట్టియర్ధరాత్రివేళఁ దిరుగుట కెవ్వరు సాహసించిరో? ఆవిన వచ్చుచున్న సందడివలన నొకరిద్దఱుగఁ దోఁచుట లేదు. జనసమూ హామువలెఁ బొడకట్టుచున్నది. ఈ వెన్నెలవెల్తురున నీయరణ్యమునుబరి శోధింతము.

వరుసగనున్న యీవృక్షపంక్తులను దాఁటినచో నొకమైదానము గానఁబడుచుండెను. అందెవ్వరో దండువిడసిరి. అదిసామాన్యసేనకాదు. ఈదెస లెక్కలేనియేనుఁగులసమూహము. ఆప్రక్క నత్యధికమైనగుఱ్ఱ ములగుంపు. నలుదిక్కులను నంతటను గాల్బలము. మధ్యమధ్యమునఁ బటకుటీరములు చాలఁగ నున్నవి అందుమహాయోధులు నివసించి యుందురు. వారివారివిచిత్రరథము లాపడమటిదిక్కున శిలాకుడ్యము వలె నెట్లున్నవో? కాల్బల మంతయు నిద్రించుట లేదు. అక్కడక్కడ మేలుకొనియున్నవారు మాటలాడుకొనుచుండిరి. సేనాసమూహమున కావల నీవల నీప్రక్క నాప్రక్కఁగూడఁ గొందఱు మహాయోధులు శస్త్రాస్త్రధారులై జాగరూకతతోఁ దిరుగుచుండిరి. ఆసేనాబాహుళ్య

మునుగనుఁగొనుటకై మనము ప్రయత్నించుచున్నాము. కాని లెక్కించుటకు సులువుగ లేదు. ఇది చాలఁ బ్రచండసైన్యము. ఈసేన యెవ్వరిదో కనుఁగొనుటకై యీస్కంధావారమునఁ బ్రవేశించితిమేని మన మే యోధునిచేతిలోనో చిక్కుఁబడి పోవుదుము. కావున నట్లు పోవలదు. సత్యమును గ్రహించుటకై సన్నాహము సేయుదము.

గాన మాఁగిపోలేదు. అది మనవీనులకు విందుసేయుచునే యున్నది స్కంధావారము నందుఁగూడ నది పూలగుత్తులనో, ముత్యాలసరములనో, విరియఁజిమ్ముచునే యుండెను. సేనలప్రక్కల సంచరించు వీరులుకూడ నాగానామృతమును జవిఁగ్రోలుచుండిరి. ఆసంగీతమున వీరరస ముప్పొంగిపోవుచున్నప్పు డేవీరుఁడు దాని నాలకించుట కిచ్చగింపఁడు? తద్రసానుభవమునకు లోనైనవారిని మన మానవాలు పట్టవచ్చును. వారిశరీరములు గగుర్పొడుచుచున్నవి. సమరోత్సాహపూరితములై యుప్పొంగిపోవుచున్నవి. ఇప్పుడుగాన మాఁగిపోయినది.

మరల నింకొకప్రక్క నాస్వరము లుదయించినవి. స్వరము రసప్రధానమైనదో, రసము స్వరప్రధానమైనదో మన మూహింపఁజాలకున్నాము. ఇందు స్వరముచేత రసోదయ మగుచున్నది. రసభావము స్వరమునకుఁ బట్టినది. స్వరము మధురమైనది. రసమామాధుర్యమునందు లీనమై యున్నది. రసమునందును మాధుర్యము లీనమైయున్నది. ఈ యైక్యభావముచేతనే మురళీధరుఁడగు బాలకృష్ణుని గోపగోపికాజనము మోహించినది. లోకమంతయును మోహించినది. విషోగ్రుఁడగుకాళియుఁడా మోహమునకు లోఁబడలేదు. ఆగర్భశత్రుఁడగు కంసుఁడును లోఁబడలేదు. అయినను వారల కాగానకళానిధి యగుబాలకృష్ణుని పావనదేహస్పర్శనము లభించినది. జన్మాంతరమునందైన వారల కాభాగ్యము కలుగకుండునా? ఇప్పుడు వినఁబడుచున్న గీతమున, కాళీయమర్దనము, కంసవధ, వీనినిగూర్చినగాథయే. ఇందు వీరరసము ప్రవహించుచుండుట

కేమి యాశ్చర్యము? ఈగీత మాసేనాపార్శ్వమునఁ దిరుగుచున్న యొక యోధుని చెవింబడెను. ఆతనిశరీరము జలదరించెను. హృదయము వివశత్వమును బొందెను. "రాధా — కృష్ణా — నీవే పాఁడవు. నీవు కనఁబడకుండఁ బోయితివిగదా!" యనియగ్గించెను. రాజ యోగా నందస్వామీ! యని సంబోధించెను. రాజయోగానందస్వామి రాజ్య కార్యములయందు నిపుణుఁడై తన్నీయుద్ధమున నియోగించి నందుల కాతఁ డట్లు సంబోధించియుండును. ఆతఁడు రాజయోగానందస్వామి శిష్యుఁడగు మహాయోధుఁడే. ఈసేనయంతయు నాతని యాధిపత్యము క్రిందనే యున్నది. ఈసేనచంద్రగుప్తప్రభునిదే. మహాయోధుని హృదయ మాగానములో లీనమైనది. ఆతఁడు నాగాధనే గానము సేయ నారంభించెను. ఏకసంతఁగ నప్పుడాతఁడు విని గ్రహించెనో, లేక పూర్వ మాతని కాగీతము కంఠపాఠముగ వచ్చునో గాని, యొక్కతప్పైన లేకుండగీతమును మరలఁ బాడ నారంభించెను. ఇది వినఁబడినతోడనే యెదుటిగీత మాఁగిపోయినది. మహాయోధుఁడును మానివేసెను. మరలఁ గొంతసేపటికి మఱియొకదిశనుండి సంగీతము వినఁబడుచుండెను. అది గీర్వాణభాషలో నున్నది. కాఁబట్టి యది గీర్వాణులే పాడు చుండిరని తోఁచుచున్నది. దాని యర్థ మిది.

"సౌమ్యస్వభావుఁడ వగునోరాజచంద్రుఁడా! నీవు లోకమునం దంతటను నమృతమును వర్షింపఁజేయుచున్నావు. అందులకు జనము నిన్ను వేనోళ్లఁ గొనియాడుచున్నది. నీవు దేవతలకుఁగూడ నాహారము నిచ్చుచుందువు. దేవతలు నీయందు కరుణాళులై యున్నారు. కాని దుష్టులగురాహుకేతువులు నీయందు మత్సరమూని నిన్నుఁ బట్టవచ్చు చున్నారు. చలింపక నిలిచెదవేని వారియంతమును నీవు చూడఁ గలవు. నీవమృతమూర్తివి."

ఇం దెంతపరమార్థ మున్నది? చంద్రగుప్తున కీసంగీతము వినఁబడి యుండునా? అతఁడు తనశిబిరములో నిదురించుట లేదు. ఆయుధహస్తుఁడై యిటునటు తిరుగుచుండెను. ఇంతలో నాగానము గాలివాలున సామీప్యమున వినఁబడియెను. సేనాసమూహముప్రక్క యోధులనుండి కొన్నియీల లావెంటనే వినవచ్చినవి. తోడనే చంద్రగుప్తుని పటకుటీరముకడనుండి ఖడ్గహస్తు లగునిరువురుయోధు లొక్కపేపరుగునఁ బాఱిపోవుచుండిరి వారు మాఱువేసములతోఁ జంద్రగుప్తుని రహస్యముగ వధింపవచ్చినకుండలదండధారులను యోధులు. వారు నందుని సేనానాయకులు. కొందఱుయోధులు వారిని వెనుదవిలిరి గాని వారు దొరక లేదు. ఆసందడివలన గీత మాఁగిపోయినది.



## పందొమ్మిదవ ప్రకరణము.



సూర్యోదయము కావచ్చుచున్నది. వనశకుంతముల కలకలారావమంగళవాచకములు వీనులవిందు సేయుచుండెను. గంగాతరంగమాలికలలోఁ దూఁగితూఁగిచల్లనిపిల్లవాయువులు వనవిహారము సేయుచున్నవి. చెట్లక్రీనీడలఁ జేరిన చీఁకటి దొంగలు మనకిప్పుడు కాన్పించుట లేదు. ఆక్రీనీడలును గనఁబడుట లేదు! ఆకసముతొంటినైల్యమును వీడినది. ఉషస్సునకుఁ బూర్వమునఁ దోఁచు వెలవెలపాటును వీడినది. అరుణతేజ మాతూర్పుదిక్కునం దవతరించెను. ఆకాంతులలోఁ గరకర ప్రొద్దుపొడుచుచుండుటచే నాకాశమునం దొకవింతకాంతులు తోఁచుచుండెను. బాలభానునిలేఁతకిరణము లిప్పుడు పర్వతాగ్రములయందును, నున్నతవృక్షాగ్రములయందును బ్రాఁకుచు, మెల్లఁగ ముందునకుఁ దారి

చుండెను. అవి, క్రమముగఁ జెట్ల యాకుల మీఁదను, కొమ్మల మీఁదను, పరువడఁ బూదీఁగల నల్లుచుండెను. తరుపంక్తు లన్నియుఁ జిత్రవిచిత్ర వర్ణములు గలపత్త్రిసంతతులచే మనోహరముగఁ గానవచ్చుచుండెను. ఆయద్భుతశక్తి వాని కాద్యుమణి యభ్యుదయముచేతనే లభించినది. ఇప్పుడు ప్రభాతతేజము లోకమునం దత్యంతప్రభావముచే సంచారము సేయుచున్నది. అది పరబ్రహ్మముయొక్క సౌమ్యతేజము. దానిమాహాత్మ్యమును మన ముపవర్ణింపఁజాలము. త్రిమూర్త్యాత్మకమైన యీబాల భాస్కరుని, నాతఁ డవగాహనము సేయుచున్న యీ పావనగంగా స్రవంతిని, ఫలభరిత తరువిలసితం బగు నా వనలక్ష్మిని, మన మొక్కసారి స్మరించుకొందము.—

ఇట్టిసమయమున గంగాతీరమునం దొకమఱ్ఱిచెట్టుక్రింద నిరువురు పురుషు లేమియో ముచ్చటించుకొనుచుండిరి. అందొకపురుషుఁడు యౌవనము నతిక్రమించి యున్నాఁడు. అయినను నాతని శరీర మింకను పటుత్వమును వీడియుండలేదు. ఆతనిముఖమున బ్రహ్మతేజము తాండవ మాడుచుండెను. రెండవయాతఁడో, నవనవోన్మేషయౌవన విరాజితుఁడు. ఆతనిస్వరూపస్వభావ లక్షణములచే నాతఁడొకసుక్షత్త్రియ ప్రభుపుంగవుం డని తోఁచుచున్నది. వారీవిధముగ సంభాషించుకొనుచుండిరి.

"వత్సా! నృపబాలా! సార్వభౌముఁడ వగుదువుగాక! ఆయుష్మంతుఁడవై చిరకాల మీయవనిఁ బాలింతువుగాక!"

"ఆచార్యోత్తమా! అనుగ్రహింపఁబడితిని."

"చంద్రగుప్తకుమారా! పాంచాలదేశమున నిప్పుడు ప్రతినిధిగ నెవ్వరున్నారు?"

"భక్తియుక్తుండును, సత్యసంధుండు నగులావణ ప్రభువు; సాభూతి"

"నమ్మకమునకును, రాజనీతికిని, జాల దూరమే. ఆప్రాంతప్రభువునే యంకుంచితి వేల?"

"అతఁడొక్కఁడే యందున్నవాఁడు. మనమహాసౌధునిసైన్య మందున్నది. అదియునుగాక యాతనిసేనతో నాతనిప్రియతనయుఁ డగు జయభూతి నిటకుఁ దీసికొని వచ్చితిమి"

"బిడ్డా! నీయేర్పాటు ప్రయోజనకరముగనే యున్నది. ఇఁక నాతఁ డేమాత్రమును ద్రోహము తలపెట్టఁడు. ఒకవేళనీచవర్తనము నకుఁ గడంగెనేని సైన్యమునకుఁజెడును. పుత్త్రునకుఁజెడును. మాన ప్రాణములకుఁజెడిపోవును."

"గురూత్తమా! నందపుత్త్రవధనుగూర్చి విన వేడుకపడు చున్నాఁడను."

"దానిగాథ చాలగ నున్నది. చెప్పుటకు నాకును దొందరగనే యున్నది. సేవును, వసంతుఁడు నేగినపిదప పురమంతయుఁ జాలఁగల్లోల మునకు లోఁబడియెను. పురజనులు చాలమంది నంకునిచే బాధింపఁ బడిరి. వధ్యశిలయొద్దకు వచ్చినవారిని రాని వారినిగూడఁ బట్టించి చెఱఁ బెట్టించెను. తమకు వ్యతిరేకముగఁ బనిచేసెనన్న వారినెల్ల బంధించెను. ఈసమయమున నాగృహదహన వృత్తాంత మాతనికి వినఁబడినది. గొడ్డలిచేఁ జేయుపని గోటనే తీరిపోయినదని యాతఁడు సంతసించెను. నామరణవృత్తాంతమును వినినతోడనే ప్రజల బాధించుట తగ్గించెను. క్రమముగఁ గొన్నాళ్లకా ప్రజలు విడుదల చేయఁబడిరి ఇదియంతయును ప్రజలయందుఁ దాను దయఁగలిగియున్నట్టుగ వారనుకొనుటకై యొనర్చిన యాతనికపటనము."

"మాపోకడ నెఱింగినవెనుక నందుఁడు మాకొఱకు వెదకింప లేదా?"

"నిన్ను నవ వసంతుని బట్టుకొనుటకై యానందుఁడు చాలమంది చారులను బ్రచ్ఛన్నముగఁ బంపఁదొడంగెను. నేను మనశకటదాసు మొదలగుభృత్యుల నందందుఁ గాపుంచి శత్రుచారుల రహస్యముల నారయుచు వారిని నయమునను, భయమునను, ధనాదిసాధనములను, మన లోనికిఁ ద్రిప్పికొంటిని. అట్లు స్వాధీనము కానివారల రహస్యముగ నరణ్యమార్గములనో, మఱిమెచ్చటనో, మనగూఢసంచారులచే మట్టుపెట్టించితిని. ఒక్కచారుఁడును దనకెట్టి వృత్తాంతమును జెప్పకుండుట కను మానించునని కొందఱ మొగములు మాత్రము రాజునకుఁగనఁబడునట్లు చేయుచుంటిని. వారేమి చెప్పఁగలరు? ఈసందర్భమున నందునకుఁ జాలననుమానము కలిగెను. వసంతచంద్రగుప్తులవృత్తాంతముఁ దీసికొని రాకుండ వచ్చినవారికి మరణదండనము విధింతు నని యాతఁ డాజ్ఞాపించెను. బ్రదుకఁదలంచినచారుఁ డెవ్వఁ డాతనికి మరలఁగన బడును? వారందఱు క్రమక్రమముగ నెచ్చటికో పాఱిపోవుటయో, లేక మనగూఢచారులపక్షమునఁ జేరుటయో, తటస్థించెను. అట్టివారికయినను మనరహస్యవృత్తాంతములు తెలియనీయకుండ మనమిత్రుఁ డగుమాళవరాజకుమారునియొద్దఁ జేర్పించితిని."

"అయినను, నందుఁ డూఱకుండువాఁడు కాఁడే. ఆతనిమంత్రి యగు రాక్షసుఁడు చాల బుద్ధిమంతుఁడు. మీరహస్యమును గనిపెట్ట లేక పోయెనా?"

"ఆతనిప్రయత్నము లన్నియును వ్యర్థమగుచుండుటచే నందు నకు నామరణవిషయమున ననుమానము కలిగినది"

"తరువాత నేమి చేసిరి?"

"నీతిశాస్త్రనిపుణుండును, తంత్రజ్ఞుండు నగు, రాక్షసామాత్యుఁడు మనయాశ్రమరహస్యములఁ దెలియఁగోరి, చాణక్యునియావరణమునందలి

స్థలమంతయును ద్రవ్వి యందుఁజాణక్యాలయముఁ గట్టింతుమని యుత్తరవు చేసెను."

"అది యేమి?"

"నామరణమునుగూర్చియే తల్లడిల్లుచున్న ప్రజలు నాయాశ్రమమును త్రవ్వించినయెడలఁదిరుగఁబడక మానరని యుక్తిగా నట్లు చేయ నిశ్చయించెను."

"గూఢమార్గమును గూర్చి వారు తెలిసికొనిరా? అట్లైన మీ మరణము కృత్రిమమే యని తేటపడకమానదే! "

"అది యెట్లు జరుగును" ఈసంగతి యంతయును నేను జీవసిద్ధి వలనఁ దెలిసికొని నాసహాశ్రోతయు, నందునిభోగినియగు పుష్పమంజరికిఁ బ్రియుండు నగు, నిందుశర్మమూలమున నొకతంత్రమును బన్నితిని"

"ఎట్లు?"

"చాణక్యుఁడు బ్రహ్మరాక్షసుఁడై తన్నుఁ బీడించుచున్నాఁ డని పుష్పమంజరి కపట భూతావేశాభినయముఁ జూపించునట్లు చేయించితిని. దానిమూలమున నామరణమునుగూర్చినసందేహము పోయినది. పుష్పమంజరియే ప్రాణముగనున్న నందుఁడు దాని కష్టములను జూడలేక యనేకులగుభూతవైద్యులను బిలిపించి చికిత్స చేయింప నారంభించెను. అప్పుడు మాళవమునందున్న మన మిత్రుఁడగు బేతాళశాస్త్రి వచ్చి రాజునుదర్శించి తానాభూతమును వదలించెదనని ప్రతిజ్ఞ చేసెను. అతని చికిత్స యారంభించినది మొదలు కొంచెముగుణ మగపడియెను. శాస్త్రి మారణహోమముఁ జేయుటకుఁ దనకువలనుపడదనియు, చాణక్యుని తోఁటలో నక్కడక్కడ విభీతకవృక్షముల నాఁటించినచో మరలఁ బైకి రాకుండ నావృక్షములం దాభూతము నావహింపఁ జేయుదు ననియు నందునితోఁ జెప్పెను. నందుఁడట్లొనరించెను. పుష్పమంజరిని బట్టిన బ్రహ్మరాక్షసి శాస్త్రిమంత్రప్రభావమున నాచెట్ల నాశ్రయించెను. ఆప్రదేశమున

కిప్పటికి నితరులు పోవవెఱతురు. రాక్షసుని యుక్తి దానిచేఁ గొనసాగినది కాదు"

"మహాత్మా! మొట్టమొదట గృహదహన మెవ్వరివలన నైనది?"

"నావలననే"

"అది యేమి?"

"నాఁడు విష్ణుగుప్తుఁడు మనయాశ్రమమున సుందరిని జూచెను. తరువాత లోనికి వచ్చి యంతయును వెదకెను గాని యామె పాతాళద్వారమునఁ గొన్పుటచే నాతని కగపడలేదు. మరల నాతఁడు రక్షకభటులతో వచ్చి వెదకింపవలయు నని పైని గొళ్లెము పెట్టి వెడలిపోయెను. నాయం దనుమానము కలుగుటయును, పాతాళ గృహవృత్తాంతము బయలఁబడుటయును,గూడ మనకుఁ జిక్కులకు మూలమని యోచించి చాణక్యుఁ డీగృహమునఁ బడి కాలిపోయె నని నమ్మించుటకు నేనట్లు చేసితిని. ఆనమ్మకమువలననే చాలకాలమువఱకు వారు ప్రమత్తులై యుండఁగలిగిరి."

"పాపము! సుందరి యేమైనదో గదా!"

"మీవెనుకనే యామెనుగూడఁ బంపితిని. ఆమె మిమ్మును గలిసికొనలేకపోయిన దనియును, కలశపురమున వసుమతి చోరులచే నపహరింపఁబడిన దని విని యాదుఃఖమున రాత్రివేళ గంగానదిలోఁ బడి మునిఁగిపోయిన దనియును, చంద్రజూటశాస్త్రి నాకు జాబు వ్రాసినాఁడు."

"అయ్యో! ఆమె కెట్టియవస్థ వచ్చినది? రాక్షస ప్రయత్నము భంగమైన వెనుక మీరేమి చేసితిరి?"

"తరువాత నేనాభూగృహమును విడిచి మహావనములోఁ బర్వతసామీప్యమున నున్న మన పాతాళపురమునకుఁ బోయి యందుండియే తగినయేర్పాటులను జేయుచుంటిని. ఈలోపల జీవసిద్ధి పర్వతకుని ప్రబోధించి నందరాజ్యములో సగ మాతనికిప్పించెద ననియు నాతని

సేనలతో నందునినుండి విడిపోవలసిన దనియు నమ్మించెను. నందుఁడు రాక్షససహితుఁడై కోసలమునందలి మహాకటకమునకుఁ బోయినప్పుడు పర్వతకుఁడు తనసేనలతో మనపక్షమునఁ జేరెను. అతఁడును, మాళవ రాజకుమారుఁడును, తమతమసేనల బలపఱచుకొనిరి. భరతపురరాజును, కాశీప్రభువును,మఱికొందఱు నందవిరోధులగురాజులును, మాళవసేనతో వచ్చి చేరుట కేర్పాటులు కావింపఁబడినవి. ఈరహస్యరాజ్యమునకుఁ బర్వతకునే రాజుగ నేర్పఱచుకొనిరి. ఆతనికే యందఱును ప్రమాణ పూర్వకముగా గంగాతోయముల నభిషేకించి పట్టాభిషేకము గూడఁ గావించిరి.''

''గురువర్యా! నందపుత్త్రు లెట్లు నిర్మూలింపఁబడిరి?''

''భేతాళశాస్త్రి యింద్రజాలమునందును గట్టివాఁడే కదా! తండ్రిలేనిసమయమున విష్ణుగుప్తుఁ డీయింద్రజాలకుని బిలిపించి వినోదించుచుండెను. ఒకనాఁటి రాత్రి శాస్త్రి నాతఁడు బిలిచి ''అయ్యా మీరు చాణక్యుని జూపఁగలరా'' యని ప్రశ్నించెను. రేపు చూపెద నని యాతఁడు బదులుచెప్పెను మఱునాఁటిరాత్రి కోటయంతర్నగర మునసున్న భూగృహమునుండికోటలోఁ ప్రవేశించి చీఁకటిలో నేనొకగది యందుఁ బ్రవేశించి యుంటిని. ఆగదిగుమ్మము నొద్దనే విష్ణుగుప్తుం డుచి తాసనముపైఁ గూర్చుండి శాస్త్రియింద్రజాల విద్యనుగాంచి వినోదించు చుండెను. ఆతనియెదుటగోడ కొకనిలువుటద్దమున్నది. నేనుకత్తి నెత్తి కొని యాతని వెనుక నిలువఁబడితిని. నిలువుటద్దములోఁ దోఁచునారూప మును విష్ణుగుప్తుఁడు చూచెను. ఆతని మొగము వెలవెల బోయెను. ఒకింతలోఁ గోపమువచ్చెను. అది యద్దము, మహేంద్రజాలము, అను మాట నాతఁడు మఱచి ''ఓరీ! బ్రాహ్మణహతకా! చచ్చియును గ్రౌర్యమునువిడువవేమిరా?నీకీకత్తి యెందుఁలకు?''అని లేచియాయద్దము పై, నొక్కఁతన్ను తన్నెను. అద్దము పగిలిపోయినది. అక్కడి

చాణక్యుఁడు మాయమై పోయెను. ఆతఁడు వెనుకకుఁ దిరిగెను. మరల నక్కడఁగాన్పించెను. మరలఁదన్నుటకయి కాలు పైకెత్తెను. నాఖడ్గ మాకాలునకు బుద్ధిచెప్పినది. వెంటనే యాతఁడొక్క కేకవేసి క్రిందఁ బడిపోయెను. ఒక్కనిమిషములో నాతనిశిరము శరీరమునుండి వేఱు చేయఁబడినది—అప్పటి కప్పుడే పర్వతకాదులు తమతమ సేనలతో కోట లోఁజొరఁబడి నందపక్షపాతులనందఱ నఱకుచుండిరి. అంతటనుగలకలము ప్రారంభమైనది. బేతాళశాస్త్రి యింద్రజాలము కొంప ముంచివేసిన దని యందఱు నాతని బట్టుకొనుటకయి మీఁదఁ బడిరి. ఆగుంపులోఁ గొంతమంది నాఖడ్గముపాలై క్రిందఁబడిపోయిరి ఈలోపల నంతర్న గరమునుండి నేనువచ్చినదారినేమాళవకుమారుఁడు మహావీరులతోవచ్చి పడియెను. అప్పటిచర్య నేమని చెప్పఁగలను? అంతఃపురమున నా సేనతోఁ బ్రవేశించినందపుత్త్రిల వెదకి పట్టుకొంటిని. వారి ప్రాణములతోఁ గోట యును మనస్వాధీనమై పోయినది. కాని, వారిప్రాణములు మాత్ర మెగిరి పోయినవి. ఆరాత్రియంతయుఁ గల్లోలములో నాకోట మునిఁగి పోయి నది. తెల్లవాఱుసరికి నిరాతంకముగఁ బాటలీపుత్త్రి మంతయు మనకు స్వాధీన మైనది. ప్రజలుకూడ నేమియు ననలేదు. వృషలా! ఈఘనకార్య మునకు నందునిపై నాకుఁ గల క్రోధమును, శిష్యవత్సలతయు, నన్ను బ్రేరేచుటచే నేను బూనుకొంటిని. దైవము మనపక్షముగ నుండుటచే నిరపాయముగఁ బని జరిగిపోయినది”

“ఈవార్త విని నందుఁ డూరకుండెనా?”

“తరువాత నందున కీవార్త తెలిసినది. సేన లన్నియుఁ దిరిగి పోయిన సంగతియును దెలిసినది. కార్యము మించి పోయినది ఏమి చేయును? ఆతఁడు కోసలమున నందకటకమునందేయుండి మరల సేనలఁ గూర్చుకొనుచున్నాఁడు.”

“పర్వతకుఁ డేమయ్యెను?”

"రాక్షసామాత్యుఁడు నన్నుఁ జంపుటకయి నాపైకి విషకన్యక నంపెను. దాని నేనాపర్వతకునిపైఁ బ్రయోగించి యర్థరాజ్య మీయ వలసిన యగత్యము లేకుండఁ జంపించితిని"

"ఇదివఱ కాతని రాజుగాఁ జేసికొన్న ప్రజలు మీపైఁ దిరుగఁ బడ లేదా?'

"ఇది యెవ్వరికిఁ దెలియును? చాణక్యునితోఁ జేరిన కారణమునఁ బర్వతకుని రాక్షసుఁడే చంపించెనని లోకులు చెప్పుకొనసాగిరి."

"ఇప్పుడు రాజ్య మరాజకముగనే యున్నది కాఁబోలును,,

నేను చాలవఱ కొదవ లేకుండఁ గాపాడుచున్నాఁడను- ఈకల్లోలములోఁ బ్రజలు నిన్నా కాంక్షించిరి. సామంతరాజులును, దండ నాయకులును, మాళవరాజకుమారుఁడుచుగూడ, నీకొఱ కెదురు చూచు చున్నారు. నీవు పాంచాలమును జయించి వచ్చినవార్త విని వాఱంద ఱును బరమానందము నొందుచున్నారు."

ఈవాక్యములు విని చంద్రగుప్తుఁడు పరమానందమును బొం దెను. గురునకు సాష్టాంగదండ ప్రణామంబులు గావించెను. చాణక్యుఁ డాతని నెత్తి శిరము మూర్కొని చిరాయుష్మంతుఁడ వగుమని మరల దీవించెను.

చంద్రగుప్తుఁడు "ఆర్యా! ఉభయ సేనలను నడపించుపాటి సామ ర్థ్యము మహాయోధునియం దున్నది. మనము నందకటకమునకుఁ బోవుదమా?" యనియెను.

చాణక్యుఁ డందుల కంగీకరించెను. ఆసేనాసాగర మాయుద యమే నందకటకమునకు దాడి వెడలెను.

---

## ఇరువదియవ ప్రకరణము.



ఆమఱునాఁటిసాయంకాలమునకుఁ జంద్రగుప్తుఁడుసేనలతో నందకటకసామీప్యమునకు వచ్చినిలిచెను ఆపట్టణముచుట్టును ప్రాకారమున్నది. కాని ద్వారము లన్నియుఁ దెఱవఁబడియే యుండెను పద్మనందుని యొద్ద నిప్పుడు చాలసేన కూడినది. వైశాలీనగరేశ్వరుఁడగు వైరోచనుఁడును, నేపాళభూపాలుండగువిజయకేతుండును, తమ తమ సేనలతో నాతనికి సహాయులయి వచ్చిరి. తన తండ్రియగు పర్వతకుని చాణక్యుఁడు విషముపెట్టి చంపెనననసూయతో మలయకేతువుకూడఁ బగఁదీర్చికొనఁదలంచి ప్రచండసేనతో నందుని నాశ్రయించెను. నందుని సమీపజ్ఞాతి యగుసిద్ధార్థుఁడుకూడ నాతనినే కలిసికొనియెను. ఆతని సేనయుఁ జాలఁగ నున్నది. అది సముద్రముతోఁ బోల్పఁదగియున్నను నిప్పు డేమోకాని ఘోషించుట లేదు.

నందుఁడు యుద్ధకార్యనిపుణుఁడు. తఱివేచిశత్రువులజయించుటలో నాతని మంత్రి యగు రాక్షసుఁడు చేయు ప్రయత్నము లత్యద్భుతముగ నుండును. ఆతఁడు శత్రువుల నెదిరించి యుద్ధము సేయ దలఁచికొనలేదు. ఆకారణమునఁ గోటవిడిచి సేనలతోఁ బట్టణమునఁ బ్రవేశించెను. ఆపట్టణమున నేమూల నేసందు లున్నవో, యెచ్చటినుండి యెచ్చటికి మార్గమున్నదియో, క్రొత్తవారికిఁ దెలియదు. ఆతఁడు సేనల నన్నిఁటిని జిన్నచిన్న భాగములుగ విడఁదీసి యాయాస్థలములలో నిలిపి యుంచెను. శత్రుసైన్యములు పట్టణమునఁ బ్రవేశించినతోడనే వారిని చుట్టుముట్టి చిందరవందరఁ జేయవలయు నని యాతని యుద్దేశము. నందుఁడు సమయము ననుసరించి, యేయెండకాగొడుగు పట్టువాఁడే కాని వృథాభిమానమునఁ జావునకుఁ దెగించి విజయోత్సాహమున గెలుపోటములకు సిద్ధపడి

యుండువాఁడు కాఁడు. ఓటమివచ్చినప్పుడు పాఱిపోవుటకు వెనుదీయు వాఁడు కాఁడు. ఆతని కొక్కసారి తక్క యెన్నఁడును నట్టి యవస్థ తటస్థింప లేదు. అదియైనను బాఱిపోవుట కాదు. సర్వసేనానాయకులుఁ జాణక్యునితోఁ గలిసిపోవుటచే నక్కడకు మరల రాలేకపోయెను. అది మనమునం దుంచియే శత్రుసైనికులను లోనికి రానిచ్చుటకును, తాము వారిని చుట్టుముట్టి తాఁకుటకును, నిశ్చయించుకొనియెను. ఇది కేవల పలాయన మాత్రమునకే గాదు. విజయము గలుగుటకుఁ గూడ ననుకూలముగా నుండునని యాతఁ డాలోచించెను.

చంద్రగుప్తునిసైనికు లందఱును శూరశిఖామణులు. వారికి రణ మన్నఁ బండువుగా నుండును. ఇప్పుడు యోధు లందఱును, ఫలాపేక్ష కూడ నొకటి యుండుటచే, విజయోత్సాహమున నుద్రేకించి యుండిరి. ఎప్పుడైన నందునిపైఁ బడిపోవలయు నని ప్రతియోధుఁడును త్వరపడు చుండెను. ప్రతిదండనాయకుఁడును దనసైన్యముతో ముందుఁ బ్రవేశింప వలయునని తలంచుకొనుచుండెను జగన్మోహిని యగు వసుమతీ కర గ్రహణసౌభాగ్యమును, నమూల్యమణినిధాన మగురత్నగిరి రాజ్యసింహా సనసంపత్తియుఁ, బేరుగల ప్రతియోధుని హృదయమునందును నాశాలతలఁ బ్రాఁకించుచుండెను. ఆయుద్రేకముచే సేనాసముద్ర మంతయుఁ బొంగి పోవుచుండెను.

దట్టముగ మబ్బు పట్టినది. ఇంకను సూర్యాస్తమయము కా కుండుటచే గాఢాంధకారము కాలేదు. కాని, దూరపుచూపానుట లేదు. సేన లన్నియు ముందునకుఁ బోవునుత్సాహముతోఁ గ్రమముఁదప్పి యుండెను. యోధులును సైనికులఁ బురికొల్పుచుండిరి. పరేంగితజ్ఞాన ధురీణుండగు చాణక్యుని మతిప్రౌఢిమ లోకాతీత మైనది. ఒక్క యోధుఁడైన లోనఁ బ్రవేశింపఁగూడ దని రాజుచే నాజ్ఞ చేయించెను. ఈరాజాజ్ఞ యంత

టను వ్యాప్తమగుటకుఁ బూర్వమే ముందున్న కాశ్మీరరాజసైనికులిర్వురు దండనాయకులతో ద్వారమును దాఁటి పట్టణమునఁ బ్రవేశించిరి. తోడనే యిరువంకలను శత్రుసైనికులు బిలబిల లాడుచు వచ్చి వారి నరికట్టిరి. ఆకొలఁదిసేనతో నొకచిన్న కయ్యమారంభమైనది. భేరీధ్వనులు లేవుగాని యప్పు డుఱుముల పెళపెళధ్వనులును, సైనికులకోలాహల ధ్వనులును వినవచ్చుచుండెను. భయంకర దావానలమువలె శత్రు సైన్యముకాశ్మీరదండనాయకులనుబరివేష్టించి నాశనము చేయుచుండెను. ఆచీఁకటిలో నాసంకులసమరమున నెందఱెందఱు పడిపోయిరో తెలియ లేదు. కాశ్మీరదండనాయకులకుఁ దోడుపడుటకును వారిని రణసంరం భమునుండి మరలించి తెచ్చుటకు మఱికొందఱు దండనాయకులు లోనఁ బ్రవేశించిరి. వారుకూడ శత్రుసేనలచే నరికట్టఁబడిరి. అచ్చటి కయ్యము దారుణముగనే జరిగినది. గాఢాంధకారమైనది. ఎత్తఁబడిన కత్తులు, బల్లెములు, మొదలగు నాయుధములనుండి స్రవించుచున్న రక్తబిందు వులు మెఱుముల వెలుతురున నగపడుచుండుటచే వెలుపల నున్న చంద్రగుప్త సైనికుల కందఱకును హృదయములందు వీరరసము పొంగి పొరలుచుండెను. కాని, పురప్రవేశమున కభ్యంతరముగ నున్న రాజాజ్ఞ వారికి నిర్బంధముగ నుండెను.

చంద్రగుప్తుని సేనలు పట్టణమునకు వెలుపలనున్న యొక పేటలోఁ విడిసి యుండెను. అందఱును రాజాజ్ఞచే నిశ్శబ్దముగ నుండిరి. మహా యోధవసంతులు దమ సైనికులను బ్రాకారములఁ బగులఁగొట్టుట యందును, కంచెల బాగుచేయుటయందును, మార్గమును సుగమము చేయుటయందును నియోగించిరి. లోనఁ బ్రవేశించిన వారలలో గొందఱు రాజాజ్ఞ విని తప్పించుకొని వెనుకకు వచ్చుచుండిరి. కోపోద్రేకమున నొడలెఱుంగని కొందఱు ముందునకుఁ బోయి శత్రుసేనాసముద్రము నీది నంతవఱ కీది తుద కందు మునిఁగిపోవుచుండిరి. ఈవచ్చు పోవువారివలన

నాపురద్వార మంతయును క్రిక్కిఱిసియుండెను. ఆచిన్న సేన శివమెత్తి నట్లు శత్రువులతోఁ బోరుచునే యుండెను.

ఆగాఢాంధకారమునకుఁదోడప్పుడు పెద్దగాలియును ధూళియును బయలుదేఱెను. ఆపైఁదుపార మారంభించి క్రమక్రమముగా జడివాన కురియుచుండెను. అది చీకటిరాత్రి. దానిపై మేఘావరణము. అందును, ధారాపాతవర్షము. బాడిబురదలవలనఁ గాళ్లు జారుచుండెను. కన్నెత్తుటకు వలనుపడకుండ వర్షము మొత్తుచుండెను. ఒకరికొకరగపడుట లేదు. ఆసందడిలోఁ బట్టణముఁగొనిపో రాఁగిపోయినది. సేనలు చెల్లాచెదరై పోయెను. కాశ్మీరదండనాయకులు మిగిలిన సేనతో నిలువఁబడిరి. ఆజడి వానలోఁ జంద్రగుప్తుని సైనికులు చెట్టుచెట్టునకుఁబోయి తలఁదాఁచు కొనుచుండిరి. ఆసేనలు నిలిచినకోటలోఁ గుడివైపున నొకపెద్దచావడి యుండెను. అందుఁ జాణక్యుఁడును, ఆతనియంగరక్షకులును, మాళవ రాజును, గొంతమందిదండనాయకులును, గూర్చుండియుండిరి కొంతసైన్య మాపంచను జుట్టువారి యుండెను. ఆచావడి కెడమభాగమున నొక వినోదమందిరములోఁ జంద్రగుప్తుఁడును, గాశ్మీరగాంధారకాంభోజాది భూపాలురు, వారివారి యంగరక్షకసైన్యముతో నిలిచియుండిరి. అందే యంతఃపురస్త్రీజన ముండెను. వసంతుఁడును మహాయోధుఁడును, వినోద మందిరమునకును చావడికినినడుమనున్న యొకమఱ్ఱిచెట్టు క్రిందఁ దమ సేనలతోఁ దల దాఁచుకొని యుండిరి. వినోదమందిరమునకు వెనుకనున్న మామిడితోపునందు తక్కినసైనికులును, దండనాయకులును, నిలిచి యుండిరి.

రెండుగడియలసేపు వర్షమొక్కటేరీతిగాఁ గురిసి వెలిసెను. వీధులనుండి వర్షోదకము ప్రవహించుచుండెను. భూమియందలి కమ్మనిపరిమళముతో నీటిపై నుండి చల్లనిగాలి వీతెంచుచుండెను చెట్లయాకుల తుదలనుండి జారుచున్న జలబిందువుల చిటచిటస్వనంబును, వర్షజల

ప్రవాహములయందలి గలగలధ్వనులును, నీటిగుంటలలోనుండి యొక్కటే మాదిరిగఁ గూయు మండూకతండముల బెకబెకారావమును, గింగురు గింగురుమని కూయుచీకువాల రొదయును, గలిసి యొక యనిర్వాచ్యమగు వింతశబ్దముత్పన్నంబగుచుండెను. ఆతంత్రీస్వనముతోఁ గోమలకలకంఠ స్వరములీనమయి యున్నట్లు తోఁచుచుండెను.

ఆసమయమునఁ జంద్రగుప్తుఁడు వినోదమందిరమునకుఁ జాణక్యుని, తక్కినరాజలోకమును, రావించి యుద్ధకార్యముల విషయమై యాలోచించుచుండెను మహాయోధుఁడుకూడ నక్కడకుఁ బోయి యుండెను. అప్పుడువసంతుఁ డెక్కడనుండియో ససంభ్రమముగ వచ్చి "నాకుఁగూడ నీవిషయమున సమయ మీయవలయును" అని లోనికి విన్నప మంపికొనియెను. వసంతుఁడుగూడ వచ్చుటకు సమ్మతించిరి. వారందఱును దెల్లవారువఱకు నాయానియమితస్థలములలోనే జాగ్రత్తగ నుండుటకును, నుదయమున యుద్ధ మారంభించుటకును, నిశ్చయించిరి.

వసంతుఁడు లేచి నిలువఁబడి వినయముతో— "మహారాజా! శత్రువీరులు మనసైనికులపోలిక దుస్తులను ధరియించి యీరాత్రియే మనపైఁబడనున్నారఁట" అనియెను.

చంద్రగుప్తుఁడు వసంతునిదృఢప్రయత్నమును, జాగరూకతయు, సూక్ష్మగ్రహణశక్తియు, పరాక్రమమును, తనయందలి యభిమానమును, జూచి జాలిపడుచునేయుండెను. హృదయమునఁ దన్ను నిందించుకొనుచునే యుండెను. కాని, రాజనీతి నట్లుపయోగింపవలసివచ్చుటచే నాతని నపరాధునిగనే చూచుచుండెను. ఇప్పు డాతఁడు కనిపెట్టిన రహస్య వృత్తాంతము మూలమున మరల నాతనిహృదయమున జాలికలిగెను

"వసంతా! నిజముగానా? నిజముగానా"? అనియెను.

"నిజమే"

"ఇది నీకెట్లు తెలిసినది?"

"ఒక హరిదాసునివలన"

"ఆహరిదాసుఁడెవ్వఁడు?"

"ఆతనియథార్థచరిత్ర మేమియో నాకుఁదెలియదుకాని కొంత కాలమాతఁడంభీరునికడఁ దక్షశిలానగరమున నున్నాఁడఁట"

"శత్రుపక్షముననున్న వానివాక్యము లెట్లువిశ్వసింపవచ్చును?"

అప్పుడు మహాయోధుఁడు లేచి "మహారాజా! మొన్న గ్రీకు సేనలు లావణమును ముట్టడింపఁబోవుటయు, నంభీరునిసేనలు కొన్ని వారి తోఁబోవుటయు, మొదలగురహస్యము లాతనివలననే తెలియవచ్చినట్లు మనరాజయోగానందస్వామివారు సెలవిచ్చి యున్నారు. ఆతఁడు శత్రుస్థానమున నుండియు మనపక్షముననే పని చేయుచుండును ఆతనిమాటలు విశ్వసింపఁదగినవే కాని సందేహింపఁదగినవి కావు." అని విన్నవించెను.

అది విని చంద్రగుప్తుఁడు వసంతుఁడా! ఆతనికి నందసన్ముఖమునకుఁ బోవుట కవకాశ మెట్లు కలిగినది?" అని ప్రశ్నించెను.

"అంభీరుఁ డాదరించుటచే నాతనిమిత్రుఁ డగునందునకుఁగూడ నాహరిదాసునియందు గౌరవభావము కలిగినది. ఆతని కాపట్టణముననను, దుర్గముననుగూడ. యథేచ్ఛముగ సంచరించుట కనుజ్ఞ యున్నది."

"ఆతనికి నీకును బరిచయ మెట్లుకలిగినది?"

"అకారణవత్సలుఁ డగునామహాత్ముఁడు నాకొకప్పుడు పరిచితుఁ డయ్యెను."

"మనకుఁగావలసినవిషయము తెలిసినది. ఇప్పుడు సైనికులందఱును గుంపులుగుంపులుగ నందందు నిశ్శబ్దముగ నుండవలయును. ఒక గుంపునుండి మఱియొకగుంపునకు వేగునడపుచారులు సంచరించుచుండవలయును. శత్రువులు వచ్చువార్త వారిమూలముననే సేనలకన్నిటికిఁ దెలియుచుండవలయును. సైనికు లందఱు నీవఱకున్న వస్తులను మార్చి,

ఆయుధహస్తులై జాగరూకులై యుండవలయును రాజులందఱును దమ యంగరక్షకసైన్యమును భద్రముగ నుంచుకొనవలయును. ఈగాఢాంధ కారసమయమున మనము నిద్రించుచుంటి మని శత్రువులుకొలఁది సేన లతోఁ బడఁబోవుదురు. ఆసమయమున నందఱము నేకముఖముగఁజేరి వారిని ముట్టడింతుమేని యతిసులభముగ జయింపవచ్చును.” అని చంద్ర గుప్తుఁ డాజ్ఞాపించెను. పైనిజెప్పిన ప్రకార మందఱును దమతమ కార్య ములలో నప్రమత్తులయి యుండిరి

రాత్రి రెండుజాములయినది. కాలము కొందఱతో నెగిరిపోవు చుండును. కొందఱతోఁ బరువెత్తుచుండును. కొందఱతోఁ నతివేగముగ నడచుచుండును. కొందఱతో నెమ్మదిగఁ బయనము సేయుచుండును. కొందఱతో మాటలాడుచుండును కొందఱతోఁ గఠినముగ నిలువఁబడి యుండును. కొందఱ కగపడక యే యుండును. మన సైనికుల కందఱ కారాత్రి వేకువజాము త్వరగా వచ్చుటలేదు. వారుచాల నలసి యుండిరి.

నిద్రాదేవత వారిని జోకొట్టుచున్నది. ఉయ్యాల లూఁపుచున్నది. ఒడలుమఱచునంతటి యుపచారములఁ జేయుచున్నది. కఠినములగువారి చేతులయందలి యాయుధములఁ గ్రిందఁ బడవేయుచున్నది. అనిర్వాచ్య మగు ప్రకృతిసుఖమును గూర్చుచున్నది. ఆకారణమున వారు వసుమతి యందలియాశను మఱచిపోయిరి. రత్నగిరిసింహాసనమును మఱచిరి. ప్రపంచమునందలి యన్ని విషయములను మఱచిరి. తుదకుఁ దమ్ముగూడ మఱచి హాయిగ నిదురించుచుండిరి. అంతట నిశ్శబ్దముగనుండెను.

---

## ఇరువదియొకటవ ప్రకరణము.



వసుమతీమధురభాషణములు వీనులఁ బ్రతిధ్వనించుచుండుటచే వసంతునకుమాత్రము నిద్రాదేవత జోలపాటలు వినఁబడుటలేదు. క్షణక్షణమునకు వసుమతీదివ్యసుందరవిగ్రహ మగపడి మాయమగుచుండుటచే మరలమరలఁజూడఁగోరుచున్న యాతనికన్నులు మూఁతవడుటలేదు. వసుమతీపాణిగ్రహణమహానందముం గూర్చు తనయదృష్టముం గూర్చి ధ్యానించుకొనుచుండుటచే నాతనికి మఱపు తోఁచుటలేదు. నందశిరశ్ఛేదనసమయమును నిరీక్షించుచున్న యాతఁడు ప్రతినిమిషమును, ప్రతిఘటికయు, లెక్కపెట్టుకొనుచుండెను. ఆతనికి నిమిష మొకయుగముగా నుండెను. ఆరీతిగా రెండుజాములు గడపెను.

ఆతనికడనున్న మహాయోధుఁడును జాగరూకుఁ డయ్యేయుండెను. అంగరక్షకసైన్యమును, వేగులవాండ్రునుదక్క, సేనలన్నియు నిద్రాదేవతయొడిలో హాయిగ మైమఱచియుండెను.

ఆసమయమునఁ బట్టణమునైపున దూరముగ నేదియో మర్మరధ్వని వినవచ్చుచుండెను. వసంతయోధు లిరువురుఁ జెవియొగ్గి వినుచుండిరి అది యేమో వారికి బోధపడలేదు. గాలిచేఁ గదలుచున్న చెట్లయాకులచప్పుడైనను గావచ్చును. వర్షప్రవాహముల చప్పుడైనను గావచ్చును. వారేదియును నిశ్చయించుకొనలేదు. ఆధ్వని క్రమక్రమముగా సమీపించుచున్నట్లు తోఁచెను. అది తేనెపెట్టెనుండి చెదరింపఁబడి గుంపుచెదరిపోవుచున్న తేనెటీఁగలరొదవలెనే యుండెను.

"ఆధ్వని యేమో వినుచున్నావా?" అని మెల్లఁగ మహాయోధుఁడు ప్రశ్నించెను.

„వినఁబడుచునేయున్నది. అది యేమో యూహించుటకు సాధ్యము కాకుండ నున్నది."

"జాగరూకులమై యుండవలయును. ఏమైనను భయములేదు"

ఒక్కింతసేపటిలో నాధ్వని యాఁగిపోయెను. వారింకను జెవి యొగ్గి యాలకించుచునే యుండిరి. యోధుఁడు "వసంతా! ఏమైన వినఁబడుచున్నదా?" అనియెను.

„ఆ. ఆధ్వని కాను. ఇప్పుడు మఱియొకమాదిరిగ నున్నది" అని వసంతుఁడు పురద్వారమునంకఁ జూపులు పరగించెను అటఁ గొందఱు వీరభటులు బారులుతీరియున్నట్లాతఁడు కనిపెట్టెను.

„అయ్యో! ఆధ్వనియొక్కయర్థము బోధపడినది. పురద్వారమున శత్రువులు ప్రవేశించినారు." అని యోధునితో మెల్లగ ననియెను.

"కుమారా! నీకన్నులయందు సూక్ష్మదృష్టి యున్నది. నీవీనులకు దూరశ్రవణశక్తి యున్నది. నీహృదయమున ధైర్యలక్ష్మి నృత్యము సేయుచున్నది. వారెందఱున్నారో చూచి వచ్చెదవా?"

అట్లే యని వసంతుఁడు వింట నమ్ములు సంధించుకొని యా యంధకారమున భూమిపైఁ బ్రాఁకుచు మునుముందుకుఁ బోయెను. ఆభటులు పురద్వారముదాఁటి చాలదూరము బారులుగట్టి వచ్చుచుండిరి. వారిని లెక్కింప ననువుపడలేదు. కాని, లెక్కలేకుండ నున్నారని గ్రహించెను ఇఁకఁ గొంచెమరిగి చూచుసరికి వసంతునకు మూఁడునాలుగుగజముల దూరములో నిరువురుయోధు లగపడిరి. వారాతనిఁ జూచియుండలేదు. వసంతుఁడు చాలఁ జురుకైనవాఁడు. తత్క్షణమె వింట నమ్ములు సంధించి చప్పుడుగాకుండ ముందున్నయోధుని గుఱిచూచి కొట్టెను. ఆ వ్రేటుతో నాతఁడు క్రిందఁబడిపోయెను. అంతలో నచ్చటివీరులు కలవరపడి కొన్నియలుగుల ఱివ్వుఱివ్వున విసరిరి. వసంతుఁ డాయెదుట లేఁడు.. ప్రక్కకుఁబోయి నేలనుండియే గబగబ ప్రాఁకిపోయి శత్రువృత్తాంత

మును, యోధునకుఁ దెలియఁజేసెను. యోధుఁ డుప్పొంగి "వత్సా! నీవతిసూక్ష్మముగఁ గార్యమును జక్కఁబెట్టికొని వచ్చితివి. నాకు మహా సంతోషముగ నున్నది. అని హెచ్చరించెను."

వెంటనే మహాయోధుఁడు శాత్రవాగమమునుగూర్చి సేనల కన్నిటికిని బ్రచురము చేయించెను. సైనికులందఱును లేచి సంసిద్ధులై రాజాజ్ఞననుసరించి నిశ్శబ్దముగ నుండిరి. చంద్రగుప్తుఁడు తోడిరాజలోకముతో, వినోదమందిరము నొద్దఁ గాచికొని యుండెను. ఆవంకనే మహాయోధుఁడును వసంతుఁడును వారిసేనతో నిలిచియుండిరి. మహాయోధుఁడు తనసైనికులను వినోదమందిరపార్శ్వమునఁ జంద్రగుప్తరక్షకభటులతోఁ జేర్చియుంచెను. కోటలో నున్న సైనికులలోఁ గొందఱు చాణక్యుఁడును, మాళవరాజును, నిలిచియున్న చావడివైపునకు వచ్చి పాటలీపుత్రసేనలోఁ గలిసియుండిరి. ఈయేర్పాటు లన్నియును, కిక్కురుమనకుండఁగనే జరిగిపోయినవి. ఇంకను శత్రుసైనికులు వీరిపైఁ బడలేదు. దీనికిఁ గారణము చదువరులకుఁ దెలిసియేయున్నది. మార్గదర్శి యగుశత్రుయోధునొకని వసంతుఁడు తనవాఁడియలుగునకుఁ దొలికబళము చేసినసంగతి నిప్పుడే చదివియున్నారు. మరల వారిలో వేఱొకదండనాయకుని మార్గదర్శిగా నియమించుకొనుటకై యింత యాలస్యమైనది ఈలోపలనే చంద్రగుప్తునిసేన లన్నియును సంసిద్ధముగుట కవకాశముకలిగినది వసంతుఁడు వారిని మొట్టమొదట చూడకయే యుండినచో నీసరికే సేనలోనిద్రించుచున్న వీరభటులలోఁ జాలమంది మఱి మేల్కనలేకయే పోయియుందురు.

శత్రుసైనికులు నిశ్శబ్దముగ బయలుదేఱిరి. శరవేగమున నందఱు నొకనిమిషములో, చావడికిని, వినోదమందిరమునకును, నడుమనున్న బయలఁ బ్రవేశించిరి. ఆబయ లించుమించుగా నూఱుగజముల వెడల్పుండెను. చంద్రగుప్తసైనికులు నిద్రించుచుండి రని వారు తలంచి

యుండిరి. వారందఱును జంద్రగుప్తసైనికులవలెనే యుండిరి. కాని, చీకటిలో వారిదుస్తు లెవ్వరికిని దెలియలేదు. చంద్రగుప్తుఁడు తనసేన దుస్తులు మార్పించుట వారికిఁ దెలియలేదు.

అప్పుడే మూఁడుజాములైనది దూరమునఁ బట్టణములోఁ గొట్టఁబడినఘంటాధ్వని నెవ్వరును వినలేదు. నందునిసైనికు లొక్కసారిగ సీవలావలనున్న శత్రుసేనలపై శరవర్షమును గురియించిరి. తోడనే యిరువంకలనుండియు బాణానల ముద్రేకించి నందసైనికుల దహించుచుండెను. ఆవంకనుండి వసంతుఁడును, మహాయోధుఁడును, శిలకోటరాజపుత్త్రిలును, శత్రుసేనలలోఁ జొరఁబడి నిశితకరవాలముల వీరభటులఁ దుండెతుండెములుగ జెగనఱకుచుండిరి. ఈవంకనుండి చాణక్యప్రేరణమున మాళవకాంభోజరాజులు వీరవిహారము సేయుచుండిరి. ఆయంధకారమున నొకరికొకరగపడుటలేదు. నందసైనికులును సామాన్యులు గారు. చండప్రచండు లనుయోధపుంగవులు తమసేనలతో ముందునకుఁజొరఁబడి చంద్రగుప్తునిరక్షకసైన్యమును జెల్లాచెదరు చేయుచుండిరి. వారిరువురిని వరుసగాఁ బుష్కరాక్షుండును,జంద్రగుప్తుండును, దాఁకి తమవాఁడికోలలచే నొప్పించుచుండిరి. ఆచీఁకటిలో హస్తలాఘవమేగాని లక్ష్యము నిలుచుట లేదు. కన్నులు మూసికొనిపోరాడుచున్నట్లుండెను. ఇరువాగులను మహాకోలాహలధ్వనులు బయలుదేఱెను. ఒకరికొకరు తెలిసిపోవక పోరాడుచుండిరి.

ఆసమయమునఁజాణక్యునియానతిచేశత్రుసమీపమునున్న చావడి తగులఁబెట్టఁబడియెను. గుప్పుగుప్పునఁ బొగలును మంటలును బయలుదేఱెను. వెదుళ్లు పెళపెళ ప్రేలుచుండెను. తుట్టలు తుట్టలుగ మిణుగురు లెగిరి యొకయింటిపైనుండి మఱియొకయింటిపైఁ బడుచుండెను. ఆపేటలోనిప్రజ లదివఱకే తమతమగృహంబులను విడిచి పాఱిపోయి యుండిరి. ఒక్కొక్కయిల్లు నఖండముగ మండిపోవుచుండెను. ఆయఖండ

జ్వాలలవలన విశేషమగు వెలుతురు కలిగెను. ఆవెలుతురువలన నంద సైనికులు తాము రెండుపెద్దసేనలనడుమఁజిక్కికొని యుంటిమని తెలిసి కొనిరి. చంద్రగుప్తునిసేనలు శత్రుసేనావిన్యాసమును బాగుగ గుర్తించెను. ఇరువంకలవారును బైఁబడిరి. నందయోధులును వెనుదీయక తల పడి శత్రుసేనల కాశ్చర్యమును, భయమును, గలుగునట్లు పోరాడు చుండిరి. ఆయగ్నికీలలు క్రమక్రమముగా హెచ్చి పేటయంతయును చుట్టుముట్టుటచే వారి కప్పుడు పట్టపగలుగ నుండెను. వెనుకఁ జంద్రగుప్తుని ప్రక్కనున్నవీరులపై వెలుగానుటలేదు. నడుమనున్న నంద భటులు వెలుతురులోనుండిరి. వారిపై లక్ష్యముసేయుట సులువుగా నుండెను. వారును వీరావేశమున సాహసించి పోరుచుండిరి. ఆమహా నలకీలలను మించి బాణానలము సేనాకాననమును దహించుచుండెను. ఇరువాగులందును భటులు గూలుచుండిరి. పరస్పరసంఘట్టనలచే యోధు లొక్కసారిగ వీరమరణము నొందుచుండిరి.

పుష్కరాక్షునిదాడికి నిలువలేక చాముఁడు సేనలతో వెనుదిరిగెను. గాంధారపతి వాని నడ్డగించి రణముచేయుచుండెను. చంద్రగుప్తుఁడు ప్రచండునితోఁ బ్రచండయుద్ధము సేయుచుండఁగా వసంతుఁడు రాజుముందునకు వచ్చి ప్రచండునితల తనకరవాలమున కెరఁజేసెను. ఆతనిసేనలు చెల్లాచెదరై పోయినవి. ఆవంక కుండలదండధారులను మాళవకాంభోజులు తాఁకి శత్రులను నల్లకల్లోలములో ముంచుచుండిరి. నందసైనికులను లోనికి రానీయకుండ మహాయోధగాంధారపతులు సేనాపార్శ్వమున నిలిచి పరాక్రమించుచుండిరి.

నందసైన్యము బలహీన మయ్యెను. వారి హృదయములయం దధైర్యము జనించెను. సేనలుక్రమముగా నిలుచుట లేదు. దండనాథుల యుత్సాహవాక్యములు పనిచేయుట లేదు. వీరభటులు చెదరిపోవు చుండిరి. వారికి జయముకలుగుననునాశ వోయినది. ప్రచండునిమరణము

వారికి భయమును గలిగించెను. అవకాశము చిక్కినంతవఱకు పాఱి పోవుచుండిరి. అంతమంది యోధులతో జాముసేపు నిలిచి పోరాడిన వారిపరాక్రమమును శ్లాఘింపవలసినదే కాని, పాపము! వారిపలాయన సమయమునకే తెల్లవాఱుట కెంతయు నవమానకరంబుగను, జింతా కరంబుగ, నుండెను.

పేటనుముట్టికొన్న దారుణాగ్నిజ్వాలలు చల్లారెను. కాని, యరుణ కిరణజ్వాలలతోఁ జంద్రగుప్తయోధులశరానలకీలలు శత్రువులముట్టి కొనుచునే యుండెను. శత్రువులవెన్నాడి తఱుముచునేయుండెను.

చాణక్యచంద్రగుప్తులయానతిచే సేనలన్నియును బట్టణప్రాకార మును, ముట్టడించినవి. ఆప్రాకారములు చుట్టును నక్కడక్కడ నివఱకే పడఁగొట్టఁబడి యున్నవి. లోపల నందసైనికు లర్ధచంద్రాకృతిగ నిలువఁ బడి యుండిరి. చాణక్యుఁడు మగధమాళవకాంభోజసేనానాయకులతోఁ బేట తిరిగి పోయి పట్టణమున కవ్వలిభాగమున నిలిచి యుండెను. పుర ప్రాకారమునకుఁ దూర్పుదిక్కున కాశ్మీరగాంధారపతులు తమసేన లతోఁ గాచియుండిరి. చంద్రగుప్తుఁ డితరదండనాయకులతోడను, సామంతులతోడను, బశ్చిమద్వారమున నుగ్రాకారుఁడయి నిలువఁబడి యుండెను. నందుఁడు రాక్షసునితో దక్షిణద్వారమున కెదురుగఁ బట్ట ణములోపల నర్ధచంద్రాకృతిగ నున్నసేనాగర్భమున నశ్వారూఢుఁడయి యుండెను. అట్టియాకారముతోడనే యింకనైదాఱుగురు యోధులందందు రక్షకసైన్యముతోఁ దిరుగుచుండిరి. వారందఱును క్రొత్తవారికి నందుల వలెనే కానవచ్చుచుండిరి. ఈకారణముచే శత్రు లెక్కడ నడ్డిన నక్క డనే నందుఁడు ప్రత్యక్షమగుచున్నట్లుండెను. పాంచాలదేశయోధ పుంగవులకు సత్యమును గ్రహించుట కవకాశము లేకుండఁ బోవు చుండెను. అందఱుయోధులును నెవరిమట్టునకు వారే నందునితోఁ బోరాడవలయు నని సన్నాహము చేసికొనుచుండిరి. చంద్రగుప్తప్రతి

జ్ఞావాక్యముల వినిన నందుఁ డీతంత్రమును బన్ని యుండును. లేక బుద్ధిమంతుఁ డగునాతని మంత్రిరాక్షసుఁ డీయేర్పాటులను జేసి యుండును.

వసంతమహాయోధులు వేగవంతము లగుగుఱ్ఱముల నధిష్ఠించి సేనలతో దక్షిణద్వారమున నిరీక్షించుచుండిరి. వారికిని వారిగుఱ్ఱములకును నభేద్యము లగుకవచము లుండెను. వైరోచనుఁడు తనయోధుల ఫౌజులతో నాద్వారమునకు రక్షకుఁడయి యుండెను. అప్పుడు శీలకోట రాజకుమారు లాతనిం జూచి మహాయోధునితో "అయ్యా! ఆతఁడు మాదుస్తులనుబోలిన వానిని ధరియించి యున్నాఁడు. చూచితిరా?" అని విన్నవించిరి.

మహాయోధుఁ డాతని క్రోధవేగముతోఁ జూచి "ఈకపట శీలుఁడు తనకుఁ దగినప్రతీకారమును బడయఁగలఁడు. ఒకనిమిష మోపిక పట్టి చూచు చుండుఁడు" అని హెచ్చరించెను.

"అయ్యా! ఈదుశ్శీలుని దండించుపని నాపైఁ బెట్టుఁడు." అని వసంతుఁడు కోరుకొనియెను.

"వలదు. వలదు. నేనే యాతనికిఁ దగినశాస్త్రి చేయువలయును." అని మహాయోధుఁడు తనగుఱ్ఱమును ముందున కుఁడాయించెను.

దుర్గద్వారమున భటులందఱును బల్లెముల బారుచేసి యుండిరి. ముందున్నభటులు బల్లెములఁ దొడల నానుకొని మోకరించి యుండిరి. వెనుకవారు కచ్చడముల నానించుకొని వంగి యుండిరి. ఇంకను వెనుక నున్నవారు బల్లెముల బుజముల నానుకొని వెన్నులు వంచి నిలువఁ బడి యుండిరి. ఆబల్లెము లన్నియు విప్పఁబడినయేదుబందిముండ్లవలె బారుచేయఁబడి యుండెను. ఆసేన యాద్వారమున కినుపగోడవలె నున్నది.

మహాయోధుఁడు వారిని లక్ష్యముసేయ లేదు. కత్తి త్రిప్పు కొనుచు గుఱ్ఱమును వెనుకకు నెట్టికొనిపోయి వేగముగ ముందున కా సేనామధ్యమున కొక్క దాఁటు దాఁటెను. వారందఱును భటులు. వారికిఁ గవచములు లేవు. వారిబల్లెములు యోధునికవచముపైఁ బనిచేయుట లేదు. ఆతనికత్తికి రెంపువైపులను వాఁడియున్నది. ఆతఁ డొక్కచో నిలుచుట లేదు. ఈవిహారములో వైరోచనునిమస్తకము బంతివలెఁ బైకెగిరిపోయి నది మొండెము క్రిందఁ బడిపోయెను. మహాయోధుఁడు మహాసముద్రమున విహరించు తిమింగిలమువలె నల్లాడుచుండెను. ఆతనికరవాలాఘాతముచే శత్రుభటులశిరంబులు తాళఫలంబులవలె నేలపైఁ బడిపోవుచుండెను. ఆసేనయంతయును చెల్లాచెదరైనది. వెనుకఁ దిరిగి చూచునప్పటి కశ్వారూఢుఁడయి పరాక్రమించుచున్న వసంతుఁడు తనప్రక్కనేయుండెను. అత్యాశ్చర్యము కలిగెను. వసంతునిచంద్ర హాసమునుండి రక్తము స్రవించుచుండెను.

మహాయోధుఁ డెన్నఁడునుదనంతటియోధుని జూచియుండలేదు. వసంతునిలాఘవమునకు సంతసించెను. "కుమారా! నీవిక్రమము లోకాతీతమైనది. దైవానుగ్రహమున నీకే విజయము లభింపఁగలదు." అని హెచ్చరించెను. సేనలు మరలఁ గూడికొని వారిపైఁ బడుచుండెను. భీమపార్థులవలె వారిరువురును విజృంభించుచుండిరి. వారికొత్తల నిలువ లేక సేనలు చెదరిపోవుచుండెను వారింకను ముందునకుఁ ద్రోసికొని పోవుచుండిరి. ఇంతలో శీలకోటరాజకుమారులును, మఱికొందఱు దండనాయకులును, యోధసైన్యముతో వచ్చి వారిని గలిసికొనిరి. వారి కెదురుగనే నందునిమొనయున్నది. ఒకవంకఁ జంద్రగుప్తుఁడును, నొకవంక కాశ్మీరగాంధారరాజులును, జేరి కలంచుచుండుటచే శత్రుసేనావ్యూహము, కల్లోలమునఁ బడిపోయెను.

నందుఁడు మూర్తీభవించిన క్రోధమువలె భయంకరాకారుఁడయి యెక్కడఁజూచినఁ దానేయగపడుచుఁ బ్రతాపముఁ జూపుచుండెను. శత్రురాజలోక మంతయు నందునితోడనే పోరాడుచుండెను. నందుఁ డందఱ కన్నిరూపములుగ యుద్ధము చేయుటఁజూచి పాంచాలదేశ సేన చాల నాశ్చర్యపడిపోవుచుండెను. పాపము! నందునిమాయ నా రెఱుఁగరు.

గూఢవను లగుయోధవీరులును, దండనాయకులును, సామంత రాజకుమారులును, నిరంతర వసుమతీమనోహరాకారసందర్శన భాగ్యముం గోరి యిప్పుడు నందునితోఁ బోరఁదలంచుచుండిరి. పోరుచుండిరి. ఆతని ముందున్న మహావీరులప్రతాపశిఖల సహింప నోపక చంద్రగుప్తుని మఱుఁగునకుఁ దొలఁగిపోవుచుండిరి. కాని యాతఁడే పద్మనందుఁడని నిశ్చ యింప నేరకుండిరి. తనతోఁ బోరుచున్న వాఁడు నాతఁడే. దూరమున నింకొకరితో యుద్ధము సేయుచున్న వాఁడు నాతఁడే. చంద్రగుప్తుఁడు దూరమునందున్న మలయకేతువుతో యుద్ధ మొనర్చుచుండెను. ఆకా రణమున నాతఁ డానందుని దాఁకఁ బోలేదు. ఇతరు లెవ్వరు నిజమైన నందుని దెలిసికొనలేకుండిరి.

వసంతుఁ డాతని బాగుగ నెఱుంగును. మహాయోధుఁడుకూడ బాగుగ నెఱింగినవానివలెనే యాతని వెంబడించుచుండెను. కాని, యాతనిమాత్రము తాఁకుటలేదు. వసంతుఁ డాతని నెదిరించి తాఁకుటకు సంసిద్ధుఁడయి యుండెను. ఆతనికి సహాయముగ మహాయోధుఁడును, శిలకోటరాజపుత్త్రిలగువిక్రమసుందరసేనులును, వచ్చుచుండిరి. నందుఁ డును, మంత్రిరాక్షసుఁడును, మఱికొందఱుయోధులు, నొకగుంపుగాఁ జేరి దారుణముగఁ బోరుచుండిరి. వారివెనుకనే వసంతుఁడును దక్కిన వారును బోవుచుండిరి. వారు నిలిచినచో వీరును నిలుచుచుండిరి.

ఆసమయమున వసంతుఁడు తనగుఱ్ఱమును ముందునకు దాఁటించి నందునిం దాఁకెను. నందుఁడు తనచేతిలో నొకబలమైన గదను ధరించి యుండెను. తనపుత్త్రిల నాశనమునకుఁ గారకుఁడగుచువసంతుని జూచిన తోడనే యాతనికిఁ బట్టరానికోపము వచ్చెను. గదయెత్తి వసంతునిపై నొక్కవిసరువిసరెను. ఆదెబ్బ తగిలినచో వసంతునిదేహ మింతింతతుని యలుఁ గావలసినదే. కాని, వసంతుఁ డతిలాఘవమునఁ దప్పించుకొని యాతనిభుజముపైఁ దనచంద్రహాసముతో నొక్కనఱకు నఱకెను. ఆదెబ్బవలనఁ గవచముకూడఁ దెగి గాయమయ్యెను. దానిపైఁదోఁక త్రొక్కినభుజంగమువలె మండిపడుచు మరల గదయెత్తి విసరెను. వసంతుఁడు తప్పించుకొని మరలఁ గత్తితో నఱకెను. వసంతునియొక్కొక్కవ్రేటునకును నందున కొక్కొక్కగాయ మగుచుండెను. నందుని గదాఘాతములకు వసంతుఁడు దొరకుటలేదు. మంత్రిరాక్షసునితో మహాయోధుఁడు పోరాడుచుండెను. తక్కినయోధులతో విక్రమసుందరసేనలు పోరాడుచుండిరి

నందుఁడును మంత్రిరాక్షసుఁడును తమగుంపులోఁ దప్పించుకొని పోవలయునని చూచుచుండిరి. పుత్త్రఘాతకుఁ డగుచాణక్యు నెట్లయినఁ బరిమార్పవలయు నని నందుఁడు కోపవేగమున ఘూర్ణిల్లుచుండెను. రాక్షసుఁడు తంత్రమాలోచించుచుండెను. వసంతుఁడును, మహాయోధుఁడును, వారిని విడిచిపెట్టుట యెట్లు? వారు పోవుచోటికెల్లఁ బోయి వసంతుఁడు నందుని తాఁకుచుండెను. నలుదెసలనుండియును జంద్రగుప్తుని సైనికులుచుట్టు ముట్టియుండిరి. వారు నాశనముచేసిన శత్రుభటుల పీనుఁగులను ద్రొక్కుకొనుచు ముందునకు వచ్చుచుండిరి.

నందునకు నిరాశ కలిగెను. పాఱిపోవలయునని తలంచెను. కాని, యంతటను శత్రుసేనాసముద్రమే ఘోషించుచుండెను. ఆతని కేమియును దోఁచలేదు. ఎదుట వసంతుఁడు మృత్యుదేవతవలె నగపడుచుండెను.

చావునకుఁ దెగించి పోరాడఁ దలంచెను. మంత్రి రాక్షసునిం జూచి "అమాత్యా! నాకిఁక జీవితాశ లేదు తప్పించుకొని పోవుట కవకాశము లేదు. నేనీవసంతునితోఁ బోరాడెదను చంపుటయో, చచ్చుటయో, తుద కేమగునో తెలియదు. అవకాశమున్న నివెటకేని పోయి శత్రు సంహారమును గావించుటకుఁ గాలోచింపుము" అనియెను.

రాక్షసుఁడు "మహారాజా! మిమ్ము విడిచి నేనెందుఁ బోఁగలను?" అనియెను.

"పోవలయును. కాలము తప్పినది పోవలయును. శత్రుసంహారము కావలయును." అని పద్మనందుఁడేమో స్మృతికిఁ దెచ్చుకొనువాని వలె మహాయోధునివంకఁ జూచుచుండెను.

రాక్షసుఁ డేమియును మాటాడలేదు. ఆతని ముఖకాంతి యెడలినది.

అప్పుడు వసంతుఁడు "ఓనందుఁడా! నిన్ను రక్షించువారెవ్వరైన నున్నచోఁ బిలిచికొనుము. నీపై నిరపరాధులశిక్షించుట యనాథయువతుల నవమానించుట, యనునేరముల మోపి నిన్ను శిక్షించుచున్నాఁడను. నీకు మరణదండనము విధింపఁబడినది. కాని, నీవలె బలవంతముగ నరికట్టి రహస్యముగఁ జంపఁ దలంపు లేదు. స్వేచ్ఛగా రణరంగమున నిందఱయెదుట నీతోఁ బోరాడి పగ తీర్చుకొనియెదను. నిన్ను శిక్షించెదను. పిలువుము. నీదిక్కుగలవారిని బిలిచికొనుము" అనిధిక్కరించెను.

గాయములు పడియున్న నందునిహృదయమున కోపలుకులు హాలాహలసదృశములయి యుండెను. కోపోద్రేకమున నొడలెఱుంగక వసంతునిపై గదనెత్తి బలవంతముగ విసరెను. ఆదెబ్బ తప్పించుకొనఁ జూచుచున్న వసంతునివెన్నునఁ దగిలెను. అది జారిపోయెను. అయినను, గవచము పగిలిపోయెను. వసంతుఁ డిదివఱకు దెబ్బతినలేదు. ఆతని

కన్నుల నిప్పులు గురియుచుండెను. అతివేగమున గుఱ్ఱమును దాటించుచుఁ దననిశితఖడ్గముతో నందునిశరీరమున గాయములపై గాయములు సేయుచుండెను. అతనియొడలినిండ రక్తము ప్రవహించుచుండెను. వసంతునిలాఘవమువలన నందునికరమునందున్నగద కేవల మలంకారమాత్రముగ నుండెను. అతని కాయాస మధిక మయ్యెను. వసంతుని ఖడ్గప్రహారణములచే నందునికవచము తుత్తునియ లగుచుండెను. బలమైనకోపము తెచ్చుకొని వసంతునిపై గదతో విసరెను. ఆదెబ్బవసంతుని గుఱ్ఱముతలపైఁ దగిలెను. దానితో గుఱ్ఱము పడిపోలేదు. నందునిపై కొక్కదాఁటు దాఁటెను. వసంతుఁడు కత్తినెత్తి నందునితల నెగురవేయుటకు సిద్ధముగ నుండెను.

ఆసమయమున "రహస్యభేది యగునాకపటశీలుని చంపుఁడు. పొడుపుఁడు" అనునొకధ్వని వినఁబడెను. ఆకంఠధ్వని మంత్రిరాక్షసునిదని వసంతుఁడు తెలిసికొనియెను.

తోడనే "హా! వసంతా! రక్షింపుము! రక్షింపుము!" అనునొక యార్తనాదము వినఁబడియెను. వసంతుఁడు వెనుదిరిగి చూచునప్పటికి హరిదాసుని నొకయోధుఁడు పట్టుకొని నఱకఁబోవుచుండెను.

వసంతుఁడు "రాజా! కొంచెముసేపు తాళుము. ఆదీనుని రక్షించి మరల వచ్చెదను." అనియెను.

నందుఁడు "నే నీకోస మాఁగియుండువాఁడను గాను. రమ్ము. రమ్ము" అని నందుఁడు పిలిచెను.

"నీవాఁగనక్కఱలేదు. నాకత్తి నియనుజ్ఞఁ గోరుచున్నది" అని మహాయోధుఁడనెను.

వసంతుఁడీమాటలువినిపించుకొనకయే యార్తనాదము దిక్కుగా గుఱ్ఱము నుఁడాయించెను. దయాళుఁడగునాతని కాయార్తనాదమాకర్షణమంత్ర మయ్యెను. ఒక్కనిమిషములో నందుఁడు తన

చేతిలోఁ బడిపోవును. ఆకారణమునఁ దనజీవితేశ్వరి తనకు లభింపఁ గలదు. స్వార్థము నప్పు డాతఁడు తలచుకొనలేదు. శరవేగముననగమ్య స్థానము చేరెను

అట సిద్ధార్థుఁడుకత్తినెత్తి హరిదాసుని జంపుటకు సిద్ధముగ నుండెను. ఆయెత్తినకత్తితో నట్లె యాతనిచేయి క్రిందఁ బడఁగొట్టెను. అదిక్రిందఁబడుసరికి దానిపై నాతనిశిరస్సును బడిపోయెను. మరల వెనుకకుఁ జూచెను ఇప్పుడు నందునియెదుట మహాయోధుఁడు నిలిచి యుండెను.

"అయ్యా! నీకిఁక భయము లేదు. నాకు రణమునకు సెలవొసంగెదవా?" అని వసంతుఁడు హరిదాసునితోఁ బల్కెను.

"ఇది శత్రుసేనామధ్యము. శత్రువులు నేనొంటరిగఁ బోయినచో నీఁక నాప్రాణములునిలువనిచ్చెదరా? నన్ను సురక్షితమగు తావునకుఁ గొనిపోయి మఱివిడిచిరమ్ము. ఈమాత్రముపుణ్యముగట్టికొనుము" అని హరిదాసుఁడు ప్రార్థించెను.

వసంతుఁ డట్లే యాతని వెంటఁబెట్టుకొని పోయెను.

కొలఁదిసేపటిలో మహారణము చల్లారినది. రాక్షసాదివీరులు కొందఱు పాఱిపోయిరి. హతశేషు లగువీరులు కొందఱు చంద్రగుప్తునకు లోఁబడి పోయిరి. చంద్రగుప్తసార్వభౌమునివిజయధ్వజము కోట బురుజుపై నెత్తఁబడియుండెను. చంద్రగుప్తుఁడు సపరివారముగ నిరాఘాటముగఁ గోటలోఁ బ్రవేశించెను.



# ఇరువదిరెండవప్రకరణము.



చంద్రగుప్తుఁడును, వసంతుఁడును, సహాధ్యాయులు. సమవయస్కులు. బలపరాక్రమములయందు సమానులు. జ్ఞాతులు. అయినను వీరియదృష్టమునకును, మనోదార్ఢ్యమునకును, భేద మున్నది. చంద్రగుప్తునియదృష్టము నిరాఘాటమైనది. ఆతనిమనస్సు నిశ్చలమైనది. వసంతునియదృష్టమునకు విఘాతము లున్నవి. ఆతనిగ్రహములు చాల వక్రభావమును వహించినవి. ఆతనిహృదయము సుకుమార మైనది. ఆతఁడు ఋజువర్తనుఁడే కాని, దయాళుఁ డగుటచే స్వార్థత్యాగియై దురదృష్టము నాశ్రయించుచుండును. ఆతని కొకగడియలో వసుమతీసందర్శనమహానందము నిరర్థక మైపోయినది. ఒక్కక్షణములో నిరంతర వసుమతీసంయోగసౌభాగ్యము వచ్చియున్నది. ఐహికజీవితము దుర్భరమై పోయినది. వసుమతీపాణిగ్రహణమహోత్సవము ననుభవించు నదృష్ట మాతని కిఁక నెక్కడిది? ప్రతికూలదైవ మాతనిహృదయమునకు దాక్షిణ్యభావ మనుదురదృష్టచ్ఛాయను గల్పించెను. దాక్షిణ్య ముత్తమోత్తమ మైనదే యైనను, నాతనికి వ్యతిరేకఫల మిచ్చుచున్నది. అయిన నేమి? జీవితసంశయమునం బడియున్న ప్రాణేశ్వరివృత్తాంతముం దెలిపి రక్షించినపుణ్యాత్ముఁడు, ప్రభువగుచంద్రగుప్తునివిజయముం గోరి శత్రురహస్యముల నెఱింగించినపరోపకారపరాయణుఁడు, నగుహరిదాసుని మృత్యుముఖమునుండి వెడలించుటకంటె నట్టిమహాపురుషునకుఁ గావలసిన దేమున్నది? అంతకంటె నుత్తమధర్మ మేమున్నది? ఆపురుషోత్తముని భూతదయాపరత్వమే యాతనిరక్షించుఁ గాక! కృతజ్ఞతాబుద్ధియే యాతనికి మేలు సేయుఁగాక! ఆతనిధర్మమే యాతనిఁ గాపాడుఁగాక!

పద్మనందునివధించిన మహావీరశిఖామణి యెవ్వరో తెలిసికొనుటకు నేఁడు సభగావింపఁబడినది. నందుని మేమువధించితి మని కొందఱు పాంచాల యోధులు లేచి మనవిచేసిరి. వీరందఱును గలిసి నందునిఁ జంపిరా? లేదు. వేఱువేఱుగనే సంహారించినట్లు వారొక్కొక్కరు చెప్పిరి. ఒక్కనందుని వీరెట్లుచంపిరి? దీనిపరమార్థము వేఱుగ నున్నది. వీరు పాంచాలు రగుటచే నందుని నెఱుఁగరు. నందభూమికం దాల్చి రణముచేయుచున్న యోధులను వీరు వధించిరి. ఎవరిమట్టునకు వారే నందుని చంపితిమని సంతసించుచున్నారు. వారు చూపిన యుత్తమాంగములలో నొక్కటియును నందశిరముగా నుండలేదు.

ఇఁక నందునిశిరఃకర్తనము చేసిన వారెవ్వరో తెలియ లేదు. ఆతఁడు పాఱిపోయియుండు నని యనుమానము కలిగెను ఈవిషయమును దెలిసికొనుటకు దివ్యజ్ఞానమహిముండగు రాజయోగానందస్వామి కూడ లేఁడు. నాఁడు తక్షశిలానగరమున విచారణము జరిగినది మొదలు నేఁటివఱ కామహామహుని దర్శనము లేదు. ఆలోచన చెప్పుటకట చాణక్యుఁడుకూడ లేఁడు. తనప్రతిజ్ఞ యేమికావలసి వచ్చునో యని చంద్రగుప్తుఁ డాలోచించుచుండెను.

ఇంతలో చాణక్యుఁడును మహాయోధుఁడును సభాస్థలంబునకు విచ్చేసిరి. ఒకబల్లెమునకు గ్రుచ్చఁబడినశిరస్సుఁ బట్టుకొని యొకభటుఁడు కూడ వారివెనుకనే వచ్చెను.

చంద్రగుప్తుఁడు చాణక్యునకు నమస్కరించి "మహాత్మా! అది యేమి?" అని ప్రశ్నించెను.

"అదియే పాపపుఁదలంపులకుఁ బుట్టినిల్లైనపద్మనందుని దుర్మేధానిధానము" అనిచాణక్యుఁడు బదులుచెప్పెను.

"ఇది యెట్లు వచ్చినది?"

"ఈమహాయోధుఁడు దీనిని గంగానదిలోఁ ద్రోయఁబోవు చుండఁగా వారించికొని తెచ్చితిని."

చంద్రగుప్తుడు మహాయోధునివంకఁజూచి "నందశిరఃఖండన మహాకార్యము మీవలననే దీరినదా?" అనియడిగెను.

"కేవలశిరఃఖండనమాత్రము"

"అది యేమి?"

"మహావీరశిఖామణి యగువసంతుని దారుణకరవాల మదివఱకే యాతనిప్రాణములఁ గన్నులలోనికిఁ దెచ్చినది. తరువాతపనిని ముగించుటకు నాచంద్రహాసము నిమిత్తమాత్ర మైనది."

"రాజకార్యము లన్నియు నెఱింగియున్న మీ రాతల నేలగంగ లోఁ ద్రోయఁ బూనితిరి?"

"అవసానసమయమునఁ బద్మనందుఁడు నన్నుఁ గోరుటచేత—"

"ఆతనియభీష్టముఁ దీర్చుటకు మీరంగీకరించితిరా?"

"అంగీకరించునంతవఱకవకాశ మెక్కడిది? ఆతఁడింకను మాటలాడుచుండఁగనే తల తెగనఱికితిని"

"ఆతఁ డక్లేలకోరెనో మీరు గ్రహించితిరా?"

"మీప్రతిజ్ఞాభంగమును, వసంతుని కాశాభంగమును, గావించుటకే కావచ్చును. నాకాతఁడు గర్భశత్రుఁడైనను నవసానసమయమునఁ గోరినకోరిక తీర్చుట ధర్మమని యోచించితిని"

"పాంచాలదేశవాసులగుమీ కాతఁడు గర్భశత్రుఁ డెట్లయ్యెను?"

"ఆగొడవ యంతయు చాలఁగనున్నది."

"అది యేమో చెప్పఁగూడదా?"

ఈసంతోషసమయమున విచారపూరిత మగు నావిచిత్రచరిత్ర మునుగూర్చి తడవవలదు" అనిమహాయోధుఁడు నిట్టూర్పు విడిచెను.

అప్పుడు చాణక్యుఁడు "అయ్యా! ప్రభాకరునిఁ బరివేష్టించి యున్న గ్రహంబులకుఁ బ్రకాశమువలెఁ జంద్రగుప్తు నాశ్రయించిన యోధులకుఁగూడనదృష్టము పట్టవలసినదే. ఈశుభసమయమున నెల్లవారి విచారములును దీరిపోవలసినదే" అనియెను.

"భాగ్గునకు నలుపువలె నాజీవితమునకు విచారము స్వభావమై పోయినది. అయిననేమి? నాకోరికలు తీరినవి. అంభీరపద్మనందులమారణ కర్మము నాకంఠమున జీవము లుండఁగా జరిగినది. అంతియేచాలును" అనిమహాయోధుఁడు బదులు చెప్పెను.

"పాంచాలురగు మీ కంభీరునివలన నపకారమైనఁ గావచ్చుం గాని మగధరాజగునందునిపై మీకంతదీర్ఘక్రోధమునకుఁ గారణమేమి?"

"నేను పాంచాలుఁడను గాను. మగధరాజునకు లోఁబడిన యొక రాజ్యమునకు సేనానాయకుఁడను. నందుఁడు మాళవమును జయించిన వెనుక మారాజ్యమును బలవంతముగ లోఁబఱచుకొనియెను"

"మీరు పాంచాలమున కెందులకుఁ బోతిరి?"

"నందునిచేనవమానింపఁబడిన నేను రహస్యముగమాళవరాజులోఁ గలసి మరల యుద్ధప్రయత్నములు చేయ మొదలుపెట్టితిని. సైన్యమును గూర్చికొన నారంభించితిని. ఆకార్యము లింకను ముగియకుండఁగనే మర్మజ్ఞుఁడగునందుఁడు నన్నీదేశమునుండి వెడలింప నిశ్చయించు కొనియెను."

"ఏమిచేసెను?"

"కపటహృదయుఁడగునందుఁడు నన్ను తక్షశిలానగరనాయకుని కడకు రాయబారిగఁ బంపవలయు నని మారాజున కుత్తరువు చేసెను."

"అయ్యా! నీవు రాధాకృష్ణవర్మవా? ఈపదియేండ్లలో నెంతగా మాఱిపోతివి!" అని చాణక్యుఁడు ప్రశ్నించెను.

మహాయోధుఁడు మాటాడలేదు. అప్పుడు చంద్రగుప్తుఁడు "గురువర్యా! రాధాకృష్ణవర్మ పేరు నాచిన్నతనమున వినియున్నాను. ఆతఁడొక మహాకవి. ఆతఁడు రచియించిన గ్రంథములును, కృతులును, జాలవఱకు నేను వినియున్నాను. ఆతఁడే యీతఁడా?" అనియెను.

"వత్సా! ఔను. ఈతఁడు సంగీతసాహిత్యములయం దఖండ ప్రజ్ఞావంతుఁడు. సింహవిక్రముఁ డగునీతఁడు రణరంగమున విజృంభించుచున్నప్పుడు భీమసేనుఁడు తలంపునకు వచ్చుచుండును. ఈవీరశిఖామణి లేకుండుటవలననే రత్నగిరిరాజ్యమున కీగతి పట్టినది. ఈతఁడు వసుమతి తండ్రి యగు మానపాలునకు సమీపబంధువు ఈతని వియోగమును సహింపకయే మానపాలుఁడు మరణించెను." అని చాణక్యుఁడు చెప్పెను.

చంద్రగుప్తుఁడు మహాయోధునిఁ గూర్చి "అయ్యా! తరువాత మీరు తక్షశిలకుఁ బోయి యేమి చేసితిరి!" అని యడిగెను.

"నిజముగా నందుఁడు నన్నచటికి రాయబారిగాఁ బంపలేదు. బలిపశువుగాఁ బంపెను."

" అదియేమి?"

"నావలన ముందుముందు తనరాజ్యమునకు భంగము గలుగఁ బోవుననుభయముచే రాయబారమనుమిష పెట్టి నన్నచటికి బంపుచు నంతకుముందే బలవంతముగ నన్ను వధింపు మని యంభీరునకు లేఖామూలముగఁ దెలియపఱచెను."

"అంభీరుఁ డట్టిదుష్కార్యమున కంగీకరించెనా?"

సమానులకుఁ గాక మైత్రి యెట్లు పొసంగును? పద్మనందుఁ డెంతపాపాత్ముఁడో యంభీరుఁ డంతిదుర్మార్గుఁడు. ఇరువురు నావిషయమున నొకరికొకరు తీసిపోరు.

"ఆయపాయమును మీరెట్లు తప్పించుకొంటిరి?"

"నేను మాటలాడుచున్నప్పుడే యాతనిదుశ్చేష్ట లన్నియును గనిపెట్టి తీవ్రక్రోధమున లేచి నిలువఁబడితిని. చుట్టును గొందఱుభటు లాయుధహస్తులయి నిలిచియుండి రాజాజ్ఞను వేచియుండిరి. నేను లేచిన తోడనే నన్నుఁ బట్టికొనుటకై వచ్చిరి. నేను మరణమునకుఁ దెగించి వారిపైఁ బడితిని. అప్పుడు నాచంద్రహాసమునకుఁ గొందఱుభటులు బలియైరి. అంభీకుఁ డంతఃపురమునకుఁ బాఱిపోయెను. అప్పటి నాతీక్ష్ణా కారమును జూచి యెవ్వరును నన్నడ్డుకొనువారు లేకపోయిరి. ఆసమయ మున నేనా యపాయమునుండి తప్పించుకొని తపోవనమునకుఁ బోయి యందుండి యంభీకుని జంపువఱకుఁ బాంచాలము విడువననియును, పాద్దనందునిమరణానంతరమునఁగాని నఖలోమచ్ఛేదముఁ గావించుకొన ననియును, నాలో నేనే ప్రతిన చేసి కొంటిని. అప్పటిగ్రీకుకలహముల వలనఁ గొందఱు యోధులు నాతో వచ్చి కలిసికొనిరి."

"ఇంతమంది యోధులు మీతోఁ గలియుటకు రాజయోగానంద స్వామి మీకుఁ జాలవఱకు సాయపడి యుండును. ప్రాపంచకవిషయ ముల నుజ్జగించినపరమహంస యగునామహాత్ముని కీగొడవ లన్నియు నెందులకో? నాకు వింతగానున్నది ఉపాధ్యాయచాణక్యుని వాత్సల్య మునకుఁ దోడాదయామయునిసాహాయ్యముకూడ నలవడుటచేతనే మా కిట్టిభాగ్యము లభించినది."

"అట్లు కాదు. నీయదృష్టమున కాతఁడు నిమిత్తమాత్రుఁడు. అంతేకాని యాతఁడు చేసిన దేమున్నది? నీయదృష్టమే నిన్నింతటివానిగఁ జేసినది"

"అట్లనరాదు. ఇదంతయు నాపుణ్యపురుషుని యాశీర్వచన ప్రభావమే. ఆమహనీయుఁ డెల్లప్పుడును దర్శన మిచ్చుచు నీవిజయో త్సాహమున నేల సాహాత్కరింపకుండెనో తెలియరాకున్నది"

"ఇఁక నికాతనిదర్శనము కాదు. ప్రత్యక్షముగ నాతని నీవు చూడఁజాలవు"

"ఏమి?"

"ఆపరమహంస నాతో నైక్యమై పోయెను"

సభ్యు లెల్లరును మహాశ్చర్యమున మునిఁగిపోయిరి. చంద్రగుప్తుఁడు దిగ్గున లేచి మహాయోధుని కౌఁగిలించుకొని "మహాత్మా! నా యనుమానము స్థిరపడినది. రాజయోగానందస్వామికిని మీకును తావళములు, దండము, కావిచేలములు, కమండలువు, వీనివలననే భేద మగపడుచుండెడిది గాని యాకారమున నేకీభావమే పొడకట్టుచుండెడిది. తేజోమూర్తియగురాజయోగానందస్వామి యందలి భయభక్తులచే నా సంశయమునుగూర్చి యడుగ లేకపోవుచుండెడివాఁడను. అయ్యా! ఆ మహాత్ముఁడు మీయపరాకృతియే గాదా?" అని ప్రశ్నించెను.

మహాయోధుఁ డేమియును బదులుచెప్పక యూరకుండెను. సభాస్తారు లగుయోధులును, చాణక్యుఁడును, మహానందమున నా మహాయోధుని వేవిధముల సన్నుతించిరి. రాజయోగానందస్వామియే మహాయోధుఁ డనియు, మహాయోధుఁడే రాధాకృష్ణవర్మ యనియు నందఱకును దెలిసిపోయినది.

"అయ్యా! యోగమహిమయు, దివ్యదృష్టియు మీకెట్లు లభించినవి" అని మహాయోధునిగూర్చి చంద్రగుప్తుఁడు మరలఁ బ్రశ్నించెను

"గ్రీకులకల్లోలమునం బడినప్రజ లనేకులు నన్నాశ్రయించిరి. నేను యోధుఁడ నైనప్పుడు వారు భటులై గ్రీకుకోశములఁ గొల్లగొట్టుటయందును, గ్రీకుపక్షసైనికుల రహస్యముగ వధించుటయందును, వారు తోడుపడుచుండిరి. ఆద్రవ్యముతో మే మొకశైలదుర్గమును నిర్మించుకొని యందుండిటిమి. నేను యోగినైనప్పుడాభటులే శిష్యు లగు

చుండిరి. వారిమూలముననే నాకెల్లవృత్తాంతములును దెలియవచ్చుచుండెడివి. నిరంతరమునాకన్నులు మగధపాంచాలములవంకనే చూచుచుండెను. మగధరాజ్యమునందలిసమాచారము లన్నియు నాకెప్పటికప్పుడు వారివలననే తెలియుచుండెడివి. మీరు తప్పించుకొని వచ్చుటయు, గుప్తదుర్గమును నిర్మించుకొనఁదలంచుటయు, నాకు వారివలననే తెలిసినది. ఆచారచక్షుస్సులమూలమున నేనన్నియును దెలిసికొని పని చేయుచుంటిని. వసంతుఁడును నీవు నందుఁ జేసినపనులను విని సంతసించి మీవలన నాకార్యములు సఫలములు కాఁగల వని నాసైన్యమును నీసేనలతోఁ గలిపితిని. నేను నిన్నుఁ జేరితిని తక్షశిలానగరమునందలివసుమతివృత్తాంతమును హరిదాసునివలనఁ దెలిసికొనివచ్చినవారు నాశిష్యులే. మొట్టమొదట ననుమానముగ గ్రహించినవారును నాశిష్యులే"

"అయ్యా! ఆహరిదాసుఁడు కూడ మీశిష్యుఁడేనా"

"కాదు ఆతఁడు కొంతకాలముక్రిందట మాయాశ్రమమునకు వచ్చినాఁడు. ఆతఁడు నాచే రచియింపఁబడినగీతములు పాడుచుండుటచే నాకుఁ బూర్వస్మృతి కలిగి నాహృదయము చలించుచుండుటవలన నాకార్యముల కభ్యంతరము కలుగునను భయముచే నాతని మూఁడవ నాఁడే యటనుండి పంపివేసితిని. ఆతఁ డీదేశపువాఁడే కావచ్చును. లేని యెడల నేను రచియించినగీతముల నెట్లు గానముచేయఁగలఁడు? తరువాత నాతనిచర్యలనుబట్టి యుపాధ్యాయచాణక్యుని గూఢచారుఁడయి యుండు నని యూహించితిని."

ఆమాటలు విని చంద్రగుప్తుఁడు చాణక్యునివంకఁ జూచెను. చాణక్యుఁడు "నాగూఢచారులలో హరిదాసు లెవ్వరును లేరు. ఆతఁ డెవ్వఁడై యుండునో యింకను తెలియలేదు" అనియెను.

"మొన్న గంగానదితీరమున నందయోధులు రహస్యముగ వచ్చి నప్పుడుగూడ నొకపాట వినఁబడినది. ఆపాటయందారహస్య ముద్బోధ మైనది. అంతట మనయోధులు పట్టుకొనఁబోవునరికి 'వారు పాఱిపోయిరి. దీనినిబట్టి చూడఁగా నాతఁడు మనయభ్యుదయమును గాంక్షించుచు మనతోడనే వచ్చుచున్నట్లు తోఁచుచున్నది. నిన్నటిదినమున శత్రు రహస్యమును వసంతునకుఁ దెలిపినవాఁడు నాతఁడేయఁట! ఆమహాను భావుఁ డెవ్వఁడో మనకు బోధపడినది కాదు" అని చంద్రగుప్తుఁడు పలికెను.

"ఆహరిదాసుఁడుకూడ నీరాధాకృష్ణవర్మవంటివాఁడే కావచ్చు ను" అని చాణక్యుఁడు బదులుచెప్పెను

"మహాత్మా! ఐహికసుఖంబుల నుజ్జగించి విజితేంద్రియుండవై చరించుచును నకారణవాత్సల్యంబున మాకింతటిమహోపకారముం జేసినమీకుఁ బ్రత్యుపకార మేమి చేయఁగలము?" అని చంద్రగుప్తుఁడు మహాయోధుని సంభావించెను. మహాయోధుని మన మింతటినుండి రాధాకృష్ణవర్మ యనియే పిలిచికొందుము.

"నీసహాయమున నాకోర్కెలు తీఱినవి. నేను కోరఁదగిన దేమి యును లేదు. నీపట్టాభిషేకమహోత్సవమును,వసుమతీవసంతుల కళ్యా ణమును గన్నారఁ గాంచి మరల మునివ్రత మవలంబించి నాశేషకాల మును గడపి వైచెదను" అనిరాధాకృష్ణవర్మ బదులుచెప్పెను.

"నందశిరశ్ఛేదకుఁడు వసుమతీపాణిగ్రహమున కర్హుఁడయి యుండఁగా వసుమతీవసంతులకళ్యాణమును మీరెట్లు చూడఁగలరు?"

"వసంతుఁడు నందుని జయింపలేదా?"

"వధించుట మీవలన నైనదికాదా?"

"నావలన నైన దేమియును లేదు. ప్రాయోపవిష్టుఁడయి పడి యున్న ద్రోణునితలను దృష్టద్యుమ్నుఁడువలెవసంతకృపాణాఘాతములచే నుసురు చెదరియున్న నందునితల నేను నఱికితిని. ఈజయము తప్పకవసంతునిదే కాని నాది కాదు."

"అయ్యా! అట్లు కాదు మీకింకను వయసు చెల్లలేదు. ప్రతాప విజిత యగువసుమతితో రత్నగిరి రాజ్యమును గాని, పాంచాలరాజ్య ప్రాతినిధ్యమును గాని చేకొని మమ్మానందింపఁ జేయుఁడు!"

"అయ్యో! అట్లనకుఁడు! నాకీలోకమున ననుభవింపఁదగినది లేదు. నాకు లభించినభాగ్యమునే యనుభవించు నదృష్టము పట్టినది కాదు నాయర్ధశరీరము భస్మమైపోయినది. నేనర సచ్చియున్నాఁడను. నాజీవితమువలనఁ బ్రయోజనము లేకపోయినను, నాహృదయమునందలి క్రోధ మింతవఱకు నన్నుఁ బనిచేయించినది ఇప్పు డదియును నన్ను విడిచిపోయినది. నాకిఁక శాంతరసాశ్రయం బగుముని వ్రతమే శరణ్యము. నాకుమరలఁ బూర్వస్మృతిఁగలిగించి నాహృదయమునుగలఁగింపవలదు."

"మహాత్మా! మీకిదివఱకుఁ బరిణయ మైనదా?"

"నేను మానపాలునకు సమీపజ్ఞాతి కుటుంబములోనివాఁడను. ఆతనిమేనగోడలగు సుందరిని నాకిచ్చి పరిణయము చేసి నన్నే యాతఁడు కుమారునిగఁ జూచికొనుచుండెడివాఁడు. ఆతఁడురాజ్యభార మంతయును నామీఁదనే విడిచిపెట్టెను. నందహతకునిమూలమున నాకుఁ బ్రియా వియోగము తటస్థింప నున్నప్పటికి నాప్రాణేశ్వరి పదునాఱేండ్లది. అప్పటికి వసుమతి యైదేండ్లబాలిక. ఆతల్లిలేనిబిడ్డను మేమే పెంచుచుంటిమి. వియోగసమయమున నాబిడ్డను నాజీవితేశ్వరియగు సుందరి కొప్పగించి కొంతధైర్యము చెప్పి నేను వెడలిపోతిని. తరువాతినాయవస్థను మీరిదివఱకు వినియుంటిరి గదా! అప్పటిదీర్ఘక్రోధమువలన నేను

మరల వెనుదిరిగి చూడలేదు. చిన్నబిడ్డ యగువసుమతిని త్తికొనిబాష్ప పూరితనయనములతోఁ దలవంచికొని నిట్టూర్పు విడుచుచు నాకేళి మందిరమున నానాఁటిరాత్రి నుఱుమాట చెప్పలేక నిలువఁబడిపోయిన నాప్రాణేశ్వరి మనోహరాకార మొకనాఁటిరాత్రిమాత్రము శైలారణ్యమున నాస్మృతిపటంబునఁ దోఁచినది. అంతకంటె నెప్పుడును కఠిన హృదయుఁడ నగునాకు నాప్రేయసి తలంపునకైన రాలేదు. ఇఁక నీలోకమున నాప్రాణమును జూచుభాగ్యము నాకు లేదుగదా! నాజీవితము నిరర్థకమై పోయినది. నేనీలోకమున నెందఱకును బరికిరానివాఁడనై పోతిని." అనియాధీరోదాత్తుఁ డంతర్బాష్పనయనుఁడై తలవాంచి కొనియెను.

సభ్యులహృదయము లన్నియును గరుణారసపూరితము లయ్యెను. వారేమియును మాటలాడలేక యూరక చూచుచుండిరి.

అప్పుడుచాణక్యుఁడు "రాధాకృష్ణవర్మా! వసంతునకు నందశిర శ్ఛేదన మవశ్యకర్తవ్యమైనను జేఁజిక్కినసందుని విడిచి యాతఁ డా సమయమున నెటకుఁ బోయెనో? నీకుఁ దెలిసినదా?" అని ప్రశ్నించెను.

"ఆతఁడు మరణాపాయమునఁ బడిపోవనున్న హరిదాసుని రక్షింపఁ బోయెను" అని రాధాకృష్ణవర్మ చెప్పెను.

"ఆహా! వసంతుఁ డెంతకరుణాళుఁడు! ఎంతస్వార్థత్యాగి! ఎంత ధీరుఁడు! ఎంతధర్మాత్ముఁడు! ఎంతకోమలహృదయుఁడు! ఎంతపరాక్రమ నిధి!" అనుధ్వనులతో సభ యంతయును మ్రోఁగిపోయెను. అప్పుడు చాణక్యుని బోధనమునఁ జంద్రగుప్తుఁడు వసంతుని సభకు రాపింప నాజ్ఞాపించెను.



## ఇరువదిమూఁడవప్రకరణము.



వసంతుఁ డిప్పు డెందున్నాఁడు? పొలికలన దుఃఖభీషణాకారుఁడై కూర్చుండియున్నాఁడు. పేరిననెత్తురువలన నెఱ్ఱనైయున్న చంద్రహాస మాతనితొడపై నుండెను. ఆతనిమొగము జేవురించి యుండెను. కన్ను లెఱ్ఱనడిపోయినవి. ఎంతియాఁపిన నాఁగక కన్నీరు కాలువలు గట్టుచుం డెను ఆతఁడు సిద్ధార్థునికపాలమునుండి స్రవించుచున్న నెత్తురును దన బాకుమొనతో నద్ది వడఁకుచున్న చేతులతో నెట్లో యొకలేఖ లిఖిం చెను. ఆతనియుద్దేశమునుబట్టి చేయి నడచుట లేదు. హృదయావేగ మునను ద్దేశములు నిలుచుట లేదు. కన్నీటికాలువలచే, వ్రాసినదా తని కగపడుట లేదు. ఉత్తర మింకను ముగింపలేదు. ఏమి వ్రాసితినో చూచికొనవలయు నని యాతఁడు తలంచెను. శిరోవేష్టమును విచ్చి కన్నులఁ దుడిచికొని యాలేఖను జదువుకొనుచుండెను

"జీవితేశ్వరీ——" అని చదువునప్పటికి దుఃఖాతిరేకమున గుండెలు బ్రద్దలయ్యెను. నోట మాటవచ్చుట లేదు. మరల సంతాపాశ్రు పూరమువలనఁ గన్నుల కేమియు నగపడుట లేదు. సముద్రతరంగముల వలె దుఃఖతరంగము లెగచి విరుగుచుండెను. మరల నెగయునంతవఱ కానడుమఁ గొంతవిశ్రాంతి యుండెను. వసంతుఁడు మరలఁ గన్నులు దుడిచికొని ధైర్యము నదెచ్చుకొని, యావాక్యము ను దుడిచివైచి, యట "వసుమతీ!" యని వ్రాసిచదువ నారంభించెను.

"దారుణరణసంరంభమున నీలోకమును విడిచిపోవఁదలంచితిని. కాని, యాశాపాశమును, యోధసామాన్యమగు దురభిమానావేశమును, నన్నడ్డగించుటచే శత్రువీరునియాయుధమునకుఁ దలయొగ్గలేకపోతిని. ఆశాపాశము తెగిపోయినవెనుక మరలరణరంగమునఁ బడి చావఁజూచితి. ఏమి లాభము? అంతలో యుద్ధమే పరిసమాప్తియయినది. మన యనురాగలతకు, మనయాశాకుసుమమునకు, మనదురదృష్టము గ్రీష్మ మైపోయినది. ఈలోకమున—ఈజన్మమున—ఇఁక—మనముఁ గలిసికొనుట కవకాశము లేదు. కేవలదుఃఖదాయక మగునాజీవితమును విడిచివేయవలసినదే కాని బలవన్మరణము వీరపురుషోచితము కాదని సంశయించుచున్నాఁడను— మనయదృష్టమునకు భంగము దెచ్చుట యందుఁ బాపగ్రహమువలెనడ్డమువచ్చినదురాత్ముఁడగుసిద్ధార్థుని నెత్తురుతో నీలేఖ వ్రాసి యిందుమూలమున నానిశ్చితాభిప్రాయమును వెల్లడించు చున్నాఁడను. ఈదుఃఖజీవిత మింతటితోఁ గడతేరునదికాదు. ఐహికసుఖం బులఁ బరిత్యజించి నిరంతరమును నాహృదయనిధానమును స్మరించుచుఁ దదేకధ్యానమునకు నెమ్మది మరలించి మహారణ్యముల మునివృత్తినవ లంబించి చరించుచు నాయాయుశ్శేషమును గడపెదను. నాకు సెల వొసఁగెదవా?" అని చదువునప్పటికాతనిహృదయ మతివేగమునఁ గొట్టు కొననారంభించెను. ఆపరితాపమున నొడలంతటను జెమరించెను. కంఠ స్వరము గాద్గద్యమును వహించెను. ఒక్కింత మనసుకుదురుపఱచు కొని మరలఁజదువు చుండెను.

"నీవిశాలతరళనయనముల నుండి యాణిముత్తియపుఁగోవలవలె వెడలుచుండు వేఁడి కన్నీటిధారలఁబయ్యెద చెఱఁగునఁదుడిచి—చెమ్మటలఁ

జెక్కులఁజిక్కువడియున్న వినీలకుటిలకుంతలంబుల సవరించి—అభినవ కోమలప్రవాళముం బోనినీమధురారుణాధరమును గమలించుచున్న వేఁడి నిట్టూర్పులను చేలాంచలచాలనంబులం బోఁడముచల్లనిగాలిచే నొక్కింత సేపాఁపి—నీహృదయమును గందింపక—నీమనసుఁ జెదరింపక—నీమోడలు వడకింపక—నీముద్దుమొగమువాఁడింపక—నీకన్నులు మూయింపక—నీప్రాణముల నల్లార్పక—సయుక్తికముగ—సార్థకముగ—సాభిలాషముగ—సానుకంపముగ—నాహృదయాభిప్రాయమును వెల్లడించి—నీయొద్ద—సెలవు—గయికొని— "ఇఁకఁ జదువలేకపోయెను. ఆపై నిఁకవ్రాసినదియును లేదు. శోకవేగమున "హా!" యని మూర్ఛిల్లెను.

ఆతఁడు మూర్ఛదేరునప్పటికిరువురుభటు లెదుట నిలువఁబడి "అయ్యా! చక్రవర్తియగుచంద్రగుప్తునియాజ్ఞ యయినది. మీరు సభాస్థలంబునకు విచ్చేయవలయును" అని విన్నవించిరి.

వసంతునకుఁ జంద్రగుప్తునియం దెంతమిత్రభావము! ఎంతగౌరవము! ఎంతభయము! ఎంతభక్తి! అట్టిదుఃఖసమయమునఁగూడ నాతఁడు మాఱుమాటాడక బయలుదేరెను. చంద్రగుప్తునియాజ్ఞానిర్వహణమే వసంతునకుఁ బరమధర్మము. వారిరువురును రామలక్ష్మణుల యపరావతారము లని చెప్పవచ్చును.

వసంతుఁడు సభారంగమునఁ బ్రవేశించెను. కాని, దురదృష్టోపహతుం డగునాతఁ డెవ్వరిని గన్నెత్తి చూడలేకపోయెను. నోరెత్తి మాటలాడలేకపోయెను. స్థాణువువలె నిలువఁబడిపోయెను.

అప్పుడు చంద్రగుప్తునిహృదయము కఱఁగి నీరయ్యెను. కొంచెము సేపూరకుండి "వసంతా! నందశిరఃఖండనము నీకావశ్యకకార్యమై

యుండఁగా రణరంగమునఁ జేజిక్కి నసందుని విడిచి నీవెటకుఁ బోతివి?" అని యడిగెను.

"సుందరిని రక్షించుటకు—" అని వసంతుఁడు ప్రత్యుత్తర మిచ్చెను.

సభ యంతయును నివ్వెఱపడిపోయెను. వాఁడిపోయియున్న రాధాకృష్ణవర్మ యాశాలత వసంతవచనసుధారససేచనమున మరల మొలక లెత్తుచుండెను.

"సుందరి గంగానదిలో మునిఁగిపోయినది గదా?" అని చంద్రగుప్తుఁడు ప్రశ్నించెను.

"లేదు. ఊరక యట్లు నటించి కలశపురమునుండి తప్పించుకొని హరిదాసవేషమున సంచరించుచున్నది. అంభీరుని రహస్యములును, పద్మనందుని రహస్యములును, మనకుఁ దెలియపఱచిన దామెయే."

"ఆమె యుద్ధములోని కేల వచ్చినది?"

"ఊరక హరిదాసవేషముతోడనే వచ్చినది. తమరహస్యములీహరిదాసునిమూలముననే, వెల్లడియయ్యెననుకోపమున సిద్ధార్థుఁడామెను నఱకఁబోవుచుండ నేనాతని వధియించి యామెను గాపాడితిని."

రాధాకృష్ణవర్మ మొగము వికసించెను. ఆతఁడు వెనుక హరిదాసుని జూచినప్పటిచర్యయంతయును స్మృతికిఁ దెచ్చుకొనియెను. కార్యభారమును వహించియుండుటచేతను, చిరకాలము క్రిందటనే విడుచుటచేతను, నాతని కప్పు డనుమానముకలుగలేదు. ఇప్పు డవియన్నియును తార్కాణ మయ్యెను. రాధాకృష్ణవర్మ సంతోషము నాఁపజాలక వసంతుని గాఁగిలించుకొని యానందబాష్పములతో నాతనిశిరంబును దడిపివైచెను.

అప్పుడు చాణక్యుఁడు లేచి నిలువఁబడి యిట్లుపన్యసించెను.

"చంద్రగుప్తునకు విజయము లభించినది. రాధాకృష్ణవర్మ ప్రతిజ్ఞలు తీరినవి. నాయభీష్టము సిద్ధించినది. దేశోపద్రవములు చల్లారినవి. ఇప్పుడు వసంతుఁడుమాత్రము సందిగ్ధావస్థయం దున్నవాఁడు. ఇందు సందిగ్ధమే లేదు. వసంతుఁ డుదారస్వభావుఁడు. మహాపరాక్రమసంపన్నుఁడు. దయార్ద్రహృదయుఁడు. నేనును రాధాకృష్ణవర్మయు నెంతపని చేసినను మొట్టమొదటఁ జంద్రగుప్తుని యభ్యుదయమునకు స్వార్థత్యాగియయి తోడుపడినవాఁడు వసంతుఁడు. స్వదేశరాజుల యంతఃకలహములు చంద్రగుప్తసేనానాయకుఁ డగువసంతునివలననే తీరినవి. అంభీరునివధియించి తక్షశిలాదుర్గమును జంద్రగుప్తున కొప్పగించినవాఁడును వసంతుఁడే. ఆ కారణముననే పాంచాలమునకు నెమ్మది కలిగినది. ఎన్నివిధములఁ జూచినను చంద్రగుప్తనకుఁగాని, ప్రజలకుఁగాని, వసంతునివంటిమిత్రుఁడు, వసంతునివంటి యోధుఁడు, వసంతునివంటి రాజభక్తుఁడు, వసంతునివంటి దేశసేవాపరాయణుఁడు, వసంతునివంటి విశ్వాసి మఱియొకఁడు లేఁడు. ఇంతేగాక చంద్రగుప్తుని ప్రతిజ్ఞ ననుసరించి నందునితోఁ బోరాడి ప్రాణావశిష్టునిగఁ జేసియుఁ బరోపకార పరాయణుఁడయి యాతని విడువవలసినవాఁడయ్యెను. ఆతని నీరాధాకృష్ణవర్మ సంహరించెను. వీరిరువురును దక్క నిందు నందునితోఁ బోరాడినవా రెవ్వరును లేరు గదా——"

"లేరు. మహాత్మా! లేరు" అని సభ్యులందఱు నేకగ్రీవముగాఁ బల్కిరి.

"ఇప్పుడు వసుమతి వీరిరువురిలో నొకరిసొత్తు కావలసియున్నది-"

"ఔను! ఔను!" అని సభయంతయును ప్రతిధ్వనించెను.

"రాధాకృష్ణవర్మ వసుమతికి జ్ఞాతికుటుంబములోనివాఁడు. ఇంతేగాక యామెను పెంచినవాఁడు. ఆమెతండ్రి యగుమానపాలుని మేనగోడలికి భర్త. ఈకారణములవలన రాధాకృష్ణవర్మకు వసుమతిని బరి

గ్రహింప వలనుపడదు. ఒక్క నందశిరశ్ఛేదముమాత్రమే యాతఁడు కావించెనుగాని విజయమువసంతుని కేకలిగినది. ఒకవేళ రాధాకృష్ణవర్మ కే జయము కలిగినదన్న యెడల నాతఁడు వసుమతిని పుత్రికగా స్వీకరింపఁ దగినవాఁడే కాని యర్ధాంగిగాఁ గైకొనుట ధర్మశాస్త్రమునకుఁ గాని, యాచారమునకుఁ గాని, విరుద్ధమైన పని. అంతేకాక రాధాకృష్ణవర్మ యంతరాత్మకూడ నందుల కంగీకరించుట లేదని సభ్యులకెల్లరకుఁ దెలిసిన విషయమే. వసుమతీ వసంతుల యన్యోన్యానురాగము కూడ నంద ఱెఱింగినదియే. కాఁబట్టి తనప్రాణేశ్వరి యగుసుందరిని మృత్యుముఖంబు నుండి తప్పించి యొసంగినవసంతునకు రాధాకృష్ణవర్మ తాను పెంచుట వలననేగాక రాజశాసనమును బట్టి తనకుఁ బుత్రికాప్రాయ యగు వసుమతి నొసంగి తనఋణమును దీర్చుకొనుఁగాక! మగధపాంచాలచక్రవర్తి యగుచంద్రగుప్తసార్వభౌముని పట్టాభిషేక శుభసమయమున వీరి కళ్యాణమహోత్సవ మతివైభవమున జరిగింతురుగాక! వసుమతీ వసంతులకళ్యాణముతోఁ జంద్రగుప్తపట్టాభిషేకమహోత్సవము వసుమతికి వసంతాయమాన మగుఁగాక!''

అప్పుడు "తథాస్తు! తథాస్తు!" అను శబ్దములతోడను, సభ్యుల కరతాళధ్వనులతోడను, సభ ముగింపఁబడియెను.

ఇది ద్వితీయభాగము.



# పరిసమాప్తి



చరిత్రవిషయంబు లగునవల లను నవీనాలంకారములచే నాంధ్ర భాషావధూటిని వలపించుచున్న మాయాంధ్రప్రచారిణీగ్రంథమాలికకు ద్వితీయకుసుమముగ నీవసుమతీవసంతమును వ్రాయుచు వ్యవధి చాల నందున నింతటితో ముగించి ముద్రాయంత్రమున కొసంగితిమి. మే మింకను వ్రాయవలసినదే కాని రెండువేలయేండ్లకుఁ బూర్వమున జరిగిన యానాఁటిచంద్రగుప్త పట్టాభిషేకవైభవమునుగూర్చి గాని, వసుమతీ వసంతులకల్యాణమహోత్సవముంగూర్చి గాని, వర్ణించి వ్రాసినచో నుత్ప్రేక్షాతిశయోక్త్యాద్యలంకారతత్త్వమును సంపూర్ణముగ నాకళించి యున్న చదువరులకు మావాక్యములయం దసత్యశంక యుదయించు నేమో యనుభీతిచే మా లేఖిని నింతటితో నాఁపివేయవలసినవార మైతిమి. మగధపాంచాలరాజసార్వభౌముఁడును, ప్రజారంజకుఁడును, నగుచంద్ర గుప్తునిపట్టాభిషేకకార్యములకుఁ గొదవ యేముండును? ఆతని పట్టా భిషేకశుభసమయమున జరిగినవసుమతీవసంతుల కల్యాణోత్సవమునకు మాత్రము లోపము కలుగునా? ఆమహోత్సవము లెట్లు జరగవలసి యుండెనో యట్లే జరిగినవి.

సార్వభౌమునియనుగ్రహముననో, కృతజ్ఞతవలననో, వసంతు నకు రత్నగిరిరాజ్యమును, రాధాకృష్ణవర్మకు పాంచాలరాజప్రాతినిధ్య మును, లభించినవి. సామంతరాజు లెల్లరును సన్మానింపఁబడి తమ తమదేశములకుఁ బంపఁబడిరి. సైనికు లెల్లరును పారితోషికముల నందికొనిరి. చంద్రగుప్తుని చల్లని పరిపాలనమునఁ బ్రజలు సుఖఁ

చిరి. ఇందు చంద్రగుప్తునిరాణి యెవ్వరో చరిత్రములవలనఁ దెలియక పోవుటచే నూహించివ్రాసినయెడలఁ బాఠకులహృదయములకు సందేహము కల్పించినవార మగుదుమేమో యని యాభాగమును మేము కూడ వదిలితిమి. కాని, పట్టాభిషేకమునకు ముందో, తరువాతనో, చంద్రగుప్తునకుఁ దప్పక కల్యాణమైయుండు నని మనమూహింపవచ్చును. మురాతనూజుఁ డగుచంద్రగుప్తుఁడు మౌర్యుఁడనికూడఁ బిలువఁబడు చుండెడివాఁడు. ఆతనిసంతతివా రందఱును మౌర్యులైరి. వసుమతీసుందరులు కొంతకాలమునకుఁ బిమ్మట వియ్యమునుఁగూడ నందిరఁట! వీరెల్లరును మన కపూర్వపరిచితు లయ్యును నీగ్రంథపఠనమునఁ జిరపరిచితులవలెనే మనహృదయములం దోఁచుచుండుటచే వీరియభ్యుదయపరంపరలంగూర్చి యెంతసేపు యోచించినను మనకుఁదనివి తీరుటలేదు. మాలేఖిని యింకను నదృష్టప్రభావము నూహించుచునే యున్నది. కాని, చిరకాలముక్రిందటి వృత్తాంతము లూహాల కందరానివగుటచే దరువాతి సంగతులను యథార్థముగఁ దెలిసికొనుటదుస్సాధ్యము కావున నింతటితోడనే సంతుష్టివహించి విరమింతము.

